# తెలుగు బోధన పద్ధతులు
# (Methods of Teaching Telugu)



రచయిత :

డా॥ డి. సాంబమూర్తి
ఎం.ఏ., ఎం.ఇడి., పి.హెచ్.డి.



ముందుమాట

ఆచార్య పేర్వారం జగన్నాథం
వైస్-ఛాన్సలర్
తెలుగు విశ్వవిద్యాలయం - హైద్రాబాద్



1995

N.K. Publications

METHODS OF TEACHING TELUGU by Dr. D. Samba Murthy, M.A., M.Ed., Ph.D. for the use of B.Ed., TTC and T.P.T. students as well as practising teachers.



First Edition : 1995

**Price : Rs. 48/-**

Distributors : **Neel Kamal Book Distributors**
First Floor, Opp. Clock Tower,
Sultan Bazar, Hyderabad.
Phone : 591665

Laser Composed by : 21st Century, Hyd.

Printed at : Vaishnavi Offset Printers,
Ramkote, Hyderabad.

*Published by :*

**N.K. Publications**

**Hyderabad.**

# ఒక మాట

మనిషిని మనీషిగా తీర్చిదిద్దగల్గిన సాధనం విద్య. అనూచానంగా ప్రజలంతా నియతంగానో, అనియతంగానో విద్యను అభ్యసిస్తూనే ఉన్నారు. విద్యాభ్యసనంలో ప్రధాన అధ్యయనాంశం భాష. అందునా మాతృభాష. వివిధ విషయాలను భాషా మాధ్యమం ద్వారానే వ్యక్తులు తమ స్వంతం చేసికొంటారు. బాలబాలికలు పాఠశాలల్లో చేరేనాటికే ఏదోఒక భాషా మాధ్యమంలో తమ భావాలు వ్యక్తీకరింపగల్గినప్పటికి, వారికి పాఠశాలల్లో చేరిన మొదటిరోజు భాషాభ్యసనంతోనే ప్రారంభమవుతుంది. మొదటగా మాతృభాషను అభ్యసించడం సంప్రదాయం. బాలబాలికల భావవ్యక్తీకరణ సామర్థ్యాలను మెరుగుపరచడానికి భాషోపాధ్యాయులు భాషను బోధిస్తారు.

బోధన ఒక శాస్త్రం. ఇది ఒక కళ కూడా. భాషాబోధనలో మెలకువలు తెల్సిన ఉపాధ్యాయులు మరింత సమర్థంగా తమ విద్యార్థుల్ని తీర్చిదిద్దుతారు. విద్యా కళాశాలల్లో బి.యిడి. పట్టం కోసం 'తెలుగుబోధన పద్ధతుల'ను ఒక అధ్యయనాంశంగా ఎంపిక చేసికొన్నవారు, తెలుగు పండిత శిక్షణ, టి.టి.సి. శిక్షణ పొందుతున్న ఛాత్రులందరితో బాటు ఉపాధ్యాయ లోకానికి కూడా పరామర్శగ్రంథంగా ఈ పుస్తకం ఉపకరిస్తుందని మా విశ్వాసం. సాధారణంగా అందుబాటులో ఉన్న 'తెలుగు బోధన పద్ధతుల' పుస్తకాలకన్న, భిన్నమైన శైలిలో అద్యతన విషయాలను కూడా చేర్చి ఈ పుస్తకాన్ని రూపొందించే ప్రయత్నం జరిగింది. భాష–స్వరూప స్వభావాలు, బోధన లక్ష్యాలు, భాషానైపుణ్యాలు, పాఠబోధనపద్ధతులు, మూల్యాంకనం మొదలైన విషయాలను విస్తృతంగా చర్చించడంతో బాటు అదనంగా కనిష్ఠ అభ్యసన ప్రమాణాలు (Minimum Levels of Learning) భాషా ప్రణాళిక రచన, భాషాబోధనలో విద్యాసాంకేతికశాస్త్రం, బోధన నైపుణ్యాలు మొదలైన విషయాలను కూడా సమగ్రతకోసం చేర్చడం జరిగింది. ఈ పుస్తకం పాఠకులందర్ని సంతృప్తిపరుస్తుందనే మా విశ్వాసం.

నా యందుగల ఆదరంతో తమ అమూల్యాభిప్రాయాన్ని రాసి ఇచ్చిన తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య పేర్వారం జగన్నాథం గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తక రచన కోసం వీలైనన్ని ఎక్కువ పుస్తకాలను, బోధన శాస్త్ర నిపుణులను సంప్రదించడం జరిగింది. ఆయా పుస్తక రచయితలకు, నిపుణులకు ధన్యవాదాలు. పుస్తకంలో దోషాలు దొరలకుండా వీలైనంతవరకు జాగ్రత్త తీసికోవడం జరిగింది. ఎక్కడైనా దోషాలుంటే, సవరణలు అవసరమైతే ఉపన్యాసకులు, ఉపాధ్యాయులు, ఛాత్రులు సహృదయంతో తెలియజేస్తే మలి ముద్రణలో సవరించుకొంటాం. ఈ పుస్తకాన్ని అందరూ ఆదరిస్తారనే నమ్మకంతో.

ఎందరో మహానుభావులు – అందరికీ వందనాలు

– రచయిత

తెలుగు విశ్వవిద్యాలయం
**TELUGU UNIVERSITY**



**Prof. PERVARAM JAGANNADHAM**
M.A., Ph.D.
VICE-CHANCELLOR

LALITHA KALA KSHETRAM,
PUBLIC GARDENS,
HYDERABAD-500 004. (A.P.)

DATE : 9-1-1995

# ముందుమాట

డా॥ డి.సాంబమూర్తి రచించిన తెలుగు బోధన పద్ధతులు చదివినాను. ఇందులో రచయిత బోధన పద్ధతులలోని మెలకువలను గురించి కూలంకషంగా చర్చించి ఈ గ్రంథాన్ని వెలువరించినారు. ప్రతి పుటలో వారు పడిన శ్రమ ద్యోతకమవుతున్నది. విద్యా సంస్థలలో ముఖ్యంగా పాఠశాలల్లో పని చేస్తున్న అధ్యాపకులు తమ నైపుణ్యాన్ని మెరుగుపరుచుకోవడం కోసం ఇది ఎంతగానో ఉపకరిస్తుంది. విద్యార్థులు సాధారణంగా చేసే తప్పిదాలను, పొరపాట్లను రచయిత చక్కగా ఇందులో ఎత్తి చూపించినారు. తెలుగు భాష వికాసాన్ని గురించి దానిపై ఇతర భాషల ప్రాబల్యాన్ని గురించి ఇందులో శాస్త్రీయంగా వివరించినారు.

ఈ గ్రంథం తెలుగు భాషాభ్యసనం చేసే విద్యార్థులకు ఎంతగానో ఉపకరిస్తుంది.

ఈ సందర్భంలో రచయిత డా॥ డి.సాంబమూర్తి గారిని అభినందిస్తున్నాను.

(పేర్వారం జగన్నాథం)

# విషయసూచిక

# ఒకటో అధ్యాయం

## భాష-ఉత్పత్తి-స్వభావం-లక్షణాలు

### 1.01 ఉపోద్ఘాతం :

జీవ పరిణామక్రమంలో మానవుడు పరిణితి చెందిన జీవి. సమస్త జీవజాలం నుండి మానవుణ్ణి వేరుచేసి చెప్పగలిగే లక్షణాల్లో అతని మేధోసంపత్తి, ఆలోచనాధోరణి, వీనిని వ్యక్తీకరించడానికి ఉపయోగించే భాష ప్రధానంగా చెప్పుకోదగ్గవి. తమలో నిబిడీకృతమైన భావనల్ని వ్యక్తీకరించడానికి ప్రతి జీవి ఏదో ఒక విధంగా ప్రయత్నిస్తుంది. ఈ ప్రయత్నాల్లో భాగంగానే ధ్వనులు చేస్తుంది. ఈ ధ్వనులకు ఒక ఆకృతి, అర్థం కల్పించుకొని వీనికి ఒక వ్యవస్థారూపమిచ్చుకొన్న వాడు మానవుడు. అందువల్లే ఇతర జీవుల్లో కెల్ల ఉన్నతుడుగా తాను గుర్తింపుపొందాడు.

మానవుణ్ణి పరిణితి చెందినవాడుగా చేసిన భాష అంటే ఏమిటో, దాని స్వభావం, లక్షణాలు ఎలా ఉంటాయో, ఉత్పత్తి ఎలా జరుగుతుందో తెల్సికోవడానికి, వివరించడానికి విశేషంగా ప్రయత్నాలు జరిగాయి. ఆ ప్రయత్నాల పరంపరను తెల్సికొని ఆయా అభిప్రాయాల్లోని లోతుపాతుల్ని విశ్లేషించడం, ఆ దిశలో ఆలోచించడం భాషాబోధకులకు అవసరం. ఈ సందర్భంలో భాష అంటే ఏమిటో తెల్సికొందాం. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పుకొనే ముందు 'నీళ్ళంటే' ఏమిటి? 'గాలి' అంటే ఏమిటి? అనే ప్రశ్నలకు మనం సాధారణంగా చెప్పుకొనే సమాధానాలేవో జ్ఞప్తికి తెచ్చుకొంటే బాగుంటుంది. ఒక వ్యక్తి నీళ్ళంటే త్రాగడానికి ఉపయోగపడేవని, మరొకరు ద్రవపదార్థమనీ, ఇంకొకరు సైన్స్ చదివిన వ్యక్తి హైడ్రోజన్, ఆక్సిజన్ వాయువుల సమ్మేళనమని చెప్తాడు. అట్లే గాలి అంటే ఏమిటో కూడా చెప్పగల్గుతాడు కూడా. పై అభిప్రాయాల్లో ఏ ఒక అభిప్రాయం కూడా నీళ్ళంటే పూర్తి భావనను ఆవిష్కరించలేకపోయినప్పటికి అన్ని భావనలు 'నీటి' యొక్క ధర్మాన్నో, లక్షణాన్నో స్వభావాన్నో వివరిస్తున్నాయి. అట్లే

భాషను కూడా విద్యావేత్తలు, తత్వవేత్తలు, భాషావేత్తలు నిర్వచించడానికి ప్రయత్నించారు. వారుచేసిన కొన్ని నిర్వచనాలను పరిశీలిద్దాం.

## 1.02 భాష-నిర్వచనాలు :

'భాష్' అనే ధాతువు నుండి 'భాష' అనే పదం ఉత్పన్నమైంది. భాషింపబడేది భాష. అంటే మనోగత భావవ్యాపారాన్ని కంఠ ధ్వనులద్వారా ఇతరులకు అభివ్యక్తంచేయగల్గింది భాష. కంఠధ్వనుల వ్యక్తీకరణకు ప్రధానంగా తోడ్పడే శారీరిక అవయవం నాలుక. దీన్ని ఇంగ్లీషులో tongue అని వ్యవహరిస్తారు. అందువల్ల భాషను tongue అని మరియు Language అని వ్యవహరిస్తున్నారు.

ఇచట ఒక ప్రశ్న ఉత్పన్నమవుతోంది. అన్ని కంఠధ్వనుల్ని భాష అంటే పశుపక్ష్యాదుల కంఠధ్వనుల్నికూడా భాషలని వ్యవహరించాలిగదా! ఈ మధ్య కొందరు శాస్త్రజ్ఞులు పక్షులభాషలను, జంతువుల భాషలను కూడా విశ్లేషించి, అవి కూడా వివిధ సందర్భాల్లో అవసరాలకను గుణమైన కంఠధ్వనుల్ని చేస్తాయి అని నొక్కిచెప్తున్నారు. అలాంటప్పుడు మానవుడు చేసే కంఠధ్వనులకు, ఇతర పశుపక్ష్యాదుల కంఠధ్వనులకు మధ్య వివక్ష ఏల అనే అభిప్రాయం కూడా కల్గవచ్చు.

పశుపక్ష్యాదుల కంఠధ్వనుల్లో ప్రాంతీయతా వైవిధ్యం లేకపోవడం, వాని ధ్వనులు పరిమితాలు కావడం అనే ప్రధానాంశాలతో మానవుని కంఠధ్వనులు పశు పక్ష్యాదుల కంఠధ్వనులతో విభేదిస్తాయి. మానవుని కంఠధ్వనులు అపరిమితాలు. ప్రాంతీయ వైవిధ్యభరితాలు. ఆ కారణాన పరిమితమైన కంఠధ్వనుల్నికూడా అపరిమితంగా ఆయా సన్నివేశాలకనుగుణంగా, అవిశ్రాంతంగా వివిధ రూపాల్లో వ్యక్తీకరించే నేర్పు తీర్పు మానవునకుంది. అందువల్ల మానవుని కంఠధ్వనులు ఇతర కంఠధ్వనులకన్న భిన్నమైనవిగా అర్థవంతమైనవిగా భావించవచ్చు.

భాషకు నిర్వచనాలు చెప్పే ప్రయత్నంచేయడం మహాసాగరాల్లోని లోతు పాతుల్ని కనుగొనడం వంటిది. అలాగే భాషకు ఇచ్చే నిర్వచనాలు కూడా ఏవీ సమగ్రంకాకపోవచ్చు. అయినా శాస్త్రదృష్టితో పరిశీలించినపుడు ఆయా నిర్వచనాలు భాష యొక్క స్వరూపాన్ని, స్వభావాన్ని, లక్షణాలను పరిశీలించే దృక్పథాన్ని పెంపొందించి, భాష అంటే ఏమిటో కొంతమేరకు అవగాహనచేసికోవడానికి తోడ్పడతాయి. కొన్ని నిర్వచనాలను ఇచట పరిశీలిద్దాం.

i) సామాన్య మానవుని దృష్టిలో భాష భావ వ్యక్తీకరణకు ఉపయోగపడే అర్థవంతమైన కంఠధ్వనుల సముదాయం. కాని కొన్ని పర్యాయాలు కంఠధ్వని చేయకుండానే భావాలను మానవుడు తన చేష్టలద్వారా, సంకేతాలద్వారా, హావభావాల ద్వారా వ్యక్తీకరిస్తాడు. వానిని కూడా భాష అని పిలవొచ్చా అనే సందియం కల్గుతుంది. నిజంగా ఆ సంకేతాలు కూడా భావవ్యక్తీకరణ సాధనాలే. కొన్ని పర్యాయాలు అవి అర్థవంతమైన ధ్వనుల్ని ప్రభావితం చేస్తాయికూడా. కావున ఆ ధ్వనుల్ని 'మూకభాష' అని భాషావేత్తలు వ్యవహరిస్తారు.

ii) వ్యాకరణకారుడు 'ప్రకృతి ప్రత్యయ పదనిరూపణమే భాష' అని నిర్వచిస్తాడు. ఇచట ప్రకృతి అంటే పదాల మూలం. ప్రాతిపదిక. ప్రత్యయం ప్రాతిపదిక మీద చేరే రూపం. ఉదాహరణకు 'రామ' అనేది ప్రాతిపదిక 'డు' ప్రత్యయం. ఈ రెండున్నూ కల్సిరాముడు అనే పదం ఏర్పడింది. క్రియల్లో 'చేయు' ప్రాతిపదిక, 'ఇ' ప్రత్యయం. ఈ రెండున్నూ కల్సి 'చేసి' అనే పదం ఏర్పడింది. ఈ ప్రత్యయాలు కొన్ని పర్యాయాలు పదంముందుకూడా చేరవచ్చు. వీనిని ఉదా: గుణము - సుగుణము 'సు' దీనిని ఉపసర్గ అంటారు. వీనిని ఆంగ్లంలో Prefix, Suffix అని అంటారు.

iii) నిఘంటుకారుల దృష్టిలో 'భాష అంటే పదాలు వాని అర్థాలు'. ప్రతిపదం ఒక అర్థమిస్తుంది. అర్థవంతమైన పదాల సమూహమే భాష అని వారి నిర్వచనం.

iv) Emman Bach అనే భాషావేత్త తన 'Introduction to Transfermational Grammar' అనే గ్రంథంలో భాషను ఇలా నిర్వచించాడు. 'Language is an Infinite Set of Sentences' భాష అంటే అనంతమైన వాక్యాల సముదాయం. భావ వ్యక్తీకరణలో వాక్యం ప్రధాన అంశం. పూర్తిభావం కేవలం వాక్యాల ద్వారానే ఎదుటివ్యక్తికి అందించబడుతుంది. అందువల్ల అసంఖ్యాక వాక్యాల సముదాయమే భాష అని అతని అభిప్రాయం.

v) Sappire అనే భాషావేత్త భాషను ఇలా నిర్వచించాడు. 'Language is a purely human, non instinctive method of Communicating ideas, emotions, and desires by means of a System of Voluntarily Produced Symbols' అంటే 'భావవినిమయంలో కేవలం మానవుడు తన

భావాలను, ఆవేశాలను, కోరికలను వ్యక్తంచేయడానికి అప్రయత్నంగా రూపొందించుకొన్న సాధనం భాష.' ఈ నిర్వచనాన్ననుసరించి అసంకల్పితంగానో, అలవోకగానో, సహజాతంగానో భాష అలవడుతుంది. కాని శిశువు సహజాతంగా చేసే ధ్వని కేవలం రోదన మాత్రమే. రోదన ముడిరూపంలోని ధ్వని. ఈ ధ్వనులు మానవుల ఉద్రేకాల్ని, ఆలోచనల్ని, కోరికల్ని తెలియజేయడానికి తద్వారా అర్థవంతమైన భావప్రకటనకు తోడ్పడుతాయి.

vi) మరో నిర్వచనంలో వక్త తన ధ్వన్యుత్పత్తి అవయవాల సాయంతో చేసే ధ్వనుల పరంపరనే శ్రోత శ్రవణేంద్రియ సాయంతో స్వీకరిస్తాడు. వక్తకు శ్రోతకు మధ్య నాడీ మండల వ్యవస్థ భావ వ్యక్తీకరణ, భావగ్రహణాలను సర్దుబాటు చేస్తుంది. అంతేగాక 'ఉన్నత సంక్లిష్ట సూత్రజాలావలయం భాష' అని Langage in the modern world అనే గ్రంథంలో వివరింపబడింది.

vii) మరికొందరి దృష్టిలో "ప్రజలు మాట్లాడుకొనే తీరే భాష కాని ప్రజలిట్లా మాట్లాడాలని నిర్దేశించే తీరు భాషకాదు." వ్యవహార నిర్దేశనం భాష లక్షణమని, వ్యవహారంలో తప్పొప్పులనేవి ఉండవని ఈ అభిప్రాయంలోని ప్రధానాంశం. అయితే ఈ అభిప్రాయంలో ఒక లొసుగుంది. వ్యవహారంలో తప్పొప్పులనేవి ఉండవనే మాట సరికాకపోవచ్చు. కొన్ని సందర్భాల్లో ఉచ్చారణ లోపాలవల్ల అర్థాల్లోనే పెద్దమార్పురావడం ఎరుగుదుము. ఆ సందర్భాల్లో వ్యవహారంలో ఉన్న రూపమే సరియైన భాషయని చెప్పడం సర్వదా ఆమోద యోగ్యం కాకపోవచ్చు.

viii) ఇంకొక భాషావేత్త దృష్టిలో 'Language makes an infinite use of finite means' అంటే పరిమిత సాధనాల్ని అపరిమితంగా వాడుకచేసేది భాష. భాషలో సాధారణంగా వర్ణాలు (అక్షరాలు) పరిమితంగానే ఉంటాయి. కాని వాటి కలియికలే అనంతం. ఈ విషయాన్నే మాఘకవి తన 'శిశుపాలవధ' అనే సంస్కృత కావ్యంలో ఇలా పేర్కొంటారు.

వర్ణైః కతిపయైరేవ
గ్రథితస్య స్వరైరివ
అనంతా వాఙ్మయస్యాహో
గేయస్యేవ విచిత్రతా ॥ (2.72)

అంటే సంగీత శాస్త్రమంతా 'సరిగమపదని' అనే ఏడు స్వరాల్లో ఇమిడి ఉంది. అట్లే సాహిత్యం కూడా కొద్ది వర్ణాల సముదాయంలోనే ఏర్పడింది అని అర్థం. ఈ కొద్ది వర్ణాలే అనంతమైన ఆలోచనలకు ఆకృతినిస్తున్నాయి అని తాత్పర్యం.

ix) Hacket అనే భాషావేత్త A course in Modern Linguistics అనే గ్రంథంలో 'A Language is a Complex System of Speech habits' అని నిర్వచించాడు. అంటే 'అనేకాలైన భాషణ అలవాట్లతో కూడిన సంక్లిష్టవ్యవస్థ భాష' అని ఆ నిర్వచన సారాంశం. అందువల్ల భాష సామాన్యమైంది కాదని, సంక్లిష్టమైన వ్యవస్థల కలయిక అని చెప్పవచ్చు. ఈ వ్యవస్థల్ని అనుకరించి, అలవరుచుకొంటేనే అది పూర్తి భాషగా రూపొందుతుంది అని భావించవచ్చు.

x) Simeon Pottor అనే భాషావేత్త కూడా తన 'Modern Linguistics' లో భాషను నిర్వచించడానికి ప్రయత్నించాడు. అతని ననుసరించి 'A Language may be defined as a System of arbitary Vocal sounds by means of which human beings communicate and co-operate with one another' 'ఏ సాధనం ద్వారా మానవులు తమ అభిప్రాయాల్ని ఎదుటి వ్యక్తికి తెలియజేస్తూ పరస్పరం సహకరించుకొంటారో, అట్టివారి కంఠధ్వనుల స్వతంత్రవ్యవస్థ భాష' అని చెప్పవచ్చు. మానవులు చేష్టలు సంకేతాలకన్న మిన్నగా ధ్వని రూపంలోని భాషద్వారా సహకరించుకోవచ్చు. అందువల్ల భాష పరస్పర సహకారానికి అత్యుత్తమ సాధనంగా భావించవచ్చు.

xi) John P. Hughes భాషను "Language is a System of arbitary Vocal Symbols by Which thought is conveyed from one human being to another" అని తన "The Science of Language" అనే గ్రంథములో నిర్వచించాడు. అంటే 'మానవులు పరస్పరం తను ఆలోచనల్ని యాదృచ్ఛిక నిర్మాణం కల్గినట్టి వాగ్రూపధ్వనుల ద్వారా వ్యక్తం చేయగల్గిన విధానం భాష' అని వారి అభిప్రాయం.

xii) Sturtvert తన "Linguistic change" అనే గ్రంథంలో భాషను ఈక్రింది విధంగా నిర్వచించ యత్నించాడు. "Launguage is a system of arbitary vocal symbols through which members of a social group interact, co-oparate and transmit their culture" అంటే 'యాదృచ్ఛిక మైన నిర్మాణసౌష్టవం కల్గి మానవ సమాజంలో భావవినిమయానికి ఉపకరించే

వాగ్రూపధ్వని సంకేత సముదాయం భాష' అని అర్థం. Hughes, Sturtvert నిర్వచనాలననుసరించి భాష యాదృచ్ఛికమైంది మరియు నిర్మాణ సౌష్టవం కల్గిన వ్యవస్థ అని చెప్పవచ్చు.

xiii) "S.K. వర్మ మరియు N. కృష్ణస్వామి గారలు తమ Modern Linguistics అనే గ్రంథంలో భాషను ఈ విధంగా నిర్వచించారు. Language is not a mono - lithic object. It is a human Phenomenon, which is as complex as human relationships in a socicty.

xiv) ప్రఖ్యాత హిందీ భాషావేత్త రామచంద్ర వర్మ "మనస్సులోని భావపరంపరను ఏ పదాలద్వారా, ఏ వాక్యాల ద్వారా ఎదుటి వారికందిస్తామో ఆపదాలే, వాక్యాలే భాష" అని అభిప్రాయపడ్డారు.

xv) విభిన్న వ్యక్తులు భాషను దర్శించే తీరు స్థూలంగా ఇలా ఉండొచ్చు.

| | |
|---|---|
| i) సామాన్య మానవుడు: | భావప్రకటనకు ఉద్దేశించే సాధనం. |
| ii) భాషోపాధ్యాయుడు: | భావ వినిమయంలో మానవులకు అవరోధాలు లేకుండా చేసే సాధనం. |
| iii) సాహితీవేత్త: | కవితా సౌందర్యాన్ని దర్శించడానికి, అవగాహన చేసికొనడానికి ఉపయోగపడే సాధనం. |
| iv) మనస్తత్వ శాస్త్రజ్ఞుడు: | మానవుల ప్రవర్తనలను పశుపక్ష్యాదుల ప్రవర్తనల నుండి వేరుచేసి చూపడానికి ఉపయోగపడే సాధనం. |
| v) మానవ శాస్త్రజ్ఞుడు: | మానవ సంస్కృతి అధ్యయనానికి భాష ఒక సాధనం. |
| vi) మత ప్రచారకుడు: | ఉపదేశమీయడానికి ఉపకరించే సాధనం. |
| vii) చరిత్రకారుడు: | శాసనాలు, రచనలు, అభిలేఖల సాయంతో చరిత్రను నిర్మించడానికి ఉపకరించే సాధనం. |
| viii) వేదాంతి: | తాత్విక చర్చకు ఉపకరించే సాధనం. |
| ix) సాంకేతిక శాస్త్రజ్ఞుడు: | వాగ్రూపంగా గాని, లిఖిత రూపంగా గాని ఎదుట వ్యక్తికి భావాన్ని అందించే సాధనం |

x) భాషా శాస్త్రజ్ఞుడు: భాషా విషయ వివెచనానికి ఉపకరించే సాధనం. భాష కేవలం సాధనమే గాక సాధ్యం కూడా. కొందరికి ఇది సాధనం. మరికొందరికి రెండున్నూ.

xi) విద్యార్థి భావం చెప్పడానికి చేష్టలతోబాటు ఉపయోగ పడే ధ్వనిరూపం

పై నిర్వచనాలన్నీ భాషను వివిధ దృక్కోణాలలో దర్శిస్తున్నాయి. ఈ నిర్వచనాలన్నీ భాష యొక్క స్వరూపాన్ని, స్వభావాన్ని లక్షణాలనీ వివరింప గల్గుతున్నాయి. వీనిలో ఏ ఒక్క నిర్వచనమూ సమగ్రం అనిపించకపోవచ్చు. కాని అన్ని నిర్వచనాలు కూడా భాష అంటే ఏమిటో తెల్సికోవడానికి సహకరిస్తున్నాయి.

## 1.03. భాష - ఉత్పత్తి :

మానవుడు సంఘజీవి. సమాజంలోని ఇతర వ్యక్తులతో వ్యవహరించడానికి అతడికి ఉపకరించే సాధనం భాష. అయితే ఈ భాష ఎలా ఉత్పత్తి అవుతుంది అనే అంశంపై వివిధ వాదాలు ప్రతిపాదింపబడ్డాయి. కొన్ని ప్రతిపాదిత వాదనల్ని తెల్సికొందాం.

i) భాష భగవద్దత్తమని ప్రాచీనుల మతం. భగవంతుడు ఈమానవ జన్మ కల్పించిన తీరులోనే వారు ఒండొరులు తమ భావాలను వినిమయం చేసికోవడానికి 'భాషను' ప్రసాదించాడని వీరి అభిప్రాయం.

ii) మరొకవాదం 'ఆశ్చర్యవాదం'. మానవుడు తన సుఖదుఃఖాలను వెలిబుచ్చే సన్నివేశాల్లో, ఆశ్చర్యాన్ని ప్రకటిస్తాడని ఆ ఆశ్చర్యాలే భాషా నిర్మాణానికి మూలకారణాలని ఈ ప్రతిపాదనలోని భావం. అందువల్ల ఆహా! అయ్యో! భళీ! వహ్వా! అనే ఆశ్చర్యార్థక శబ్దాల నుండి భాష ఉత్పత్తి అయిందని వారి అభిప్రాయం.

iii) బేబిలోనియా దేశస్థులు 'బైబిలు అందించిన ప్రసాదమే భాష ' అని, భాష భగవద్దత్త మనే ప్రాచీనుల వాదాన్ని బలపరిచారు.

iv) మరికొందరు అతి ప్రాచీన కాలంలోనే ఈ వస్తువును ఇలా పిలుద్దాం అని నిర్ణయించారని, ఈపిలుపుతో కూడిన కంఠధ్వనులే భాషోత్పత్తికి

మూల భూతాలని చెప్తారు.

v) అనుకరణం ద్వారా భాష అలవడుతుందని ఎల్లరకూ తెల్సిన విషయం. ఆదిమ మానవులు తమ చుట్టూ ఉన్న జీవజాలం చేసిన ధ్వనులను అనుకరించుట ద్వారా భాషకు ప్రాతిపదిక ఏర్పరిచారని మరికొందరు అభిప్రాయపడ్డారు. ఈ వాదాన్ని 'అనుకరణవాదమని' వ్యవహరిస్తారు. Maxmullar మహాశయులు ఈ వాదాన్ని Bow - Vow వాదమని పేర్కొన్నారు.

vi) శబ్దానికి, అర్థానికి మధ్య ఆంతరిక సంబంధముందని వాని అతీంద్రియ సంబంధాల ప్రభావం వల్ల మానవులు స్వాభావికతచే బాహ్య వస్తువులను తమ అంతరంగంలో వాగ్రూపంగా పదిలపరచుకొన్నారని మరికొందరు అభిప్రాయపడతారు. మానవుల హృదయంలో ధ్వనించిన వాగ్రూపాలే భాషయని వీరి భావన. దీనిని డింగ్-డాంగ్ వాదమని కూడా వ్యవహరిస్తారు.

ii) మరికొందరు భాష అనుభవపూర్వకంగా అలవడుతుందని అందువల్ల భాషోత్పత్తికి ' సంపాదన వాదం ' సరిపోతుందని చెప్తారు. తత్వ శాస్త్రంలోని 'అనుభవవాదం' వీరి అభిప్రాయాలకు ప్రాతిపదిక. విజ్ఞానం జన్మతః సిద్ధించింది కాదని, అనుభవాల ద్వారానే ఆర్జింపబడుతుందనేదే ఈభావన. శిశువులు పెద్దల్ని అనుకరించి ప్రయత్న వైఫల్యాల trail and error ద్వారా భాషను అభ్యసిస్తారు. ఈ అనుభవవాదం లేక సంపాదన వాదానికి ప్రతిరూపమే మనస్తత్వ శాస్త్రం లోని ప్రవృత్తి వాదం Behaviourism. దీని ప్రకారం ప్రేరణలు, స్పందనల మూలాన కల్గిన పరివర్తనలే, అలవాట్లే జ్ఞానం. మనస్తత్వ శాస్త్రజ్ఞులనేకులు ఈ వాదాన్ని సమర్థించారు. వారిలో Bloomfield. B.F. Skinner వంటి వారు ముఖ్యులు.

iii) అనుభవ పూర్వకమైన భాషా సంపాదన వాదాన్ని 'Chamsky ' ఖండించి హేతువాదం (Rationalism) ఆధారంగా స్వతస్సిద్ధ వాదాన్ని (Innate theory) ప్రతిపాదించాడు. వీరి అభిప్రాయం భాషోత్పత్తి వాదాలను కొత్త మలుపు తిప్పింది. ఈ వాదాన్ని అనుసరించి మానవుడు స్వతస్సిద్ధంగా భావాలను కల్గిఉంటాడని అనుభవాలు కేవలం ఆ భావాలకు ఉద్దీపనాన్ని మాత్రమే కల్గిస్తాయని అందువల్ల భాష స్వతస్సిద్ధంగా అలవడుతుందని

వీరి నమ్మిక. జన్మగతమైన స్వతస్సిద్ధ భావాలే వ్యక్తులు ఆర్జించిన విజ్ఞాన పరిధులకు ఆధారాని, వానిని నిర్ణయించగలవని 'చామ్స్కీ' మొదలగు హేతువాదుల నమ్మకం. దీని ఆధారంగానే భాష ఐదారేండ్ల వయస్సు వారికే పూర్తిగా వస్తుందని, ఒకవేళ స్వతస్సిద్ధత లేకపోతే అందరికీ భాషా వ్యవహార దక్షత ఎలాకలుగుతుందని వీరి వాదం.

ix) ప్రాచీన మానవులు జంతుజాలంనుండి పరిణితి చెందారని, ఈ పరిణామం క్రమంగా జరిగింది కావున మానవుల అభిప్రాయ నివేదన కూడా క్రమపద్ధతిలో జరిగిందని దీని వల్ల క్రమవికాస పరిణామంగా భాష ఉత్పత్తి ఐందని కొందరు పేర్కొన్నారు. మానవులకు అతి దగ్గరి వైన వానరాలు, చింపాజీలు, గొరిల్లాలు మొదలైన జంతువులు కూడా ధ్వని సంకేతాల మూలంగానే తమ భావాలను ప్రకటిస్తాయని అందువల్ల భాష క్రమవికాస పరిణామ ఫలితమని వీరి అభిప్రాయం. ఎంతో మంది పరిశోధకులు చింపాజీ, గొరిల్లా, చిలుకలు, మైనాక పక్షులకు మానవుల ధ్వనులను కేవలం అనుకరించడం నేర్పారు. ఇవి మానవులవలె పెక్కు విధాలుగా భాషింపలేవు. అందువల్ల వివక్షకు లోబడి మాట్లాడటం మానవులకు మాత్రమే సాధ్యమైనందున భాష సహజసిద్ధంగా క్రమ వికాస పరిణామం చెందిందని భావించవచ్చు.

x) బరువులను మోయుట మొదలైన సందర్భాల్లో ధీర్ఘంగా మనం ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసాలు తీస్తాం. ఇటు వంటి సమయాల్లో కండరాలు బిగిసి నాద తంత్రుల ప్రకంపనం తీవ్రమై ఒక విధమైన ధ్వని పుడుతుంది.పనివల్ల కల్గిన శ్రమ ధ్వనికి కారణమవుతుంది.ఈ ధ్వనులే తర్వాత అర్థవంతమైన భాషా రూపం ధరిస్తాయని కొందరంటారు. దీనిని వారు Mascular theory గా వ్యవహరిస్తారు. పడవలు నడుపువారు 'యెహూహూ' అని చేయు ధ్వనులను బట్టి దీనికి 'యెహూహూ' వాదమనే పేరు కూడా వచ్చింది.

xi సంకేతాల నుండి భాషలు ఉద్భవించాయని కొందరి వాదం. భావ వ్యక్తీకరణకు ప్రాచీన మానవుడు శరీర అవయవాలను కదిర్చేవాడు. దాంతో బాటు ఏ,ఓ మున్నగు ధ్వనులు చేసేవాడు. ఆ ధ్వనులు, సంకేతాలు నేటి భాషకు ప్రాతిపదికలని అందువల్ల ఈ వాదాన్ని ఫూ-ఫూ (phooh - phooh) వాదమని పేర్కొన్నారు. దీనికే టట్ - టట్ వాదమను పేరు కూడా కలదు.

పై వాదాల ననుసరించి భాష మానవుణ్ణి తక్కిన జంతుజాలం నుండి వేరుపరుస్తుందన్నది సత్యమౌతుంది. సంఘజీవి యైన మానవుడు తన భావాలను ఎదుటి వ్యక్తి కందించడానికి చేసిన కంఠధ్వనులే ఈనాటి భాషారూపానికి మూలమని చెప్పవచ్చు. భాష అనుకరణం,సంకేతం, సుఖ దుఃఖాల ఆవిష్కరణ మొదలగు వాని కలయికచే ఉత్పత్తియై ఉండవచ్చునని భావించవచ్చు.

## 1.04. భాష - స్వభావం లక్షణాలు :

సంఘంలో మానవుని కార్యకలాపాలకు, పరస్పర సహకారాలకు కారణ భూతమైంది భాష భాష లేందే నేటి సమాజం లేదు. మానవజాతి ఎంత పురాతనమైందో భాష కూడా అంతే పురాతన మైందని భాషా వేత్తలు ఇచ్చిన పై నిర్వచనాలు, భాషోత్పత్తి వాదాలు పరిశీలించిన మీదట స్పష్టమౌతోంది. భాషకు ప్రత్యేక స్వభావముందని ఆ స్వభావమే భాషా లక్షణాలుగా పరిగణింపబడుతున్నాయని భావింపవచ్చు. భాషా లక్షణాలకు ఆధార భూతమైన భాషా స్వరూపాన్ని కొంత తెల్సికొందాం.

### i) భాష, వాగ్రూప ధ్వని సంకేత సముదాయం :

మొదట మానవుడు తన భావాలను ఇతర ప్రాణులవలెనే చేష్టలు సంకేతాల రూపంలో ఎదుటి వ్యక్తికి అందించాడు. ఆ సంకేతాలకు కంఠధ్వని తోడై ప్రస్తుత భాషా రూపం ఏర్పడింది. వాగ్రూప ధ్వనులతో కూడిన సంకేతాలు భావ ప్రకటనను మరింత స్పష్టం చేస్తాయి. వీనివల్ల భావానికి తద్వారా భాషకు స్థిరత్వం ఏర్పడుతుంది. ఈ కారణాన భాష సాంకేతికము (Symbolic) అని కూడా వ్యవహరింపబడుతోంది.

### ii) భాష నిర్మాణాత్మకం :

ప్రపంచ భాష లన్నిటికి ఏదో ఒక నిర్మాణం ఉంటుంది. ఉదాహరణకు తెలుగు వాక్య నిర్మాణం కర్త కర్మ క్రియ రూపంలో ఉంటుంది. అలాగే ధ్వనుల్లో పదస్వరూపాల్లో, ఉచ్చారణ విధానాల్లో ప్రతిభాష ఏదో ఒక నిర్మాణ సూత్రానికి లోబడి ఉంటుంది.

అంతే గాక భాష వ్యక్తినిర్మాణానికి కూడా సహకరిస్తుంది. మనిషిని మనీషిగా మార్చడానికి భాష సాధనం. ఈ భాషను సక్రమంగా వినియోగించుకోకపోతే వ్యక్తి పతనానికి కూడా కారణభూతమౌతుంది. వ్యక్తులు ఏ భాషను

అలవర్చుకొన్నప్పటికి ఆ భాషను నిర్మాణాత్మక (Constructive) భావనకే ఉపయోగించుకొని ఉన్నత శిఖరాలనధిరోహించాల్సి ఉంటుంది.

iii) భాష యాదృచ్ఛికం :

వివిధ భావాలకు వస్తువులకు భిన్నమైన వాగ్రూప సంకేతాలున్నాయి.

ఉదా: తెలుగు - చెట్టు
ఇంగ్లీషు - tree
తమిళం - మరం
కన్నడం - గిడ
హింది - పేడ

పై పదాలు ఇచ్చే భావానికి ఆ పదాలకున్న లిపి - ధ్వని సంకేతానికి మధ్య ఉన్న సంబంధం కేవలం యాదృచ్ఛికంకాని వేరు కాదు. ఒకవేళ అలా కాక పోయినట్లయితే అన్ని భాషల్లో ఒక భావానికి ఒకే విధమైన వాగ్రూప సంకేతముండాలి. దీని ప్రకారం శబ్ద సంకేతానికి వస్తువుకు మధ్య సంబంధం నిత్యం కాదని భావించవచ్చు. ప్రతీ భాషలో ఒకే వస్తువును వేరువేరు పర్యాయ పదాల్లోనూ, ఒకే పదాన్ని వేరువేరు అర్థాల్లోనూ నానార్థ పదాల్లో వ్యవహరించడం కూడా భాషలకు గల స్వాభావిక ధర్మమే.

iv) భాష సామాజికం :

భాషా వ్యవహారంలో ప్రధాన సూత్రధారులు కనీసం ఇరువురు వ్యక్తులు. వ్యక్తుల ఉమ్మడి ఆశయాలు, ఆకాంక్షలు, వైయక్తిక ప్రభావాలు అన్నీ సామాజిక సమిష్టి ప్రభావాలకు లోనై ఉంటాయి కొన్ని సమాజాలు తమ భాషా రూపాలను కూడా నిర్దేశించుకొంటాయి. ఈ రూపం తప్పని ఆరూపం ఒప్పనే భావన ఈ లక్షణం లోనిదే. అందువల్ల భాష ఆయా సమాజాల ఔన్నత్యానికి కారణమౌతుంది.

v) భాష అర్థవంతం :

కేవలం అన్ని వాగ్రూప ధ్వనులు మాత్రమే భాషా ధ్వనులు కావు. ఈ ధ్వనుల్లోని అమరిక, క్రమం వీనిని అర్థ వంతము, అర్థరహితము చేస్తుంది. క్రమంలో అమరిన ధ్వనులు తప్పనిసరిగా ఒక అర్థాన్నిస్తాయి. ఈ అర్థం వక్త ఉచ్చారణ, శ్రోత గ్రహించిన తీరును బట్టి నిర్ణయమౌతుంది. వక్తకు శ్రోతకు మధ్య భావవినిమయానికి ఉపయోగించే ధ్వనులన్నీ పరస్పర

అంగీకార యోగ్యమై అర్థవంతమై ఉంటాయి.

vi) భాష పరిణామ శీలి :

భాషల్లో మార్పులు సహజం. ఇట్టిమార్పులు ప్రాచీన భాషలైన సంస్కృతం, లాటిన్ లలో కన్న ఆధునిక భాషలలో ఎక్కువ. ఈ పరిణామాలను ఇముడ్చుకోలేని భాషలను మృత భాషలుగా, పరిణామాలకు లోబడుతున్న భాషలను జీవద్భాషలుగా పరిగణిస్తున్నారు. భాషాపరిణామంలో మొదట కనబడిన లేదా వాడబడిన రూపం రానురాను మార్పుకు లోబడిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. మన తెలుగు భాషలో కూడా ప్రాచీన శాసనాల్లోని తెలుగు పదరూపాలకు, నన్నయ కాలం నాటి పదరూపాలకు, ఈనాటి తెలుగుకు మధ్య ఎంతో తేడా కనిపిస్తుంది. దీనికి కారణం ఆయా భాషా సమాజాలు అభివృద్ధి చెందే కొలది భౌగోళిక, రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితుల్లో మార్పులు జర్గడం. వీని ప్రభావం వల్ల భాషలో వివిధ మాండలిక రూపాలు ఏర్పడడం. ఈ మాండలికాల మధ్య భేదాలు పెరిగే కొలది కాలక్రమంగా అవి భిన్న భాషలుగా ఎదిగే అవకాశాలు కూడా లేకపోలేదు.

vii) భాష అనుకరణ సాధ్యం :

భాష జన్మతః అలవడేదికాదు. జన్మతః అలవడేది రోదన రూపంలోని కంఠధ్వని మాత్రమే. కంఠధ్వనులు అర్థవంతమైనవిగా మారడానికి శిశువులు మొదట పెద్దలను అనుకరిస్తారు. అందువల్ల భాష మొదట అనుకరణంవల్ల వస్తుంది. అనుకరణ మానవ వ్యవహార జీవితంలో అత్యంత ప్రధానమైన అంశం. ప్రతివ్యక్తి దైనందిన వ్యవహారంలో ఎదుటివారిని అనుకరించ యత్నిస్తాడు. అందువల్ల పుట్టినబిడ్డ ఏ భాషా సమాజంలో జీవిస్తాడో ఆ భాషను అనుకరిస్తాడు. ఇంటి గడపదాటి ఇతర భాషలుకూడా అనుకరిస్తాడు. తమ జిజ్ఞాసనుబట్టి వ్యక్తులు ఎన్నైనా భాషలు అభ్యసించవచ్చు.

పైన నిర్వచించిన లక్షణాలు కల్గిన భాషాస్వరూపం ప్రధానంగా రెండు రూపాల్లో ఉంటుంది. అవి వాగ్రూపభాష మరియు లిఖితరూపభాష. వాగ్రూపభాష సాధారణ వ్యవహారానికి సంబంధించింది. ఇందు నిత్య వ్యవహారంలో, విశిష్టవ్యవహారంలో ఉపయోగపడే భాషారూపాలుంటాయి. ఈ వాగ్రూపభాషా రూపం తాత్కాలికమైంది. స్ఫోట శాస్త్రజ్ఞులు వాగ్రూపభాష అనిత్యమైందని అభిప్రాయపడతారు. అంటే ఒకసారి ఉచ్చరించింతర్వాత వేవలా అవలేదు అంటే, అది ధ్వని ముద్రాంకితమైతే తప్ప సాక్ష్యం లేదని, ఉచ్చారణలో మూడవధ్వని ఉచ్చరిస్తుంటే మొదటి ధ్వని తెరమరుగవుతుందని

విరి వాదన. ఈ విషయానికి ఉదాహరణంగా పత్రికల్లో ఏదో ఒక వార్త రావడం. మరునాడు నేనలా అనలేదనే ఖండన రావడం మనంచూస్తాం. ఆ కారణాన వాగ్రూప భాషారూపాన్ని కేవలం తాత్కాలికరూపమనే భావిస్తారు. రెండవదైన లిఖితరూపం శాశ్వతం. అందువల్ల లిఖితభాషకే ప్రాధాన్యత హెచ్చు. ఈ రూపంలోనే మానవుడు తన ప్రాచీన సంప్రదాయాన్ని, సంస్కృతిని తెల్సికోగల్గుతున్నాడు. లిఖితభాషలో సాధారణంగా దోషాలుండవు. ఇది వ్యాకరణ నియమాలకు లోబడి ఉంటుంది.

## 1.05 భాషాశాస్త్రం - భాషాబోధన :

భాష వ్యక్తుల భావాలకు, ఆవేశాలకు, కార్యకలాపాలకు సంబంధించింది. ఇది జాతి, మతం మొదలైన వానితో సంబంధం కల్గి ఉంటుంది. మానవుని నిత్య వ్యవహారసందర్భాలన్నింటిలోనూ భాషావినియోగం తప్పనిసరి అవుతుంది. అంటే భాషను ఉపయోగించకుండా రోజు గడపడం కష్టం అన్నమాట. ప్రతి వ్యక్తికి తనదేయైన ఒక భాష ఉంటుందని చాలామంది విశ్వసిస్తారు. వీరు చేసే భాషాధ్వనుల సముదాయం శబ్దాలుగాను, శబ్దాల సముదాయం పదబంధాలుగాను, పదబంధాలు వాక్యాలుగాను రూపొంది పూర్తి భావాన్ని వినిమయంచేస్తాయి. మానవుడు అభివృద్ధి చెందుతున్నట్లే భాషాభివృద్ధికూడా జరుగుతుంది. వ్యక్తులుచేసే ధ్వనులు అర్థవంతంగా శబ్దాలలో ఒదిగిపోయినపుడే అవి భావ వ్యక్తీకరణకు ఉపకరిస్తాయి. లేకపోతే అవి నిరర్థక ధ్వనులు మాత్రమే అవుతాయి.

భాషా వైజ్ఞానికులు భాషల పరిశీలనకు నాలుగు మార్గాలు సూచించారు. అవి ధ్వన్యాత్మకస్థాయి (Phonological Level), పదాంశస్థాయి (Morphological Level), వాక్యాంశస్థాయి (Syntax Level), అర్థ సంబంధస్థాయి (Semantic Level). పైస్థాయిలు ఏ భాషనైనా స్పష్టంగా వివరించడానికి ఉపకరిస్తాయి. భాషాబోధనలోగాని, భాషాభ్యసనంలోగాని, ప్రధానంగా ఆ భాషా తత్వాలను తెల్సికొని, ఆ భాష వివిధ సందర్భాల్లో ఎలా ఉపయోగింపబడుతుందో అవగాహనచేసికోవాలి. ఆయా భాషల మధ్యగల సామ్యభేదాలను (Similarities and differences)ను భాషను నేర్పే ఉపాధ్యాయులు ఈనాడు అవశ్యంగా అధ్యయనం చేయాల్సిన అవసరముంది. తద్వారా భాషోపాధ్యాయులు తమ విద్యార్థుల భాషాభ్యసనంలోని ఇబ్బందులను గ్రహించి వారి అభ్యసనాన్ని సులువుపరచడానికి వీలవుతుంది.

ప్రసిద్ధ భాషా వైజ్ఞానికుడు (Linguist) ఫెర్డినాండ్. డి. సస్యూర్ భాష

ఒక నిర్దిష్టరూపం కల్గి ఉంటుందని దీనిలోని అన్ని మౌలిక అంశాలు ఒక క్రమపద్ధతిలో అమర్చబడి ఉంటాయని అభిప్రాయపడ్డారు. అంటే భాషలోని పదాలు, పదాంశాలు, వాక్యాలు అన్ని కల్సి క్రమపద్ధతిలో కూర్చబడి సమూహంలో ఒక అర్థాన్నిస్తాయి. తెలుగు అనే పదం తె.లు.గు అని వేరువేరుగా ఉచ్చరిస్తే, రాస్తే అర్థమేలేదు. ఈ లక్షణాలను తెలుగు అనే క్రమంలోగాక ఇతర క్రమంలో (గులుతె) (లుతెగు) అని రాస్తే కూడా అర్థంలేదు. తెగులు అనిరాస్తే అర్థమే మారిపోతుంది. అందువల్ల ఒక నిర్దిష్ట క్రమంలో ఉంటేనే ధ్వనులు అర్థవంతమౌతాయని భావించాలి. భాషా శాస్త్ర పరిచయం ఈ మౌలికాంశాలనే ఉపాధ్యాయులకందించి వారికి భాషా నిర్మాణం తీరుతెన్నుల్ని తెల్పి మరింత ప్రభావయుతంగా భాషాబోధనకు సన్నద్ధులను చేస్తుంది.

భాషా శాస్త్రాన్ని అధ్యయనంచేయడానికి వివిధ పద్ధతులున్నాయి. వానిలో ఒకటి వర్ణనాత్మక వివరణ (Descriptive analysis). అంటే భాషలోని వివిధ అంశాలు ఎలా ఉన్నాయో వర్ణించి చెప్పి వాటికి సంబంధించిన సూత్రాలు చెప్పడంద్వారా భాషా శిక్షణను మెరుగుపరచవచ్చు. కొన్ని పర్యాయాలు భాషకు, చారిత్రక వివరణ కూడా (Historical analysis) ఇవ్వాల్సి ఉంటుంది. తద్వారా పదాలపుట్టుక, ఆయా ప్రాంతాల్లో వాని ప్రయోగం మొదలైనవి విద్యార్థులకు తెలియజేయవచ్చు. పై వాని సాయంతో భాషయొక్క మౌఖిక రూపాన్ని, లిఖితరూపాన్ని వివరించి రెంటిలో మౌఖిక భాషారూపం నిత్య వ్యవహారంలో సింహభాగం గ్రహిస్తుంది కనుక దానికే మొదట బోధనలో ప్రాధాన్యతనీయవల్సియుంటుంది.

శాస్త్రీయ దృక్పథంలో చేసే భాషా పరిశీలన భాషా శాస్త్రమవుతుంది. భాషాతత్వాన్ని (Language nature) దాని అంతర్గత నిర్మాణాన్ని (Internal Structure) అర్థంచేసికోవడానికి భాషాశాస్త్రం ఉపకరిస్తుంది. భాషానిర్మాణం, ఆ భాషలో వ్యక్తంచేసే ధ్వనుల సముదాయం (expression - speech), వావిద్వారా వ్యక్తమయ్యే భావం లేదా అర్థం (Content or meaning) అనే ప్రధావ లక్షణాలపై ఆధారపడి ఉంటుంది. ఒక భాషతో పరిచయంలేని మరోభాషా వ్యవహర్త ఆ భాషను విన్నప్పుడు ఆ ధ్వనులను కేవలం ధ్వనులుగా మాత్రమే వింటాడు తప్ప, అవి వ్యక్తం చేస్తున్న భావాలు మాత్రం తెల్సికోలేదు. ధ్వనుల సముదాయాలు, అవి వ్యక్తంచేసే భావాలను తెల్పగల్గిన శాస్త్రంగా భాషాశాస్త్రం అభివృద్ధి చెందింది. వాగవయవాలనుండి ఉత్పన్నమయ్యే పెక్కు ధ్వనులు ఒక్కొక్క భాషలో ఒక్కొక్క పద్ధతికి (Pattern) నిర్మాణానికి

లోబడి ఉంటాయి. ఆ నిర్మాణాలు పద్ధతుల్లో గల భేదం భాషల్లో భేదాలను కల్గిస్తుంది. ఆయా భాషల్లోని ధ్వనుల నిర్మాణం వానియందలి అంతర్గత నిర్మాణాన్ని కూడా నిర్దేశిస్తుంది.

భాషాశాస్త్ర పరిధిలోని ప్రధానమైన అంశాలు మూడు.

i) వ్యక్తనిర్మాణం (Expression System)

ii) భావనిర్మాణం (Content/Meaning System)

iii) పదజాలం (Vocabulary)

పై మూడింటిలో పదజాలం మార్పులు - చేర్పులకు లోబడుతుంది. వ్యక్త నిర్మాణానికి భావనిర్మాణానికి మధ్య అంతర్గత సంబంధముంటుంది. ఒకకాలంలో విరివిగా ఉపయోగించిన పదజాలం తరువాతి కాలంలో కని పించకపోవడంకూడా సంభవిస్తుంది. అందువల్లే H.A. Gleason తన 'An Introduction to Descriptive Linguistics'లో "It (Vocabulary) is the least stable and even least characteristic of the three components of the language" అని అన్నారు. భాషలో నూతన విషయాలు తదనుగుణమైన నూతన పదజాలం వచ్చి చేరినప్పటికి భాషయొక్క మౌలికరూపం మాత్రం మారదు. కాని స్వల్పమైన మార్పులు జరగడానికి మాత్రం అవకాశముంటుంది. ఒక భాషా వ్యవహర్త మరోభాషను అభ్యసిస్తే ఆ భాషా ధ్వనులపై తన మొదటి భాష ప్రభావం గాని, తన మొదటి భాషపై కొత్తగా అభ్యసించిన భాష ప్రభావంగాని ఉండవచ్చు. అట్లే నూతన వ్యాకరణకార్యాలు, వాక్యనిర్మాణాలు కూడా రెండు భాషల్లో చోటుచేసికోవచ్చు. అయితే పదజాలంలో వచ్చినంత వేగంగా వాక్య నిర్మాణంలో మార్పురాకపోవచ్చు.

భాషల వ్యక్త నిర్మాణంలో వర్ణాలు (Phonemes) మౌలికాంశాలు (Basic ·lements). వర్ణాలు ఒక భాషకు చెందిన వ్యక్తులందరికీ సర్వసమానంగా ఉన్నప్పటికీ ధ్వనిలక్షణాలు (Sound features) మాత్రం వేరుగా ఉండవచ్చు. ఉదా: మామ, మాఁవ. ప్రతిభాషలోను వర్ణాల సంఖ్య పరిమితమే. ధ్వని లక్షణాలు అపరిమితాలు. వర్ణం భాషలోని కనిష్ఠాంశంగా భాషావైజ్ఞానికులు పరిగణిస్తారు. ఉదా: కాలం - గాలం. ఈ రెండు పదరూపాలలో |క్|, |గ్| అన్నవి రెండు అర్థభేదక ధర్మంకల్గిన కనిష్ఠ ధ్వనిరూపాలు. ఈ వర్ణాలమీదే భాషయొక్క పూర్తి వ్యక్తనిర్మాణం (Expression System) ఆధారపడి ఉంటుంది. వర్ణం భాషాసంబంధమైన ఒక అంశం మాత్రమే. వివిధ భాషల్లో వివిధ ధ్వనిరూపాలు వర్ణాలుగా పనిచేయవచ్చు. ఈ వర్ణం

(Phoneme) అనేది మాట్లాడేభాష (Spoken language)కు సంబంధించిందే తప్ప లిఖితభాష (Written language)కు సంబంధించిందికాదు. లిఖితభాష లిపి సంకేతాలపై (graphumes)పై ఆధారపడి ఉంటుంది.

వ్యక్త నిర్మాణంలో కనిపించే రెండవ అంశం పదాంశం (Morpheme). అర్థవంతమైన ప్రతి అంశం భాషలో పదాంశమే. ఉదా: ఆవులు - ఈ పదంలో ఆవు-లు అనే రెండు పదాంశాలున్నాయి. ఈ పదంలో 'లు' అన్నది బహువచనార్థాన్నిచ్చే పదాంశం. ఈ పదాంశం అన్న అంశమే వ్యక్త నిర్మాణంనుండి (Expression System) నుండి భావనిర్మాణంతో (Content System)తో సంబంధం కలుపుకుంటుంది. పదాంశం - వర్ణం రెండున్నూ వ్యక్తనిర్మాణంలో భాగాలైనప్పటికి పదాంశం అర్థవంతమైంది. వర్ణం అర్థరహితమైంది. కాని వర్ణం అర్థరహితమైనప్పటికి అర్థభేదక శక్తి కలది అని గుర్తించాలి. ఈ రెండు అంశాల ఆధారంగా భాషా శాస్త్రజ్ఞులు భాషకు ఒక నిర్దిష్టమైన రూపాన్ని ఇవ్వడానికి యత్నిస్తారు.

ఇట్లు ప్రపంచంలోని అనేక మానవభాషలయొక్క నిజస్థితి. నిర్మాణ స్వరూపాలను, చారిత్రక విశేషాలను నిశితంగా పరిశీలించి, వాటికి సంబంధించిన నిరూపణయోగ్యమైన సిద్ధాంతాలను శాస్త్రీయపద్ధతుల్లో ప్రతిపాదించి, భాషల స్వరూపాన్ని, పరస్పర సంబంధాన్ని తెలియజేసేశాస్త్రం భాషాశాస్త్రమని చెప్పవచ్చు.

భాషా వైజ్ఞానికుడు (భాషా శాస్త్రజ్ఞుడు), భాషోపాధ్యాయుడు ఇరువురూ భాషను గూర్చి ఆలోచిస్తారు. ఒకరు భాషను పరిశోధిస్తూ విశ్లేషిస్తే మరొకరు భాషలను నేర్పే విధానాలగురించి, విద్యార్థులు సులువుగా భాషలను నేర్చుకొనగల్గిన పద్ధతులగురించి పరిశోధిస్తారు. ఇలా ఇరువురూ భాషల విశ్లేషణలకు - వివరణలకు ప్రాధాన్యత ఇస్తారు.

ఇట్లు భాషల నిర్మాణక్రమాన్ని పరిశీలించడం, ఇతర భాషలతోడి తారతమ్య వివక్ష, భాషల పరస్పర సంబంధబాంధవ్యాలు, ప్రభావాల నిర్ణయం, భాషల వర్గీకరణం, భాషారూపాల్ని వ్యాకరించడం, భాష పూర్వపూర్వరూపాల్ని, మూల భాషా రూపాలను గుర్తించడం, కొత్త భాషల్ని అన్వేషించడం, కొత్తవానికి వర్ణనాత్మక వ్యాకరణాన్ని సిద్ధంచేయడం ఆధునిక భాషా శాస్త్రజ్ఞుల ప్రధానలక్ష్యాలు. భాషాశాస్త్రజ్ఞుల సహాయంతో భాషాబోధకులు భాషాబోధనలో ఆయా అంశాలను నేర్చుకొని కొత్తపుంతలు తొక్కాల్సిన అవసరం ఈనాడు ఎంతేని ఉంది.

# రెండో అధ్యాయం

## భాష - వివిధ భావనలు

### 2.01 ఉపోద్ఘాతం

మానవులు తమ అభిప్రాయాల్ని నివేదించుకొని ఎలా ఒండొరులు సహకరించుకొంటారో, ఆ మానవుల కంఠధ్వనుల స్వతంత్ర వ్యవస్థ భాషయని Simon Pottor నిర్వచించారు. ఇచట మానవులంటే ఒక సమాజంలోని వారు. కంఠధ్వనులంటే కేవలం వాగింద్రియాల సాయంతో చేసే ధ్వనులు మాత్రమే. ఆంగిక చేష్టలు, లేఖన చిహ్నాలు ఇవి కంఠధ్వనుల పరిధిలోకిరావు. అందువల్ల భాషకు ఇరువురు వ్యక్తులనివార్యం. ఒకరు వక్త, మరొకరు శ్రోత. మానవశరీరంలో శబ్దోత్పత్తికి, శబ్దగ్రహణానికి ఉపకరించే భాగాలన్నీ సక్రమంగా ఉంటేనే బాషా వ్యవహారం సరిగా సాగుతుంది. మానవునకు భాష ఒక మంచి ఉపకరణం. దీనిద్వారా అనేక క్లిష్ట సమస్యల్ని సులువుగా పరిష్కరించుకొంటాడు. వ్యవహారంలో ఎంతో లాఘవాన్నికూడా సంపాదించుకొంటాడు.

ఇప్పుడు ప్రపంచంలో ఎన్ని భాషలు వ్యవహృతంలో ఉన్నాయో ఖచ్చితంగా చెప్పలేం. కొన్ని వేల సంవత్సరాలనుండి అసంఖ్యాకమైన భాషలు వాడుకలో ఉన్నట్లుగా భాషా శాస్త్రజ్ఞులు చెప్తారు. కొన్ని భాషలున్నట్లు వింటామేగాని ఆ భాషల వ్యవహర్తలు ఉన్నారనే దాఖలాలులేవు. కొన్ని భాషలు కేవలం మౌఖికాలే. కొన్ని భాషలే లిఖితాలు. ఈ భాషలన్నీ సుమారు నాలుగువేలకు పైబడి ఉంటాయని శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తంగారు తమ 'భాషాశాస్త్ర పరిచయం'లో అభిప్రాయపడ్డారు. అయితే ప్రపంచవ్యాప్తంగా ఉన్న ఇన్ని భాషలలో ఏదో ఒక భాష మాత్రమే ఒక వ్యక్తియొక్క స్వంత భాషయై మిగతాభాషలు అతనికి పరిచయమున్న భాషలుగా వ్యవహరింపబడతాయి. ఒక వ్యక్తియొక్క స్వంతభాష మరోవ్యక్తి స్వంతభాష ఒకటి కాకపోవచ్చు. ఒక భాష మరొకరికి కేవలం పరిచయమైనదే కావచ్చు. అందువల్ల భాష అనే పదంతో పూర్వానుబంధం చేరి మాతృభాష, ప్రథమభాష, ద్వితీయభాష, తృతీయభాష, మాధ్యమభాష,

జాతీయభాష, అంతర్జాతీయభాష, అధికారభాష అనే పదబంధాలతోబాటు భాషాస్వరూపాన్ని బట్టి గ్రాంథికభాష, ప్రామాణికభాష, వ్యవహారికభాష, మాండలికభాష అనే పదబంధాలు కూడా వాడుకలో ఉన్నాయి. భాషకు సంబంధించిన వివిధ భావనలను పరిశీలించడం, వాని ప్రధాన లక్షణాలను అధ్యయనం చేయడం భాషోపాధ్యాయులకు అవసరం. వీనిగురించి కొంత తెల్సికొందాం.

## 2.02 గ్రాంథికభాష :

ప్రాచీన కావ్యభాషా సంప్రదాయాన్ని మనం గ్రాంథికభాషయని వ్యవహరిస్తున్నాం. ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చేయడానికి ఈ భాషారూపం అవసరం. మన రాష్ట్రంలో ఇటీవలి కాలంవరకు కూడా పాఠ్యపుస్తకాల్లో గ్రాంథికభాషా రూపానికే ప్రాధాన్యత ఈయబడింది. వ్యవహారంలోని భాషారూపం ఒకరకంగా, గ్రంథస్థభాషారూపం మరోరకంగా ఉండటం మూలాన విద్యార్థులు రెండు భాషారూపాలు వేరువేరు సందర్భాలకు పరిమితాలనే భావించారు. పాఠ్యపుస్తకాల్లో తాము చదువుతున్న భాషారూపం, నిత్య వ్యవహారానికి అనుకూలించదనే భావంతో ఆ భాషారూపాన్ని స్వంతంచేసికోలేకపోయారు. పరిణామంచెందుతున్న సమాజాల్లో భాషా రూపంకూడా పరిణామం చెందుతుంది. అందువల్ల ఈ పరిణామాలకు అనుగుణంగా సమకాలీన జనవ్యవహారానికి అనుకూలమైన భాషారూపమే విరివిగా ప్రచారంలోకి వస్తుంది. కాని ఉన్నత తరగతుల్లో ప్రాచీన సాహిత్యం నుండికూడా పాఠ్యాంశాలు ఎంపికచేయకపోతే భాషాస్వరూపమే తెరమరుగై ప్రాచీన సాహితీ సంపదను పోగొట్టుకొంటాం. అందువల్ల విద్యార్థులకు ప్రాచీన భాషారూపం కూడా గ్రాంథికభాషగా పాఠ్యాంశాలలో పరిచయం చేయబడాలి. ఈ ఆలోచనలో విప్రతిపత్తిలేదు. ఈ విషయంలో శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి లాంటివారు గ్రాంథికభాషా వ్యవహారాన్ని పూర్తిగా వ్యతిరేకించినప్పటినుండి ఈనాటి పాఠ్యపుస్తకాలు ఆధునిక ప్రామాణిక భాషారూపాన్ని అలవరచుకొని రాయబడుతున్నాయి. ప్రాచీన కావ్యభాషయైన గ్రాంథికభాషా రూపాన్ని కూడా తప్పనిసరిగా విద్యార్థులకు పరిచయంచేసి సాహిత్య సౌరభాల్ని పంచిపెట్టి భాషా సంప్రదాయాన్ని కాపాడాల్సి ఉంది.

## 2.03 ప్రామాణికభాష :

మౌళిక ధ్వనుల వ్యవస్థ భాష. భాషించే వ్యక్తుల సామాజిక, ఆర్థిక, విద్యా, వైజ్ఞానిక స్థితిగతుల్ని బట్టి వారి భాషాస్థాయిని నిర్ణయించవచ్చు.

సమాజంలోని కొంతమంది మాట్లాడే భాష ఆమోదయోగ్యమని, కొంతమంది మాట్లాడేభాష అంతగా ఆమోదయోగ్యంకాదని తక్కినవాళ్ళు భావిస్తారు. ఇలా అత్యధిక సంఖ్యాకులైన వ్యక్తులచే ఆమోదింపబడి వ్యవహారంలో ఉన్న భాషారూపాన్ని ప్రామాణిక భాషా రూపమనిగాని ప్రామాణికభాష అనిగాని వ్యవహరించవచ్చు.

Bloomfield ప్రామాణిక భాషలను గూర్చి ఈ విధంగా అభిప్రాయపడ్డారు. "The Modern Standard Languages which prevail within the bounds of an entire nation supersede the provincial types. These Standard Languages become more and more uniform as time goes on. In most instances, they have gone out of the provincial type that prevailed in the upperclass of the urban centre that became the capital of the unified nation." ప్రామాణిక భాషా లక్షణాలుగా ఈ కిందివానిని ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారు పేర్కొన్నారు.

i) మృదువైన స్థిరత్వం (Flexible Stability)
ii) మేధావీకరణం (Intellectualisation)

వీరు తమ అభిప్రాయానికి మద్దతుగా పాల్ గార్విన్‌గారిని ఉల్లేఖించారు. 'పాల్ గార్విన్' అభిప్రాయంలో ప్రామాణిక భాష మార్పుల్ని ఆహ్వానిస్తూ, ఆ మార్పుల్ని అంతర్భూతం చేసికొంటూ స్థిరంగా ఉంటుంది. ఇట్టి స్థిరత్వం సముచితమైన క్రోడీకరణం మూలంగా ~~సంభవిస్తుంది. సాంస్కృతిక~~ పరిణామాలవల్ల ఈ క్రోడీకరణంలో మార్పులు రావచ్చు. అట్టి అవకాశాల్ని కల్పించడమే మృదుత్వం అని వారి అభిప్రాయం.

ఇచట మేధావీకరణం అంటే కేవలం సంభాషణాస్థాయిలో ఉన్న మాండలికం, ఆ స్థాయినతిక్రమించి ఉన్నత వైజ్ఞానిక వ్యవహారస్థాయినందుకోవడం అన్నమాట. గార్విన్ దృష్టిలో ప్రామాణిక భాష ఈ క్రింది ప్రయోజనాల్ని సాధిస్తుంది.

i) సమైక్యతా సాధనం

ప్రామాణిక భాష వివిధ మాండలిక భాషా వ్యవహర్తలమధ్య సమైక్యతను సాధించి భాషా సమైక్యతకు, భావ సమైక్యతకు తద్వారా ~~జాతీయ సమైక్యతకు~~ తోడ్పడుతుంది.

ii) ప్రతిష్ఠా సాధనం

ప్రామాణిక భాషను మాట్లాడేవ్యక్తులు మాండలికం మాట్లాడేవారికన్న ఉన్నత సామాజిక స్థాయి మరియు ప్రతిష్ఠ కలవారుగా పరిగణింపబడతారు.

iii) అనుసంధాన సాధనం

వివిధ సామాజిక సన్నివేశాల్లో తమ భావాలను నిర్దుష్టంగా, నిర్దిష్టంగా చెప్పి అందర్నీ మెప్పించగల సాధనంగా ప్రామాణిక భాష ఉపకరిస్తుంది.

ప్రామాణిక భాషారూపం ఏర్పడ్డ తర్వాత ఆ భాషారూపానికి నిఘంటువులు, వ్యాకరణాలు ఏర్పడతాయి. సాధారణరచనలు, రాతకోతలు, సమాచార వేదికలు అన్నీ ప్రామాణిక భాషా రూపాన్నే నిరంతరం ఉపయోగిస్తాయి. ఆధునికకాలంలో కృష్ణా, ఉభయగోదావరి జిల్లాల్లో మాట్లాడే తెలుగు భాషారూపం ఆధునిక ప్రామాణిక భాషగా (Modern Standard Language) శ్రీ C.P. బ్రౌన్ అభిప్రాయపడ్డారు.

ప్రామాణిక భాషలోని వైవిధ్యాన్ని, ఆవశ్యకతను ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు గుర్తించారు. భాషా శాస్త్రజ్ఞులందరూ ఈ రూపాన్నే విరివిగా ఉపయోగిస్తున్నారు కూడా. వర్ధమాన ప్రపంచంలోని భాషల్లో ప్రామాణిక భాషను మాండలిక సమ్మేళనంతో సులభ గ్రాహ్యం చేయడం అవసరమని వారు తమ తెలుగు భాషా చరిత్రలో వారు అభిప్రాయపడ్డారు.

## 2.04 వ్యావహారిక భాష :

సాధారణ జన వ్యవహారమందున్న భాష వ్యవహారికభాష అని పిలువబడుతుంది. గ్రామ్య భాషారూపమే వ్యవహారిక భాషారూపంగా పరిణతిచెందిందనడానికి బహుశా అభ్యంతరం ఉండకపోవచ్చు. శ్రీ గిడుగు రామమూర్తి, శ్రీ గురజాడ అప్పారావు లాంటి మహోద్దండులు ఈ వ్యావహారిక భాషా రూపాన్ని పాఠ్యగ్రంథాల్లోకి తీసికొని రావడానికి విశేషంగా కృషిచేసారు. వ్యవహారిక భాషోద్యమాలు నిర్వహించి, వ్యవహారిక భాషారూపానికి జీవంపోసి ఆ భాషారూపాన్ని అభివృద్ధిచేయడానికి విశేషంగా కృషిచేసారు.

ఈ రూపం కొత్తగా రూపొందిందిగాని ప్రతిపాదించిందిగాని కాదు. ప్రాచీనకాలంలోని శాసనాల్లో, వివిధ రచనల్లోనే వ్యవహారిక భాషారూపాలు వ్నాయి. శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారి అభిప్రాయంలో పూర్వకాలంలోని కావ్యభాషా గ్రంథకర్తలు కూడా వ్యవహారిక భాషను ప్రయోగించారు.

ఆదరించారుకూడా. దేశభాషల్ని (Native Languages) అభివృద్ధి పర్చాలనే ధ్యేయంతో 1901 సం॥లో గవర్నర్ జనరల్‌గా ఉన్న లార్డ్‌కర్జన్ విద్యా సంబంధమైన సమస్యలు చర్చించడానికి ఒక సమావేశం ఏర్పాటుచేసాడు. మాతృభాషలో, మాట్లాడేభాషలో రచనలు చేయాలని, ఇంగ్లీషు పుస్తకాలను ప్రాంతీయభాషల్లోకి అనువదిస్తున్నపుడు వానికవసరమయ్యే ప్రత్యేక పద్ధతుల్ని నేర్పాలని ప్రతిపాదించారు. తరగతిగదుల్లో, తరగతిగోడల వెలుపల మాట్లాడే భాషారూపాల మధ్యగల అంతరాన్ని పరిశీలించిన J.A. Yates ఈ భాషారూపాల్లో ఎలాంటి అంతరం ఉండరాదని అభిప్రాయపడ్డారు. ఈ అంశాలను దృష్టిలో పెట్టుకొనే 1911 సం॥లో మద్రాస్ విశ్వవిద్యాలయం సెప్టెంబర్ ఎనిమిదవ తేదీన 'వ్యావహారికభాషావాద' సంఘాన్ని నియమించింది. ఈ సంఘం శిష్టవ్యవహారిక భాషారూపానికి అనుకూలంగా తీర్మానించింది. శిష్టవ్యావహారిక రూపం ప్రామాణిక, గ్రాంథిక భాషారూపానికి దగ్గరగా ఉండటం ఇచట గమనార్హం. గురజాడలాంటి మహోన్నత వ్యక్తులు ఈ విషయాన్ని ప్రతిఘటించారు. తర్వాతికాలంలో వివిధ రచయితలు తాముచేసిన వచనరచనల్లో వ్యావహారిక భాషారూపానికే ప్రాధాన్యత ఇచ్చారు. పత్రికలు, రేడియో, సినిమాలు మొదలైన ప్రసార మాధ్యమాలన్నీ వ్యవహారిక భాషా రూపానికే ప్రచారమిచ్చాయి. ప్రసిద్ధులైన పండితులు కూడా వ్యవహారిక భాషలోనే తమ రచనలు చేయడం ప్రారంభించారు. అందువల్ల వ్యావహారిక భాషారూపం స్థిరపడిపోయింది.

మన రాష్ట్రప్రభుత్వ విధానాన్ననుసరించి పాఠ్యపుస్తకాల జాతీయాకరణం జరిగింది. తెలుగు మాతృభాషగా, ద్వితీయభాషగా అధ్యయనంచేసే విద్యార్థుల కోసం ప్రధానంగా ప్రాథమికదశలో వ్యవహారిక భాషారూపంలోనే పాఠ్యపుస్తకాల రచన జరగాలని నిర్ణయించబడింది. 1965 సం॥తిరుపతిలో జరిగిన ఒక పండిత గోష్ఠిలో వ్యవహారిక భాషారూపమే పాఠ్యపుస్తకాల్లో ఉండాలని తీర్మానించారు. అభినవాచార్యకకర్త శ్రీ గొడవర్తి సూర్యనారాయణగారు వ్యవహారికభాషలో కొన్ని నమూనా పాఠాలు రూపొందించారుకూడా. ఆ తర్వాతి సంవత్సరాల్లో రాష్ట్రప్రభుత్వంవారు ఏర్పాటుచేసిన భాషా పాఠ్యప్రణాళిక నిర్మాణ సంఘాలన్నీ వ్యవహారిక భాషనే ఆధునిక ప్రామాణికభాషగా స్వీకరించాలని సిఫార్సు చేసాయి. మాట్లాడేభాషకి, రాసేభాషకి ఎక్కువ అంతరముండగూడదని భావించాయికూడా. పాఠ్యపుస్తకాలన్నీ ఈ భాషారూపంలోనే రాయాలని కూడా తీర్మానించాయి. అందువల్ల వ్యవహారికరూపం శిష్ట వ్యావహారికమై ఆధునిక ప్రామాణిక భాషారూపంగా స్థిరపడిందని చెప్పవచ్చు.

## 2.05 మాండలిక భాష :

ఒక మండలానికి సంబంధించిన భాష మాండలిక భాష. మాండలికభాష ఒక సీమిత ప్రదేశానికి, ప్రాంతానికి సంబంధించిన ప్రజలు వ్యవహరించే భాషావిశేషాన్నిగాని, లేక భాషకు చెందిన ప్రజానీకంలో వృత్తినిబట్టిగాని, కులాన్నిబట్టిగాని ఏర్పడ్డ ఒక వర్గం ప్రజలు వ్యవహరించే భాషాభేదాన్నిగాని మాండలికం అనొచ్చని 'మోలియర్ విలియమ్స్'ను ఉటంకిస్తూ ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారు నిర్వచించారు. International Webster New Encyclopedic Dictionary లో మాండలికాన్ని Dialect అని పేర్కొని 'a form of language prevailing in a particular district and marked by peculiarities of vocabulary, or pronounciations, a special variety or branch of a knowledge, or one of a number of languages regarded as a family, a language characteristic of a particular profession or trade.' అని అర్థం ఇవ్వబడింది. తెలుగు అకాడమీ హైదరాబాద్ వారి ఇంగ్లీషు - తెలుగు నిఘంటువులో 'మాండలికభాష' అనే పదబంధం ప్రస్తావించబడింది. బ్రౌణ్య నిఘంటువు 'మాండలికం' అని ప్రస్తావించింది. పదోత్పత్తిలోగాని, ఉచ్చారణలోగాని కొంత వైలక్షణ్యం కల్గిన ఒక మండలానికి చెందిన భాషనుగాని, భాషా శాఖనుగాని, లేక ఒక మూలభాషకు చెందిన భాషాభేదాన్నిగాని, ఒక వృత్తికో, వ్యాపారానికో చెందిన పరిమిత భాషను గాని మాండలిక భాష అనొచ్చు.

పై నిర్వచనాలకనుగుణంగా మాండలికభాషా లక్షణాలను ఈ విధంగా క్రోడీకరించవచ్చు.

i) పరిమితమైన ప్రాంతంలో ఏకదేశ వ్యవహారం కల్గి ఉండటం.
ii) ప్రామాణికభాషలో అంతర్భూతంగా ఉండటం.
iii) న్యూన ప్రామాణికంగా (Sub-Standard) ఉండటం.
iv) స్వతంత్రమైన సాహిత్యం లేకపోవడం.
v) ప్రాంతీయ వైలక్షణ్యం విశేషంగా ఉండటం.
vi) పృథక్ లక్షణాలెన్ని ఉన్నా మొత్తంమీద భాషా వ్యవహర్తల మధ్య పరస్పరావగాహనాన్ని కోల్పోకుండా ఉండటం.

మాండలికాలు ఈ కింది కారణాలవల్ల ఏర్పడుతాయి.

i) వలసపోవడం ద్వారా వక్తపై కొత్త ప్రాంతంలోని భాషల ప్రభావం.

ii) రాకపోకలు ఇతర సంబంధబాంధవ్యాలు.

iii) విస్తృతమైన వ్యవహార ప్రాంతంవల్ల సరిహద్దుల్లోని భాష ఇతర భాషల ప్రభావానికి లోనవడం.

iv) అనేక వృత్తులవారుపయోగించే పనిముట్లు, వృత్తికి సంబంధించిన పదాలు వారు నివసిస్తున్న ప్రదేశానికే పరిమితంకావడం.

v) అరణ్య ప్రాంతాల్లోని వారు రాకపోకల సౌకర్యాలు లేక తమ భాషా వ్యవహారాన్నే కొనసాగించడం.

vi) ప్రజల భిన్నమైన సామాజిక, ఆర్థిక పరిస్థితులు, వ్యత్యాసాలు.

vii) పట్టణీకరణం (Urbanisation), పారిశ్రామికవాడలు, మురికివాడలు మొదలగునవి ఏర్పడడం.

viii) శీతోష్ణ ప్రభావాలవల్ల ఉచ్చారణల్లో భేదాలు ఏర్పడడం.

'Dialect is the natural state of language' అని మాక్స్‌ముల్లర్ అభిప్రాయపడ్డారు. ప్రతివ్యక్తి మాట్లాడేది మాండలికమేగాని భాషకాదు. మాండలికాల సమాహారరూపమే భాషయని వారి అభిప్రాయం.

తెలుగుభాషలో మాండలిక భేదాలు చాలా ఉన్నాయి. వానిలో,

i) విశాఖపట్నం ప్రాంతంలోని తెలుగు, ఒరియా భాషా ప్రభావంతోడి మాండలికం.

ii) తెలంగాణా పశ్చిమోత్తర ప్రాంతం నిజామాబాద్, ఆదిలాబాద్ ప్రాంతాల్లో మరాఠీ ప్రభావంతోడి మాండలికం.

iii) అనంతపురం, కర్నూలు, మహబూబ్‌నగర్ ప్రాంతాల్లో కన్నడంతో కూడిన మాండలికం.

iv) చిత్తూరు, నెల్లూరు ప్రాంతాల్లో తమిళభాషా ప్రభావంతో ఏర్పడ్డ మాండలికం.

v) తెలంగాణా ఇతర ప్రాంతాల్లో ఉర్దూ, పారసీ భాషల ప్రభావంతో ఏర్పడ్డ మాండలికం.

vi) ఇతర రాష్ట్రాల్లో ప్రధానంగా మహారాష్ట్రలోని చంద్రపూర్ ప్రాంతం, బొంబాయిలోని పనివారు, కర్ణాటక రాష్ట్రం బెళగావిలోనివారు మాట్లాడే

మాండలికాలు వలసకారణంగా ఏర్పడ్డ మాండలికాలు అని చెప్పవచ్చు.

మాండలిక భాషా భేదాలనుబట్టి మన రాష్ట్రాన్ని నాలుగు మండలాలుగా భాషా శాస్త్రజ్ఞులు విభజించారు.

i) పూర్వమండలం : శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాలు.
ii) దక్షిణమండలం : రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు.
iii) ఉత్తరమండలం : తెలంగాణా, కోస్తా, రాయలసీమలను అంటుకొనియున్న తాలూకా ప్రాంతాలు
iv) మధ్యమండలం : ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలు.

భాషా వ్యవహర్తం దృక్పథాలనేక రీతులలో ఉంటాయి. ఆంగ్లేయులకు మాండలికాలపై అంతగా పట్టింపులేదు. జర్మనులు అలాకాక మాండలికంపైనే మక్కువ చూపుతారు. తెలుగువారమైన మనం నిత్య వ్యవహారంలో ఎక్కువగా మాండలికాన్నే ఉపయోగించినా శిష్టవ్యవహారంలో, సాహిత్య వ్యవహారంలో ప్రామాణిక భాషవైపే మొగ్గుచూపుతాం.

## 2.06 మాతృభాష :

మాతృభాష అనే పదానికి దేశభాష, స్థానికభాష (native language), ప్రథమభాష (first language), ప్రాథమిక భాష (Primary language), బలీయభాష (Stronger language) అనేపదబంధాలు కూడా వ్యవహృతంలో ఉన్నాయి. ఈ భావనలన్నీ ఏ భాష ఐతే శిశుప్రాయంలోనే వ్యక్తికి మొదట అలవడిందో ఆ భాషను పేర్కొంటాయి. ఈ భాష వ్యక్తి జీవనంపై తీవ్ర ప్రభావాన్ని వేసి ఆ వ్యక్తిని తన అధీనంలో ఉంచుకొంటుంది. సాధారణ అభిప్రాయాన్ననుసరించి 'మాతృస్తన్యంతోబాటు మానవునకలవడిన భాష'ను మాతృభాషయని నిర్వచిస్తారు. అయితే మాతృస్తన్యం గ్రోలనివారు, దాదుల పెంపకంలో పెరిగినవారు నేర్చుకొన్న భాష మాతృభాషయని అనరాదా? అనే సంశయం కలుగుతుంది. అట్లే ఈ భావనకు సంబంధించి వివిధ సందర్భాల్లో కొన్ని సందేహాలు ఎదురవుతాయి. వానిలో,

i) భార్యాభర్తలిరువురూ వేరువేరు భాషలు మాట్లాడే వారయినప్పుడు వారిద్దరు ఉమ్మడిగా నిత్యవ్యవహారంలో వాడుకొనే భాష వారివారి భాష కానపుడు వారికి జన్మించిన శిశువుకు ఏ భాష మాతృభాష అవుతుంది?

ii) ఒకేభాషను మాట్లాడే దంపతులు ఇతర భాషా ప్రాంతానికి వివిధ కారణాలవల్ల వలసవెళ్ళినపుడు, వారు ఆ ప్రాంతీయ భాషలోనే నిత్యవ్యవహారాలు కొనసాగిస్తే వారి సంతానానికి మాతృభాష ఏది?

iii) తల్లిదండ్రులవద్ద గడపక ఆయాలవద్ద, అనాథాశ్రమాల్లో గడిపే బాలబాలికలకు ఎవరి భాష మాతృభాష అవుతుంది?

iv) దురదృష్టవశాత్తూ తల్లిని కోల్పోయిన శిశువులకు ఏ భాష మాతృభాష అవుతుంది?

v) సరిహద్దు ప్రాంతాల్లోని ప్రజలు రెండు, మూడు భాషలు చాలా సులభంగా మాట్లాడుతారు. అపుడు వారి పిల్లల మాతృభాష ఏ భాష అవుతుంది?

vi) ఒక భాష వారైనప్పటికి వివిధ కారణాలవల్ల వలసవెళ్ళి తమభాషను పూర్తిగా మరిచిపోయి మరోభాషను మాట్లాడేవారి శిశువుల మాతృభాష ఏది?

మొదలైన ప్రశ్నలకు సమాధానాలు సులభంగా చెప్పుకోవడం కష్టం. అందువల్ల మాతృభాష అనే పదానికి మాతృస్తన్యం ద్వారా అలవడిన భాష అని చెప్పడానికి కొన్ని పరిమితులున్నాయి. మాతృదేవత, మాతృభూమి, మాతృభాషలు భారతీయులందరికీ వందనీయాలే. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అనే సూక్తి కూడా ఈ విషయాన్నే నొక్కిచెప్తోంది. వీనితోబాటు మాతృభాషపై మక్కువలేనివారు అరుదుగా ఉంటారు. కొన్నిదేశాల్లో మాతృభూమి అనే భావనకు బదులుగా 'father land' అనే వాడుకకూడా ఉంది. ఆ కారణాన మాతృభాష అనే పదానికి బదులుగా పితృభాష అనే పదబంధం వ్యవహారంలో లేదుకదా! పై కారణాలవల్ల మాతృభాష అనే పదానికి మొదట చెప్పుకొన్న నిర్వచనం ఒక ప్రత్యేక కాల, స్థల పరిమితుల్లోనే పనిచేస్తుంది. చిన్నప్పుడు వినే భాషనే అభ్యసించి, ఆ తర్వాత వివిధ భాషలు నేర్చింతర్వాత, అన్ని భాషల్లో భావ వ్యక్తీకరణ సమతౌల్యంలో చేయగల్గిన సామర్థ్యముంటే ఈ భాషలన్నిటిని మాతృభాషలంటామా? అన్నదే ప్రశ్న. ఇచట మాతృభాష అనేది ఒకటే భాషగాని వివిధ భాషలుకావు. అందువల్ల ఎన్ని భాషలు నేర్చినా సాధారణ భావవ్యక్తీకరణంలో అసంకల్పితంగా ఉపయోగించే కంఠధ్వనుల రూపం మాతృభాష అని చెప్పుకొంటే కొంతవరకు సరిపోతుందేమో. ఎన్ని భాషలు నేర్చినా ముల్లు గుచ్చుకొన్నప్పుడు తెలుగువాడు అమ్మో! అంటాడుగాని

'Oh' అని అనడుగదా! అంటే అసంకల్పితంగానే తన భావనలను ఏ భాషాధ్వనుల రూపంలో వ్యక్తీకరిస్తాడో, ఏ భాషలో తన భావాలను సునాయాసంగా, ఎదుటి వ్యక్తికి అర్థమయ్యేరీతిలో వివరించగల్గుతాడో ఆ భాష ఆ వ్యక్తియొక్క మాతృభాష అని చేప్తే సరిపోతుంది.

పై కారణాలవల్ల మాతృభాష అనే పదం తనదేయైన ప్రత్యేకత కల్గిఉంది. ప్రతివ్యక్తికి ఒకే భాష మాతృభాష ఔతుందని చెప్పవచ్చు. మన రాష్ట్రంలోని పెక్కుమందికి తెలుగు మాతృభాష. కర్ణాటకంలోని చాలామందికి కన్నడం మాతృభాష. ఒక ప్రాంతంలో అత్యధిక సంఖ్యాకుల నిత్యవ్యవహారంలోని భాష ఆ భాషీయుల ప్రథమ భాషకూడా అవుతుంది. మాత, మాతృభూమి, మాతృభాషలు, మమత, మానవత, మనుగడలకు ఆధారాలంటారు. వీనియందు పరస్పరానురాగం ఉంటుంది. 'దైవములు లేరు తనకన్న తల్లికంటె, భాగ్యములు లేవు తన తల్లి భాషకంటె, నరులకీ సూత్రములు జీవనాదులంద్రు' అను కవి వాక్కులు బహుధాఃస్మరణీయాలు.

## 2.07 ప్రథమభాష :

వ్యక్తి మొదట పాఠశాలలో అభ్యసించే భాష ప్రథమభాష. ఈ భాషలోనే సాధారణంగా తన నిత్యవ్యవహారాన్ని కొనసాగిస్తాడు. మన రాష్ట్రంలోని పెక్కురు విద్యార్థులు 'తెలుగు' భాషను మాతృభాషగా కల్గియుండి తరగతిగదుల్లో ప్రథమభాషగా అభ్యసిస్తున్నారు. ఆంగ్లంలోని first language అనే పదానికి ప్రథమభాష అనే పదం సమానార్థకంగా ఉపయోగింపబడుతోంది. ఈ భాషనే స్థానికభాషయని (Native language), ప్రాథమిక భాషయని (Primary language), బలీయమైనభాష (Stronger language) అని కూడా వ్యవహరిస్తారని H.H. Stern అనే భాషావేత్త అభిప్రాయపడ్డారు.

## 2.08 ద్వితీయభాష :

ప్రథమభాషతోబాటు అభ్యసించే రెండవ ప్రధానభాషను ద్వితీయభాష (Second language) అని వ్యవహరిస్తారు. H.H. Stern ద్వితీయభాషను స్థానికేతరభాషగా (Non-native language), విదేశీభాషగా (Foreign language), సెకండరీభాషగా (Secondary language) బలహీనమైన భాషగా (Weaker language) అభివర్ణించారు.

మన రాష్ట్రంలో తెలుగును మాతృభాషగా కల్గియున్న బాలబాలికలకు

ప్రథమభాషగా తెలుగుతోబాటు, ద్వితీయభాషగా జాతీయభాషయైన హిందీ బోధింపబడుతోంది. మన రాష్ట్రంలోనే ఉర్దూ ప్రథమభాషగా చదువుతున్నవారికి తెలుగు ద్వితీయభాషగా బోధింపబడుతోంది. మన రాష్ట్రంలో ప్రస్తుతం ఆరో తరగతినుండి ద్వితీయభాషాబోధన ప్రారంభమవుతోంది.

## 2.09 తృతీయభాష :

ప్రథమ, ద్వితీయభాషలుగాక వేరొక భాషనుకూడా పాఠశాలల్లో బోధిస్తున్నారు. తెలుగు, హిందీభాషలను ప్రథమ, ద్వితీయభాషలుగా అభ్యసిస్తున్నవారు, లేదా ఉర్దూ, తెలుగులను ప్రథమ, ద్వితీయభాషలుగా అభ్యసిస్తున్నవారు ఆంగ్లాన్ని తృతీయభాషగా అభ్యసిస్తున్నారు. ఈ తృతీయభాషాభ్యసనం మన రాష్ట్రంలో ఐదో తరగతినుండి ప్రారంభమవుతోంది.

ఉత్తర భారతదేశంలోని హర్యానా లాంటి రాష్ట్రాల్లోని కొన్ని పాఠశాలల్లో హిందీ, ఇంగ్లీషు భాషలను ప్రథమ, ద్వితీయ భాషలుగా అభ్యసిస్తూ తెలుగుభాషను తృతీయభాషగా అభ్యసించడం జరుగుతోంది. ఇట్లా ఒక వ్యక్తి పదోతరగతి పూర్తిచేసేనాటికి కనీసం మూడుభాషల్లో, తన భావాలను వ్యక్తీకరించే సమర్థుడౌతాడు.

## 2.10 జాతీయభాష :

స్వాతంత్ర్యం చెందింతర్వాత మనదేశంలో మాట్లాడే వివిధ భాషల్లో ఏదేని ఒక భాషను జాతీయ భాషగా (National language) గుర్తించి అభివృద్ధిపరచాలని భావింపబడింది. దానికి బీజావాపనం 1937 సం॥లో స్థానిక ప్రభుత్వాల్లో కాంగ్రెస్‌పార్టీ భాగస్వామ్యం వహించినపుడు జరిగింది. భారతజాతికి ఒక గుర్తింపును కొనిరావడానికి 'హిందీ' భాషను జాతీయభాషగా గుర్తించారు. స్వాతంత్ర్యానంతరం ఈ భావన మరింత బలపడి హిందీ భాషకు జాతీయభాషగా రాజ్యాంగం గుర్తింపు లభించింది. అన్ని అధికార వ్యవహారాల్లో హిందీ భాష వాడకాన్ని ప్రోత్సహించి జాతీయ అనుసంధానభాషగా, జాతీయ సమైక్యతకు దోహదకారిగా అభివృద్ధిపరచారు. మన రాష్ట్రంలోకూడా హిందీని ప్రాంతీయభాషతోబాటు ద్వితీయభాషగా విద్యార్థులు అభ్యసిస్తున్నారు. జాతీయ జీవన స్రవంతిలో అన్ని భాషల ప్రజలను ఏకతాటిపై నడిపించడానికి ఉద్దేశించిన భాష హిందీ భాష. ఇది భారత రాజ్యాంగం గుర్తించిన అధికార భాషకూడా.

## 2.11 ప్రాంతీయభాష :

ఒక ప్రాంతంలో ఏ భాష అత్యధిక సంఖ్యాకుల నోళ్ళలో నలుగుతోందో ఆ భాష ప్రాంతీయభాష. మన రాష్ట్రంలో తెలుగు, మహారాష్ట్రలో మరాఠీ ప్రాంతీయభాషలు. అట్లే ప్రతి రాష్ట్రంలో ఏదో ఒక భాష ప్రముఖభాషగా, ప్రాంతీయభాషగా గుర్తింపు పొందుతుంది. ప్రాంతీయభాషలోనే బోధన చాలా సందర్భాల్లో జరుగుతుంది.

## 2.12 అంతర్జాతీయ భాష :

అంతర్జాతీయంగా విశేషమైన గుర్తింపుపొందిన భాషను లేదా భాషలను అంతర్జాతీయభాష (లు) అంటారు. ఆంగ్లం ప్రపంచ దేశాలన్నిటిలో గుర్తింపు పొందినది కావున ఆ భాష అంతర్జాతీయభాషగా పరిగణింపబడుతోంది. 1966 నాటి కొఠారి విద్యాసంఘం మన దేశ భాషలతోబాటు రష్యన్, ఆంగ్లభాషలలో ఒక భాషను మన దేశ ప్రజలు అభ్యసించాలని తద్వారా ప్రపంచాన్ని వీక్షించడానికి అవకాశమేర్పడుతుందని పేర్కొంది. ప్రపంచమంతటిలో చాలామంది ప్రజలు అర్థంచేసికోగల్గిన భాషయైన ఆంగ్లం మనకు విదేశీ భాషగాకాక, ఒకకాలంలో అధికారభాషగా కూడా గుర్తింపు పొందింది. అందువల్ల అంతర్జాతీయభాషగా గుర్తింపు పొందిన ఆంగ్లాన్ని మనరాష్ట్రంలో, మరియు ఇతర రాష్ట్రాల్లో తృతీయభాషగా బోధిస్తున్నారు. అంతర్జాతీయ భావనకు ఈ భాషాధ్యయనం తోడ్పడి ప్రపంచంలోని వివిధదేశాల్లోని విశేషాలను తెల్సికోవడానికి ఉపకరిస్తుంది. సుసంపన్నమైన సాహిత్యం కల్గి విశ్వవ్యాప్తమైన భాషగా ఆంగ్లం భారతీయభాషలపై తన తీవ్ర ప్రభావాన్ని నెరపింది. నిత్య జన వ్యవహారంలో కూడా ఆంగ్ల పదాలు దొరలిపోతూ ఉంటాయి. కొన్ని సందర్భాల్లో మాతృభాషలో మాట్లాడ్డంకంటె ఆంగ్లంలో మాట్లాడ్డమే ప్రతిష్ఠాహేతువుగా కూడా కొందరు భావిస్తారు. జన జీవనంపై తీవ్ర ప్రభావాన్ని వేసిన ఈ భాషాధ్యయనం మన భాషల అధ్యయన దృక్పథాలను కూడా మలుపుతిప్పింది అని కొందరు భావిస్తారు.

## 2.13 మాధ్యమ భాష :

మానవుల ఆలోచనలకు భాష వాహిక. భాషారూపంలోనే మానవులు తమ ఆలోచన్లని ఎదుటివ్యక్తికందిస్తారు.. ఆలోచనలతో బాటు భాషకూడా ఎదుగుతుంది. తాము మొదట నేర్చిన భాషలోనే ఆలోచనలకు ఒక స్పష్టమైన రూపమీయగల్గుతారు మానవులు. తర్వాత నేర్చిన ఇతర భాషల్లో అంత

సులువుగా భావప్రకటనచేయలేరు. అందువల్ల మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలు కూడా వ్యక్తుల జీవనవిధానంలో మాతృభాషకు అత్యంత ప్రాధాన్యం కల్పించారు. ఇంగ్లీషువారి పరిపాలనాకాలంలో ఆంగ్లానికి నిత్య వ్యవహారాల్లో, ప్రత్యేక వ్యవహారాల్లో ఆలోచనలకు వాహికగా గుర్తింపువచ్చింది. మనరాష్ట్రంలో నిజాంరాజుల పరిపాలనాకాలంలో ఉర్దూకూడా వ్యవహార వాహికగా గుర్తింపు పొందింది. ఈ రెండు సందర్భాల్లో కూడా తెలుగుభాష ఆలోచనల వాహికగా గుర్తింపు పొందలేదు. అలా అని తెలుగుభాష పూర్తిగా విస్మరింపబడింది అని చెప్పడానికి వీలులేదు. కాని మనస్తత్వ శాస్త్రజ్ఞులు నమ్మే సిద్ధాంతాలు కొంతమేరకు కుంటుపడ్డాయి. ఈ భాషల ప్రభావాలవల్ల కొత్త పలుకుబళ్ళు, కొత్త పదబంధాలు, పారిభాషికపదాలు. వాక్య నిర్మాణరీతులు మన భాషలో చేరుటయేగాక [illegible]న విజ్ఞానపుటంచులు స్పృశించడానికి వీలుకల్గింది. అలా మన ప[illegible]ని ప్రజల్లో మొదట ఉర్దూ, ఆ తర్వాత ఆంగ్లం భావవాహికమై తెలుగు ద్వితీయ ప్రాధాన్యతనొందింది. విద్యాబోధన కూడా ఉర్దూ, ఆంగ్ల భాషల్లోనే జరగడంవల్ల సంపూర్ణ వ్యక్తి ఆవిష్కరణకు ఆటంకం కల్గిందికూడా. విద్యావేత్తలంతా విద్యాబోధన విద్యార్థుల మాతృభాష, ప్రాంతీయభాషల్లోనే జరగాలని అప్పుడే సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి వీలుకల్గుతుందని ప్రతిపాదించారుకూడా.

మానవ మస్తిష్కాల్లోని భావాలకు తొలిరూపమిచ్చి బాహ్య ప్రపంచావగాహనకు తొలిమాధ్యమమైన భాష మాతృభాష. విద్యావ్యవస్థలో మాతృభాషే మాధ్యమభాషగా, బోధనభాషగా, బోధనవాహికగా రూపొందాలని స్వాతంత్ర్యానంతరం ఏర్పాటుచేసిన వివిధ విద్యాసంఘాలు అభిప్రాయపడ్డాయి. సెకండరీ విద్యాసంఘం (1952) 'విద్యార్థుల జీవితంలో మాతృభాష అత్యంత ప్రాధాన్యత కలద'ని అభిప్రాయపడింది. 1948 సం॥నాటి విశ్వవిద్యాలయ విద్యాసంఘంకూడా విద్యార్థుల భాషాసాహిత్యాల అభ్యసనంలో మాతృభాష మొదటిస్థానాన్ని ఆక్రమిస్తుందని అభిప్రాయపడింది. జాతిపిత గాంధీజీ మాతృభాష మాధ్యమభాషగా రూపొందాలని, దీని ప్రాధాన్యాన్ని నొక్కిచెప్పారు. 9.7.1938 నాటి 'హరిజన' పత్రికలో "The medium of a foreign language through which higher education has been imparted in India has caused incaluculable intellectual and moral injury to the nation. Those graduates who are my valued associates, themselves flounder when they have to give expression to their inner most thoughts." ఏ భావమైనా స్వభాషలో చెప్పినపుడు ఎంత సునాయాసంగా ఉంటుందో

ఎంతగా రుచిస్తుందో, జీర్ణమౌతుందో ఇతర భాషద్వారా అది సాధ్యంకాదని భాషాతత్వాన్ని అధ్యయనంచేసిన వారందరూ అభిప్రాయపడతారు. ఒక భాషలో బోధనకు వీలుకల్గి ఆ భాష బోధనభాషగా పెంపొందిందంటే ప్రపంచంలోని అన్ని భాషలుకూడా బోధనభాషలుగా సమర్థాలు కాక తప్పదు. ప్రాథమిక పాఠశాల దశనుండి విశ్వవిద్యాలయస్థాయివరకు మాతృభాషలోనే విద్యాబోధన జరగాలనే భావం రోజురోజుకూ బలపడింది. 1964-66 నాటి కొఠారి విద్యాసంఘం, 1986 నాటి జాతీయ విద్యావిధానంకూడా మాతృభాష, ప్రాంతీయభాషలోనే అన్నిస్థాయిల్లో విద్యాబోధన జరగాలని అపుడే సమగ్ర మానవ వ్యక్తిత్వానికి రూపకల్పన జరుగుతుందని అభిప్రాయపడ్డాయి. ఈ భావనం మేరకే ఉన్నత విద్యాస్థాయిలో కూడా బోధనాభాషగా తెలుగు వాడకాన్ని ప్రోత్సహించాలని 'స్విన్' సంఘం సిఫార్సులమేరకు మన రాష్ట్రప్రభుత్వం 1968లో తెలుగు అకాడమీని స్థాపించింది. తెలుగుభాషలో పాఠ్యపుస్తకాల నిర్మాణానికి అవసరమైన పారిభాషిక పదాలను సేకరించి, కొన్ని పర్యాయపదాలు రూపొందించి పాఠ్యగ్రంథాలు, పఠనీయగ్రంథాలు రాయించి ప్రచురించడం తెలుగు అకాడమీచేస్తున్న కృషిలో భాగం.

తెలుగును మాధ్యమభాషగా ప్రాథమిక దశనుండి అమలుచేస్తున్నప్పటికి రూపొందించుకొన్న పారిభాషిక పదజాలం ఇంకా మన భాషకు స్వంతంకాలేదు. ఉదా: Hypothesis, proforma అనే ఆంగ్లపదాలకు, సమానార్థక పదాలుగా పరికల్పన, ప్రరూపం అనే పదాలు నలుగురి నోళ్ళలో ఇంకా నానలేదు. విజ్ఞానశాస్త్రంలోని అనేక పదాలకు రూపొందించిన తెలుగుపదాలు, కొన్ని పర్యాయాలు అన్వయక్లిష్టత కల్గిస్తున్నాయి. ఈ కారణాన తెలుగుభాషను పూర్తిస్థాయిలో మాధ్యమభాషగా అమలుపరచడానికి కొంత ఇబ్బంది కల్గుతోంది.

తెలుగును మాధ్యమభాషగా అమలుచేయడంలో ఎదురయ్యే ఆటంకాలను ఈ విధంగా పేర్కొంటున్నారు.

i) శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాన్ని అధ్యయనం చేయడానికి తెలుగులోని పదజాలం అంతగా సరిపోదని.

ii) పారిభాషిక పదాలు కృతకంగా అన్వయక్లిష్టంగా ఉండి పదుగురినోళ్ళలో నానడానికి ఇబ్బంది కల్గుతోందని.

iii) ఇతర భాషాపదాలను మన భాష స్వంతంచేసికొని జీర్ణించుకోలేదని చెప్తారు.

కాని మనదేశంలోని ఉత్తరాది రాష్ట్రాల్లో, ప్రపంచంలోని అన్ని అభివృద్ధిచెందిన చెందుతున్న దేశాల్లో కూడా ఆయా ప్రజల మాతృభాషలోనే సంపూర్ణ విద్యాబోధన సాగుతోందని, అనుసంధానభాషలుగా ఇతర భాషలుకూడా అభ్యసిస్తారని తెల్సికొంటే మన సందేహాలు నివృత్తి అవుతాయి. ఇంగ్లీషు మాధ్యమంలో చదువుకొన్న వాళ్ళంతా తెలుగుభాషలో బోధించడానికి, తెలుగును బోధనభాషగా స్వీకరించడానికి వెనుకంజవేయడమే తెలుగుభాష మాధ్యమభాషగా వేళ్ళూనకపోవడానికి కారణంకావచ్చు. అంతేగాక అధునాతన కుహనా సంస్కృతిలో భాగంగా ఆంగ్ల మాధ్యమంవైపు పరుగుపెడుతున్న పై తరగతి, మధ్యతరగతి ప్రజాబాహుళ్యం కూడా తెలుగు మాధ్యమభాషగా బలపడకపోవడానికి కారణమవుతోంది. ఈ స్థితిపోయి తెలుగు మాధ్యమ భాషగా ఎదగడానికి మనోవాక్కాయ కర్మలయందు కృషిచేయాల్సిన అవసరం ఎంతేని ఉంది. తద్వారా భాష ఒక గుర్తింపును పొందుతుంది. పర భాషాదాస్యం వదిలిపోతుంది.

## 2.14 అధికార భాష :

ఒక జాతి సంస్కృతికి, అభివృద్ధికి కీలకమైన వానిలో భాషకూడా ఒకటి. ఆ జాతి సంపూర్ణ సంస్కృతిని, ప్రజాజీవనాన్ని భాష ప్రతిబింబిస్తుంది. భాష కేవలం భావ ప్రకటనాసాధనం మాత్రమేగాక భావాలను సమైక్యపరచి భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించడానికి దోహదపడే సాధనంకూడా. మన దేశంలో ప్రభుత్వం పదహారు భాషలను ప్రధానభాషలుగా గుర్తించింది. ఈ భాషలు ఆయా భాషా ప్రాంతాల్లోని ప్రజలు నిత్యవ్యవహారంలో ఉపయోగించే భాషలు. ఈ భాషలన్నిటిలో హిందీ భాషను జాతీయ అధికారభాషగా కేంద్రప్రభుత్వం (రాజ్యాంగం) గుర్తించింది. భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్విభజన జరిగింతర్వాత భాషా ప్రయుక్త రాష్ట్రాల్లోని అత్యధిక సంఖ్యాకులు మాట్లాడేభాషలు ఆయా రాష్ట్రాల అధికారభాషలయ్యాయి. ఈ అధికార భాషలతోబాటు అనుసంధాన అధికారభాషలుగా కొన్నిటికి గుర్తింపు లభించింది. జాతీయస్థాయిలో హిందీతోబాటు ఆంగ్లానికి, మనరాష్ట్రంలో తెలుగుతోబాటు ఉర్దూ అధికార, అనుసంధాన అధికార భాషలుగా గుర్తింపుపొందాయి.

ప్రభుత్వ నిత్య వ్యవహారాల్లో ఉపయోగించే దేశీయ భాషల్లోని పదజాలాన్ని సుసంపన్నంచేసేవరకు ఆంగ్లాన్ని అధికార భాషగా ఉపయోగించుకోవాలని కాలక్రమేణా కార్యనిర్వహణవ్యవస్థ, శాసనవ్యవస్థ, న్యాయవ్యవస్థలు ఆంగ్లం స్థానంలో రాష్ట్రాల ప్రధానభాషల్ని, జాతీయస్థాయిలో హిందీని అధికార భాషలుగా

వినియోగించాలని ఆ తర్వాత ఆంగ్లాన్ని పూర్తిగా కార్యాలయ వ్యవహారాల నుండి తొలగించాలని భావించబడింది. ఈ విషయంలో హిందీ జాతీయ అధికార భాషగా ఎదగడానికి విశేష కృషి జరిగింది. మన రాష్ట్రస్థాయిలో తెలుగును అధికార భాషగా అభివృద్ధిపరచే కృషిని తెల్సికోవడం అవసరం.

అధికారభాషగా తెలుగు అమలుకు కృషి :

1966 సంవత్సరం ఏప్రిల్ నెలలో అంటే భాషాప్రయుక్త రాష్ట్రం ఏర్పడిన సుమారు పదేండ్లకు మన రాష్ట్ర ఉభయ శాసనసభలు అధికార భాషా చట్టాన్ని ఆమోదించాయి. ఈ చట్టాన్ని ఐదు సంవత్సరాలకాలంలో నూటికి నూరుపాళ్ళు అమలుజరిపి 1971 నుండి కేవలం తెలుగు భాషలోనే ప్రభుత్వ వ్యవహారాలు సాగాలని కార్యనిర్వహణ, శాసన, న్యాయవ్యవస్థలు తదనుగుణమైన ప్రణాళికలు సిద్ధంచేసికోవాలని, అందుకై విశేషకృషి చేయాలని అధికార భాషా చట్టంలో నిబంధనలేర్పరచబడ్డాయి. సామాన్య జనజీవనంలో భావ వ్యక్తీకరణకు అవసరమయ్యే భాషారూపం సునాయాసంగా ఉంటుంది. ప్రత్యేక వ్యవహారంలోని భాషారూపానికి కొన్ని పర్యాయాలు ప్రత్యేకమైన పదజాలం అవసరమవుతుంది. దీని కోసం కేవలం సాధారణ పదజాలం సరిపోదు. ప్రభుత్వ కార్యకలాపాల నిర్వహణకు ఉపయోగించే భాషారూపానికి కొత్త పరిభాష అవసరమవుతుంది. అందువల్ల అంతవరకు వాడుకలోనున్న ఆంగ్లపదాలకు సమానార్థక తెలుగు పారిభాషిక పదాలను రూపొందించడం అవసరమైంది. పాలకుల భాషయే ఇంతకాలం అధికార భాషగా అంగీకరించిన వ్యవస్థ, ప్రజాస్వామ్యంలో పాలితుల భాషకే ప్రాధాన్యతనీయాలనే ధ్యేయం కారణాన కొత్త పారిభాషిక పదజాలం తయారీకి అధికార భాషా చట్టంలో అవకాశం కల్పించబడింది.

ఈచట్టం కన్న ముందే 1955 సం॥లో వావిలాల గోపాలకృష్ణయ్యగారు 'సాధ్యమైనంత త్వరలో తెలుగుభాషను అధికారభాషగా అమలుచేయాలని' ఆంధ్రరాష్ట్ర శాసనసభలో ప్రతిపాదించారు. ఈ తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడినప్పటికి సాధ్యమైనంత త్వరలో అన్న పదానికి ఖచ్చితమైన కాలవ్యవధిని నిర్దేశించనందున ఈ విషయం 1966 నాటివరకు అత్యధిక శ్రద్ధకు నోచుకోలేదు. 1956 నవంబరు ఒకటోతేదీన ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డతర్వాత 1964 వరకు కూడా శాసనసభలో ఈ విషయం ప్రస్తావనకు రాలేదు. 1964లో ప్రతిపాదించిన చిత్తు చట్టం (సుమారు తొమ్మిది పర్యాయాలు) ప్రజల అభిప్రాయాల సేకరణకు, తర్వాత సెలెక్టు కమిటీ పరిశీలనకు నోచుకొంది.

చివరకు నాటి మన విద్యామంత్రి, నేటి ప్రధానమంత్రి (1994) శ్రీ పి.వి. నరసింహారావుగారు శ్రీ బ్రహ్మానందరెడ్డిగారి నేతృత్వంలో 1966లో అధికారికంగా అధికార భాషాచట్టాన్ని శాసనసభలో ప్రవేశపెట్టి ఆమోదింపజేసారు. 1971లో అధికార భాషగా తెలుగు అమలుకు చేసిన కృషిని సమీక్షించడానికి, అమలుతీరును పరిశీలించడానికి శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షతన అధికార భాషా సంఘాన్ని ప్రభుత్వం ఏర్పాటుచేసింది. ఆ తర్వాత శ్రీ వందేమాతరం రామచంద్రరావు, శ్రీమతి అనసూయాదేవి, శ్రీ నండూరిరామకృష్ణమాచార్యులు, డా॥ సి.నారాయణరెడ్డి, శ్రీమతి యశోదారెడ్డి, శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు, శ్రీమతి నాయనికృష్ణకుమారి, శ్రీ గజ్జెల మల్లారెడ్డి మొదలగు భాషావేత్తలు అధికార భాషా సంఘం అధ్యక్షులయ్యారు. 1971 నుండి నేటివరకు తెలుగు అకాడమీ పక్షాన అధికారభాష అమలును సులభతరంచేయడానికి వీలుగా పారిభాషిక పదకోశం, పరిపాలనన్యాయపదకోశం, కార్యాలయపదావళి మొదలగు ప్రచురణలు వెలువడ్డాయి. ఇవి తెలుగుభాష అమలును కొంతమేరకు సులువుచేసాయి. వీనితోబాటు తెలుగు మాతృభాషగాని ఉద్యోగులకు స్వల్పవ్యవధి తెలుగు తరగతులు నిర్వహించడం జరిగింది. తెలుగు ముద్రణాయంత్రాలను (Type missions) కూడా సరఫరాచేయడం, తెలుగు టైపిస్టులను నియమించడం మొదలైనవి తెలుగును అధికారభాషగా కార్యాలయాల్లో అమలుచేసే. దశలో చేసిన ప్రయత్నాలే.

1966 సం॥నుండి అధికార భాషా సంఘ సారథులు జిల్లాలు పర్యటించి, అధికారభాష అమలును సమీక్షిస్తూ ఎంతగా ప్రోత్సహించినప్పటికీ ఆశించిన విధంగా అన్నిస్థాయిల్లో అధికారభాషగా తెలుగువాడకం పాక్షికమేనన్నది సత్యం. గ్రామస్థాయిలో, మండలస్థాయిలో కొంతమేరకు కార్యాలయ వ్యవహారాలు తెలుగులో నిర్వహింపబడుతున్నప్పటికి జిల్లా రాష్ట్ర, స్థాయిల్లో ఆశించినంత మేరకు తెలుగును కార్యాలయ వ్యవహారాల్లో అమలుచేయుటలేదు. తెలుగుభాషను అధికారభాషగా అమలుచేయని అధికార గణాలను అధిక్షేపించే అవకాశాలు చట్టంలో ఉండికూడా వివిధ వర్గాల ఉదాసీనత కారణంగా తెలుగు పూర్తిస్థాయిలో అధికారభాషగా అమలుకు నోచుకోలేదు. దీనికి ప్రధానకారణం తెలుగుభాషాచట్టాన్ని, అమలుపరిచే అధికార యంత్రాంగానికి చిత్తశుద్ధి లేకపోవడమేనని భావించాలి. దురదృష్టవశాత్తూ మన రాష్ట్రంలోనే ఈ పరిస్థితిగాని, ఇతర రాష్ట్రాల్లో అన్నిస్థాయిల్లో నూటికి 90% వ్యవహారాలు ఆయా రాష్ట్రాల ప్రధాన భాషల్లోనే నిర్వహింపబడుట అతిశయోక్తికాదు. ఈ

రాష్ట్రాలను ఆదర్శంగా తీసికొని, మన ఆలోచనల్లో సమూలంగా మార్పువస్తే తప్ప చట్టాలెన్ని చేసినా అధికారభాషగా తెలుగు అమలు జరగదు. కనీసం ఈ దశాబ్దం చివరివరకైనా మనలో ఆ స్పృహ, భాషాస్పృహ కల్గుతుందని ఆశిద్దాం. కారణం మనం ఆశాజీవులం కనుక.

## 2.15 త్రిభాషా సూత్రం :

మనదేశంలోని పాఠశాలల్లో విద్యాభ్యాసం చేస్తున్న బాలబాలికలు తమ మాతృభాషతోబాటు హిందీని, అంతర్జాతీయ భాష ఆంగ్లాన్ని, హిందీ మాతృభాషయైనవారు అంతర్జాతీయభాష ఆంగ్లంతోబాటు ఒక దక్షిణాదిభాషను అభ్యసించాలనే ప్రతిపాదన త్రిభాషాసూత్రానికి ప్రాతిపదిక. మానవ జీవనంలో సాంఘిక, ఆర్థిక, వర్తక వ్యవహారాలు పెంపొందిన కొలది బహుభాషల అభ్యసనం అవసరమవుతుంది. ప్రపంచంలోని దేశాల మధ్య ఎల్లలు కనుమరుగవుతున్న నేటిస్థితిలో బహుభాషాభ్యసనం అత్యావసరమౌతుందికూడా. అసంఖ్యాకులైన ప్రజలు నేడు బహు భాషాభ్యసనంపై మక్కువ చూపుతున్నారు. Dr.Viljion అభిప్రాయపడినట్లుగా 'There is a school of thought which holds that bilinguilism adds to childs mental equipment. It sharpens his wit, develops his intelligence and gives him sympathy with another people.' ఆ కారణాన అందరూ బహుభాషలను అభ్యసించాలి.

"మనం జాతీయ సమైక్యత సాధించడానికి, అంతర్జాతీయంగా గుర్తింపు పొందడానికి కూడా వివిధ భాషల అభ్యసనం అవసరం" అని డా॥ రాధాకృష్ణ పండితులు అభిప్రాయపడ్డారు. మనదేశంలో ప్రస్తుతం రెండువందలకు పైబడిన భాషలు వ్యవహారంలో ఉన్నప్పటికి పదహారు భాషలనే రాజ్యాంగం ప్రధానభాషలుగా గుర్తించింది. స్వాతంత్ర్యానికి పూర్వం అంతర్జాతీయ ఖ్యాతిపొందిన ఆంగ్లాన్ని మన విద్యావిధానంనుండి తొలగించాలనే భావన ఎంతగా ప్రబలినా, కొందరు మాత్రం స్థానిక భాషలతోబాటు ఆంగ్లాన్ని కూడా తప్పనిసరిగా అభ్యసించాలని వాదించేవారు. భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడ్డ తర్వాత కూడా ప్రత్యేకంగా మనకంటూ ఒక భాషావిధానం ఏర్పడలేదు. 1956 లో త్రిభాషాసూత్రాన్ని, ఆ భాషల అధ్యయనాన్ని ప్రస్తావించినప్పటికి 1964లో జరిగిన రాష్ట్ర ముఖ్యమంత్రుల సమావేశంలో మాత్రమే ఈ సూత్రాన్ని మనదేశ విద్యావిధానంలో అంతర్భాగంగా అమలుచేయాలని నిర్ధారించారు. దీనిప్రకారం మాతృభాష, ప్రాంతీయభాషతోబాటు ప్రతి విద్యార్థి పాఠశాల దశలో విధిగా హిందీ, ఆంగ్ల భాషలను అభ్యసించాలి. హిందీ మాతృభాషగా కల్గిన

విద్యార్థులు ఒక దక్షిణాదిభాషను అభ్యసించాలి అనేది త్రిభాషా సూత్రంలోని ప్రధానభావం. 1964-66 సంll పు కొఠారి విద్యాసంఘం కూడా త్రిభాషా సూత్రాన్ని బలపరచి ఆంగ్లంతోబాటు రష్యన్ భాషనుకూడా అధ్యయనాంశంగా స్వీకరించవచ్చని సిఫార్సుచేసింది.

ఆ తర్వాత భాషా విషయకంగా ఏర్పాటుచేసిన వివిధ సంఘాల సిఫార్సులుకూడా త్రిభాషాసూత్రం అమలుకే ప్రాధాన్యం ఇచ్చాయి. కారణం శిశుప్రాయంలోనే భాషాభ్యసనం సులువవుతుందనే మనోవైజ్ఞానిక శాస్త్రీయ ఆధారాలు. 1978లో NCERT వారు రూపొందించిన 10+2+3 విద్యా ప్రణాళికకూడా త్రిభాషా సూత్రాన్ని తప్పనిసరిగా దేశమంతా అమలుచేయాలని సూచించింది. ఆ తర్వాత ఏర్పాటైన ఈశ్వరిభాయ్ పటేల్ సంఘం, 1986 నాటి జాతీయ విద్యావిధానం కూడా త్రిభాషా సూత్రాన్ని నిర్ద్వంద్వంగా అమలుచేయాలని పేర్కొన్నాయి. ఈ సిఫార్సులకనుగుణంగా ఆంధ్రప్రదేశ్, హర్యానాలాంటి రాష్ట్రాలు త్రిభాషా సూత్రాన్ని చిత్తశుద్ధితో అమలుచేస్తుండగా మరికొన్ని రాష్ట్రాలు అమలుకు ఒకింత తాత్సారం చేస్తున్నాయి. అందువల్ల దేశవ్యాప్తంగా త్రిభాషా సూత్రం అమలుకు కొంత అవరోధమేర్పడింది. సంపూర్ణంగా అమలుపరచలేకపోవడానికి కారణాలేమైనప్పటికి జాతీయ సమైక్యత దృష్ట్యాగాని, అంతర్జాతీయ అవగాహనదృష్ట్యాగాని, బహుభాషల అభ్యసనం భావితరానికి మేలుచేస్తుంది. ఎన్ని భాషలు నేరిస్తే అంత గొప్ప వాళ్ళమవుతామనే భావనతోబాటు భావసమైక్యత, సాంస్కృతిక సమైక్యత సాధించడానికి త్రిభాషా సూత్రాన్ని చిత్తశుద్ధితో అమలుచేయాల్సిన అవసరముంది.

## 2.16 తెలుగు భాషపై ఇతర భాషల ప్రభావం :

ఒక భాష తన సంప్రదాయానికి భిన్నమైన మరో భాషా సంప్రదాయాన్ని అనుసరిస్తే ఆ రెండవభాషయొక్క ప్రభావం మొదటిభాషపై కనబడుతుంది. "అనుకరణం హి శిష్టస్య సాధుభవతి" అనే ఆర్యోక్తి ఆధారంగా పై లక్షణాన్ని భాషా శాస్త్రజ్ఞులు (Linguists) భాషా ప్రతిదేయత్వం (Linguistic Borrowing) అని వ్యవహరిస్తారు. ఈ ప్రభావానికి సంబంధించిన విజ్ఞానాన్ని భాషాశాస్త్రంలో 'Borrowing' లేక ప్రాతిదేయ విజ్ఞానం అని అంటారు. ఈ విజ్ఞానంలోని రెండు భాషల్లో ఒకదాన్ని ప్రాతిదేయక భాష (Borrowing Language) అంటారు. ఈ భాషల ప్రతిదేయత్వంవల్ల ఆ మూలభాషల వక్తల భాషణంలో చాలావరకు మార్పులు గోచరించవచ్చు. ఇది మొదట

అనుకరణ ద్వారా లభిస్తుంది. శ్రోత ఇతర భాషాధ్వనిని విన్నప్పు
అది తనకు ఆదర్శప్రాయమనో, అవసరమనో భావించి, ఆ ధ్వనిని తి
ఉచ్చరించుటద్వారా, తన భాషాధ్వనులతో కల్పి ఉచ్చరించుటద్వారా
భాషాధ్వనులు మరో భాషలోకి వస్తాయి. అయితే ఇతర భాషల స్వీకర
కొన్ని కారణాలవల్ల జరుగుతుందని భాషా శాస్త్రజ్ఞులు విశ్వసిస్తున్నారు. వాని
ప్రధానమైనవి.

i) ప్రతిష్ఠాప్రేరణం (The prestige motive).

గౌరవం, ప్రతిష్ఠ సముపార్జించుకోవాలనే ఆశయంతో ఇతర భాష
తమ భాషలో చేర్చుకోవడం జరుగుతుంది. మనం తెలుగు బ
మాట్లాడగల్గినప్పటికి ఆంగ్లంలో మాట్లాడి ప్రతిష్ఠను ఇనుమడింపజేసికోవా
చూస్తాంగదా! ప్రజానీకానికి ఆయా భాషలయందు గల గౌరవభావంకూ
ఇతర భాషలు వారి భాషలో చేరడానికి, కారణమౌతుంది.

ii) సామాజిక ఐక్యతా ప్రేరణ (Social unity motive).

సమాజంలోని వివిధ భాషావర్గాలవారు కల్సిమెల్సి జీవించాలనే తప
ఒకరు మరొకరి భాషను అనుకరిస్తారు. అభ్యసిస్తారు. అందువల్ల సమాజ
భావసమైక్యత పెంపొందుతుంది.

iii) అవసరపూరణ ప్రేరణ (Need filling motive).

తన ప్రాంతం వదిలి మరో ప్రాంతానికి తాత్కాలికంగాగాని శాశ్వతంగా
వలసవెళ్ళిన వ్యక్తి తన అవసరాలు తీర్చుకోవడానికి అచటి స్థానికభా
అనుకరిస్తాడు. చాక్లెట్, టీ, కాఫీ, టుబాకో, షుగర్, కోకో మొద
పదాలు ప్రపంచంలోని అన్ని భాషల్లో అందుకే కనిపిస్తాయి.

Bloomfield ఒక భాషాపదాలు మరోభాషలోకి మూడువిధాలుగా వస్తా
చెప్పారు.

i) మాండలిక ప్రతిదేయత్వం (Dialectical transaction).

మాండలికాలు మాట్లాడే వారిమధ్య అంతర ప్రభావంవల్ల ఒక భాషారూపం
మాండలికాలు మరో మాండలికంలో చేరిపోతాయి.

ii) సాంస్కృతిక ప్రతిదేయత్వం (Cultural transaction).

మతాచారాలు, ఆచారవ్యవహారాలు మొదలగునవి సాంస్కృతికంగా భాషలమధ్య ఆదానప్రదానాలకు అవకాశం కల్పిస్తాయి.

iii) అనువర్తిత ప్రతిదేయత్వం (Loan transaction).

ఇతర భాషాపదాలు యథాతథంగా గాని, కొన్ని మార్పులతోగాని ఒక భాషలో చేరుతుంటాయి. ఈ మార్పుచెందిన పదాలు జాతికిగల ఊహాశక్తిని నిరూపిస్తాయి. Train అనే పదానికి మరబండి అనే పదం జానపద సినీగీతంలో వింటాం. ఇట్లే పొగఓడ (Steamer) అనేపదం కూడా.

తెలుగుభాషలోకి వివిధ రకాలుగా (ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు, భాషల పదాలు పరిమితంగాను, ఇంగ్లీషు, అరబీ, పారసీ పదాలు అపరిమితంగాను వచ్చిచేరాయి. ప్రాచీన కాలంనుండి సంస్కృతపదాలు, ప్రాకృత భాషాపదాలు తత్సమ, తద్భవ రూపాల్లో చేరిపోయాయి. ఇంగ్లీషు భాషవలె తెలుగుభాషకూడా వివిధ భాషల పదాలను తనలో ఇముడ్చుకుంది.

iv) సంపర్గ ప్రతిదేయత్వం (Intimate borrowing).

రాజకీయాధికారంలో ఉన్నవారి భాష, స్థానికులభాషపై చూపే ప్రభావాలు ఈ కోవలోకి వస్తాయి. ఆంగ్లం, ఉర్దూ పదాలు ఈ కారణాన్నే మన భాషలో చేరిపోయాయి. ఇది పూర్తిగా ఏకపక్షంగానే ఉంటుంది. ఈ భాషలను upper or dominant languages అని ఇలాంటి సందర్భాల్లో వ్యవహరిస్తారు.

v) విచిత్ర ప్రతిదేయత్వం (Abbarant borrowing).

ఒక భాషను పూర్తిగా మరచిపోయి మరోభాషను మాట్లాడటం ఈ కోవలోకి వస్తుంది. ఉదాహరణానికి జిప్సీలు తమ భాషను పూర్తిగా విస్మరించి ఆంగ్లాన్నే మాట్లాడుతారు. కొన్ని సందర్భాల్లో కొందరు తమ భాషా పదాలను ఆంగ్లోచ్చారణతో పలకడంకూడా కద్దు. తెలుగుదేశంలో కొన్ని మహ్మదీయ కుటుంబాలు ఉర్దూ మరచిపోయి తెలుగును ఉర్దూవలె ఉచ్చరించడంగాని, పూర్తిగా తెలుగులోనే వ్యవహరించడంగాని ఈ కోవలోకి వస్తుంది.

vi) బాలభాషణం (Baby talk).

చిన్నపిల్లలు తమదే ఐన ఉచ్చారణతో మాట్లాడుతారు. ఉదా: లాల

పోసుకొంటావా? (స్నానం చేస్తావా).

Hacket ఈ ప్రతిదేయత్వాన్ని (Borrowing) ఆగతపదాలు, ఆగత వృత్తులు, ఆగతమిశ్రాలు, ఉచ్చారణ ప్రతిదేయత్వం, వ్యాకరణ ప్రతిదేయత్వ వర్గీకరించాడు.

i) ఆచారంతోబాటు వచ్చే పదం ఆగతపదం.
ఉదా: కాగిదం - కలం

ii) ఎరువుపదాలతో కొత్తపదాన్ని తయారుచేయడం.
ఉదా: అయిదర్ - ఎయిదర్ - సొరకాయ

iii) ఆగతపదంతో కల్సి కొత్తపదం ఏర్పడ్డం ఆగతమిశ్రం.
ఉదా: ఎక్సర్‌సైజు పుస్తకం - గవర్నమెంటు వైద్యశాల

iv) ఉచ్చారణలో ఊనిక ఉచ్చారణ ప్రతిదేయత్వం.

v) వ్యాకరణరూపాలలో మార్పు. రుబ్బు - రుబ్బింగ్

ఇట్లు వివిధరకాలుగా పదాలు నిజజీవితంలో వచ్చిచేరతాయి. ప్రధాన వాక్య నిర్మాణంలో, భావ ప్రకటనల్లో ఆంగ్లభాష ఎన్నో కొత్త ఒరవళ్ళ మనభాషలో కల్పించింది. గుండెల్లో రైళ్ళు పరిగెత్తడం లాంటి కొ పదబంధాలు ఏర్పడ్డాయి. ఈ ప్రభావాలు నిత్య వ్యవహారాల్లో అంతర్భా విడదీయరానంతటి వయ్యాయి.

# మూడో అధ్యాయం

## భాష - ప్రయోజనాలు: స్థానం: భాషోపాధ్యాయుడు:

### 3.01 మాతృభాష ప్రయోజనాలు :

సుఖవంతమైన జీవనానికి ధనంతోబాటు భాషాధనం కూడా అవసరం. సుఖజీవనంకోసం వ్యక్తులు విరామ సమయాన్ని సద్వినియోగం చేసికోవాలి. దీనికొరకు విస్తృతమైన పుస్తక పఠనం అవసరం. తద్వారా అపారమైనజ్ఞానం స్వంతమవుతుంది. అందువల్ల వ్యక్తుల దైనందిన జీవితంలో భాష ప్రధానపాత్ర వహిస్తుంది. ఈ ప్రయోజనాలు సాధారణంగా రెండు విధాలని అవి ఉద్దీపన ప్రయోజనం, సాంకేతిక ప్రయోజనం అని Richard and Ogden అనే భాషావేత్తలు పేర్కొన్నారు. ఉద్దీపనము భావోదాత్తీకరణానికి మూలం. ఈ ఉద్దీపనంలో మాతృభాషకే ప్రధానస్థానం. మాతృభాషపై సముచిత అధికారమున్నచో భావదారిద్ర్యాన్ని, భాషాదారిద్ర్యాన్ని నివారించవచ్చు. 'ఉద్దీపనంచే బాలుర భావాలను ఉద్రేకపరచవచ్చు, రేకెత్తింపవచ్చునని, రెండవదియైన సాంకేతిక ప్రయోజనం 'విజ్ఞానశాస్త్రం మొదలైన సాంకేతిక శాస్త్రాల అభ్యసనంలో ఎక్కువగా ఉపకరిస్తుందని' శ్రీ గొడవర్తి సూర్యనారాయణగారి అభిప్రాయం. వారు ఈ రెండు ప్రయోజనాలను వివరిస్తూ 'ఉద్దీపనం రసాదులందువలె హృదయగమ్యమని, సాంకేతికం కేవలం బుద్ధిగమ్యమగుటచే సంవేద్యంకాదని అది కేవలం సూక్ష్మబుద్ధులకు మాత్రమే అలవడుతుందని' తమ అభినవాచార్యకంలో వివరించారు. ఉద్దీపనమట్లుగాక శాస్త్రేతర విషయాల అధ్యయనంలో రసానందాన్ని కల్గించి వ్యక్తుల జీవితంలో సార్వకాలికం, సార్వజనీనం అవుతుందని అభిప్రాయపడ్డారు.

ఈ ప్రయోజనాలు అభివ్యక్తి, గ్రహణం అనే రెండు విధాలుగా ప్రవర్తిల్లుతాయని, అభివ్యక్తి వాగ్రూప లిఖితరూపాలలో, గ్రహణ, శ్రవణ పఠన మూలకంగా కల్గుతుందని చెప్పవచ్చు. తిరిగి వాగ్రూప లిఖితరూపాలు ప్రకాశమని, ఆత్మగతమని విభజింపబడతాయి. వాగ్రూపంలో ఆత్మగతం

నాటకాదుల్లో పాత్రలు తమలోతాము మాట్లాడుకొనే విధానానికి ప్రతిఁ దీన్ని స్వగతం అని వ్యవహరిస్తారు. ఇంతేగాక మానవుల నిత్య వ్యవహ తమకే పరిమితమైన ఆంతరంగిక లేఖలు, దినచర్య మొదలైనవి ఆ లిఖితరూపాలకు ఉదాహరణలు.

పారిభాషిక అంశాలు శాస్త్రాల అధ్యయనంలో ప్రధానాలు. గ్రహించుటకు కూడా మాతృభాష అవసరం. ఉద్దీపన ప్రయోజనం మనోవికాసంకల్గి ఉదాత్త ప్రవృత్తుల్ని అనురంజింపచేయుగల్గుతాం. ఇట్లు సాంకేతిక ప్రయోజనాల్ని భాష కల్గించి వ్యక్తుల్ని సమాజంలో సమున్నతస్థ నిల్పడానికి దోహదపడ్తుంది.

## 3.02 మాతృభాష ప్రాధాన్యత :

ఏ భాషను శిశువు స్పృహరహితంగానే నేర్చుకొంటాడో, ఏ భాష భాషల అభ్యసనంపై ప్రభావం చూపుతుందో ఆ భాషను మా అనొచ్చు. ఇది వంశపారంపర్యంగాగాక పరిసరాల ప్రభావంవల్ల అలవడు అసంఖ్యాకమైన వ్యక్తుల విషయంలో ప్రాంతీయభాషే మాతృ వ్యవహరింపబడుతోంది.

వ్యక్తి నిత్య వ్యవహారానికి అవసరమైన భావగ్రహణ, భావ వ్యక్తీకర మాతృభాషపై ఆధారపడతాడు. ఏదైనా ఒక విషయంలో ఆలోచించఁ ఇతరులతో చర్చించడంగాని మాతృభాషలోనే తరచుగా చేస్తాడు. భాషలు తెల్సియున్నప్పటికి అవి కొన్ని ప్రత్యేక సందర్భాల్లో వ ఉపకరిస్తాయి. అందువల్ల మాతృభాష వ్యక్తుల నిత్య వ్యవహారంలో భాగాన్ని, ప్రధాన స్థానాన్ని పొందుతుంది. భాషపై అధికారాన్ని సంః భావవ్యక్తీకరణను ఎంత స్పష్టంగా చేయగల్గితే ఆ భాష ఆ వ్యక్తికి కరతలామలకమైందన్నమాట. సాధారణంగా మాతృభాషపై ఆ ప్రతివారికి త్వరగా లభిస్తుంది.

పరభాషల్లో వ్యవహరిస్తున్నపుడు కూడా, ఆ భావాలను మనోకుః తమ భాషలోకి అనువదించుకొని వానికి అనుగుణంగా భావ వ్యక్తీ మాతృభాషలోనే ఆకృతి కల్పించుకొని పరభాషలో వ్యక్తీకరించడం జరుగు భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయం. దీనిని బట్టి భావ గ్రహణం, భావ వ్యః సులువుగా మాతృభాషలోనే జరుగుతాయని చెప్పవచ్చు.

పాఠశాలల్లో భాషలతోబాటు భాషేతర విషయాలుకూడా బోధింపబడతాయి. వానిలో గణితం, సాంఘికశాస్త్రం, సామాన్య శాస్త్రాల అభ్యసనంలో కూడా మాతృభాష ప్రాధాన్యత వహిస్తుంది. మాతృభాషలో అభ్యసించిన అంశాలే వ్యక్తితో చరకాలముంటాయి. అంతేగాక అభ్యసనం సులువవుతుంది. వేగవంతమవుతుంది. ఈ కారణానవే మాతృభాష బోధనభాష అవుతుంది. 'కొత్త విషయాన్ని పరభాషలోకన్న స్వభాషలో అధ్యయనంచేయడం సులభమవుతుందని' భాషావేత్తల అభిప్రాయం. అందువల్ల సహజమైన వాతావరణంలో విద్యార్థి అన్ని విషయాలను కూలంకషంగా మాతృభాషలోనే అభ్యసించగల్గుతాడు.'

ఇతర భాషల అభ్యసనంలోకూడా తిరిగి మాతృభాషయే ప్రాధాన్యత వహిస్తుంది. మొదట భాషాంతరీకరణ పద్ధతిలో పరభాషల అభ్యసనానికి వ్యక్తి సుముఖత చూపుతాడు. ప్రత్యక్ష పద్ధతిలో పరభాషలను నేర్చుకుంటున్నపుడుకూడా మనోకుహరాల్లో మాతృభాషే మాధ్యమంగా పనిచేస్తుంది.

మాతృభాష అధ్యయనంవల్ల ఈ కింది ప్రధాన ప్రయోజనాలను పొందవచ్చు కూడా:

i) భాషపై అధికారం సంపాదించడం.
ii) ఇతర భాషలను సులభంగా నేర్చుకోవడం.
iii) భాషేతర విషయాల అధ్యయనం సులువుకావడం.
iv) జ్ఞానపరిధుల్ని విస్తరించుకోవడం.
v) పారంపర్యంగా సంక్రమించిన భావనలు, ఆదర్శాలను తెల్సికోవడం.
vi) దేశాభిమానానికి బాట వేసికోవడం.
vii) మానసికాభివృద్ధికి చక్కని మూర్తిమత్వాన్ని రూపొందించుకోవడం.
viii) మాతృవిషయాలను సులువుగా అర్థంచేసికోవడం.
ix) రసానుభూతిని పొందడం.
x) సృజనాత్మకతను పెంపొందించుకోవడం.
xi) సంస్కృతి సంప్రదాయాలను జీర్ణంచేసికోవడం.
xii) అభిరుచి పెంపొందించుకోవడం.
xiii) భావ గ్రహణ, భావ వ్యక్తీకరణాలను ప్రభావకారిగా మలచుకోవడం.

xiv) భాషాంతరీకరణ సామర్థ్యం సాధించడం.

xv) సముచితమైన మనోవైఖరులు పెంపొందించుకోవడం.

పై ప్రధాన ప్రయోజనాలు సాధించిన వ్యక్తి తాను ఉన్నతుడై సమాజాన్నికూడా ఉన్నతస్థాయిలో నిలబెట్టగల్గుతాడు.

## 3.03 పాఠ్యప్రణాళికలో మాతృభాష స్థానం:

నిత్య వ్యవహారంలో ఉపయోగపడే భాషగా, ఇతర భాషల, విష అధ్యయనాన్ని సులభతరంచేసే భాషగా, మాధ్యమభాషగా మాతృభాష ప్రణాళికలో, వ్యక్తుల జీవితంలో ప్రథమస్థానంలో ఉంటుంది. వి పాఠశాలలో ప్రవేశించి విద్యాభ్యాసాన్ని ముగించేవరకు, ఆ తర్వాత జీవితా మాతృభాష ప్రథమస్థానాన్నే వహిస్తుంది. పరిపూర్ణ మానవుడిగా, మ మనీషిగా తీర్చిదిద్దగల్గిన భాష మాతృభాష అని చెప్పొచ్చు.

## 3.04 ఉన్నత పాఠశాలస్థాయివరకు మాతృభాషగా తెలుగుబోధన:

ప్రాథమిక, ప్రాథమికోన్నత తరగతుల్లో విద్యార్థులకు భాషా నైపుణ సమర్థంగా అలవడటానికి ముమ్మర ప్రయత్నం జరుగుతుంది. భాషయె సదుచ్చారణ, దోషరహిత లేఖనం, సరళమైన రచన, స్వతంత్రంగా చదవగ పద్యాలను వల్లెవేయడం విద్యార్థులకు ఈ స్థాయివరకు అలవడాలి. భాషావాచ కూర్చబడిన వివిధ పాఠ్యాంశాల్లోని పదసంపదపై విద్యార్థులకు అధికా కల్గించుటయేగాక తమ అనుభవాలను, భావాలను ఆపదజాలాన్నుపయో వ్యక్తపరచే సామర్థ్యం కూడా వారికి కలగాలి.

దీని ఆధారంగా ఉన్నత తరగతుల్లో భాషావికాసం అతివేగంగ సమర్థంగానూ నిర్వహించే వీలుకల్గుతుంది. పరిచయంచేస్తున్న వివిధా జ్ఞానం, అవగాహన పరిధులు వ్యాప్తిచెందుతూ విద్యార్థుల్ని ఉత్తమ వ్యవహర్తలుగా తీర్చిదిద్దడం జరుగుతుంది. ఈ భాషే మాధ్యమభాష అయిన కతాన మాతృభాషాభ్యసనంద్వారా విస్తృతమైన ఆలోచనా పెంపొందుతుంది. భాషేతర అంశాలకు సంబంధించిన ఎన్నో విష భాషా పాఠ్యపుస్తకాల్లో ఉద్ధృతాలగుటచే వాని ఆలంబనంతో భాషా మూ పదజాలం మరింత వృద్ధి అవుతుంది. ఎన్నియో శాస్త్ర శ సాంకేతిక శబ్దాలు విద్యార్థి పదసంపదను సుసంపన్నంచేస్తాయి. భాషాస్వరూపంకూడా మార్పులకు లోబడుతుంది. ఈ దశలో

భాషలను కూడా అభ్యసించడంవల్ల ఆ భాషల ప్రభావంకూడా మాతృభాషపై తీవ్రంగా ప్రసరిస్తుంది. దీనివల్ల విద్యార్థుల మానసికస్థాయి, అనుభవాలు విస్తరిస్తాయి. ఈ కాలంలోనే ఉపాధ్యాయులు విద్యార్థుల దృష్టిని పదజాలంనుండి వాక్య విన్యాసంవైపు మళ్ళించి వాక్య నిర్మాణరీతులలో తమదేయైన శైలిని అనుసరించేట్లు చేయగల్గుతారు.

పై అంశాల నేపథ్యంలో భాషోపాధ్యాయులు ఉన్నత తరగతుల్లో బోధిస్తున్నపుడు ఈ కింది అంశాలను దృష్టియందుంచుకోవాలి.

i) స్పష్టోచ్చారణను పదిలపరచి మరింత కఠినమైన పదబంధాలుకూడా స్పష్టంగా ఉచ్చరించగల్గిన సామర్థ్యాన్ని పెంపొందించడం.

ii) పఠన నైపుణ్యాన్ని అభివృద్ధిపరచడం, రాగయుక్తంగా అన్వయక్రమంతో అర్థవంతంగా చదివే నేర్పు పెంపొందించడం.

iii) అభివ్యక్తిని మెరుగుపరచడం. తమదేమైన శైలిని పెంపొందించడం.

iv) విస్తార పఠనాన్ని ప్రోత్సహించడం.

v) సృజనాత్మకతను వెలికితీయడం, స్వతంత్ర రచనల ప్రోత్సహించడం.

vi) భాష, సంస్కృతి, సంప్రదాయాలు మున్నగువానియెడ విశ్వాసాన్ని, సద్వైఖరులు పెంపొందించడం.

బోధనలో భాషోపాధ్యాయుడు ఈ కింది మెలకువలను కూడా దృష్టియుందుంచుకోవాలి.

i) వివిధరంగాలకు సంబంధించిన పాఠ్యాంశాల బోధనలో ఇతర విషయ బోధకుల సహాయాన్ని తీసికోవడం.

ii) పాఠంయొక్క ప్రధాన ఉద్దేశ్యాలకనుగుణమైన ప్రవర్తనామార్పులను విద్యార్థుల్లో సాధించడం.

iii) కేవలం విషయ బోధనకుగాక భాషా విషయానికే అధిక ప్రాధాన్యతనీయడం.

iv) పాఠ్యాంశాలలోని కాలభేద ప్రభావాల్ని సమకాలీనంగా అనువర్తించడం.

v) పాఠ్యాంశాలను విద్యార్థుల నిజ జీవితాల్లోని అనుభవాలతో సమన్వయించడం.

పై అంశాలు ఉన్నత తరగతుల్లో భాషాభ్యసనాన్ని సమర్థం చేస్తాయి.

ఈ అంశాలు దృష్టియందుండకపోతే ఉపాధ్యాయుల అవసరం లేక దర్శినీ పుస్తకాల సాయంతోగాని, స్వయంకృషితోగాని విద్యార్థులు కనీస సాధించగల్గుతారు. కావున నిజమైన భాషాబోధనకు ఉపాధ్యాయులు తరగతుల్లో కొత్తపుంతలు తొక్కాల్సిన అవసరముంది.

## 3.06 భాషోపాధ్యాయుడు :

విద్యా వ్యవస్థలో ప్రధానవ్యక్తి ఉపాధ్యాయుడు. అధ్యయనం, అధ ఆతడి నిరంతర కర్తవ్యాలు. పాఠశాలలో బోధించే వివిధ బోధనా ప్రధానమైందీ, కీలకమైందీ, అన్ని బోధనాంశాలకు ఆధారభూతమైందీ అదీ మాతృభాష. ఈ భాషను బోధించే ఉపాధ్యాయుడు ఇతర వి బోధకుడికన్న విస్తృత జ్ఞాన సంపద కల్గిన వాడైనపుడే భాషాబోధనలో ల గమ్యాల్ని సాధించగల్గుతాడు. ఇతర ఉపాధ్యాయులందరికీ ఆదర్శప్రాయ మార్గదర్శకుడుగా కూడా భాషోపాధ్యాయుడే వ్యవహరించాల్సి ఉం ఉపాధ్యాయులు నవ లక్షణాలను కల్గి ఉండాలని విద్యావేత్తలు భావిస్తు వారు శుచులై, వర్చస్వులై, వాచస్వులై, ధృతిమంతులై, చక్కని స్మృతిమ చక్కని కృతిమంతులై, నమ్రత, ఉత్సాహం, జిజ్ఞాసలు మూర్తీభవించిన వ్య ఉండాలని ఆర్యోక్తులు వక్కాణిస్తున్నాయి. ఒక మంచి ఉపాధ్యాయుడ బోధించాల్సిన అంశాలను నిత్య నూతనం చేసికొంటూ బోధనప కొత్తదనాన్ని అన్వేషిస్తూ, కొత్తపుంతలు తొక్కుతాడని, అలా మునుమ వెళ్తాడని శ్రీ ఐ.వి. చలపతిరావుగారు అభిప్రాయపడ్డారు.

*గురుర్బ్రహ్మా, గురుర్విష్ణు, గురుదేవో మహేశ్వరః*
*గురుసాక్షాత్ పరబ్రహ్మ, తస్మై శ్రీ గురవేనమః*

అను ఆర్యోక్తికి ఉదాహరణంగా ఉపాధ్యాయుడుండాలని, సమ గౌరవమర్యాదలను పొందాలని భావింపబడుతోంది. ఈ ప్రాతిపదికగా భాషోపాధ్యాయుని లక్షణాలను కొన్నిటిని తెల్సికొందాం.

### i) భాషా, సాహిత్యాల అభిజ్ఞత :

భాషోపాధ్యాయుడు పాఠశాలలో తెలుగును ప్రథమభాషగా, భాషగాగాని బోధిస్తాడు. భాషాస్వరూప స్వభావాలు, భాషలో వ్యవహా సాహిత్య లక్షణాలు, చరిత్ర మొదలగు అన్ని విషయాల్లో అప దోషరహితమైన జ్ఞానాన్ని ఉపాధ్యాయుడు కల్గిఉండాలి.

ii) ఉత్తమ వ్యవహర్త :

తాను నేర్చిన, సంపాదించిన విజ్ఞానాన్ని విద్యార్థులకు సమర్థంగా అందించగల్గిన ఉత్తమ వ్యవహర్తగా ఉపాధ్యాయుడుండాలి. దీనికై మృదుభాషణం, సద్యోభాషణ శక్తి, సమయస్ఫూర్తి, సృజనాత్మకతలను స్వంతం చేసికొన్నవాడై అందరి హృదయాలను చూరగొనాలి.

iii) సత్ప్రవర్తన - స్నేహపూర్వకవైఖరి :

తాను మంచి ప్రవర్తన కల్గినవాడై వ్యక్తిగత జీవనంలో, పాఠశాల జీవనంలో, సామాజిక జీవనంలో అందరి ఎడ స్నేహపూర్వక వైఖరిని కల్గి ఉండాలి. పాఠశాలలోని బాలబాలికలను తన పిల్లలుగా, సోదరులుగా పరిగణించిన రోజు అతడి బోధనద్వారా వారు ప్రభావితులౌతారు. లాభపడతారు. తన బలహీనతలను బయల్పడనీయక, వానిని పరిహరించుకొనే ప్రయత్నంచేసి శుద్ధుడై ఉండుట అవసరం.

iv) సహనశీలత - నిష్పక్షపాతం :

భాషోపాధ్యాయునికి సహనశీలత అవసరం. నిష్పక్షపాతంగా అందర్ని సమానంగా ఆదరించాలి. బోధనలో ఎంతటి క్లిష్టసందర్భాలెదురైనా సహనాన్ని కోల్పోరాదు. దీనికోసం అంతరీక్షణ (Introspection) అవసరం. విద్యార్థుల ఎడ ఆపేక్షరేగాని నిరపేక్షలుండక అందరి ఎడ నిష్పక్షపాత దృష్టితో వ్యవహరించి వారిని సంపూర్ణ జ్ఞానోన్ముఖులను చేయాలి.

v) వృత్తి గౌరవం :

తాను నిర్వహిస్తున్న వృత్తి ఇతర వృత్తులలోకెల్ల ఆదర్శప్రాయమైందనే, ఉన్నతమైందనే దృఢవిశ్వాసం కల్గి ఉండాలి. తన్నుతాను గౌరవించుకోవడం, ఆత్మగౌరవాన్ని కాపాడుకోవడంతోబాటు తన వృత్తిని గౌరవించుకోవాలి. దీనివల్ల ఉపాధ్యాయుడు సమాజంలో ఉన్నతస్థానం పొందుతాడు. తన వృత్తియందు ఉదాసీనత, అలసత్వం, ఈ వృత్తిలో ఎదగలేననే భావన ఎట్టి పరిస్థితుల్లోనూ దరిచేరనీయరాదు. తాను అసంతృప్తిపడక సంతృప్తిని కల్గి ఉంటే విద్యార్థులను సంతృప్తిపరచి వారి గౌరవాన్ని, సమాజ గౌరవాన్ని చూరగొనగల్గుతాడు.

vi) ఉత్తమ శిక్షణ, మనోవైజ్ఞానిక శాస్త్ర పరిచయం :

ఉపాధ్యాయుడు ఉత్తమ శిక్షణపొంది ఉండాలి. వృత్తి పూర్వక శిక్షణతో వృత్త్యంతర శిక్షణలనుకూడా పొంది తన వృత్తి నైపుణ్యాలను నవనవో చేసికోవాలి. దీవిద్వారా బోధనలో కొంగొత్త ప్రయోగాలనుచేసి సత్ఫలి పొందగల్గుతాడు. మనోవిజ్ఞానశాస్త్ర పరిచయం, నిరంతర అధ్యయనం విద్యార్థుల సామాజిక, వారసత్వ, పరిసరాల, మూర్తిమత్వ అంశాలతో అభ్యసనాన్ని ప్రభావితంచేసే వివిధాంశాలు, అభ్యసనంలో ఎదురయ్యే సమ వానిని పరిష్కరించుకొనే మార్గాలు కరతలామలకమౌతాయి.

vii) సామాజిక నిబద్ధత :

ఉపాధ్యాయుడు సమాజంలోని వ్యక్తి, భాగస్వామి. సమాజం ఉ యుని జీవనానికి ఆర్థికంగా తోడ్పడుతుంది. ఉపాధ్యాయుడినుండి ఫలితాన్ని ఆశిస్తుంది. ఈ సమాజానికి ఉపాధ్యాయుడు నిబద్ధుడుగా సమాజశ్రేయస్సే, తన శ్రేయస్సుగా భావించాలి. తన బోధన, ప్రవర్తనల సమాజాన్ని ప్రభావితంచేయుగల్గిన వ్యక్తి మాత్రమే ఉత్తమ ఉపాధ్యాయ అందరి మన్ననలు పొందగల్గుతాడు.

viii) సంస్కృతీ వారసుడు :

భాషోపాధ్యాయుడు మన దేశ సంస్కృతీ వారసత్వ సంపదకు ని వారసుడు. జాతీయ సంస్కృతి, తెలుగు సంస్కృతి, తెలుగు సంస్కృతి అతడి నిత్య జీవితంలో అడుగడుగునా ద్యోతకం కావాలి. సుస వారసత్వమైన సంస్కృతిని పరిరక్షించే బాధ్యతకూడా భాషోపాధ్యాయ

ix) విద్యాగమ్యాల అవగాహన – పరిశోధనాసక్తి :

విద్యాబోధన గమ్యాలు, ధ్యేయాలు, ఉద్దేశ్యాలు, . లక్ష్యాలు స్ప నిర్వచించగల్గినవాడై ఉండాలి. వీనిని తన పాఠ్యాంశాలతో సమన్వయించుక శక్తిగలవాడై, విద్యార్థులు వీనిని సాధించేట్లు చూచే బాధ్యత ఉపాధ్యాయ బోధన మరియు అభ్యసనంలో ఆవశ్యకమైన చిట్టి పరిశోధనలను ( Scale Research), క్రియాత్మక పరిశోధనలను (Action Res నిర్వహించుటయందు ఆసక్తి కనబరచి బోధనలో తనకెదురగు సమ పరిష్కరించుకొనగల్గే సామర్థ్యాన్ని పెంపొందించుకోవాలి. పరిశోధన ఫలి

తోటి ఉపాధ్యాయులతో, విషయ నిపుణులతో చర్చించి వాటి సత్ఫలితాలను అందరికీ అందుబాటులోకి తేవాలి. అన్వేషణా నైపుణ్యాలను విద్యార్థుల్లో పెంపొందించాలి.

x) వ్యాఖ్యాత :

ప్రాచీన సాహిత్యాన్ని, ఆధునిక సాహిత్యాన్ని ఆయా కాలాలకనుగుణంగా విలువల నేపథ్యంలో వ్యాఖ్యానించగల్గి, వివరించగల్గి, విశ్లేషించగల భాషోపాధ్యాయుడు విద్యార్థుల మనస్సులను చూరగొంటాడు. ప్రాచీన సంప్రదాయాలను ఆధునిక దృక్పథంతో విమర్శించి వానియందలి మంచి చెడులను హంసక్షీరన్యాయ..గా ఈనాటి తరానికి అందించవల్సినవాడు భాషోపాధ్యాయుడే.

శ్రీ గొడవర్తి సూర్యనారాయణగారు 'అభినవాచార్యక'మనే తమ గ్రంథంలో భాషోపాధ్యాయునికి ద్వాదశ లక్షణాలను సూచించారు. అవి:

i) ఆత్మసంయమనం (Self control)
ii) అభినివేశం (Enthusiasm)
iii) ఆర్ద్రత (sympathy)
iv) సంశోధిత బుద్ధి (Experimental attitude)
v) వృత్తిధర్మం (Sense of vocation)
vi) చాతుర్యం (Humour)
vii) ధర్మబుద్ధి, ధర్మప్రకోపం (Love of justice - sensitiveness to injustice)
viii) మానసిక స్వాతంత్ర్యం (Independence of mind)
ix) నిష్కాపట్యం (Sincearity)
) విశ్వసపాత్రత (Dependableness) (Reliable)
.i) సహనం (Patience)
.ii) సమయస్ఫూర్తి (Resourcefulness)

పై లక్షణాలన్నిటిని భాషోపాధ్యాయుడు కల్గియుండి లోపరహితుడై, దోషరహితుడై పాఠశాల, మరియు సమాజంలోని వ్యక్తులందరికి తలలోని నాలుకగా వ్యవహరించిననాడు వందనీయుడౌతాడు. అతడివల్ల సమాజం ప్రభావితమౌతుంది. లాభపడ్తుంది. నివాళులర్పిస్తుంది.

# నాలుగో అధ్యాయం

## విద్యాగమ్యాలు - భాషాబోధన లక్ష్యాలు:

### 4.01 విద్యాగమ్యాలు :

భర్తృహరి నిర్వచనంలో విద్య నిగూఢ గుప్తమగు విత్తమని, సిసిరో అనే విద్యావేత్త దృష్టిలో విద్య వ్యక్తికి లభించే ఉత్తమోత్తమ బహుమతి అని, వైట్ హెడ్ విద్య విజ్ఞానంతోబాటు, విద్యార్థులు తమ జీవిత సమస్యల్ని పరిష్కరించుకోవడానికి, సజీవమైన భావనా సముదాయం కల్గిన చైతన్యశీలురైన విద్యార్థుల్లో స్వంత ఆలోచనల్ని రేకెత్తించే సాధనమని పేర్కొన్నారు. వివేకానందుల దృష్టిలో మనిషిని నిజమైన మనిషిగా, మనీషిగా మార్చగల్గిన అత్యుత్తమ సాధనం విద్య. రిచర్డ్ లివింగ్స్టన్ మానవీయతా ఔన్నత్యాన్ని గుర్తించే సాధనం విద్యయని శ్రీ జిడ్డు కృష్ణమూర్తి విద్య విద్యార్థుల్లో స్వతంత్ర ఆలోచనల్ని పురికొల్పే సాధనమని వక్కాణించారు. పై అభిప్రాయాలు విద్య సాధించవలసిన గమ్యాలు - ఉద్దేశ్యాలను స్పష్టం చేస్తున్నాయి. అనూచానంగా విద్య,

i) జీవికను సంపాదించుకొనే సాధనంగా,

ii) జ్ఞాన సముపార్జనకు అనువైనదిగా,

iii) మూర్తిమత్వ వికాసానికి దోహదకారిగా,

iv) విరామకాలాన్ని సద్వినియోగపరిచేదిగా,

v) శీల నిర్మాణానికి ఉపకరించేదిగా,

vi) సంస్కృతి, సంప్రదాయాలను పెంపొందించేదిగా భావింపబడుతోంది. విద్య ప్రతి వ్యక్తిలో సాంఘిక చైతన్యాన్ని, తనకు వారసత్వంగా లభించిన సంస్కృతిని పరిరక్షించుకొనే శక్తిని, క్లిష్ట సమయాల్లో అవసరమైన తార్కికశక్తిని, సంఘ అభివృద్ధికి అవసరమైన సంపదను ఉత్పత్తిచేయగల్గిన నైపుణ్యాలను కల్గించాలని విద్యావేత్తల అభిప్రాయం. సోదర మానవుల సంక్షేమానికి పాటుపడి మనిషిలోని దానవత్వాన్ని రూపుమాపి మానవత్వాన్ని పెంచి పోషించేదిగ

మలచబడాలి. ఈ విషయాలనే దృష్టియందుంచుకొని 1986 నాటి జాతీయ విద్యావిధానం పై విద్యా గమ్యాలతోబాటు ఈ క్రింది గమ్యాలను కూడా దృష్టియందుంచుకోవాలని, వీనిని విద్యాబోధనద్వారా సాధించాలని ప్రతిపాదించింది.

i) శారీరక, మానసిక, వ్యక్తిత్వ పరిపూర్ణతతోబాటు సౌందర్యాత్మక దృష్టితో జీవించేట్లుగా వ్యక్తిత్వ రూపకల్పన.

ii) శాస్త్రీయ దృక్పథంతోబాటు, నైతిక, ఆధ్యాత్మిక విలువల్ని ప్రోదిచేయడం.

iii) కొత్తవానిని కనుగొనాలనే ఉత్సుకతను (అన్వేషణా సామర్థ్యాన్ని) పెంచి ఇదివరలో పరిచయంలేని సన్నివేశాల్లో, అననుకూల వాతావరణాలనుకూడా ఎదుర్కొనగలిగే ఆత్మస్థైర్యాన్ని పెంపొందించడం.

iv) భౌతిక, సాంఘిక, సాంకేతిక, సాంస్కృతిక వాతావరణానికి సంబంధించిన అవగాహనను పెంపొందించడం.

v) కాయకష్టంపట్ల, ఒళ్ళువంచి పనిచేయడంపట్ల గౌరవభావాన్ని కల్గించడం.

vi) లౌకిక దృక్పథం, సాంఘిక న్యాయాలపట్ల నిబద్ధత.

vii) దేశ పురోభివృద్ధి, దేశగౌరవం, దేశ సమగ్రతలకై సర్వసన్నద్ధత.

viii) అంతర్జాతీయ అవగాహన, విశ్వమానవశాంతి, సౌభ్రాతృత్వాల భావన.

విద్యాప్రణాళిక ప్రతిపాదిస్తున్న పై ప్రాతిపదిక గమ్యాలను, ప్రణాళికలోని అన్ని విషయాలబోధనలో తప్పనిసరిగా దృష్టియందుంచుకోవాలి. వీనితోబాటు విద్యాప్రణాళిక మౌలికాంశాలనుకూడా దృష్టియందుంచుకొని వాని సాధనకు కూడా ప్రణాళిక పాటుపడాలని జాతీయ విద్యావిధానం సిఫార్సుచేసింది. వీని ఆధారంగా బోధన లక్ష్యాలను నిర్ణయించుకొని విద్యార్థుల్లో సముచితమైన ప్రవర్తనా మార్పుల్ని సాధించాలి.

## 4.02 బోధన లక్ష్యాలు :

బోధన లక్ష్యాలను ప్రఖ్యాత విద్యావేత్త Benjamin Bloom మొట్టమొదట విశ్లేషించాడు. లక్ష్యాల ఆవిష్కరణలో గమ్యం, ఉద్దేశ్యం, లక్ష్యం, స్పష్టీకరణం అనే పదాలకు నిర్వచించుకోవాల్సిన అవసరం ఉంది.

i) గమ్యాలు, ధ్యేయాలు (Goals) :

ఆశయాలు, ఉద్దేశ్యాల విస్తృత వ్యక్తీకరణలే గమ్యాలు. ఇవి విద్యావిధాన ప్రాధాన్యతలను నిర్ణయించి ప్రణాళికల రూపకల్పనకు ఉపకరిస్తాయి. ఇవి సుదీర్ఘకాలంలో విద్యాప్రణాళిక (Curriculam) మొత్తంపై సాధించవలసిన ప్రవర్తనామార్పుల మొత్తాలు. వీనిని ధ్యేయాలని కూడావ్యవహరించవచ్చు.

ii) ఉద్దేశ్యాలు (Aims) :

గమ్యాలనుండి ఆవిర్భవించి పాఠ్యప్రణాళికల (Syllabus) రూపకల్పనకు, పాఠ్యాంశాల ఎంపికకు ఉపకరించి ఆయా పాఠ్యాంశాలద్వారా విద్యార్థుల్లో సాధించవలసిన స్థూలమైన ప్రవర్తనామార్పుల్ని తెలిపేవే ఉద్దేశ్యాలు. ఇవి ఒక ప్రత్యేక పాఠ్యప్రణాళిక చివర (సుమారు ఒక సంవత్సరకాలం కావచ్చు) విద్యార్థుల్లో సాధించే ప్రవర్తనా మార్పుల మొత్తాలు. ఇవి సామాన్య ఉద్దేశ్యాలని (General aims), ప్రత్యేక ఉద్దేశ్యాలని (Specific aims) రెండు విధాలుగా విభజించబడతాయి. ఇవి దీర్ఘకాలంలో సాధించదగినవి.

iii) లక్ష్యాలు (Objectives) :

గమ్యాలు, ఉద్దేశ్యాలనుండి ఆవిర్భవించి తరగతి బోధనకు మార్గదర్శకత్వం నెరపి ఆయా పాఠ్యాంశాలద్వారా విద్యార్థుల్లో ఆశిస్తున్న ప్రవర్తనామార్పుల్ని తెలిపేవే లక్ష్యాలు. వీనిని బోధన లక్ష్యాలని Intructional objectives వ్యవహరిస్తారు. ఇవి సంవృత లక్ష్యాలని (Closed objectives), వివృత లక్ష్యాలని (Open objectives) అని ద్వివిధాలు. సంవృత లక్ష్యాలు విస్తృత వ్యాఖ్యలను నోచుకొంటాయి. వివృత లక్ష్యాలు ఒకే ఒక వ్యాఖ్యకు నోచుకొంటాయి. వీనిని స్వల్పకాలంలో అంటే ఒక పాఠ్యాంశబోధన చివర సాధించవచ్చు.

iv) స్పష్టీకరణాలు (Specifications) :

బోధన లక్ష్యాల సూక్ష్మరూపాలు స్పష్టీకరణాలు. ఏదేని ఒకే ఒక బోధనాంశం చివర విద్యార్థుల్లో ఆశిస్తున్న ప్రవర్తనా మార్పు స్పష్టీకరణం. ఇది అల్పకాలంలో సాధింపబడుతుంది. ప్రతి లక్ష్యంలోని సూక్ష్మభావనలే స్పష్టీకరణాలు. ఇవి బోధన లక్ష్యాలను ప్రవర్తనల రూపంలో వివరిస్తాయి. ఇవి బోధన కార్యానికి ప్రాతిపదికలు, అభ్యసనానికి సాక్ష్యాలు. ఇవి లక్ష్యాల అర్థాలను పరిమితంచేస్తాయి. వివిధ లక్ష్యాలయందలి భేదాలను చెప్పడానికి

ఉపకరిస్తాయి. బోధన, అభ్యసన పన్నివేశాల్లోకి అంతర్దృష్టిని సారించడానికి మూల్యాంకనంలో ప్రశ్నల తయారీకి ఇవి ఉపకరిస్తాయి.

బోధన వ్యవస్థలో గమ్యాలు, ఉద్దేశ్యాలు, లక్ష్యాలు, స్పష్టీకరణాలు ఒకదానినుండి మరొకటి ఉద్భవించి స్థూలరూపంనుండి సూక్ష్మరూపానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. మానవ శరీరంలోని రక్త ప్రసరణమండలాన్ని వీనితో పోల్చవచ్చు. మానవ జీవితమే గమ్యమైతే, గుండె ఉద్దేశ్యం. సిరలు, ధమనులు లక్ష్యాలు, రక్తకేశనాళికలు స్పష్టీకరణాలని భావించవచ్చు. శారీరక వ్యవస్థకు రక్త ప్రసరణ వ్యవస్థ ఎలా ప్రధానమో అట్లే బోధన వ్యవస్థకు ప్రవర్తనామార్పుల్ని నిర్వచించే ఈ వ్యవస్థ ప్రధానం. Bloom విశదీకరించిన లక్ష్యాలను నిర్ణయించుకొనేముందు ఈ కింది అంశాలను దృష్టియందుంచుకోవాలి.

i) ఇవి విద్యార్థులు కనబరచవలసిన ప్రవర్తనల రూపంలో చెప్పబడాలి.

ii) ఇవి పాఠ్యబోధనకన్న ముందే నిర్వచించుకోవాలి.

iii) ఇవి స్ఫూర్తి వాక్యాల్లో స్పష్టంగా రాయబడాలి.

iv) ఇవి పాఠ్యాంశంతో సమన్వయించబడాలి.

v) ఇవి రెండు భాగాలుగా ఉండాలి. వానిలో ఒకటి పరివర్తన భాగం, రెండోది విషయభాగం.

vi) ఇవి సంక్షిప్తంగా, స్పష్టంగా, తమ పరిమితుల్లో, మరో భావనకు తావీయక సాధించగల్గేవిగా, ఆర్జించగలిగేవిగా ఉండాలి.

ఈ బోధన లక్ష్యాలు పై కారణాలవల్ల స్పష్టంగా వివరింపబడి, సాధించబడేవి ఐనప్పుడే వీనికి సార్థకత కలుగుతుంది. ఇవి సామాన్యంనుండి క్లిష్టతకు, వైయక్తికతనుండి సామూహికతకు విస్తరింపబడతాయి. ఇవి స్థాయి (Level), తరగతి (Class), విషయం (Subject), పాఠ్యవిభాగం (Unit), పాఠ్యాంశం (Lesson) వారీగా ఉంటాయి. బోధన లక్ష్యాలను విద్యావేత్తలు ఈ క్రిందివిధంగా వర్గీకరించారు.

మానవ ప్రవర్తన జ్ఞానాత్మక (Congntive,) భావావేశ (Affective), మనో చలనాత్మక (Psychomotor) రంగాల (domains)లోని ప్రతిస్పందనలకు ప్రతిరూపం. బోధన లక్ష్యాలు ఈ మూడు రంగాలకు సంబంధించినవి.

వీనిలో ఒక స్పష్టమైన అనుసంబంధ (hierarchy) వారసత్వం ఉంటుంది. ఈ సంబంధాన్ని దిగువ విధంగా సూచించవచ్చు.




పై మూడురంగాల గురించి కొంత తెల్సికొందాం :

**i) జ్ఞానరంగం :**

బోధన అభ్యాసన ప్రక్రియలో జ్ఞానరంగానికి విశిష్టత ఉంది. ఈ రంగం ఆలోచించడం, తెల్సిక ˙ ˙డం, సమస్యల్ని పరిష్కరించుకోవడం మొదలైన వానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. తద్వారా జ్ఞానం, సాధారణ నైపుణ్యం, మనో నైపుణ్యాలను ఆర్జించవచ్చు. వీనిని పరీక్షించే సామగ్రి విశేషంగా తయారుచేయవచ్చు.

**ii) భావావేశరంగం :**

ఇది మానవ ప్రవృత్తి, ప్రవర్తన, ప్రతిస్పందనలకు సంబంధించింది. ఇది వ్యక్తుల ఆసక్తులు, అభిరుచులు, వైఖరులు, విలువలు అనుభూతులు, ప్రశంసలు మొదలైనవానిని వివరిస్తుంది. దీన్ని పరీక్షించడానికి మనోవైజ్ఞానిక శాస్త్ర సూత్రాలు అవసరమౌతాయి. ఈనాటి బోధనలో అత్యధిక ప్రాధాన్యతనీయాల్సిన అంశమిది.

iii) మనోచలనాత్మకరంగం :

ఇది యాంత్రిక నైపుణ్యాలు (Mechanical skills), అనువర్తిత నైపుణ్యాల (Manipulative skills)కు సంబంధించింది. దీనిని దృష్టిలో పెట్టుకొన్నపుడే బోధన ప్రక్రియ పరిపూర్ణమవుతుంది.

ఉన్నత తరగతుల్లో జ్ఞానరంగంలోని జ్ఞానం, అవగాహనం, వినియోగదక్షత, భావేశరంగంలోని ఆసక్తులు, ప్రశంస, వైఖరులు, అభిరుచులు, మనోచలనాత్మక రంగంలోని నైపుణ్యాలను అభివృద్ధిచేయాల్సి ఉంది. ఈ బోధన లక్ష్యాలు, స్పష్టీకరణాలు ఉపాధ్యాయునకు ఈ కిందివిధంగా ఉపకరిస్తాయి.

i) బోధన ప్రణాళికల (Teaching Plans)ను సిద్ధంచేసికోవడానికి.

ii) విద్యార్థుల్లో ఆశించదగిన ప్రవర్తనా మార్పుల్ని దృష్టియందుంచుకోవడానికి, వానిని పరిశీలించడానికి, మదింపు వేయడానికి.

iii) కార్యక్రమయుత అభ్యసన క్రియను తయారుచేయడానికి.

iv) లక్ష్యాధార బోధన, మూల్యాంకన సామాగ్రిని తయారుచేయడానికి.

విద్యా ప్రణాళిక గమ్యాలను, ఉద్దేశ్యాలను సాధించడానికి. బోధన లక్ష్యాలు అవసరమా? అనే ప్రశ్నకు ఈ క్రింది విధంగా సమాధానాలు చెప్పుకోవచ్చు.

i) విద్యార్థుల అర్జనా తీవ్రతలను వేగవంతంచేయడానికి.

ii) బోధనాభ్యసన ప్రక్రియలో లభించిన సమయాన్ని మరింత సద్వినియోగం చేయడానికి.

iii) ఆయా విద్యార్థుల్లో ఆశించదగిన ప్రవర్తనామార్పులేవో ముందే నిర్ణయించుకొని సముచితమైన బోధన వ్యూహాలను (Teaching Strategies)ను ఎంపికచేసికోవడానికి.

iv) విద్యార్థుల్లోని అశక్యతలను కనుగొని వాని నివారణకు ప్రయత్నించడానికి.

v) అభ్యసనంలో, బోధనలో, సన్నద్ధతలో సమయాన్ని ఆదా చేయడానికి.

vi) పాఠ్యాంశాల ఉద్దేశ్యాలు సాధించడానికి తద్వారా విద్యా గమ్యాలను చేరుకోవడానికి, బోధన లక్ష్యాలు అవసరమౌతాయి.

బోధనాభ్యసక్రియలో ఉపాధ్యాయులు మొదట లక్ష్యాలను నిర్ణయించుకొని, విద్యార్థుల ప్రవేశ ప్రవర్తన (Entry behaviour)లను కనుగొని, ఆశించిన

ప్రవర్తనలను బోధనద్వారా కల్పించి మూల్యాంకనం చేయాల్సి ఉంటుంది. పై గమ్యాలు, ఉద్దేశ్యాలు, లక్ష్యాలు, స్పష్టీకరణాలు ప్రాథమికదశనుండి ఉన్నత పాఠశాల దశవరకు ఉపాధ్యాయులు దృష్టియందుంచుకొని విద్యార్థులు సాధించేట్లుగా చూడాల్సి ఉంది. ఈ సందర్భంలో 1986 నాటి జాతీయ విద్యావిధానానికి అనుగుణంగా జాతీయస్థాయిలో ప్రాథమిక పాఠశాల విద్యార్థులు సాధించవలసిన ప్రవర్తనా మార్పుల్ని మరో విధంగా నిర్వచించే ప్రయత్నం జరిగింది. అభివృద్ధి చెందిన దేశాల్లో అనుసరిస్తున్న సాధన గమ్యాలను (Attainment Targets) దృష్టిలో పెట్టుకొని డా॥ R.H. ధావె అధ్యక్షతన ఏర్పడిన ఒక సంఘం కనిష్ఠ అభ్యసన ప్రమాణాలను నిర్ణయించింది. వీరు నియత, అనియత విద్యాక్షేత్రంలో విద్యాభ్యాసం చేస్తున్న ప్రాథమిక తరగతుల విద్యార్థులందరూ సాధించవల్సిన కనిష్ఠ అభ్యసన ప్రమాణాలను (Minimum Levels of Learning) నిర్ధారించారు. వీనిని కనిష్ఠ ప్రమాణాలని తప్పనిసరిగా సాధించాల్సినవని పేర్కొనడం జరిగింది.

ఈ ప్రమాణాలను మాధ్యమిక, ఉన్నత తరగతులకు కూడా విస్తరించే ప్రయత్నం జరుగుతోంది. అంతవరకు నేటి మన పాఠశాలల్లో ప్రాథమిక తరగతుల బోధనలో కనిష్ఠ అభ్యసన ప్రమాణాలను మాధ్యమిక ఉన్నత తరగతుల్లో బోధన లక్ష్యాలను, స్పష్టీకరణాలను దృష్టిలో పెట్టుకొని బోధనాభ్యసన కార్యక్రమాన్ని కొనసాగించవల్సి ఉంది. అందువల్లబోధన లక్ష్యాలు, స్పష్టీకరణాల గురించి తెల్సికొనేముందు కనిష్ఠ అభ్యసన ప్రమాణాలను గూర్చి తెల్సికొందాం.

### 4.03 కనిష్ఠ అభ్యసన ప్రమాణాలు (Minimum Levels of Learning):

ఇవి నియతకాలంలో విద్యార్థుల్లో ఆశించదగిన నిర్దిష్టమైన ప్రతిష్ఠ నైపుణ్యాలు. విచక్షణలేకుండా అందరు విద్యార్థులు వీనిని సాధించి విద్యా నాణ్యతకు ఉదాహరణలుగా నిలవాలి. వీనియందు గుణాత్మకమైన అంశాలు, ప్రణాళికాపరమైన అంశాలు అనే రెండు దృక్పథాలుంటాయి. గుణాత్మకమైన అంశాలు విద్యార్థుల్ని ఉత్తమ పౌరులుగా దిద్ది తీర్చడానికి ఉపకరిస్తే, ప్రణాళికాపరమైన అంశాలు ప్రత్యుపాయబోధన ప్రయత్నాలు, వ్యూహాల రూపకల్పనకు దోహదపడతాయి. వీనికి ఈ కింది లక్షణాలున్నాయి.

i) కార్యసాధక సామర్థ్యం (Achievability)
ii) వ్యక్తీకరణ సామర్థ్యం (Communicability)
iii) మూల్యీకరణ సామర్థ్యం (Evaluability)

iv) నిరంతర అభ్యసన సామర్థ్యం (Learning Continum)

v) జ్ఞాన-జ్ఞానేతర రంగాల సమన్వయ సామర్థ్యం (Combination of Cognitive and Other domains in Learning)

వీనియందు భావన, ప్రవచనం, కార్యాచరణ వ్యూహాలనే మూడు అంశాలు (concepts, statements, operational strategies) ఇమిడి ఉన్నాయి.

వీనిని ఉపయోగిస్తున్నపుడు విద్యార్థులస్థాయి నిర్ధారణకు రేటింగ్ పద్ధతిని పాటించాల్సి ఉంటుంది. ఆ పద్ధతిని దిగువ విధంగా సూచించవచ్చు.

90-100 గుణాలు సాధించినవారు ప్రతిభావంతులుExcellent
80-89 గుణాలు సాధించినవారు అతిసమర్థులుVerygood
70-79 గుణాలు సాధించినవారు సమర్థులుgood
60-69 గుణాలు సాధించినవారు సామాన్యులుFair
50-59 గుణాలు సాధించినవారువెనుకబడినవారుPoor
50-కన్నతక్కువ గుణాలు సాధించినవారు పూర్తిగా వెనుకబడ్డవారుVery poor

ఈ సామర్థ్యాలు తరగతివారీగాను, ఉపసామర్థ్యాలుగను విశ్లేషింపబడ్డాయి. ఈ సామర్థ్యాల మొత్తం భాషలో తొమ్మిదిగా నిర్ణయింపబడింది. అవి:

i) శ్రవణం (Listening)
ii) భాషణం (Speaking)
iii) పఠనం (Reading)
iv) లేఖనం (Writing)
v) భావావగాహనం (Comprehension of ideas through listening) and reading)
vi) ప్రాయోగిక వ్యాకరణం (functional grammer)
vii) స్వయం అధ్యయనం (Self learning)
viii) భాషోపయోగం (Language use)
ix) శబ్దజాలంలో అధికారం vocabulary control)

పై తొమ్మిది రంగాలను సామర్థ్యాల్లోని ఉపసామర్థ్యాలను ఈ కింది పట్టికద్వారా తెల్సికోవచ్చు:

# భాషలో కనిష్ఠ అభ్యసన ప్రమాణాలు
## (Minimum levels of learning)

| సామర్థ్యాలు | ఒకటో తరగతి | రెండో తరగతి | మూడో తరగతి | నాలుగో తరగతి | ఐదో తరగతి |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| I శ్రవణం | 1.1.1 సామాన్యమైన పరిచితమైన గీతాలను పద్యాలను, కథలను అవగాహనతో వినడం. | 1.2.1 సామాన్యమైనప్పటికి అపరిచిత పద్యాలు, పాటలు కథలను అవగాహనంతో వినడం. | 1.3.1 కథనం, వర్ణనం, శబ్దక్రీడ, పొడుపుకథలను అవగాహనంతో వినడం. | 1.4.1 పరిచిత సన్నివేశాలలో సామాన్యమైన ప్రసంగాలను అవగాహనంతో వినడం. | 1.5.1 పద్యపఠనం, నాటికలు వక్తృత్వాన్ని (పాఠశాల ఉత్సవాల్లో, పోటీల్లో) అవగాహనంతో వినడం. |
| | 1.1.2 పరిచిత సన్నివేశాల్లో సంభాషణలు, సంవాదాలను అవగాహనచేసుకోవడం. | 1.2.2 పరిచిత సన్నివేశాల్లో సంభాషణలు, సంవాదాలను అవగాహనచేసుకోవడం. | 1.3.2 అపరిచిత సన్నివేశాల్లో సంభాషణలు, సంవాదాలను అవగాహనచేసుకోవడం. | 1.4.2 అపరిచిత సన్నివేశాల్లో సంభాషణలు, సంవాదాలను అవగాహనచేసుకోవడం. | 1.5.2 అపరిచిత సన్నివేశాల్లో సంభాషణలు, సంవాదాలను అవగాహనచేసుకోవడం. |
| | 1.1.3 పరిచిత సన్నివేశాల్లో మౌఖిక అభ్యర్థనలు, సామాన్యమైన సూచనలను అవగాహన చేసుకోవడం. | 1.2.3 పరిచిత సన్నివేశాల్లో మౌఖిక అభ్యర్థనలు, సామాన్యమైన సూచనలను అవగాహన చేసుకోవడం. | 1.3.3 క్రీడలనుగూర్చి, సామాన్యకార్యకలాపాలను గూర్చిన మౌఖిక సూచనలు అవగాహనచేసుకోవడం. | 1.4.3 ఒక కృత్యాన్ని నిర్వహించడానికి వరుసగా ఇచ్చిన మౌఖిక సూచనలను అవగాహన చేసుకోవడం. | 1.5.3 జట్టు కృత్యాన్ని నిర్వహించడానికి ఇచ్చే సూచనలను అవగాహన చేసుకోవడం. |
| II భాషణం | 2.1.1 సామాన్య వాక్యాలను సరిగా పునర్వచించడం. | 2.2.1 భాషలోని ధ్వను లన్నింటిని ఉచ్చరించడం. | 2.3.1 సరియైన ఉచ్చారణ తో మాట్లాడడం. | 2.4.1 ఆగకుండా సహజంగా మాట్లాడడం. | 2.5.1 ధారాళంగా సహజంగా మాట్లాడడం. |
| | 2.1.2 కంఠస్థం చేసిన సామాన్యగీతాలను, పద్యాలను | 2.2.2 జట్టులో గాని వైయక్తికంగాకాని కంఠస్థం | 2.3.2 సామాన్యమైన పరిచిత కథలను అభిన | 2.4.2 కంఠస్థం చేసినదాన్ని సరిగా చదవడం. | 2.5.2 సామాన్య పరిచిత ఇతివృత్తాలను గూర్చి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | చదవడం, అభినయ గేయాలను జట్లుగా గానంచేయడం. | చేసిన పద్యాలను పాటలను చదవడం. | యంతో చెప్పడం. | | మాట్లాడడం. |
| | 2.1.3 సామాన్య ప్రశ్నలకు ఔను/కాదులలో సమాధానాలు ఇవ్వడం. | 2.2.3 సామాన్య ప్రశ్నలకు పూర్తివాక్యాల్లో సమాధానాలు ఇవ్వడం. | 2.3.3 పరిచిత వస్తువులను చూసి వర్ణించడం. | 2.4.3 అపరిచిత వస్తువులను వర్ణించడం లేదా అపరిచిత వస్తువులను గూర్చి చెప్పడం. | 2.5.3 సన్నివేశాలను, సంఘటనలను వర్ణించడం. |
| | 2.1.4 సామాన్య ప్రశ్నలను అడగడం. | 2.2.4 పరిచిత వస్తువులను గురించిన సమాచారాన్ని అందించడం. | 2.3.4 సంశ్లిష్టమైన ప్రశ్నలడగడం. | 2.4.4 తరగతిలో జరిగే సామాన్య చర్చల్లో పాల్గొనడం | 2.5.4 నాటకాల్లో వక్తృత్వాల్లో పాల్గొనడం, అందులో సంప్రదాయ ప్రకటనలు చేయడం. |
| III పఠనం | 3.1.1 అక్షరాలను విడిగాను పదాలలోను గుర్తించడం. | 3.2.1 అరుదుగా వచ్చే అక్షరాలను ద్విత్వ, సంయుక్తాక్షరాలను గుర్తించడం. | 3.3.1 రోడ్డు సంజ్ఞలు, ప్రకటనలు, నోటీసుబోర్డుపై ఉన్న నోటీసులను చదవడం. | 3.4.1 హాస్యాన్ని సూచించు పత్రాలను, ప్రకటనలను, చదవడం. | 3.5.1 సామాన్య చిత్రాలను, పట్టికలను, పటాలను చదవడం. |
| | 3.1.2 పెద్దక్షరాల్లో ముద్రించిన అంశాన్ని, నల్లబల్లపై రాసిన చేతిరాతను మెరుపు అట్టలను చదవడం. | 3.2.2 పెద్ద చిన్న అచ్చులోనున్న అంశాన్ని చదవడం. | 3.3.2 ఇతర విద్యార్థుల చేతిరాతను చదవడం. | 3.4.2 చేతిరాతలో ఉన్న ఉత్తరాలను చదవడం. | 3.5.2 ముద్రణలో ఉన్న చేతిరాతను స్వేచ్ఛగా చదవడం. |
| | 3.1.3 సామాన్య పరిచిత పదాలను చదవడం (మూడక్షరాలకు మించని పదాలు చదువడంవరకే | 3.2.3 గీతాలను, పద్యాలను పాటలను, సామాన్యమైన కథలను ప్రకాశంగా చదవడం. | 3.3.3 సామాన్యమైన కథల పుస్తకాలు, బాలల పుస్తకాలను చదవడం. | 3.4.3 బాలల పత్రికలను చదవడం. | 3.5.3 వార్తాపత్రికలను తదితర ముద్రితాంశాలను చదవడం. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | పరిమితం). | | | | |
| IV లేఖనం | 4.1.1 అచ్చులు, హల్లులు, ఒత్తులు, ద్విత్వ, సంయుక్తాక్షరాలను చూసి రాయడం. | 4.2.1 పదాలను, వాక్యాలను చూసిరాయడం. | 4.3.1 అక్షరాలు రాసేప్పుడు విశిష్టమైన రూపు, క్రమం అక్షరాల మధ్య పదాలమధ్య సమదూరం ఉండునట్లు చూడడం. | 4.4.1 స్పష్టంగా సౌష్ఠవంతో రాయడం. | 4.5.1 సరైన రూపంతో వ్యవధానాన్ని పాటించి రాయడం. |
| | 4.1.2 అచ్చులు, హల్లులు, ఒత్తులు, ద్విత్వ సంయుక్తాక్షరాలను (ఉక్తలేఖనం) రాయడం. | 4.2.2 సామాన్యమైన పరిచిత పదాలకు ఉక్తలేఖనం రాయడం. | 4.3.2 అపరిచిత పదాల ఉక్తలేఖనం తీసుకోవడం. | 4.4.2 సామాన్యమైన విరామ చిహ్నాలను పాటిస్తూ ఉక్తలేఖనం రాయడం. | 4.5.2 అన్నివిరామచిహ్నాలను పాటిస్తూ ఉక్తలేఖనం రాయడం. |
| V భావావగాహనం (శ్రవణ పఠనాల ద్వారా) | 5.1.1 మాట్లాడుతున్న అంశంలోని సామాన్య భావాలను జ్ఞప్తికి తెచ్చుకోవడం. | 5.2.1 మాట్లాడుతున్న అంశంలోని, రాతలలోని, సంఘటనల క్రమాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవడం. | 5.3.1 మాట్లాడుతున్న అంశంలోని, రాతల్లోని ముఖ్యమైన భావాల్ని గుర్తించడం. | 5.4.1 మాట్లాడుతున్న అంశంలోని రాతలలోని, కారణాలు ఫలితాల మధ్య ఉన్న సంబంధాలను గుర్తించడం. | 5.5.1 మాట్లాడుతున్న అంశంలోని, రాతలలోని, (అంశాన్ని గ్రహించి స్వంత నిర్ణయానికి రావడం. |
| | 5.1.2 విన్న తర్వాత ఎవరు? ఎప్పుడు? ఎక్కడ? అనే ప్రశ్నలకు సమాధానాలివ్వగలగడం. | 5.2.2 విన్న తర్వాత ఏమిటి? ఎట్టిది? అనే ప్రశ్నలకు సమాధానాలివ్వగలగడం. | 5.3.2 విన్న లేదా చదివిం తర్వాత ఎందుకు? అనే ప్రశ్నకు సమాధానాలివ్వగలగడం. | 5.4.2 విన్న లేదా చదివిం తర్వాత ఎందువల్లనంటే ఎప్పటినుండి వంటి ప్రశ్నలకు సమాధానాలివ్వగలగడం. | 5.5.2 విన్న లేదా చదివిం తర్వాత ఒకవేళ ... తర్వాత... ఒకవేళ కాకపోతే... తర్వాత... పదాలు వచ్చే ప్రశ్నలకు సమాధానాలివ్వగలగడం. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| VI ప్రాయోగిక వ్యాకరణం | 6.1.1 పదాంతాలనుబట్టి పదాల మధ్య ఉన్న సామ్యాలను గ్రహించడం. | 6.2.1 పదారంభం, పదాంతాలనుబట్టి పదాలమధ్య ఉన్న సామ్యాలను గ్రహించడం. | 6.3.1 పదాల మధ్య ఉన్న అర్థసంబంధాన్ని గ్రహించడం. | 6.4.1 వాక్య నిర్మాణానికి సంబంధించిన ప్రాయోగికాంశాలను అవగాహన చేసుకోవడం. | 6.5.1 భాషాభాగాలకు సంబంధించిన ప్రాయోగికాంశాలను అవగాహన చేసుకోవడం. |
| VII స్వయం అధ్యయనం | 7.1.1 అందుబాటులో ఉన్న సామాన్య చిత్రకోశాలను ఉపయోగించగలగడం. | 7.2.1 అందుబాటులో ఉన్న సామాన్యమైన సచిత్ర విజ్ఞాన కోశాలను ఉపయోగించగలగడం. | 7.3.1 అందుబాటులో ఉన్న బాలల చిత్రకోశాన్ని ఉపయోగించగలగడం. | 7.4.1 అందుబాటులో ఉన్న లఘునిఘంటువులను ఉపయోగించగలగడం. | 7.5.1 అందుబాటులో ఉన్న లఘు విజ్ఞానకోశాలను ఉపయోగించగలగడం. |
| VIII భాషోపయోగం | 8.1.1 సామాన్యమైన సంస్కారసభ్యతలతో కూడిన వాక్యాలను అవగాహన చేసుకోవడం. | 8.2.1 అవధానంతో వినడం, సభ్యతతో మాట్లాడటం. | 8.3.1 బృందంలో మాట్లాడేటపుడు తనవంతు వచ్చినపుడు మాత్రమే తన అభిప్రాయాలను వ్యక్తం చేయడం. | 8.4.1 భాషలో ఉన్న సంప్రదాయ (నియత)(Formal) సంప్రదాయేతర (అనియత) (Informal) భేదాలను అభ్యసించడం | 8.5.1 సంప్రదాయ, సంప్రదాయేతర సన్నివేశాల్లో సరియైన, భాషను ఉపయోగించడం. |
| IX శబ్దజాలంలో అధికారం | 9.1.1 సుమారు 1500 శబ్దజాలంవరకు పఠనావగాహన ఆర్జించగలగడం. | 9.2.1 సుమారు 2000 శబ్దజాలంవరకు పఠనావగాహన ఆర్జించగలగడం. | 9.3.1 సుమారు 3000 శబ్దజాలంవరకు పఠనావగాహన ఆర్జించగలగడం. | 9.4.1 సుమారు 4000 శబ్దజాలంవరకు పఠనావగాహన ఆర్జించగలగడం. | 9.5.1 సుమారు 5000 శబ్దజాలం వరకు పఠనావగాహన ఆర్జించగలగడం. |

గమనిక : 9.2.1 అనే సంకేతంలో మొదటి అంకె సామర్థ్యాన్ని, రెండో అంకె తరగతిని, మూడో అంకె ఉప సామర్థ్యాన్ని సూచిస్తుంది. అంటే ఇచట (9) అనె అంకె శబ్ద జాలంలో అధికారం అనే సామర్థ్యాన్ని (2) అనే అంకె రెండో తరగతిని, (1) అనే అంకె ఉప సామర్థ్యాన్ని సూచిస్తుంది. ఇట్లే అన్ని సంకేతాలను అన్వయించుకోవాలి.

పై తొమ్మిది కనిష్ఠ ప్రమాణాలు తప్పనిసరిగా అందరు విద్యార్థులు సాధించేట్లు చూడాల్సిన బాధ్యత ఉపాధ్యాయులది. వీని సాధనకు అనుగుణమైన బోధన వ్యూహాలను ఎంపికచేసికొన్న ఉపాధ్యాయులు మాత్రమే ఈ విషయంలో కృతకృత్యులౌతారు. ఈ ప్రమాణాలు ఉన్నత తరగతులకు కూడా విస్తరించాలనే ప్రయత్నం జరుగుతోంది. అంతవరకు వీనిని ప్రాథమిక తరగతులవరకే పరిమితంచేసి వాని ప్రభావాలను పైతరగతుల్లో కొనసాగించ ప్రయత్నించాలి.

## 4.04 మాధ్యమిక, ఉన్నత పాఠశాలస్థాయిలో మాతృభాషగా తెలుగును బోధించుటలో లక్ష్యాలు-స్పష్టీకరణాలు :

ఇంతకుముందు విద్యా ప్రణాళిక గమ్యాలు విద్యాబోధన ఉద్దేశ్యాలగురించి తెల్సికొన్నాం. గమ్యం, ఉద్దేశ్యం, లక్ష్యం, స్పష్టీకరణాలంటేకూడా నిర్వచించు కొన్నాం. ప్రస్తుతం తెలుగును మాతృభాషగా, ప్రథమభాషగా బోధిస్తున్నపుడు ఉపాధ్యాయులు దృష్టియందుంచుకోవాల్సిన లక్ష్యాలు, స్పష్టీకరణాలు వివరంగా తెల్సికోవడానికి ప్రయత్నిద్దాం. ఈ లక్ష్యాలు, స్పష్టీకరణాలు 1972-73 విద్యా సంవత్సరంలో రాష్ట్ర విద్యా పరిశోధన శిక్షణ సంస్థవారు నూతన మూల్యాంకనా విధానానికి అనుగుణంగా ప్రతిపాదించిన లక్ష్యాత్మక బోధన అనే అంశంపై నిర్వహించిన సామూహిక ఉపాధ్యాయ శిక్షణా కార్యక్రమాలకోసం రూపొందించి అమలుచేసినవి. వీని ఆధారంగా నేడు మన పాఠశాలల్లో లక్ష్యాత్మక బోధన కొనసాగుతోంది. వీని నేపథ్యంలో విద్యార్థుల ప్రవేశ ప్రవర్తన (Entry behaviour), నిర్గమన ప్రవర్తన (Exit behaviour), మధ్యంతర ప్రవర్తన (In between behaviour), (Behaviour continum)లను వీనిద్వారా మదింపువేసి వారిలో ఆశించిన ప్రవర్తనా మార్పుల్ని సాధించవచ్చు. బోధన లక్ష్యాలు ఈ కిందివిధంగా ఉన్నాయి.

i) జ్ఞానం, ii) అవగాహనం, iii) వాగ్రూప అభివ్యక్తి, iv) లిఖితరూప అభివ్యక్తి, v) పఠన నైపుణ్యం, vi) భాషాభిరుచి, vii) రసానుభూతి, viii) సంస్కృతి సంప్రదాయాలు, ix) సృజనాత్మకత, x) సముచిత మనోవైఖరులు, xi) భాషాంతరీకరణం.

పై వాటిని విస్తృతంగా పరిశీలిద్దాం.

A) జ్ఞానం : knowledge

జ్ఞానం అనంతమైంది. దీంతో సమానమైన అంశం లేదు. అందువల్లే

'నహిజ్ఞానేన సదృశం' అనే సూక్తి ఏర్పడింది. అయితే జ్ఞానం అంటే ఏమిటి అన్నదాన్ని సమగ్రంగా నిర్వచించడం కష్టసాధ్యం. జ్ఞానం అంటే తెల్సినతనం. తెల్సినతనం తెలియనితనానికి భిన్నమైంది. ఏది మొదట తెలియదో, ఆ తర్వాత తెలుస్తుందో తెల్సింది స్థిరంగా ఉంటుందో అది జ్ఞానం. అంటే తెలియనితనాన్నుండి తెల్సినతనానికి తెల్సినతనాన్నునుండి శాశ్వతత్వానికి, తద్వారా ఆచరణలో ద్యోతకమయ్యేదిజ్ఞానం. ఆ కారణాన బోధన లక్ష్యాలన్నిటికి జ్ఞానం ప్రాతిపదిక. ఇతర లక్ష్యాలన్నీ ఈ జ్ఞానపునాదులపై నిర్వచింపబడతాయి. కేవలం జ్ఞానాన్ని సంపాదించడం మాత్రం సరిపోదు. దాన్ని విచక్షణతో ఉపయోగించడం, జ్ఞానపరిధుల్ని విస్తరించుకోవడం అనేవి ఈ లక్ష్యం ఆశిస్తున్నభావనలు. సాధారణంగా ఈ జ్ఞానం భావనలు (Concepts), సత్యాలు (truths), సూత్రాలు (Principles), ప్రక్రియలు (tasks) మొదలగువానికి సంబంధించింది. భాషాబోధనలో జ్ఞాన లక్ష్యాన్ని మూడు ప్రధానవర్గాలుగా పేర్కొంటారు. అవి

i) విషయజ్ఞానం.
ii) భాషాజ్ఞానం.
iii) సాహిత్యజ్ఞానం

పై మూడు జ్ఞానపరిధుల్ని వివరంగా తెల్సికొందాం.

i) విషయజ్ఞానం :

విషయానికి సంబంధించిన జ్ఞానం విషయజ్ఞానం. ఏ విషయం? పాఠ్యాం శంలోని విషయం. పాఠ్యాంశంతో సంబంధమున్న విషయం అని అర్థం. వీనిగురించి విద్యార్థులకు సమగ్రంగా తెలియాలి. విషయజ్ఞానంలో పాఠ్యాంశ విషంయంతోబాటు

అ : పాఠ్యాంశ పూర్వకథ, పూర్వగాథ, పూర్వాంశం.
ఆ : పాఠ్యాంశ పరకథ, పరగాథ, పరాంశం.
ఇ : రచయిత, కవి వివరాలు.
ఈ : పాఠ్యసంబంధ విశేషాంశాలు.
ఉ : పాఠంలో ప్రస్తావించబడ్డ అదనపు అంశాలు (References).

ప్రధానాలు. వీనిద్వారా పాఠ్యాంశంపై విద్యార్థికి సమగ్ర దృక్పథం ఏర్పడుతుంది. ప్రధానంగా ఉన్నత తరగతుల్లోని పాఠ్యాంశాలు వివిధ రచయితల రచనల్లోనుండి

ఎంపికచేయబడతాయి. అందువల్ల ఆయా అంశాల పూర్వాపరాలు తె
విషయానికి సమగ్రతరాదు. వివిధ రచనలు ఆయాకాలాల్లో రచిం
ఉంటాయి. రచనా విధానాల్లో కూడా భేదముంటుంది. వీనిని పాఠ్య
రచయిత పరిచయం, పూర్వకథా పరిచయం, విశేషాంశాలు, అదనపు స
అనే రూపంలో తెలియజెప్పాలి. తద్వారా విద్యార్థులకు పాఠ్యాంశంపై
దృక్పథం ఏర్పడుతుంది. లేకపోతే పాక్షికమైన జ్ఞానమే విద్యార్థికి అలవడ
అందువల్ల ఉపాధ్యాయులు ఈ జ్ఞాన భాగంలోని వివిధాంశాలను ప్ర
దృష్టియందుంచుకోవాలి.

ii) భాషాజ్ఞానం :

జ్ఞాన లక్ష్యంలో రెండవ ప్రధానభాగం భాషాజ్ఞానం. అంటే
సంబంధించిన జ్ఞానం. భాషలోని మౌలికాంశాలకు సంబంధించిన
ధ్వని, ఉచ్చారణ, వర్ణం, వర్ణక్రమం, పదం, వాక్యం, పదభేదాలు, వాక్య
సామాన్య వ్యాకరణాంశాలు, నుడికారం, జాతీయం, లోకోక్తి మొదలై
జ్ఞానంలో లోని భావనలు. వీనికి సంబంధించిన సమగ్రరూపమే భాషా
ఉపాధ్యాయులు మొదట విద్యార్థులకు ధ్వనికి సంబంధించిన మెల
చెప్పాలి. ధ్వన్యుత్పత్తి విధానాన్ని, ఉత్పత్తికి సహకరించే అవయవ
గూర్చి, ఉచ్చారణా విధానాన్నిగూర్చి, చెప్పాలి. తాము స్పష్టంగా ఉ
విద్యార్థులచే అనుకరణపద్ధతిలో ఉచ్చరింపజేయుట ద్వారా వారికి
ఉచ్చారణలకు సంబంధించిన జ్ఞానం అలవడుతుంది. తర్వాత విద్యార్థుల
లిఖితరూపం వర్ణమని, అక్షరమని పరిచయం చేయాలి. ధ్వనికి, లిపిరూ
వర్ణానికి మధ్య ఉచ్చారణలో భేదమున్న సందర్భాలను కూడా ప
చేయాలి. అంటే మాట్లాడేధ్వనులకు రాసే రూపాలకు మధ్యగల
చెప్పాలి. లిపి రూపాలలోని సామ్యాలు, భేదాలు పరిచయం చేసి వ
తెల్పాలి. అక్షరక్రమానికి సామాన్యంగా నిఘంటువుల్లోని అక్షర
స్వీకరిస్తారు. తద్వారా విద్యార్థులు అవసరమైనపుడు నిఘంటువులను ప
సంప్రదించగల్గుతారు. ధ్వని, ఉచ్చారణ, వర్ణం, వర్ణక్రమాలవే ప్ర
భావనల తర్వాత పరిచయం చేయాల్సింది పదం. పదం కొన్ని
సముదాయం. అర్థవంతం. భాషా వ్యవహర్తల భావవ్యక్తీకరణకు
ప్రాతిపదిక. పదజాలం ఎంత సుసంపన్నంగా ఉంటే వ్యవహారం
సుసంపన్నం అవుతుంది. విద్యార్థులు పదాలపై అధికారం సంపా
లక్షలు సంపాదించినవారు లక్షాధికారులైనట్లు పదాలు స్వంతంచేసికొ

పదాధికారులౌతారు. పద నిర్మాణం, పదం ఉత్పత్తి, పదం స్వరూపం, పదం స్వభావం, పదం అర్థం, అర్థభేదం, సమానార్థకం మొదలైన భావనల్ని వివరించాలి. వైయాకరుణుల ననుసరించి పదం ప్రాతిపదిక, ప్రత్యయాల సమాహారరూపం. రాముడు అనే పదంలో 'రామ' శబ్దం ప్రాతిపదిక. 'డు' ప్రత్యయం. 'చేయుచున్నాడు' అనే పదంలో 'చేయు' ప్రాతిపదిక. 'ఉన్నాడు' ప్రత్యయం ఇట్లా ప్రతిపదంలోని ప్రాతిపదిక రూపాన్ని, దానిపై చేరిన ప్రత్యయరూపాన్ని విడదీసి విద్యార్థులకు వివరించాలి. దానికి వారితో పదనిర్మాణం తెలుస్తుంది. పదోత్పత్తికి సంబంధించిన వివరాలుకూడా తెల్పాలి. 'దాశరథి' అనే పదం 'దశరథుడు' అనే పదంనుండి, 'గ్రామ్యం' అనే పదం 'గ్రామం' నుండి, 'సౌలభ్యం' అనే పదం 'సులభం'నుండి ఉత్పత్తి అయినట్లుగా చెప్పాలి. 'గురువు-గౌరవం-గౌరవ్యులు' ఇలా ఒక మూలపదంనుండి ఇతర రూపాలు ఎలా ఉత్పత్తి అవుతాయోకూడా తెలపాలి. పదానికి మొదటచేరే ఉపసర్గలు (Prefixes) కూడా ఉంటాయని. ఉదా: శాంతి - ప్రశాంతి. రాగం - పరాగం, గుణం - సుగుణం అని చెప్పాలి. ఇట్లు పదాల ఉత్పత్తిని పరిచయంచేసి వాని స్వభావాన్ని చెప్పవచ్చు. ఉదాహరణకు 'అల' అనే పదంలో 'అ' ఉచ్చారణ లోపారల్లోనుండి జరిగితే 'ల' ఉచ్చారణ ముఖకుహరంలో జరుగుతుంది. ఇలా ఏర్పడ్డ 'అ-ల' అనే పదం సముద్రంలోని కెరటాలను సూచిస్తుంది. అల సముద్రంలోపలనుండి బయలుదేరి ఒడ్డుకు పెద్ద శబ్దంతో తాకి విడిపోతుంది. ఇలానే ఇఱుకు-మలుపు పదాలు వాని అర్థంలోని స్వభావాన్ని తెల్పుతాయి. ఇట్లు ప్రతి పదానికి ఉన్న స్వభావాన్ని విశ్లేషించే ప్రయత్నం చేయవచ్చు.

ఇక పదాలు ఇచ్చే అర్థాలను పరిశీలిద్దాం. పదానికి మరో పదం ఎప్పుడూ సమంకాదు. ఉదాహరణకు 'మరణించు' అనే పదానికి 'చనిపోవు' అని అర్థం చెప్తాం. ఇవి భావనాపరంగా సమం కాని ఇవి సమానార్థక పదాలు కావు. కారణం ఈ పదాలను అన్ని సన్నివేశాల్లో సమానంగా ఉపయోగించలేం అందువల్ల ప్రతి పదానికి తనదేయైన వ్యక్తిత్వముంటుందని, ప్రపంచంలోని మానవుల్లో ఒకరి పోలికలు మరొకరిలో ఉన్నప్పటికీ, ఒకరు మరొకరితో ఎలా సమానం కారో అట్లే భాషలోని పదాలుకూడా ఒకదానితో ఒకటి సమానంకావని చెప్పాలి. ప్రతి పదానికి ఒక అర్థపరిధి ఉంటుంది. ఉదాహరణకు 'చనిపోవు' అనే పదం కనిష్ఠార్థంలో వాడతాం. 'కుక్క చనిపోయింది' అంటాం గాని కుక్క మరణించింది లేదా కీర్తిశేషురాలైంది అనంకదా! అయినా మరణించు, చనిపోవు, దివంగతులగు మొదలైన పదాలన్నీ మృతకళేబరమగుట అనే

ఒకే భావనను స్ఫురింపజేస్తాయి. ఈ పదాలన్నీ వేరువేరు సందర్భా ఉపయోగపడతాయి. ఏ పదాన్నైనా దాని సందర్భాన్ని వీడి మరో ఉపయోగిస్తే అహేతుకమవుతుంది. వ్యవహారంలో వెగటు కల్గుతుంది. కారణాలవల్ల ఒక పదానికి ఈ పదం అనే అర్థంచెప్పకుండా వాని ఉప సందర్భాలను వివరించాలి. ఒక పదానికి బదులుగా ఆ సందర్భ మరోపదాన్ని ఉపయోగించడంలో జాగ్రత్త వహించాలని చెప్పాలి. సందర్భాల్లో అర్థంలో విపరిణామంకూడా జరుగుతుందని, మరో భాషాప కూడా మనభాషలో విరివిగా చేరిపోయాయని చెప్పాలి. హిందీలో 'ఉప శబ్దానికి 'నవల'యని తెలుగులో 'ఉపన్యాస'మంటే 'వక్తృత్వం ద అభివృద్ధిచెందిన రూపం' అని చెప్పాలి.

ఈ భావనలతోబాటు సమానార్థకపదాలు, విరుద్ధార్థకపదాలు : చెప్పాలి. సత్యం-అసత్యం. ఇవి విరుద్ధభావాలు. ఈ భావన అన్ని సంద వర్తించకపోవచ్చు కేవలం Abstract Nounsకు మాత్రమే విరుద్ధార్థభా చెప్పుకోవాలి. ఈ విషయంలో జాగ్రత్తవహించాలి. లేకపోతే లిం విశేషణాలు మొదలైనవానికికూడా విరుద్ధార్థాలు చెప్పవల్సి వస్తుంది. ప్ర స్వతంత్రంగాను, సందర్భంలోనూ ఎలాంటి అర్థభేదానికి, అర్థస్ఫు నోచుకొంటుందో కూడా చెప్పాలి. ఈ పదాల్లో భాషాభాగాలు మె వానితోబాటు తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్య పదరూపాలను తె ఇతర భాషాపదాలు, వాని అర్థపరిమితులు కూడా తెల్పాలి. ఇట్లు మొదట అపరిచితాలై, తర్వాత పరిచితాలై, సుపరిచితాలై, చిరపరి విద్యార్థులతో శాశ్వతంగా ఉండిపోయినప్పుడే వ్యవహర్తలుగా వారి : సంపద సుసంపన్నమవుతుంది. విద్యార్థులు ఈ సంపదవార్జిం ఉపాధ్యాయులు కృషిచేయాలి. దీనినాధారంగా జేసికొని విద్యార్థుల : స్ఫృహను (Word awareness) అంచనావేయవచ్చుకూడా.

పదం తర్వాత భాషాజ్ఞానంలో పరిచయం చేయాల్సిన జ్ఞానభాగం వాక్యం సంపూర్ణ భావ ప్రకటనకు ప్రతి రూపం. వాక్యనిర్మాణం, వాక్య వాక్యాంతరీకరణం మొదలైన అంశాలు విద్యార్థులకు పరిచయంకావాలి. వాక్యాలు సాధారణంగా కర్త-కర్మ-క్రియ అనే నిర్మాణం కల్గిఉంటాయి. వాక్యం కర్త-క్రియ-కర్మ క్రమంలో ఉంటుంది. మన భాషలో క్రి వాక్యాలు, క్రియ సహిత వాక్యాలు, క్రియాదివాక్యాలు, క్రియామధ్యమ వ క్రియాంతవాక్యాలు కనబడతాయి. వీనికి సంబంధించిన వివరాలు

వాక్యాల్లో సామాన్యవాక్యాలు, సంయుక్తవాక్యాలు, సంశ్లిష్టవాక్యాలు కూడా ఉంటాయి. సంయుక్త వాక్యాలను, సంశ్లిష్టవాక్యాలను సామాన్యవాక్యాలుగా విభజించే సామర్థ్యం విద్యార్థులకు కల్గించాలి. ఈ వాక్యాల్లోని సామాన్యవాక్యం (సాధారణవాక్యం), ప్రశ్నవాక్యం, ఆశ్చర్యవాక్యాలనుకూడా పరిచయంచేయాలి. ప్రత్యక్షవాక్యాలు, పరోక్షవాక్యాలు, కర్తరీవాక్యాలు, కర్మణీవాక్యాలు మొదలైన వివరాలు తెల్పాలి. వాక్యాంతరీకరణం చేయగల్గిన సామర్థ్యం విద్యార్థులకు కల్గి వాక్య క్రీడలు చేయుగల్గిననాడు వారికి ఈ జ్ఞానభాగంపై అధికారం లభిస్తుంది.

వాక్యం తర్వాత విద్యార్థులు తెల్సికోవాల్సింది సామాన్య వ్యాకరణాంశాలు. వీనిలో భాషాభాగాలు ప్రాథమిక తరగతుల్లోనే ప్రస్తావించబడతాయి. పై తరగతుల్లో సంధి, సమాసాలు మొదలైనవానిని పరిచయంచేయాలి. తద్వారా వారికి పదబంధ నిర్మాణం తెలుస్తుంది. పదకాఠిన్యత తొలుగుతుంది. సామాన్య వ్యాకరణాంశాల తర్వాత విద్యార్థులు తెల్సికోవాల్సినవి జాతీయాలు, లోకోక్తులు. ఒక జాతియందు అనూచానంగా వాడుకలో ఉన్న ఒకానొక పదబంధం జాతీయం. దీన్నే నుడికారం అనికూడా వ్యవహరిస్తారు. నుడికారం అంటే మాట చమత్కారం. కొండంత భావనను ముత్తెమంత పదంలో ఇమిడ్చి చెప్పే స్వభావం కలవి జాతీయాలు, నుడికారాలు. వీని ప్రయోగం, పుట్టుకల గురించి విద్యార్థులకు తెలియజెప్పాలి. వీనిని విరివిగా నిజజీవిత సన్నివేశాల్లో ఉపయోగించేట్లు చూడాలి. వీనితోబాటు లోకోక్తులుకూడా. ఇవి వాక్యరూపంలోని సాధారణీకరణాలు. వీనిని సామెతలు, నానుడులు అని కూడా వ్యవహరిస్తారు. ఇవికూడా జాతీయాల వలెనే కొండంత భావాన్ని చెప్పే వాక్యరూపాలు.

ఇట్లు ధ్వని, 'ఉచ్చారణ, వర్ణం, వర్ణక్రమం, పదం, వాక్యం, జాతీయాలు, లోకోక్తులు, సామాన్య వ్యాకరణాంశాలు' మొదలైన వాని సమాహార రూపమే భాషాజ్ఞానం. విద్యార్థి వ్యవహారశీలిని భాషాజ్ఞానమే వెన్నుతట్టి నిలబెడుతుంది. ఆతడి భావ వ్యక్తీకరణాన్ని లోపరహితం చేస్తుంది.

iii) సాహిత్యజ్ఞానం :

జ్ఞాన లక్ష్యంలో మూడవ ప్రధాన విభాగం సాహిత్యజ్ఞానం. ఇది సాహిత్య లక్షణాలను తెలిపి స్వంతం చేస్తుంది. దీనిలో శైలి, శయ్య, రీతి, రసం, అలంకారాలు, పాకం, ఛందస్సు, గద్యపద్య నాటక ప్రక్రియలు ప్రధానాలు.

వీనికి సంబంధించిన సంపూర్ణజ్ఞానమే సాహిత్యజ్ఞానం.

శైలి, రీతి రెండున్నూ పరస్పర సంబంధితాంశాలే. ప్రతి ర తనదైన రీతిలో, శైలిలో రాస్తాడు. ప్రాచీనులు ఒక విధానాన్ని అన ఆధునికులు మరో విధానాన్ని అనుసరిస్తారు. వీరు కథనశైలి, వివర వ్యాఖ్యానశైలి అని వేరువేరు పంథాల్లో రాస్తారు. ఒకరు చిన్న పదాల్లో రాస్తే మరికొందరు జటిల సమాస బంధుర రచనచే ఆయా రచయితల, కవుల రచనా శిల్పాన్ని విద్యార్థుల కెరింగిం శైలీ భేదాలను, వాని ప్రాధాన్యతలను తెల్పి తమదేమైన శైలిని విదా అలవరచుకొనేట్లుచేయాలి. వీనితోబాటు రచనల పాకాన్ని గూర్చి వివరిం చాలా సులభమైన రచనల్ని ద్రాక్షా పాకంలోని రచనలని, కొంత కఠి రచనల్ని కదలీపాకంలోని రచనలని, చాలా కఠినమైన రచనల్ని నారికేళపాక రచనలని సాహిత్య లాక్షణికులు పేర్కొంటారు. కరుణశ్రీ ర ద్రాక్షాపాకానికి, పోతన రచనలు కదలీపాకానికి, కృష్ణదేవరాయల నారికేళపాకానికి ఉదాహరణలుగా చెప్తారు. పాఠ్యపుస్తకాల్లో ఎంపి గద్య, పద్యరచనలు వీనిలో ఏదో ఒక కోవకు చెందుతాయి. అం వీని పరిచయం అవసరం. దీని తర్వాత అలంకారాల గురించి చె అర్థాన్ని ఆశ్రయించిన అలంకారాలు అర్థాలంకారాలని, శబ్దాన్ని ఆశ్రయి అలంకారాలు శబ్దాలంకారాలని చెప్పాలి. ఆధునిక, ప్రాచీన సాహి ఈ అలంకారాలు ఉపయోగించే సందర్భాలను కవిసమయాలు అం కవిసమయాలు ప్రసిద్ధాలు. వీనిని రచనల్లో కవులంతా ప్రయోగిస్తారు. భాషా ప్రభావాలవల్ల కవిసమయాల్లో కొత్త ప్రయోగాలుకూడా చేరిపోతువ ఈ విధంగా పద్య, గద్య పాఠాల్లోని అలంకారిక సన్నివేశాలను విద్యా పరిచయంచేయాలి. నిత్య జీవిత వ్యవహారంలో చెప్పుకొనే పోలికలు అలంకారాలని విశదంచేయాలి. అలంకారాలతోబాటు పరిచయం చేయ సాహిత్యజ్ఞానభాగం రసం. రసాలు నవవిధాలు శృంగారం, హాస్యం, కః వీరం, అద్భుతం, శాంతం, రౌద్రం భయానకం, భీభత్సం. మరికొ భక్తిని కూడా రసమని వ్యవహరించారు. మన పాఠ్యాంశాల్లో కః వీరం, హాస్యం, అద్భుతరసాలు పోషింపబడతాయి. వీని లోతట్టు భ పరిచయంద్వారా విద్యార్థులు రసానందం పొందగల్గుతారు.

రసంతోబాటు విద్యార్థులకు పద్యలక్షణమైన ఛందస్సు లోని అం మాత్ర, లఘువు, గురువు, గణం, పద్యభేదం, యతి, ప్రాస

పరిచయంచేయాలి. వీనితోబాటు సాహిత్యజ్ఞానంలో సాహితీ ప్రక్రియాభేదాలైన గద్యం, పద్యం, నాటకాల లక్షణాలను తెల్పి ఒక ప్రక్రియనుండి మరో ప్రక్రియలోకి అంశాన్ని ఎలా పరివర్తనం చేయవచ్చో తెలపాలి. పరివర్తన మెలకువలు నేర్పాలి.

ఇట్లు విషయ, భాషా, సాహిత్య జ్ఞానాలను వారివారి తరగతిస్థాయికనుగుణంగా, పాఠ్యాంశానికి అన్వయించి పరిచయం చేయాలి. విషయజ్ఞానం విద్యార్థులకు విషయంపై అధికారాన్ని కల్గిస్తే, భాషాజ్ఞానం భాషపై, సాహిత్యజ్ఞానం సాహిత్యంపై అధికారాన్ని కల్గిస్తాయి. ఇలా మూడింటి సమాహార రూపమే సంపూర్ణజ్ఞానం. ఈ జ్ఞానాల్లో విషయజ్ఞానానికి అన్నివిధాలైన పాఠాల్లో, భాషాజ్ఞానానికి గద్య, పద్య, నాటక, వ్యాకరణపాఠాల్లో, సాహిత్యజ్ఞానానికి ప్రధానంగా పద్య, నాటక పాఠాల్లో ఉపాధ్యాయులు ప్రాధాన్యతనీయాలి. ఈ జ్ఞానాన్ని విద్యార్థులు సంపాదించినట్లు తెల్సికోవడానికి రెండు స్పష్టీకరణాలు పేర్కొనబడ్డాయి. ఈ రెండు స్పష్టీకరణలకు విద్యార్థి ప్రతిస్పందించిన విధం ఈ మూడు విభాగాల్లో విద్యార్థి సంపాదించిన జ్ఞానానికి ప్రతీక. విద్యార్థులు అవసరమైన సందర్భాల్లో

i) ఆయా విషయ, భాషా, సాహిత్యాంశాలను జ్ఞప్తికి తెచ్చుకొంటారు.
ii) ఆయా విషయ, భాషా సాహిత్యాంశాలను గుర్తిస్తారు.

ఈస్పష్టీకరణాల్లో మొదటిదైన జ్ఞప్తికి తెచ్చుకోవడం అనేది అమూర్త (abstract)సన్నివేశాల్లో జరుగుతుంది. ఉపాధ్యాయులడిగిన ప్రశ్నలకు విద్యార్థులు తమ మెదడుపొరల్లో దాచుకొన్న సమాచారాన్ని నెమరువేసుకొని నివేదించగలగాలి. ఇది విద్యార్థుల జ్ఞాపకశక్తి (memory power)కి నిదర్శనం. అయితే జ్ఞాపకశక్తి లేనివారికి, తక్కువగా ఉన్నవారికి జ్ఞానం లేదనికాని, జ్ఞానం తక్కువ అనిగాని చెప్పడం అన్నివేళలా సాధ్యంకాదు. కొన్ని పర్యాయాలు వెంటనే, మరికొన్ని పర్యాయాలు కొంతసమయం తీసికొని, కొన్ని సందర్భాల్లో చాలాసమయం తీసికొని, మరికొన్ని సందర్భాల్లో అసలే జ్ఞాపకంరాక, ఆ తర్వాత జ్ఞాపకం రావడంకూడా జరగవచ్చు. ఈ సన్నివేశాలన్నిటిలో జ్ఞానం ఉంటుంది కాని అది సద్యస్ఫూర్తిలో లేకపోవచ్చు. ఐతే జ్ఞప్తి మొదట తాత్కాలికంగా, మధ్యలో (స్థిరపడేవరకు) మార్పులకు లోనవుతూ, చివరకు శాశ్వతమౌతుంది. ఉదాహరణకు సంవత్సరం చివర పరీక్ష రాసింతర్వాత పాఠ్యపుస్తకంలోని పాఠాల్లోనే ప్రశ్నిస్తే విద్యార్థులకు జ్ఞప్తికి రాకపోవచ్చు. ఈ

సన్నివేశంలో పాఠ్యాంశాలు కేవలం పరీక్షనాటివరకే తాత్కాలికంగా విద్యార్థ
ఉన్నాయని చెప్పవచ్చు. ఒక సందర్భంలో పరిచయంచేసిన 'చనిపో
అనే పదానికి, మరో సందర్భంలో పరిచయమైన మరణించు, కీర్తిశేషు
మొదలైన పదాల్లో మొదటిదానిని వదిలి విద్యార్థులు తర్వాతి పదాలను వె
తీసికొని వెళ్తారు. తర్వాత తెల్సికొన్న పదాన్నే విరివిగా ఉపయోగి
ప్రయత్నంచేస్తారు. అంటే పదజాలం కొత్తది వచ్చి చేరినకొలది
పదజాలాన్ని వదిలివేస్తారన్న మాట. చెరువులోకి కొత్త నీరువస్తూ పాత
వెళ్ళిపోతున్నట్లు పదజాలం మార్పుచెందుతూవున్న జ్ఞాపకంగా ఉంటు
భాషాజ్ఞానానికి సంబంధించిన జ్ఞానభాగంలో ఇది అందరికి కొంతమే
అనుభవంలోనిదే. ఇక సాహిత్య జ్ఞానంలో పరిచయంచేసిన అంశాలు విద్యా
మనస్సుల్లో హత్తుకపోతాయి. అందువల్ల ఇవి శాశ్వత జ్ఞప్తిలో ఉంటా
చిన్నప్పుడు చదువుకొన్న ఒక పద్యం, ఆకట్టుకొన్న ఒక సన్నివేశం చిరకా
వెంట ఉంటుంది. ఇది శాశ్వతజ్ఞప్తి. ఇలా విషయజ్ఞానం కొంతకా
మాత్రమే జ్ఞప్తిలో ఉంటే, భాషాజ్ఞానం నవనవోన్మేషంగా, సాహిత్యజ్ఞా
శాశ్వతంగా వ్యక్తుల్లో నిలిచియుంటుందని చెప్పవచ్చు. జ్ఞానసంపన్నుడైనప్పు
కేవలం జ్ఞప్తికి తెచ్చుకోలేనంత మాత్రాన జ్ఞానం లేదనిగాని, జ్ఞ
తెచ్చుకొన్నంత మాత్రాన సంపూర్ణజ్ఞానం కలవాడనిగాని వ్యాఖ్యచేయలే
జ్ఞాపకశక్తి తక్కువగా ఉన్నవారుకూడా కొంత సమయం లభిస్తే సరిం
సమాధానాన్ని వెతుక్కొని చెప్తారు. ఇది ఒక విధంగా ప్రశ్నల్లో రిక్తపూర
వంటిది.

ఇక రెండో స్పష్టీకరణం. విద్యార్థులు ఆయా సందర్భాల్లో గుర్తిస్తారు. ఒక మూర్తభావన (concr ete) విద్యార్థుల ముందున్న నాలుగైదు సన్నివేశా
సరియైన సమావేశాన్ని గుర్తిస్తారన్నమాట. ఒక విధంగా బహుళ సమా
ప్రశ్నల్లో సరియైన సమాధానాన్ని విద్యార్థులు గుర్తించడం ఈ స్పష్టీకరణ
భాగం. ఈ గుర్తింపు వివిధ సన్నివేశాల్లో జరుగుతుంది. గుర్తింపు
జ్ఞానేంద్రియం పాత్ర కూడా ఉంటుంది. ఆకృతి మొదలైన అంశాలు దీ
ప్రధానాలు. ఉదాహరణకు చిన్నపిల్లలు చాక్లెట్‌ను గుర్తిస్తే తర్వాత ద
అదే మాదిరి వస్తువుల్లో కూడా సులభంగా గుర్తిస్తారు. ఏకలక్షణా
ఏకకాలికాలైన అంశాలమధ్య గుర్తింపు ఆలస్యమవుతుంది. విలక్షణాంశ
గుర్తింపు సులభమవుతుంది. ఈ కారణాన ఏ సందర్భాల్లో గుర్తింపు ఉం
దాన్నిబట్టి దాని తీవ్రత తెల్సికోవచ్చు. అన్ని సన్నివేశాల్లోకూడా త్వర

సముచితంగా గుర్తించగల్గడ విద్యార్థుల [illegible]
ఈ గుర్తింపులో కొంతమేరకు జ్ఞప్తికూడా చేరి ఉంటుందని కొందరి అభిప్రాయం. జ్ఞప్తి, గుర్తింపు రెండూ ఒకే తీవ్రతతో పనిచేస్తే జ్ఞానలక్ష్యం సాధించబడినట్లే. చిరపరిచితాలను త్వరగా గుర్తించడం, పరిచితాలను కొంత సమయం తీసికొని గుర్తించడం, అపరిచితాలను సందర్భించెబితే చాలా సమయం తీసికొని గుర్తించడం నిత్యజీవితంలో జరిగేదే. అందువల్ల ఈ రెండు స్పష్టీకరణాలద్వారా విద్యార్థుల జ్ఞానసంపత్తి లోతుపాతుల్ని అంచనావేయడానికి వీలవుతుంది. ఈ రెండు స్పష్టీకరణాల్లో ఆయా అంశాలు విద్యార్థుల స్వంతమైన తర్వాత వాటిపై స్థిరమైన అభిప్రాయం ఏర్పరచుకొంటారు. స్థిరపరచుకోవడం జరిగింతర్వాత ఆ అంశంలో ఇక మార్పులు చేర్పులు ఉండకపోవచ్చు. అందువల్ల విద్యార్థులు స్థిరపరచుకొంటారనే మరో స్పష్టీకరణంకూడా ఈ లక్ష్యానికి చేర్చవచ్చని కొందరు విద్యావేత్తల అభిప్రాయం.

ఇట్లు భాషా, విషయ, సాహిత్య జ్ఞానాలను విద్యార్థులు జ్ఞప్తికి తెచ్చుకొని, గుర్తించి స్థిరపరచుకోగల్గితే ఆయా అంశాలు వారికి స్వంతమయ్యాయని చెప్పవచ్చు.

(B) అవగాహనం :

భాషాబోధన లక్ష్యాల్లో రెండవలక్ష్యం అవగాహనం. అంటే అర్థంచేసికోవడం. సంపాదించిన వివిధ జ్ఞానాంశాలను అర్థంచేసికోవడం. జ్ఞప్తికి తెచ్చుకోవడం, గుర్తించడం, స్థిరపరచుకోవడం జరిగింతర్వాత జరిగే లోతైన మనోక్రియ ఈ లక్ష్యంయొక్క ప్రతిస్పందన. విద్యార్థులు ఈ లక్ష్యాన్ని సాధించారని చెప్పడానికి వారు అర్థంచేసికొన్న తీరును ఈ కింది స్పష్టీకరణాలు విశదంచేస్తాయి. ఆ స్పష్టీకరణాలను తెల్సికొందాం.

i) విద్యార్థులు ఆయా అంశాలను (విషయ, భాషా, సాహిత్య) అవసరమైనపుడు ఉదహరిస్తారు.

ఉదహరించడం అన్ని వ్యవహారాల్లో జరుగుతుంది. అంటే ఇది Reference చెప్పడంకావచ్చు. మరో సన్నివేశాన్ని చెప్పడం కావచ్చు. ఉదాహరణకు సవర్ణదీర్ఘసంధికి ఒక ఉదాహరణ చెప్తే, మరో ఉదాహరణ ఇవ్వగల్గడం ఈ స్పష్టీకరణం పరిధిలోకి వస్తుంది.

ii) విద్యార్థులు ఆయా అంశాల సందర్భాలను వివరించి వ్యాఖ్యచేయగల్గుతా

పాఠ్యాంశాల్లో సాధారణంగా ఒక పాత్ర వ్యక్తీకరించిన భావాలు, కవి రచయిత చేసిన సాధరణీకరణ వాక్యాలు సందర్భం చెప్పడానికి స్వీకరిస్తా ఈ మాటలు ఎవరు, ఎప్పుడు, ఎవరితో, ఎందుకన్నారు. వీని అర్థమేమిఁ అనే వివిధాంశాల పూర్వాపరాలు చెప్పడం సందర్భసహిత వ్యాఖ్యచేయడంలోః ప్రధాన భావం.

iii) విద్యార్థులు ఆయా అంశాల్లోని సామ్యభేదాలను చెప్పగల్గుతారు.

పాఠ్యాంశాల్లోని వివిధ అంశాలమధ్య పోలికల్ని, భేదాల్ని చెప్పడం ఈ స్పష్టీకరణం ఆశించే ప్రవర్తనామార్పు. ఈ సామ్యభేధాన్ని పదాల్లో, అర్థాల్ల అలంకారాల్లో ప్రధానంగా సాధించవచ్చు.

iv) విద్యార్థులు పదాలను స్వంతవాక్యాల్లో ఉపయోగించి చెప్పగల్గుతారు.

ఈ స్పష్టీకరణ ప్రధానధ్యేయం పద ప్రయోగ దక్షత సంపాదించడం పదాలను విద్యార్థులు సాధారణంగా ఈ కిందివిధంగా ప్రయోగించ అవకాశాలున్నాయి.

అ : పుస్తకంలోని వాక్యాన్నే ఎత్తిచెప్పడం. (ఇది కేవలం జ్ఞప్తి మాత్రమే)

ఆ : ఉపాధ్యాయులు చెప్పిన మాదిరి వాక్యాన్నే చెప్పడం. (ఇది కేవలం జ్ఞప్తి మాత్రమే)

పై రెండు సందర్భాల్లోని వాక్యాలుకూడా ఉద్ధరణ వాక్యాలే.

ఇ : పై రెండు వాక్యాలకు అనుకరణ వాక్యం చెప్పడం. (కొంతమేరకు మెరుగైనది)

ఈ : విద్యార్థి స్వతంత్ర సన్నివేశంలో పదాన్ని వాక్యంలో ఉపయోగించడం (అవగాహనం)

నాల్గో విధమైన పద ప్రయోగశక్తిని ఆశించేదే అవగాహనం. స్వంతవాక్యాల రాయగల్గిన శక్తిని విద్యార్థులు ప్రదర్శించినపుడు మాత్రమే విద్యార్థుల సంబంధిత అంశాన్ని పూర్తిగా అర్థంచేసికొన్నారని చెప్పొచ్చు.

v) విద్యార్థులు ఆయా అంశాలమధ్యగల సంబంధ సామ్యాలను స్థాపిస్తారు.

ఒకటికన్న ఎక్కువ అంశాలమధ్యగల సారూప్యతను, లక్షణాలను పరిగణి

ళ్లోకి తీసికొని వానిమధ్యగల సంబంధాలను (జంటపదాల్లో) స్థాపించడం ఈ స్పష్టీకరణం ప్రధాన భావన. అంటే రచన, రచయిత, ఉదాహరణ, వ్యాకరణ సూత్రాల మధ్యగల సంబంధాలను సూచించి వానిని వివరించగల్గినపుడు విద్యార్థులకు ఆయా అంశాలు అర్థమైందని చెప్పవచ్చు.

vi) *విద్యార్థులు వివిధాంశాల్లో లోపాలున్న, దోషాలున్న కనుగొని సరిచేస్తారు.*

దోష సవరణం అవగాహనంలో ఒక స్పష్టీకరణం. ఇవ్వబడిన పదాల్లో, వాక్యభాగాల్లో, వాక్యాల్లో, అంశాల్లోని దోషాలను కేవలం కనుగొనడం మాత్రమే చేస్తే అది జ్ఞానమవుతుంది. అలాగాక ఆ దోషాల్ని సవరించగల్గితే విద్యార్థులకు ఆ అంశంపై పూర్తి అవగాహన ఉంది అని చెప్పవచ్చు. ఈ భావనను ఒకే అంశంలోగాని, వివిధ అంశాల మధ్యగాని నిర్వహించవచ్చు.

vii) *విద్యార్థులు అపరిచిత పద్య, గద్య భాగాల ప్రధాన భాగాలు చెప్పగల్గుతారు.*

ప్రస్తావించిన అంశానికి సంబంధించిన ప్రధానభాగాన్ని విద్యార్థులు ఈ స్పష్టీకరణంలో చెప్పగల్గాలి. జ్ఞాన లక్ష్యంలో పరిచయం చేసిన వివిధాంశాలు విద్యార్థుల స్వంతమయ్యాయని చెప్పడానికి దీనివల్ల వీలుకల్గుతుంది. ఇందు ఊహించడంకన్న ఖచ్చితంగా చెప్పడానికే ప్రాధాన్యత. ఊహించి చెప్పింది ఈ లక్ష్యపరిధిలోకి రాదు.

viii) *విద్యార్థులు సందర్భోచితంగా పదాలను ఎన్నుకొంటారు.*

విద్యార్థులు సాధారణ, విశిష్ట వ్యవహారాల్లో సందర్భానుగుణంగా పదాలను ఎంపికచేసికోవడం ఈ స్పష్టీకరణం ప్రధానభావం. అన్నివేళలా తమ వ్యవహారంలో కృత్రిమంగాగాక అత్యంత సహజంగా పదాల ఎంపిక జరగాలి. సద్యోభాషణం, సద్యోవక్తృత్వం, సద్యోపన్యాసం మొదలైన సందర్భాల్లో పదాల ఎంపిక ఎల్లరూ అంగీకరించే పద్ధతిలో ఉండగల్గినపుడే ఈ స్పష్టీకరణం సాధించబడినట్లు పేర్కొనవచ్చు.

ix) *విద్యార్థులు పదాల అర్థాలను సందర్భానుగుణంగా చెప్పగల్గుతారు.*

పదాలు వివిధ సన్నివేశాల్లో వేరువేరు అర్థాలను స్ఫురింపజేస్తాయి. ఆ సన్నివేశానికి అనుగుణమైన భావనను విద్యార్థులు చెప్పగల్గాలి. ఉదాహరణకు కరము అనే పదం మిక్కిలి అనే అర్థస్ఫురణను, చేయి అనే అర్థస్ఫురణను కల్గిస్తుంది. ఈపదం వేరువేరు సందర్భాల్లో ఉపయోగించబడుతుంది. సన్నివేశా

వికనుగుణంగా పదాల అర్థాన్ని సూచించగల్గితే విద్యార్థులు ఈ స్పష్టీకర సాధించినట్లే.

x) విద్యార్థులు ఆయా సన్నివేశాల్లోని నిగూఢార్థాల్ని కనుగొంటారు.

లోకోక్తులు, జాతీయాలు మరియు పద్యపాఠాల్లో రచయితలు సాధార అంతిపదాల్లో అనంతార్థాన్ని ప్రతిపాదిస్తారు. ఈ పదాల వెనుక భాషనలను, పదాలలో దాగియున్న అర్థాలను కనుగొని వాని అంతఃస్ఫూంద దర్శించడమే ఈ స్పష్టీకరణం ఆశిస్తున్న ప్రవర్తనామార్పు. విద్యార్థులు సన్నివేశాలను క్షుణ్ణంగా చదివి వానిలో లీనమైనపుడే నిగూఢా కనుగొనగల్గుతారు.

xi) విద్యార్థులు సందర్భానుగుణంగా ఇచ్చిన సూచనలను అనుసరిస్తారు

వివిధ సమయాల్లో ఉపాధ్యాయులిచ్చే సూచనలకు అనుగుణంగా విద్యా ప్రతిస్పందించగల్గడం ఈ స్పష్టీకరణం ఆశిస్తుంది. సూచనలు సంక్షి ఉండవచ్చు. ఆజ్ఞలరూపంలో ఉండవచ్చు. వీనినమసరించి విద్యా ప్రతిస్పందించి ఆసూచనలను ఆచరణలో పెట్టాలి. ఉదాహరణకు వాక్యాల్లో ఒక ప్రశ్నకు సమాధానం రాయమంటే రెండేరెండు వా సంపూర్ణ సమాధానం రాయగల్గాలి.

xii) విద్యార్థులు పద్య, గద్యములందలి అన్వయక్రమం తెల్పుతారు.

సాధారణంగా పద్యాన్ని అన్వయక్రమంలో చెబితే తప్ప దాని అర్థం వి విశదపడదు. ఇది ఒక రకంగా తాత్పర్యం చెప్పడానికి వీలుకల్గిస్తుంది. నాలుగు పాదాల్లోని ఏదో ఒక పదం మొదట, మరోటి చివరగా చె భావాన్ని క్రమబద్ధంచేయడం ఈ స్పష్టీకరణంలోవి ప్రధానభావన. పర్యాయాలు గద్యపాఠాల్లోకూడా అన్వయక్రమం చెప్పాకోవాల్సి వ ఉదాహరణకు చిన్నయసూరి నీతిచంద్రికలో 'పోగాలము దాపురించి అరుంధతీ నక్షత్రమును, మిత్ర వాక్యమును, దీప నిర్వాణగంధమును వినరు, మూర్కొనరు' అనే వాక్యంలో అరుంధతీ నక్షత్రాన్ని మిత్రావాక్యాన్ని వినరు, దీప నిర్వాణ గంధాన్ని మూర్కొనరు అని అ చెప్పుకొంటే తప్ప ఆ వాక్యం పూర్తిగా అర్థంకాదు. అందువల్ల విద్యా ఇట్టి సందర్భాల్లో అన్వయక్రమం చెప్పగల్గాలి.

xiii) విద్యార్థులు ఆయా అంశాల సారాంశాన్ని గ్రహిస్తారు.

ఒక విషయం చదివింతర్వాత, విన్న తర్వాత దానిలోని ప్రధానభావాలను క్రోడీకరించి కొన్నివాక్యాల్లో చెప్పడమే సారాంశం. గద్యపాఠాల్లో సారాంశంగా, పద్యపాఠాల్లో తాత్పర్యంగా చెప్పగల్గడం సంపూర్ణ భావ వ్యక్తీకరణలో క్లుప్తతకు ఉదాహరణ. విద్యార్థులు సారాంశాన్ని తమ స్వంత మాటల్లో చెప్పగల్గాలి.

xiv) విద్యార్థులు ఆయా అంశాలను సంక్షిప్తీకరిస్తారు, వివరిస్తారు, విశ్లేషిస్తారు.

ఈ స్పష్టీకరణంలో సంక్షిప్తీకరించడం అంటే విధించిన పరిమితికి అనుగుణంగా క్లుప్తీకరించడం అన్నమాట. వెయ్యి పదాలున్న నాలుగైదు పేరాలిచ్చి వంద పదాల్లోకి కుదించమనడం సంక్షిప్తీకరణానికి ఉదాహరణ (Precis writing). ఇచట సంక్షిప్తంచేసే వ్యక్తికి స్వేచ్ఛ ఉండదు. ఇక వివరించడం అంటే ఒక లోకోక్తినో, ఒక జాతీయాన్నో వివరించి చెప్పడం. ఇచట విద్యార్థులకు స్వేచ్ఛ ఉంటుంది.. ఇక విశ్లేషించడం అంటే అంశంలోని పూర్వాపరాలను కార్యకారణ సంబంధాలను పరిశీలించి వివరణాత్మకమైన వ్యాఖ్యచేస్తూ అవసరమైతే తమ అభిప్రాయాన్ని చెప్పి సాధారణీకరణం చేయడం. ఈ మూడు విధాలైన సామర్థ్యాలు విద్యార్థుల్ని సృజనాత్మక రచనలు చేయడానికి ప్రోత్సహిస్తాయి.

xv) విద్యార్థులు అపరిచిత అంశాలకు శీర్షికలు చెప్పగల్గుతారు.

ఒక సన్నివేశాన్నో, కథనో విన్నతర్వాత, చదివింతర్వాత ఆ భాగానికి నామీకరణం చేయడమే (పేరుపెట్టడం) శీర్షికా నిర్ణయం. పాఠ్యాంశ కేంద్ర భావాన్ని, ప్రధాన వస్తువును విద్యార్థులు గ్రహించడానికి ఇది సహకరిస్తుంది. ఉపాధ్యాయులు పాఠ్యబోధన సమయంలో శీర్షికాప్రకటనంచేసి విద్యార్థులచే కొన్ని పర్యాయాలు శీర్షికను చెప్పిస్తారు.

పై స్పష్టీకరణాల్లో ఆశిస్తున్న ప్రవర్తనా మార్పుల్ని ఉపాధ్యాయులు తమ బోధనద్వారా విద్యార్థుల్లో ఆశిస్తారు. విద్యార్థులు ఏ మేరకు ఈ ఆశించిన ప్రవర్తనలు కనబరుస్తారు అన్న దానిపై ఆయా అంశాలు విద్యార్థులకు ఆ మేరకు అర్థమయ్యాయి, లేదా అవగాహనమయ్యాయి అని చెప్పడానికి వీలుకల్గుతుంది.

ఇంత వరకు రెండు ప్రధాన లక్ష్యాలను తెల్సికొన్నాం. ఒకటి జ్ఞానం,

రెండోది అవగాహనం. ఈ రెంటి మధ్యగల భేదమేమి అని ప్రశ్నిస్తే సమాధాన
చెప్పడం అంత సులభం కాదు. ఈ రెండూ బోధన లక్ష్యాలని చెప్తా
కాని ఇతరత్రా భేదాలను చెప్పడానికి ఆలోచించాల్సి వస్తుంది. స్థూలం
చెప్పాలంటే జ్ఞానం ప్రాతిపదిక లక్ష్యం. ఈ లక్ష్యంపై ఎదిగినది అవగాహన
జ్ఞానం లేకపోతే అవగాహన లేదు.అవగాహనం ఒంటరిగా నిలబడలేదు. వీ
మధ్య ఖచ్చితంగా ఇదీ భేదమని చెప్పడం కన్నా ఈ రెండూ ఒకదా
ఒకటి ప్రభావితం చేస్తాయని ఒకటి స్థూలభావన ఐతే మరోటి సూక్ష్మభావ
అని చెప్పొచ్చు. ఇవి ఆధార ఆధేయాలవంటివి. అయినప్పటికి వీని మ
స్థూలంగా ఈ కింది భేదాలున్నాయని విద్యావేత్తలు అభిప్రాయపడతారు.

i) విద్యార్థులు తమకు పరిచయమైన అంశాన్ని కేవలం జ్ఞప్తికి తెచ్చుకొం
జ్ఞానం. దీనిలో మనోక్రియ అంతగా అవసరం లేదు. ఈ అంశ
పూర్వా పరాలతో సమన్వయించి చెప్పగల్గితే అది అవగాహనం.

ii) కేవలం విద్యార్థులు ఒక పదానికి అర్థాన్ని సూచిస్తే జ్ఞానం. ఆ పద
ఒక స్వతంత్ర వాక్యంలో ఉపయోగించి చెప్తే అవగాహనం.

iii) విద్యార్థులు సంధి సూత్రాన్ని తిరిగి చెప్తే జ్ఞానం. ఉదాహరణలతో సూత్ర
విశ్లేషించగల్గితే అవగాహనం.

iv) విద్యార్థులు కేవలం సందర్భాన్ని చెపితే జ్ఞానం. వ్యాఖ్య చేయగ
అవగాహనం.

పై ఉదాహరణల వల్ల ఒక విషయం స్పష్టమవుతోంది. జ్ఞాన లక్ష్యం
విద్యార్థులు స్వీకరించిన అంశాలు ఎలాంటి మార్పు లేకుండా వెలికి చెప్తార
ఇందు కేవలం జ్ఞాపక శక్తితో కూడిన సామాన్య మనోక్రియ సరిపోతుం
అవగాహనమట్లు గాక విశేష మనోక్రియతో కూడుకొని, స్వీకరించిన విషయ
వ్యక్తిలో జీర్ణమవుతుంది. ఇది మొదటి సందర్భంలో తాత్కాలిక
కావచ్చు. కాని రెండో సందర్భంలో అది శాశ్వతమవుతుంది. అందువ
జ్ఞాన లక్ష్యంపై విస్తరించబడి, సూక్ష్మాతి సూక్ష్మంగా అనువర్తింపబడిన లక్ష్య
అవగాహనం.ఈ రెండున్నూ రూపాయి నాణేనికి ఇరుముఖాల వంటి
నాణెం ఇరు ముఖాలు (బొమ్మ, బొరుసు) ఎలా వేరు చేయలేమో స్థూలం
ఈ రెంటిని కూడా వేరు చేసి చెప్పడం కష్టం.

పై రెండు లక్ష్యాలు విద్యార్థుల స్వంత మయ్యాయి అని ఉపాధ్యాయులు భావిస్తే ఆ రెండూ ఆయా విద్యార్థులకు వైయక్తికంగా స్వంతమయ్యాయన్న మాట. ఒక విద్యార్థిలో జ్ఞానావగాహనలున్నాయి అంటే అవి ఆ విద్యార్థి స్వంతాలు. అవి సమాజగతం కావాలంటే వెలికి రావాలి. వెలికి రావడం అనేది వ్యక్తీకరణం. వీని ఆధారంగా వ్యక్తీకరించే విధానాలు తెల్సికొందాం.

(C) వాగ్రూప అభివ్యక్తి :

ఈ లక్ష్యంలో విద్యార్థులు తమ భావాల్ని, జ్ఞానవగాహనల ద్వారా స్వంతం చేసికొన్న విషయాల్ని వాగ్రూప ధ్వనుల సాయంతో ఎదుటి వారికి వ్యక్తీకరిస్తారు. తద్వారా భావనలు సమాజగతం కావడానికి వీలు కల్గుతుంది. దీన్ని వాగ్రూప నైపుణ్యం అని కూడా వ్యవహరిస్తారు. భావవ్యక్తీకరణకు ఇది ప్రాతిపదిక. ఈ లక్ష్యంలోని స్పష్టీకరణాల్లో చెప్పబడిన మెలకువలను కనబర్చగల్గితే ఈ లక్ష్యం విద్యార్థులకు అధీనమైందన్న మాట. ఎంతటి లోతైన జ్ఞానం, అవగాహన లున్నా ఈ లక్ష్యం సాధించకపోతే ఇతరులకు ఏమి తెలియ జెప్పలేరు. వాగ్రూప అభివ్యక్తికి ఈ కింది స్పష్టీకరణాలు చెప్పుకోవచ్చు.

i) విద్యార్థులు ఉచ్చారణ దోష రహితంగా మాట్లాడుతారు.

ప్రధానంగా అల్ప ప్రాణాలు, మహాప్రాణాలు (క-ఖ), (శ-ష-స), (చ-చ), (అ-హ) మొదలైన వానిమధ్య, ద్విత్వ, సంయుక్తాక్షరాల ఉచ్చారణలో భేదం పాటించకపోతే కరము, ఖరము అవుతుంది. అందువల్ల ఉచ్చారణ దోష రహితంగా విద్యార్థులు మాట్లాడగల్గాలి.

ii) విద్యార్థులు స్పష్టంగా మాట్లాడుతారు.

స్పష్టంగా మాట్లాడటమంటే వాక్యాలు, పదాలను సరియైన విధంగా పూర్తిగా ఉచ్చరించడం, పైపైన ఉచ్చరించకపోవడం, తుదలు వదిలి వేయకపోవటం, శ్రోతకు తాము ఉచ్చరిస్తున్నదేమిటో తెలిసేట్లు ఉచ్చరించడం, విద్యార్థులు స్వంతంచేసికోవాలి.

iii) విద్యార్థులు ధారాళంగా మాట్లాడుతారు.

ధారాళంగా (fluency) మాట్లాడటం అంటే భావం కుంటుబడకుండా వ్యవధానరహితంగా మాట్లాడటం, ఉపన్యాసం చెప్పడం, వక్తృత్వం చెప్పడం మొదలైన సందర్భాలలో ఈ అంశం వర్తిస్తుంది. విద్యార్థులు ఈ స్పష్టీకరణాన్ని సాధించాలి.

iv) విద్యార్థులు భావాను గుణమైన స్వర భేదంతో మాట్లాడుతారు

విద్యార్థులు వాగ్రూపంలోనే భావాలను వ్యక్తీకరించాల్సిన సం పెక్కు. ఆ సందర్భాలకనుగుణంగా స్వర భేధాన్ని పాటించడం వక్తల లక్షణం. చిన్న పిల్లలతో, సమవయస్కులతో, పెద్దలతో, గురు సుఖదుఃఖాలలో, ఆవేశంలో ఇలా వివిధ సందర్భాల్లో అనుగుణమై భేదాన్ని పాటించాలి. పద్యం లోని భావనల వ్యక్తీకరణంలో స పాటించడం ద్వారా రసానుభూతిని పొందవచ్చు.

v) విద్యార్థులు సముచితమైన భాషను ఉపయోగించి మాట్లాడుతా

ఆయా సన్నివేశాలకు, సందర్భాలకు అనుగుణమైన భాషోపయోగ స్పష్టీకరణం ఆశిస్తుంది. విద్యార్థులు ఉపయోగించే భాష సము ఉండాలి. ఆడంబరంగాగాని, న్యూనంగా గాని ఉండరాదు.

vi) విద్యార్థులు భావాను క్రమంతో మాట్లాడుతారు.

విద్యార్థులు ప్రశ్నలకు సమాధానాలు చెబుతున్నపుడు భావం కు కుండా ఒక భావం మధ్య మరో భావం చొప్పించకుండా అను (sequence) మాట్లాడగల్గడం ఈ స్పష్టీకరణం ఆశయం.

vii) విద్యార్థులు సభాకంపం లేకుండా మాట్లాడుతారు.

విద్యార్థులు తరగతి గదుల్లో, పెద్దవారిముందు, సభల్లో, సమ ఎలాంటి జంకు లేకుండా మాట్లాడగల్గే ధైర్యం సభా కంపాన్ని పోగొ సాయపడుతుంది.

viii) విద్యార్థులు సభ్యతతో సందర్భోచితంగా మాట్లాడుతారు.

సభ్యతతో మాట్లాడటం సందర్భోచితంగా మాట్లాడటం వ్యక్తికి తెస్తాయి. ఈ రెండు లక్షణాలు విద్యార్థులకు అలవడాలి. వారు సామాన్య వ్యవహర్తల స్థాయి నుండి విశిష్ట వ్యవహార్తల ఎదగగల్గుతారు.

ix) విద్యార్థులు విమర్శనాత్మకంగా మాట్లాడుతారు.

విమర్శనాత్మకంగామాట్లాడటం ఎదిగిన అవగాహనా ఫలితం.ఎంత విద్యార్థులు విషయాన్ని గ్రహిస్తే అంత విమర్శనాత్మకంగా మాట్లాడగ విద్యార్థులు ఈ స్పష్టీకరణాన్ని సాధించేట్లు ఉపాధ్యాయులు ప్రోత్సహి

(D) లిఖిత రూప అభివ్యక్తి:

బోధన లక్ష్యాల్లో నాలుగో లక్ష్యం లిఖితరూప అభివ్యక్తి. అంటే విద్యార్థులు తమ భావాలను లిఖిత రూపంలో వ్యక్తీకరించగల్గుతారు. ఈ వ్యక్తీకరణ వాగ్రూప వ్యక్తీకరణం వలె నిత్య వ్యవహారశీలి కాక పోయినప్పటికి ప్రత్యేకవ్యవహారాల్లోనూ, భావానికి లిపి బద్ధత కూరుస్తున్నపుడు అవసరమౌతుంది. ఈ లక్ష్యాన్ని విద్యార్థులు సాధించారని చెప్పడానికి కింది స్పష్టీకరణాలను వారిలో పెంపొందించాలి.

i) విద్యార్థులు వర్ణక్రమ దోష రహితంగా రాస్తారు.

విద్యార్థులు అక్షర దోషాలు, వర్తనీ దోషాలు (Spelling errors) లేకుండా రాయాలి. కొన్ని పర్యాయాలు ఎలా ధ్వని చేస్తున్నారో అలా లిపి బద్ధం చేయాల్సి ఉంటుంది. ఇట్టి సందర్భాలలో భావం కుంటు పడకుండా జాగ్రత్త పడాలి.

ii) విద్యార్థులు వ్యాకరణ యుక్తంగా రాస్తారు.

వాగ్రూప వ్యవహారంలో సాధారణ వ్యాకరణ నియమాలు అనాలోచితంగానే వ్యక్తులు పాటిస్తారు. లిఖిత వ్యక్తీకరణంలో కూడా వ్యాకరణ నియమాలు పాటించడం తప్పనిసరి. నియమ రహితమైన లిఖిత రూపం ఎదుటి వ్యక్తికి సరియైన భావాన్ని చేరవేయదు. అందువల్ల విద్యార్థులు ఈ విషయంలో శ్రద్ధవహించాలి.

iii) విద్యార్థులు ఉచితమైన పదాలుపయోగించి స్థాయికి తగిన శైలిలో రాస్తారు.

ఉచిత పద ప్రయోగం అవగాహనలో భాగం. విద్యార్థులు తమలో గల ప్రతిభా స్థాయికనుగుణంగా పదాలను ఎన్నుకొని రాయడం ఈ స్పష్టీకరణంలోని భావన. సామాన్య వాక్య రచనతో బాటు తరగతి స్థాయి పెరిగినకొలది సంయుక్త, సంశ్లిష్ట వాక్యాల్లో కూడా ఉచిత పద ప్రయోగనైపుణ్యత విద్యార్థులకు అలవడాలి.

iv) విద్యార్థులు సరియైన వాక్య నిర్మాణం చేస్తారు.

తెలుగు వాక్య నిర్మాణంలోని మెలకువలను విద్యార్థులు తెల్సికొని వివిధ రీతుల్లో వాక్యాలు రాయగల్గాలి. భావానికి అనుగుణమైన వాక్యనిర్మాణరీతిని ఎన్నుకోగల్గాలి.

v) విద్యార్థులు తమ రచనల్లో అప్రస్తుతాంశాలను పరిహరిస్తారు.

విద్యార్థులు ఏదేని ఒక అంశాన్ని గూర్చి రాస్తున్నపుడు సంబంధిః తప్ప అవాంతరాంశాల్ని ప్రస్తావించకపోవడం జరగాలి. సాధా అప్రస్తుతాంశాలు అసంకల్పితంగానో లేక సరియైన అవగాహన లేకనో ( చేరిపోతాయి. రాస్తున్నపుడు ఇతర ఆలోచనలు ముసురుకోవడంవ( రాస్తున్నపుడు అప్రస్తుతాలు దొర్లుతాయి. ఈ స్పష్టీకరణంద్వారా విషయానికి పరిమితమై అప్రస్తుతాంశాలను వదిలివేసే శక్తి విద్యా కలగాలి.

vi)విద్యార్థులు తమ రచనల్లో భావానుక్రమాన్ని పాటిస్తారు.

విద్యార్థులు అప్రస్తుతాంశాలను పరిహరిస్తే భావం స్పష్టమై వరుస( తనంతటతానే అమరిపోతుంది. చెప్పదల్చుకున్న విషయమేదో ఎదుటివ్యక్తికి చేరుతుంది.

vii)విద్యార్థులు రచనలను పరిచ్ఛేదాలుగా విభజిస్తారు.

ఒక విషయాన్ని విభిన్న దృక్పథాల్లో ప్రస్తావించినపుడు ఆయా వా పరిచ్ఛేదాలుగా విభజించాల్సి ఉంటుంది. పరిచ్ఛేద విభజన వ్యాస( ప్రధాన లక్షణం. ప్రతిపేరాను ఒకే ఒక అంశానికి పరిమితంచేసి విద ఆశించిన విధంగా ప్రవర్తనా మార్పును కనబరచాలి.

viii)విద్యార్థులు విరామ చిహ్నాలు పాటించి రచన చేస్తారు.

విరామ చిహ్నాలు ఉపయోగించడం ఆంగ్లభాషా ప్రభావం వల్ల భాషలో చేరిపోయింది. ప్రాచీన కాలంలో వాక్యాంతంలో కేవల నిలువు గీత (।) గీసే వారు. ప్రస్తుత రచనల్లో పూర్ణ విరామం (. విరామం (,), ప్రశ్న చిహ్నం (?), ఆశ్చర్య చిహ్నం (!), ఉద్ధరణ ( (" ")మొదలైన విరామ చిహ్నాల్ని ఉపయోగిస్తున్నారు. విద్యార్థులు తాము చేసే రచనల్లో ఉపయోగించాలి.

నిత్యవ్యవహార దక్షతను సంపాదించుకోవల్సిన విద్యార్థులు, వ్యక్తు నాలుగు లక్ష్యాలను, అందలి స్పష్టీకరణాలను సాధించాల్సి ఉంటుంద భాషాబోధన ఉద్దేశ్యం కేవలం నిత్యవ్యవహార దక్షత మాత్రమేకాదు. భాషనూ తరగతిగదుల్లో ప్రత్యేకంగా అభ్యసించని వారు (బడికిరాని కూడా కల్గియుండవచ్చు. విద్యార్థులు సామాన్య వ్యవహర్తలనుండి

వ్యవహర్తలుగా రూపొందడానికి ఈ నాల్గు లక్ష్యాలపై అధికారం సంపాదించాలి. వీటితోబాటు అనుభూతులు, ఆసక్తులు, వైఖరులు మున్నగునవి కూడా పెంపొందించుకోవాలి. అప్పుడే విద్యార్థులు సమగ్రతను సాధించినవారౌతారు. పై నాలుగు లక్ష్యాలు అన్ని సాహిత్య ప్రక్రియల బోధనలో ఉపాధ్యాయులు దృష్టియందుంచుకోవాల్సినవే.

(E) విద్యార్థులు పఠన నైపుణ్యాన్ని సంపాదిస్తారు :

పఠన నైపుణ్యాన్ని సాధించే తీరు, పెంపొందించే పద్ధతులు ఈ పుస్తకంలోనే భాషానైపుణ్యాలు అనే అధ్యాయంలో వివరంగా ప్రస్తావించబడతాయి. ఈ నైపుణ్యాన్ని ఉపాధ్యాయులు తాము మొదట కల్గియుండి ఆదర్శప్రాయులై విద్యార్థుల్లో పఠన నైపుణ్యాన్ని పెంపొందించాలి. పఠనంలో స్పష్టత, ధారాళత, దోషరహిత ఉచ్చారణ, అన్వయక్రమత, భావానుక్రమత మొదలగు లక్షణాలను విద్యార్థులు అలవరచుకొనేట్లుగా చూడటం భాషోపాధ్యాయుల కర్తవ్యం.

(F) విద్యార్థులు భాషాభిరుచిని కల్గి ఉంటారు :

భాషాబోధనలో ఆరో లక్ష్యం అభిరుచికి సంబంధించింది. విద్యార్థులకు ఈ లక్ష్యసాధన మానసిక తృప్తిని కల్గించి మొదట ప్రస్తావించిన అన్ని లక్ష్యాలను మరింత బలోపేతం చేస్తుంది. తర్వాత సమాజంలో వారిని ఉత్తమమైన భాషా వ్యవహర్తలుగా తీర్చిదిద్దుతుంది. ఈ లక్ష్యసాధనకు స్పష్టీకరణాలు:

i)విద్యార్థులు విస్తార గ్రంథ పఠనం చేస్తారు.

తరగతి బోధనలో ఉపాధ్యాయులు పాఠ్య విషయంతోబాటు విషయ జ్ఞానంలో క్కు అంశాలు చెప్తారు. తద్వారా విద్యార్థులు ప్రస్తుతాంశాలతోబాటు ంబంధిత అంశాలను స్వంతంచేసికోవడానికి, విస్తారంగా పుస్తకాలు చదవాలి. విద్యార్థులు మూలగ్రంథాలను, పరామర్శ గ్రంథాలను సంప్రదించే అలవాటుకు చదివే అలవాట్లకు ఈ స్పష్టీకరణం నిదర్శనం.

ii)విద్యార్థులు సాహితీ ప్రసంగాల్లో పాల్గొంటారు. సాహితీప్రసంగాలు చేస్తారు.

విద్యార్థులు తమ ప్రజ్ఞాపాటవాలు ప్రదర్శించడానికి సాహిత్య సమావేశాల్లో ప్రసంగించడం, పాల్గొనడం చేయాలి. తమ స్థాయికి అనుగుణంగా విద్యార్థులు సభల్లో మాట్లాడగలగాలి. ఒక కవిని గురించిగాని, రచననుగాని తన అభిప్రాయాలను ఈ స్పష్టీకరణద్వారా వ్యక్తీకరించగల్గాలి.

iii)విద్యార్థులు, వక్తృత్వం, రచనల పోటీల్లో పాల్గొంటారు.

వక్తృత్వం, రచన రెండున్నా సహపాఠ్య కార్యక్రమాల్లో భాగా వక్తృత్వమంటేనే విద్యార్థులు వెనుకంజవేస్తారు. సభాకంపానికి దీ సంబంధముంది. రచనల మెలకువలు తెలియకపోవడంవల్ల కూడా విద్యార్థు వీనియందు సరియైన ప్రతిస్పందన చూపరు. విద్యార్థులు చురుగ్గా రెంటిలో పాల్గొనేట్లు చేస్తే ఈ స్పష్టీకరణాన్ని సాధించినట్లే.

iv) విద్యార్థులు ఉత్తమ పద్యాలను ధారణచేసి పఠిస్తారు.

పద్యాలను కంఠస్థంచేయడం, పద్యపఠనపోటీల్లో పాల్గొనడం ఈ స్పష్టీకర ఉద్దేశ్యం. దీనిద్వారా విద్యార్థుల్లో ధారణశక్తి పెరుగుతుంది. ఇది భాషాభిరు నిదర్శనం.

v) విద్యార్థులు కవి సమ్మేళనాల్లో పాల్గొంటారు.

పాఠశాలస్థాయిలో నిర్వహించే బాలకవుల, బాల రచయితల సమ్మేళనం పాల్గొని విద్యార్థులు తమ రచనల్ని వినిపించాలి. ఇతరులరచనలను కూ విని స్ఫూర్తిపొందవచ్చు.

vi) విద్యార్థులు సాహిత్య రచనలు చేస్తారు.

తరగతిలోని ప్రతిభావంతులైన విద్యార్థులు ఉత్తమ రచనలుచేయడం వా ఇతరులకు వినిపించగల్గడం ఈ స్పష్టీకరణ భావన.

vii) విద్యార్థులు సందర్భోచితంగా గ్రంథకర్తల రచనలను ప్రమాణంగా ఉ రిస్తారు.

విద్యార్థులు వక్తృత్వం చెప్తున్నడుగాని, రచనలు చేస్తున్నపుడుగాని, వ్యవహారంలోగాని తమ అభిప్రాయాలకు వత్తాసుగా ఇతరుల అభిప్రాయా చెప్పడం, తమ అభిప్రాయానికి బలం చేకూర్చడం ఈ స్పష్టీకరణం ఆశిస్తు

viii) విద్యార్థులు సాహిత్య రచనల్లోని పోలికలు చెప్తారు.

విద్యార్థులు వివిధ రచయితల రచనలు చదివి ఒకరి రచనను మరొ రచనతో పోల్చేస్థాయికి ఎదగడం ఈ స్పష్టీకరణం ఆశయం.

ఈ స్పష్టీకరణాలన్నీ ఒకదానికొకటి అంతర సంబంధాన్ని పర ప్రభావాన్ని కల్గి ఉంటాయి. ఈ కనబరిచిన పరివర్తనల పూర్ణరూ

భాషాభిరుచియని చెప్పవచ్చు. ఈ లక్ష్యాన్ని పద్యం, గద్యం, వ్యాసం, ఉపవాచక, నాటక పాఠాల బోధనలో సాధించడానికి ఎంతో అవకాశముంది.

(G) విద్యార్థులు రసానుభూతిని పొందగల్గుతారు :

రసానుభూతిని పొందడం భాషాబోధన లక్ష్యాల్లో ఏడవ లక్ష్యం. ఇది ప్రధానంగా పద్య బోధనద్వారా సాధించబడుతుంది. సాహిత్య జ్ఞానం లోతుగా కల్గితే దాని ప్రతిఫలం రసానుభూతి. ఇది హృదయగతమైన ఆర్ద్రత, మనో తన్మయతకు సంబంధించింది. తనకు నచ్చిన, తానుమెచ్చిన, తనను ఆకట్టుకొన్న అంశంలో ప్రతి వ్యక్తి లీనంకావడం మామూలు విషయం. పద్యసౌందర్యాన్ని ఆకళింపు చేసికొన్న వ్యక్తి ఆ భావనాసముద్రంలో తేలియాడుతాడు. ఉపాధ్యాయులు పద్యబోధనలో ఈ లక్ష్యాన్ని ప్రధానంగా దృష్టియందుంచుకోవాలి. రసానుభూతి, ఆనందానుభూతి కల్గినట్లు చెప్పడానికి ఈ కింది స్పష్టీకరణాలు ఉపకరిస్తాయి.

i) విద్యార్థులు రసభేదాలను గ్రహిస్తారు.

పాఠశాలస్థాయిలో రచనల్లోని రసాలను ప్రధానంగా కరుణం, హాస్యం, వీరం మొదలైనవానిని, మరియు కవిసమయాలను విద్యార్థులు తెల్సికొని అనుగుణమైన ప్రతిస్పందనలు కనబరచగల్గాలి.

ii) విద్యార్థులు గ్రంథాలలోని రసవద్ఘట్టాలను తెల్సికొంటారు.

ఒక అంశాన్ని విద్యార్థులకు పరిచయం చేసింతర్వాత, ఆ అంశం ఏ గ్రంథంలోది, ఏ రచయితది, రసవత్తరమైన ఇతర సన్నివేశాలు ఆ గ్రంథంలో ఎచటెచట ఉన్నాయి అనే అంశాలు తెల్సికోవడం ఈ స్పష్టీకరణం ఆశయం. ఈ స్పష్టీకరణాన్ని విద్యార్థులు సాధించడానికి ఉపాధ్యాయుల సహకారం ఎంతో అవసరం.

iii) విద్యార్థులు అలంకారాల విశిష్టతను గ్రహిస్తారు:

ఏ ప్రక్రియకు సంబంధించిన రచనలోనైనా కొన్ని పోలికలు, అలంకారాలు ఇమిడిపోతాయి. ఆలంకారికమైన సందర్భాలను, అలా చెప్పడానికి గల ప్రాధాన్యతను ఉపాధ్యాయులు విద్యార్థులకు వివరించి చెప్తే ఈ స్పష్టీకరణాన్ని విద్యార్థులు సాధిస్తారు.

iv) విద్యార్థులు ధ్వన్యర్థాన్ని గ్రహిస్తారు:

ధ్వనికి సంబంధించిన అర్థంగాక ధ్వని వెనకగల భావనయే ధ్వన్యర్థం.

ధ్వని ఊనిక, ఉచ్చారణ తీరు మొదలైనవి అర్థస్ఫూరణలో వివిధ భావనలను కల్గిస్తాయి. సాహిత్యంలో ధ్వనిని ప్రధానమైన అంశంగా ఆలంకారికులు భావిస్తారు. ధ్వనిని కావ్యాత్మంగాకూడా పరిగణిస్తారు. ఇది విశిష్టార్థంకావచ్చు, వ్యంగ్యార్థం కావచ్చు. ఇవి సాహిత్యంలో కొల్లలు. విద్యార్థులు ధ్వన్యర్థాలను గ్రహించేటట్లు ఉపాధ్యాయులు వివరించి చెప్పాలి.

v) విద్యార్థులు రచనల్లోని శైలీభేదాలను పరిశీలిస్తారు:

వివిధ రచనల్లో శైలి, శైలిలోగల సామ్యాలు, భేదాలను పరిశీలించి విద్యార్థులు తమదైన శైలిని ఏర్పరచుకోవడం ఈ స్పష్టీకరణం ఆశిస్తుంది.

vi) విద్యార్థులు రచయితల ఆత్మీయతను సూచించే సన్నివేశాలను పేర్కొం టారు:

ఒక పాఠాన్ని చదివింతర్వాత ఆ పాఠం గుట్టు, ప్రధానభావన ఏ సందర్భంలో ప్రస్తావించబడిందో, రచయిత తనను తాను ఎచట ఆవిష్కరించుకొన్నాడో ఆ సన్నివేశాల్ని విద్యార్థులు చెప్పగలగాలి. తద్వారా ఒక రచయితను గూర్చి విన్నంతనే అతడి ప్రముఖ రచనలను, అతడు సాధారణీకరణంచేసి వ్యక్తీకరించిన భావాలను విద్యార్థులు చెప్పగల్గుతారు.

vii) విద్యార్థులు రచనల్లోని పాత్రల ఔచిత్యాన్ని గ్రహిస్తారు:

ఆయా రచనల్లో వివిధ పాత్రలు దర్శనమిస్తాయి. ఈ పాత్రల స్వభావాలు, చేష్టలు, మాటలు రచయితలు వివిధ రకాలుగా వ్యక్తంచేస్తారు ఆయా సన్నివేశాల్లో పాత్రలు ప్రవర్తించే తీరులోని ఉచితత్వాన్ని (ఔచిత్యాన్ని) విద్యార్థులకు వివరించి చెప్పాలి. ఇతర సన్నివేశాల్లో పాత్రల ఔచిత్యాన్ని ప్రశ్నించే, ప్రశంసించే నేర్పును విద్యార్థులు అలవరచుకొనేట్లు చూడాలి.

పై స్పష్టీకరణాలన్నీ ఉపాధ్యాయులు తమ విద్యార్థుల్లో సాధింపగలగాలి విద్యార్థులు సాహిత్య పఠనంలో రసానుభూతిని పొందగల్గినపుడే ఈ లక్ష్యం సాధింపబడుతుంది. కేవలం లయబద్ధంగా రాగ, భావ యుక్తంగా పద్యం చదవగల్గితే రసానుభూతి లక్ష్యాన్ని చాలామేరకు సాధించినట్లే అని కొందరి అభిప్రాయం.

(H) విద్యార్థులు సంస్కృతి సంప్రదాయాలను తెల్సికొంటారు:

భాషాబోధనలో ఎనిమిదో లక్ష్యం సంస్కృతి సంప్రదాయాలను తెల్సికోవడం

తద్వారా దేశం, రాష్ట్రంలోని ప్రజల, జాతుల సంస్కృతిని సంప్రదాయాలను అర్థంచేసికొని వానిని పరిరక్షించుకోవడం జరుగుతుంది. సంస్కృతిని సహవానికి ప్రతిరూపమని నిర్వచిస్తారు రాధాకృష్ణన్. సహనం భారతీయుల స్థిరాస్థి. సంస్కృతికనుగుణంగా సంప్రదాయాలుంటాయి. సంప్రదాయాన్ని పాటించడం అంటే ప్రాచీనతను గుడ్డిగా అనుసరించడంగాదు. దీని వైశిష్ట్యాన్ని గ్రహించి మంచిచెడుల విచక్షణతో ఈనాటి సమాజం అంగీకరించే సంప్రదాయాలను పాటించడమే ఈ లక్ష్యం ఆశయం. ఒకనాటి ఆచారం తర్వాతి తరాలకు సంప్రదాయమవుతుంది. సంప్రదాయాలు ప్రాచీనతకు అర్వాచీనతకు వారధులుగా పనిచేస్తాయి. ఈ లక్ష్యసాధనకు ఉపాధ్యాయులు కింది స్పష్టీకరణాలను దృష్టియందుంచుకోవాలి.

i) విద్యార్థులు రచనల్లోని ఆచార వ్యవహారాలను తెల్సికొంటారు:

ఆయా కాలాల్లోని రచనలు సమకాలీన ఆచార వ్యవహారాలను ప్రతిబింబిస్తాయి. వీనియందలి అంశాలను విశ్లేషించి మంచి ఆచారాలను పాటించడం వివేకవంతుల లక్షణం. భాషాబోధనలో విద్యార్థులు ఈ స్పష్టీకరణాన్ని సాధించాలి.

ii) విద్యార్థులు రచనల్లోని కాలభేద ప్రభావాన్ని గ్రహిస్తారు:

ప్రాచీన, అర్వాచీన సాహిత్యంనుండి పాఠ్యాంశాలు ఎంపికచేయబడతాయి. అవి తమ సమకాలీన జీవన విధానానికి దర్పణాలు. అందువల్ల నేడు ఆ రచనలను పాఠంగా చెప్పుకొన్నపుడు ఉపాధ్యాయులు నేటి సమాజ దృక్పథంతోగాక ఆ రచనాకాలపు దృక్పథంతో పరిశీలించాలి. అపుడే రచనా కాలానుగుణమైన భేదం, వాని ప్రభావం విద్యార్థులు స్వంతం చేసికొంటారు.

iii) విద్యార్థులు పురాణేతిహాసాల్లోని విశేషాలను వివరిస్తారు:

పురాణాలనుండి, ఇతిహాసాలనుండి కూడా మన పాఠాలు ఎంపికచేయబడతాయి. ఆ పాఠాల బోధనలో ఉపాధ్యాయులు రచయిత, కాలం మొదలైన దృక్కోణాలనుండి వానిని విశ్లేషించాలి. వైయక్తిక దృక్పథం విశ్లేషణకు అంతగా ఉపకరించదు. కాలానుగుణంగా విశేషాలను వివరించగలిగే నేర్పు విద్యార్థులకు అలవరచాలి.

iv) విద్యార్థులు సంస్కృతిని విశదీకరిస్తారు:

మన జాతీయ సంస్కృతి భారతీయ సంస్కృతి. మన రాష్ట్ర సంస్కృతి తెలుగు సంస్కృతి. ఈ రెంటిని విశదీకరించగల్గిన నేర్పు, వీని ప్రత్యేకతలు,

వీని పరిరక్షణ విద్యార్థుల మనోకుహరాల్లో నిరంతరం ఉండిపోవడానికి వీలుగ ఉపాధ్యాయులు తమ బోధన వ్యూహాలను నిర్ణయించు కోవాలి.

v) విద్యార్థులు రచనల్లోని నీతిని గ్రహిస్తారు:

పాఠ్య పుస్తకంలోని పాఠాలు చాలామేరకు ప్రబోధాత్మకంగా ఉంటాయి అవి ఏదో ఒక ఆదర్శాన్నో, నీతినో సమాజానికి అందిస్తాయి. విద్యార్థు సంబంధితాంశాలను గుర్తించేట్లు చేయడం, వానిని నిజజీవితంలో పాటి చేట్లు చూడడం ఈ స్పష్టీకరణం ఆశయం. నీతియొక్క అంతరార్థా విద్యార్థులు గ్రహించేట్లు చేయడం ఉపాధ్యాయుల బాధ్యత.

ఈ లక్ష్యాన్ని పై స్పష్టీకరణాలద్వారా సాధించగలిగితే ఉపాధ్యాయు భాషాబోధన ఉద్దేశ్యాల్ని కొంతమేరకు సాధించినట్లే. ఈ లక్ష్యం వ్యాకర పాఠాల్లో తప్ప తక్కిన అన్ని పాఠ్యాంశాల్లో సాధించవచ్చు.

(I) విద్యార్థులు సృజనాత్మక శక్తిని పెంపొందించుకుంటారు:

భాషాబోధన లక్ష్యాల్లో తొమ్మిదోలక్ష్యం సృజనాత్మకత. విద్యార్థు తమ ప్రతిభావ్యుత్పత్తుల్ని ప్రదర్శించడానికి వీలుకల్గించే లక్ష్యం ఇది. నవనవోన్మేషమైన ఆలోచనలకు సృజనాత్మకత ప్రతిబింబం. ఆలోచనలకు ఆక కల్పించడం ఈ లక్ష్యసాధనలో ఉపాధ్యాయులు దృష్టియందుంచుకోవాలి అంశం. ఈ లక్ష్యంలోని స్పష్టీకరణాలు.

i) విద్యార్థుల స్వతంత్రరచనలు చేస్తారు:

విద్యార్థులు మొదట అనుకరించి రాస్తారు. ఆ తర్వాత స్వయం రాయడానికి ప్రయత్నిస్తారు. విద్యార్థులు స్వయంగా రాసే శ ప్రదర్శించగల్గడం ఈ స్పష్టీకరణంలోని భావన. ఉపాధ్యాయు ఈవిషయంలో శ్రద్ధ వహించాలి.

ii) విద్యార్థులు రచనా తమ శైలిలో ప్రత్యేకతను కనబరుస్తారు:

విద్యార్థులు తాముచేసే రచనల్లో తమదైన శైలిని కనబరచడం స్పష్టీకరణం ఆశిస్తోంది. ఉపాధ్యాయులు వివిధ శైలీ రీతులను పరిచ చేయుట ద్వారా ఈ స్పష్టీకరణాన్ని సాధించ యత్నించవచ్చు.

సాహిత్య జ్ఞానంలో పరిచయంచేసిన ప్రక్రియల్ని (గద్యం-పద్యం-నాటకం) ఒకదానిని మరోదానిలోకి రూపాంతరం చేయడంద్వారా ఈ స్పష్టీకరణాన్ని సాధించవచ్చు. ఉపాధ్యాయులు ఈ మెలకువల్ని విద్యార్థులకు తెల్పాలి.

iv) విద్యార్థులు తమ రచనల్లో నుడికారపు సొంపును ప్రదర్శిస్తారు, జాతీయాలు లోకోక్తులు వాడతారు:

జాతీయాలు, లోకోక్తులు విద్యార్థులకు భాషాజ్ఞానంలో పరిచయం చేయుబడ్డాయి. స్వతంత్ర రచనల్లో వీనిని విరివిగా విద్యార్థులు ఉపయోగించగల్గినపుడు భాషాసౌందర్యంతోబాటు రచనాసౌందర్యం ఇనుమడిస్తుంది. వీనిని విద్యార్థులు తమ రచనల్లో విరివిగా ఉపయోగించేట్లు ఉపాధ్యాయులు ప్రోత్సహించాలి.

ఇట్లు విద్యార్థుల్లోని అంతర్గత శక్తుల్ని వెలికితీసి వారు స్వతంత్రంగా రచనలు చేయగల్గిన స్థితిని పొందడంద్వారా ఈ లక్ష్యాన్ని సాధించవచ్చు.

(J) విద్యార్థులు సముచిత మనోవైఖరుల్ని ప్రదర్శిస్తారు :

పాఠ్యాంశాలు అధ్యయనంచేసింతర్వాత వాని సారాన్ని విద్యార్థులు స్వీకరించి మనోవాక్కాయ కర్మలలో ప్రదర్శించే తీరును మనోవైఖరులు అనవచ్చు. ధనాత్మకమైన వైఖరులను పెంపొందించడం భాషాబోధన లక్ష్యం. వైఖరులను వివరించడానికి ఈ కింది స్పష్టీకరణాలు ఉపకరిస్తాయి.

i) విద్యార్థులు సాహితీవేత్తలయందు గౌరవభావాన్ని కల్గియుంటారు:

రచయితలుకనబడ్డపుడు విద్యార్థులు వారిని గౌరవించడం, సముచితంగా సమ్మానించడం మొదలైనవి ఈ స్పష్టీకరణంలోని ప్రధానాంశాలు. సమకాలీన రచయితలను విద్యార్థులకు పరిచయంచేసి వారిపై గౌరవం ఇనుమడింపజేయడం ఉపాధ్యాయుల కర్తవ్యం.

ii) విద్యార్థులు ఇతర భాషలయందు సమానాదరం చూపుతారు:

పాఠశాలస్థాయిలో విద్యార్థులకు మూడుభాషలు బోధింపబడ్తాయి. వీని యందేగాక ఇతర భాషలయందు, ఆ భాషలు మాట్లాడేవార్ని ఆదరంతో చూడడం పలకరించడం చేయాలి. విద్యార్థులు . వీలయినన్ని ఎక్కువ భాషలు నేర్చుకోవడం ఈ స్పష్టీకరణం ఆశయం.

iii) విద్యార్థులు ఇతరుల రచనల పట్ల ప్రశంసా దృష్టిని ప్రదర్శిస్తారు:

తమ తోటివారు రచనలు చేసినప్పుడు వానిని వినడం ప్రోత్సహించడం కూడా విద్యార్థులు కనబర్చాల్సిన సముచితమైన వైఖరే. ఈ దృష్టి విద్యార్థి మానసిక ఎదుగుదలను సూచిస్తుంది.

iv) విద్యార్థులు విమర్శలను సహృదయంతో స్వీకరిస్తారు:

ఇతరులు తమ రచనలపై చేసిన విమర్శలను విద్యార్థులు సహృదయంతో స్వీకరించి అవసరమైన మార్పులు చేసికోవడం ఈ స్పష్టీకరణం ఆశయం సద్విమర్శకు ప్రతిస్పందించడం, కువిమర్శను పట్టించుకోకపోవడం దీనియందలి ప్రధానాంశం.

v) విద్యార్థులు విమర్శనాత్మక దృష్టిని కల్గి ఉంటారు:

విద్యార్థులు సదా సద్విమర్శచేసే శక్తిని కల్గియుండటం, దాన్ని అలవరచ కోవడం జరగాలి. విమర్శనాత్మకంగా ఆయా రచనలను చదివే అలవాటున విద్యార్థుల్లో పెంపొందించడం కూడా ఈ స్పష్టీకరణం ఆశిస్తోంది.

vi) విద్యార్థులు రచనల్లోని పాత్రల ఎడ, సన్నివేశాల ఎడ సముచిత వైఖరి ప్రదర్శిస్తారు:

రచనల్లోని పాత్రల ప్రవర్తన, సన్నివేశాల ఆంతర్యం కూలంకషంగా అర్థంచేసికొని విద్యార్థులు వానియందు సద్వైఖరిని ప్రదర్శించగల్గితే ఈ స్పష్టీకరణాన్ని సాధించినట్లే.

ఈ లక్ష్యాన్ని పద్యం, గద్యం, నాటకం, వ్యాసం, ఉపవాచకం మొదలైన పాఠాల్లో విద్యార్థులు సాధించగలిగేట్లు చూడటం ఉపాధ్యాయుల కర్తవ్యం

(K) విద్యార్థులు భాషాంతరీకరణ సామర్థ్యాన్ని సంపాదిస్తారు.

భాషాబోధనలో ఈ లక్ష్యం రెండుభాషల బోధన ప్రారంభించి నాటినుండి ప్రారంభమవుతుంది. కేవలం లిప్యంతరీకరణంగాక భావాలన ఒక భాషనుండి మరోభాషలోకి, పరభాషనుంచి తన భాషలోకి తేవడాని అవసరమైన మెలకువలను విద్యార్థులకు తెలియజేయాలి. ఈ లక్ష్యసాధన దశలో కింది స్పష్టీకరణాలను దృష్టియందుంచుకోవాలి.

i) విద్యార్థులు ఉభయభాషల్లోని వాక్య నిర్మాణ పద్ధతుల్ని గ్రహిస్తారు:

ఇంతకుముందు ప్రస్తావించబడినట్లు ప్రతి భాష తనదేయైన వాక్యనిర్మా

ణక్రమాన్ని కల్గియుంటుంది. ఆ నిర్మాణ క్రమాలు, భాషాస్వభావాలు సమగ్రంగా తెల్సికొంటే తప్ప అనువాదం చేయలేం. విద్యార్థులు వీనిని గ్రహించగల్గితే ఈ స్పష్టీకరణం సాధించినట్లుగా భావింపవచ్చు.

ii) విద్యార్థులు ఉభయభాషల్లోని పదాలకు సమానార్థక పదాలను ఎంపికచేసి- కొంటారు:

ప్రతి భాషకు తమవైన పలుకుబళ్ళు, లోకోక్తులు ఉంటాయి. ఒక భాషావాతావరణాన్ని మరో భాషావాతావరణానికి పరిచయంచేస్తున్నపుడు రెండవ భాషలోని సమానార్థలను ఎంపిక చేసుకోవాలి. ఉదా: ఆంగ్లంలో 'I want to speak my mind' అన్నదానికి నాహృదయం విప్పి చెప్పదలిచాను అన్న అనువాదం చేయాలి. నేను మెదడుతో మాట్లాడాలను కొంటున్నాను అనే అనువాదం పేలవంగా, సంబంధ రహితంగా ఉంటుంది. ఇట్లు ఒక భాషా సంప్రదాయాన్ని మరో భాష లోకి నేరుగా మక్షికి మక్షిగా అనువదించకుండా జాగ్రత్తపడాలని ఉపాధ్యాయులు విద్యార్థులకు తెలియ చెప్పాలి.

ఒక విధంగా అనువాదం చేయడం స్వంత రచన కన్న కఠినమైనదని భాషావేత్తలు భావిస్తారు. కారణం ఉభయ భాషల అంతః సౌందర్యాన్ని పూర్తిగా స్వంతం చేసుకొంటే తప్ప ఇది సాధ్యం కాదు. మూల రచయిత హృదయాన్ని ఆవిష్కరింపజేసికోవల్సిన శక్తి కల్గడానికి రెండు భాషల్లో సమానమైన అభినివేశం ఉండాలి. భాషా సంపన్నత కల్గియుండకపోతే అనువాదం సాధ్యంకాదు. అందువల్ల సృజనాత్మక రచన చేయడమే సులభమని పెక్కురి అభిప్రాయం. తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రధాన ప్రక్రియలు ఇతర భాషలనుండి అనూదితాలే. సంస్కృతం, ఆంగ్లం, బెంగాలి, పారసీ మొదలైన భాషా సాహిత్యాలనుండి పరివర్తనం చెందినవే. ఆయా అనువాదకులు ఉభయభాషామర్మముల నెరిగినవారుగా గుర్తింపు పొందారు. కొన్నిచోట్ల మూలాన్ని అనుసరించి, మరికొన్ని చోట్ల మార్పులు చేసికొని, కొన్ని చోట్ల కేవలం భావాలనే గ్రహించి అనువదించిన సందర్భాలు కొల్లలు.ఇంగ్లీషు నుండి అనువదించ బడినట్లు చెపుతున్న మొదటి తెలుగు నవల రాజశేఖరచరిత్ర మళ్ళీ ఇంగ్లీషులోకి అనువదింపబడిందంటే ఆ అనువాదంలోని విశిష్టత ప్రస్ఫుటమవుతుంది. ఇట్లు అనువాద రచనల్లో చేయితిరిగిన వారు మన రచయితల్లో దర్శనమిస్తారు. విద్యార్థులు అనువాదం చేసే సామర్థ్యాలను ఉన్నత పాఠశాల దశనుండే అలవరచుకోవాలని. ఈ లక్ష్యం ఆశిస్తుంది.

పైన పేర్కొన్న బోధన లక్ష్యాలను, ఈ లక్ష్యాలను విద్యార్థులకు చేరవేసే ప్రాథమికమైన శ్రవణ నైపుణ్యాన్ని విద్యార్థులు సాధించే విధంగా భాషా బోధకులు కృషి చేయాలి. ప్రతీ పాఠం బోధించుట ద్వారా తాము తమ విద్యార్థుల్లో ఆశిస్తున్న ప్రవర్తనా మార్పులేవి? వానిని సూచించే లక్ష్యాలేవి? ఆ లక్ష్యంలోని ఏ స్పష్టీకరణాలను ఈ పాఠం ద్వారా విద్యార్థులు సాధించగల్గుతారు? అనే అన్ని విషయాలను పరిశీలించి స్పష్టీకరణాలను పాఠ్యాంశ సన్నివేశాలతో అన్వయించుకొని పాఠ్యబోధన కన్నా ముందే వీనిని నిర్ణయించుకొని, వాని సాధనకు అనువైన బోధన వ్యూహాంను ఎన్నుకోవాలి. స్పష్టీకరణాలు పాఠ్య పథకంలో రాస్తున్నపుడు ఈ కింది అంశాలు దృష్టియందుండాలి. ఉదాహరణగా:

పాఠం : దేవాలయం
బోధనాంశం : దేవాలయాలు పురా సంస్కృతి నిలయాలు (ఒకే ఒక ప

సాధించాల్సిన లక్ష్యాలు- స్పష్టీకరణాలు

విషయజ్ఞానం :

i) విద్యార్థులు పవిత్ర స్థలాలను జ్ఞప్తికి తెచ్చుకుంటారు.

ii) విద్యార్థులు దేవాలయాలు పురా సంస్కృతీ నిలయాలని గుర్తిస్తారు.

భాషా జ్ఞానం :

i విద్యార్థులు దేవాలయం అనే పదం లోని సంధిని జ్ఞప్తికి తెచ్చుకొంటారు.

ii) విద్యార్థులు నిలయం అనే పదానికి అర్థాన్ని జ్ఞప్తికి తెచ్చుకొంటారు.

iii) విద్యార్థులు 'పురాసంస్కృతి' అనే సమాస పదానికి విగ్రహ వాక్యాన్ని గుర్తిస్తారు.

అవగాహనం :

i) విద్యార్థులు 'పురాసంస్కృతిని' వివరిస్తారు.

ii) విద్యార్థులు పురాసంస్కృతికి ఒక ఉదాహరణ ఇస్తారు.

iii) విద్యార్థులు పురాసంస్కృతికి, ఆధునిక సంస్కృతికి గల భేదాలు చెప్తారు

సంస్కృతి సంప్రదాయాలు :

i) విద్యార్థులు దేవాలయాలు ప్రాచీన సంస్కృతీ నిలయాలని గ్రహిస్తారు

ii) విద్యార్థులు ఆధునిక, ప్రాచీన దేవాలయాలు సంస్కృతీ కేంద్రాలని చెప్తారు.

వైఖరులు:

i) విద్యార్థులు దేవాలయాల ఎడ గౌరవాన్ని, ఆదరాన్ని ప్రకటిస్తారు.

ii) విద్యార్థులు హిందూ దేవాలయాలతో బాటు చర్చి, మసీదుల ఎడ గౌరవం చూపుతారు వానిని దర్శిస్తారు.

వాగ్రూప అభివ్యక్తి :

i) విద్యార్థులు స్పష్టంగా, సమాధానాలు చెప్పగలుగుతారు.

ii) విద్యార్థులు 'పురాసంస్కృతి' అనే పదాన్ని దోష రహితంగా ఉచ్చరిస్తారు.

లిఖిత అభివ్యక్తి:

i) విద్యార్థులు స్పష్టంగా, వ్యాకరణ యుక్తంగా సమాధానాలు రాస్తారు.

పఠన నైపుణ్యం :

i) విద్యార్థులు ఉచ్చారణాదోషరహితంగా చదువుతారు.

ii) విద్యార్థులు 'పురా సంస్కృతి' అనే పదాన్ని స్పష్టోచ్చారణతో చదువుతారు.

భాషాభి రుచి :

i) విద్యార్థులు దేవాలయాలకు, సంస్కృతికి సంబంధించిన పుస్తకాలు విస్తారంగా పఠిస్తారు. వాని యందు ఆసక్తి చూపుతారు.

ఇట్లు వివిధ దృక్కోణాల్లో పాఠ్యాంశాన్ని చదివి ఆ పాఠ్యాంశం బోధించుట ద్వారా విద్యార్థుల్లో ఆశిస్తున్న ప్రవర్తనా మార్పుల్ని స్పష్టంగా నిర్వచించుకోవాలి, వీనిపై ఉపాధ్యాయులు పూర్తి అవగాహన కల్గి ఉండి బోధనను నిర్వహించినపుడు మాత్రమే విద్యార్థుల్లో ఆశించిన ప్రవర్తనా మార్పులు అనతి కాలంలో సాధించగలరు. తద్వారా విద్యాబోధన గమ్యాలు సాధించవచ్చు.

# ఐదో అధ్యాయం

## విద్యాప్రణాళిక - పాఠ్య ప్రణాళిక

### 5.01. విద్యా ప్రణాళిక (Curriculam) :

విద్యాక్షేత్రంలో విద్యా ప్రణాళిక, పాఠ్య ప్రణాళిక అనే పద బంధ వాడుకలో ఉన్నాయి. ఈ రెండు ఒకదానితో ఒకటి అంతర సంబంధ వ అంశాలు. విద్యా ప్రణాళిక పాఠ్య ప్రణాళికల నిర్మాణానికి ప్రాతిపదిక ఏర్పరుస్తుంది. శ్రీ.పి.వి.చలపతి రావుగారి అభిప్రాయంలో "విద్యా ప్రణా రచన కేవలం కేవల పాఠ్యప్రణాళికల కూర్పు, లేదా వాని సమాహారం క పాఠ్యప్రణాళికలు విద్యా ప్రణాళికలో అంతర్భాగాలు".పాఠశాలల్లో చేపట్టి విద్యా సంబంధమైన వివిధ కార్యక్రమాల సమగ్ర స్వరూపమే విద్యాప్రణ అని చెప్పవచ్చు. ఈ కార్యక్రమాలు సాధారణంగా విద్యా విధా ఉద్దేశించిన గమ్యాల ఆధారంగా రూపొందింపబడతాయి. ఆయా సమా అవసరాలు, సమస్యలు దృష్టి యందుంచుకొని వానిని సాధించుటయే గమ్య విద్యాప్రణాళిక రూపొందింపబడుతుంది. అవసరాలు మార్పుచెందితే ప్రణాళికల్లో కూడా మార్పులు చోటు చేసుకొంటాయి. అయితే ప్రణాళికల్లో మార్పు, సమాజాల్లో మార్పు వచ్చినంత వేగంగా అన్ని సందర రాకపోవచ్చు. అనుసరింపబడుతున్న ప్రణాళికలు, కార్యక్రమాల్లోని లోపా గుర్తించి అవి కనీస అవసరాలను కూడా తీర్చగల్గడం లేదని భావించిన మాత్రమే విద్యా ప్రణాళికలు సమూలంగా మార్పులకు నోచుకొంట అంతేగాక ప్రభుత్వాలు తమ విద్యా విధానాన్ని ప్రకటించినప్పుడు జాతీయ స్థాయిలో విద్యావిధానాలను రూపొందించినప్పుడు గాని ప్రణాళికలు మార్పులకు లోబడుతాయి.

విద్యా ప్రక్రియకే విద్యా ప్రణాళిక పునాది వంటిది. విద్యా ప్రక్రి నిర్వహించాల్సిన వివిధాంశాలను, పరిక్రియలను స్పష్టంగా నిర్వచించి నిర్వహణ చివర లాభోక్తల్లో ఆశిస్తున్న ప్రవర్తనా మార్పుల్ని కూడా సు

గా విద్యా ప్రణాళిక పేర్కొంటుంది. విద్యార్థుల సర్వాంగీణ వికాసానికి దర్పణమైన ధనాత్మకమైన ప్రవర్తనా మార్పులకు విద్యా ప్రణాళిక దోహదకారి. అంతేగాక విద్యా ప్రక్రియతో సంబంధమున్న ప్రతి వారికి అంటే విద్యార్థులకు, తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు, నిర్వహణాధికారులకు, యాజమాన్యాలకు సక్రియాత్మకమైన మార్గదర్శకత్వం వహించేదిగా విద్యా ప్రణాళిక ఉపయోగపడుతుంది. దీని ధ్యేయం ద్విముఖమైంది. అది

i) ఉత్పత్తి ధ్యేయం (Product oriented).

ii) ప్రక్రియా ధ్యేయంగా (Process oriented) ఉంటుంది.

పై రెండు ముఖాలు విద్యా ప్రణాళిక సమర్థతకు సూచికలు విద్యా ప్రణాళిక ఈ కింది లక్షణాలను కల్గి ఉండాలని విద్యావేత్తలు అభిప్రాయపడ్డారు.

i) ఉపాధ్యాయులు విద్యార్థుల్లో ఆశించే ప్రవర్తనా మార్పుల్ని నిర్వచించడం.

ii) ఆశించే ప్రవర్తనా మార్పులకు ఉపకరించే బోధనాంశాలను సూచించడం.

iii) బోధనాంశాలను విద్యార్థులకందించడానికి ఉపకరించే బోధన పద్ధతులను సూచించడం.

iv) బోధనను ప్రభావశీలం చేయడానికి ఉపకరించే సాధనాలను గుర్తించడం.

v) బోధనాంశాలు విద్యార్థులకు ఏ మేరకు స్వంతమయ్యాయో తెల్సికోవడానికి ఉపకరించే మూల్యాంకనా ప్రక్రియలను ఎంపిక చేయడం.

విద్యా ప్రణాళికల రచనల్లో సమానత్వ సిద్ధి, గుణాత్మకత, సంబద్ధతలకు ప్రాధాన్యమీయాలని కొఠారి విద్యా సంఘం నొక్కి చెప్పింది. ఇట్టి విద్యా ప్రణాళికలు ఆయా సమాజాల

i) తాత్విక భావనలు,

ii) సామాజిక భావనలు,

iii) మనో వైజ్ఞానిక భావనల

పై ఆధారపడతాయి. 1986 నాటి జాతీయ విద్యా విధానాన్ననుసరించి మన విద్యా ప్రణాళిక కింది మౌలిక అంశాలను (core curriculam elements) కల్గి యుండాలి. ఇవి అన్ని బోధనాంశాల్లో సముచితంగా ఒదిగిపోయి విద్యార్థుల్లో ఆశిస్తున్న విద్యాగమ్యాలు సాధించగల్గాలి.

i) భారతదేశ స్వాతంత్ర్యోద్యమచరిత్ర.
ii) రాజ్యాంగ బాధ్యతలు.
iii) జాతీయ అభేదత్వాన్ని పెంపొందించే అత్యవసర అంశాలు.ఏకత్వ
iv) భారతీయ సార్వజనీన వారసత్వం, సంస్కృతి.
v) సమసమాజం ప్రజాస్వామ్యం, లౌకిక చట్టాలు.
vi) స్త్రీ,పురుష సమానత్వం, స్త్రీలను గౌరవించడం.
vii) వాతావరణ పరిరక్షణ, పర్యావరణ భావన.
viii) సామాజిక రుగ్మతలు, అవరోధాలు, మూఢాచారాల నిర్మూలన.
ix) చిన్న కుటుంబభావనను పెంపొందించడం.
x) శాస్త్రీయ దృక్పథం.

పై అంశాలతో బాటు పరిశీలించాల్సిన అంశాలుగా అంద సమదృష్టి, కనీస సౌకర్యాల కల్పన, సామాజిక సార్థకత, విభిన్న భాగస్వామ్యం, విస్తరణ, వాణ్యత, వ్యూహాలు, యాజమాన్యం వావిని విద్యా ప్రణాళికలను రూపొందించుటలో దృష్టియందుంచ అంతేగాక మానవుల అవగాహనకు వీలైన అన్ని క్షేత్రాల్లోను ప్రణాళికలు కొత్త విజ్ఞానాన్ని ఉత్పత్తి చేయగల్గాలి. అనువర్తనక సిద్ధాంతాలు, పద్ధతులు మార్గదర్శక సూత్రాలను రూపొందించ అనువర్తన (ఆచరణ)లో ఎదురుగు సమస్యల్ని పరిష్కరించడానికి జ్ఞాన నైపుణ్యాలను కల్గించి పరిశోధన, అభివృద్ధి, వ్యాప్తిని ప్రధావా విద్యా ప్రణాళిక గుర్తించాలి. ఇవన్నీ రాష్ట్రాలు తమ ప్రాంతాలలోని కోసం రూపొందించుకొన్న పాఠ్య ప్రణాళికల్లో ప్రతిబింబించాలి.

## 5.02. పాఠ్య ప్రణాళిక (Syllabus):

దీనిని విషయ ప్రణాళిక అని కూడా వ్యవహరిస్తారు. విద్యా ప్ర భాగంగా పాఠశాలల్లో విద్యార్థులకు వివిధ పాఠ్య విషయాలన సంబంధ విషయాలను బోధిస్తారు. ఈ పాఠ్య, పాఠ్య సంబంధ విష సంబంధించిన ప్రణాళికలను పాఠ్య ప్రణాళికలు (syllabus) అని వ్యవహ పాఠశాలల్లో రెండు విధాలైన పాఠ్య విషయాలు బోధింపబడుతున్నా భాషలు మరియు భాషేతర విషయాలైన గణితశాస్త్రం, సాంఘిక సామాన్యశాస్త్రం. (చివరి రెండింటిని ప్రాథమిక దశలో పరిసరాల I, II అని వ్యవహరిస్తారు). ఈ విషయ సంబంధ ప్రణాళికలు విద్యావిధానం, జాతీయ విద్యా పరిశోధన శిక్షణ సంస్థ వారు స

మార్గదర్శక సూత్రాల మేరకు సిద్ధం చేయడానికి రాష్ట్రాల స్థాయిలో వివిధ బోధనాంశాలకు పాఠ్య ప్రణాళికా నిర్మాణ సంఘాలను రాష్ట్ర ప్రభుత్వాలు నియమిస్తాయి. ఈ సంఘాల్లో ప్రాథమిక స్థాయినుండి విశ్వవిద్యాలయ స్థాయి వరకు ఆయావిషయాలను బోధించే ఉపాధ్యాయులు, విషయ నిపుణులు (Subject experts). ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులు, తల్లిదండ్రుల ప్రతినిధులు, (విద్యార్థుల ప్రతినిధులు) బోధనాశాస్త్ర ప్రవీణులు, విద్యాశాఖ అధికారులు సభ్యులుగా ఉండి ఆయా బోధనాంశాలకు పాఠ్య ప్రణాళికల చిత్తు ప్రతులను తయారుచేస్తారు. ఈ చిత్తు ప్రతులు పాఠ్య ప్రణాళిక విస్తృత సంఘాలు నియమించిన ఉప సంఘాలచే మార్పులు చేర్పులకు లోనుకొని పూర్తి స్థాయి పాఠ్యప్రణాళికగా స్థిరీకరింపబడతాయి. ఇవి స్థిరీకరింపబడటానికి విస్తృత చర్చలు ప్రాతిపదిక. సిఫార్సు చేయబడిన పాఠ్య ప్రణాళికలను రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖవారు ఆమోదించి పాఠ్యపుస్తక రచయితల నెన్నుకొని పుస్తకాలు రాయిస్తారు. ఇట్లు తయారు చేయబడిన పాఠ్యప్రణాళికలు, పాఠ్యపుస్తకాలు కనీసం నాలుగైదేండ్లవరకు అమలులో ఉండి తిరిగి ఆనాటి అవసరాలు, దృక్పథాల మేరకు పునర్నవీకరింపబడతాయి. ఈ పాఠ్యప్రణాళికల్లో భాగంగానే భాషా పాఠ్యప్రణాళికలు కూడా నిర్మించబడతాయి. ఇది భాషా పాఠ్యప్రణాళికా సంఘంవారి నేతృత్వంలో సాగుతుంది. ప్రణాళికను తయారు చేస్తున్నప్పుడు విద్యా ప్రణాళికల మౌలికాంశాలు, గమ్యాలు దృష్టియుందుంచుకొంటారు.

## 5.03. భాషా ప్రణాళిక రచన (Language planning) :

భాషా ప్రణాళిక అను భావన ఆధునిక భావన. భాషా శాస్త్రజ్ఞులు ఈ ప్రణాళిక రచనలో విశేష కృషి చేస్తున్నారు. భాషా ప్రణాళిక మానవుల జీవన విధానానికి, దృక్పథానికి సంబంధించింది. భాషాభ్యసనంలోని వివిధ సమస్యల్ని, వానిని అధిగమించడానికి అనుసరించాల్సిన వ్యూహాలను, అభ్యసన ప్రాధాన్యతలను (Learning Priorities) నిర్ణయించడం భాషా ప్రణాళిక రచన ప్రధాన ఉద్దేశం. భాషా ప్రణాళికరచన అనే భావన ఇటీవలి కాలంలో భాషా శాస్త్రజ్ఞులచే ప్రతిపాదింపబడింది. పాశ్చాత్య దేశాల్లో విరివిగా వాడుకలోనున్న ఈ భావనను మనదేశంలోకూడా మైసూర్‌లోని భారతీయ భాషల కేంద్ర సంస్థ (Central Institute of Indian Language, Mysore) వంటి సంస్థలు వ్యాప్తికి తెచ్చాయి. వివిధ భాషలు మాట్లాడే వారి భాషా రూపాలను, ఒకే భాషలో వేరు వేరు ప్రాంతాల్లో ఉపయోగించే వివిధ

మాండలిక రూపాలను అధ్యయనం చేసి ప్రాంతీయ సాధారణ భాషా ప్రణాళికలను (General Regional language Planning) సిద్ధంచేయాలని డా॥ దేవీ ప్రసన్న పట్నాయక్ గారి అభిప్రాయం. వివిధ భాషా రూపాలు, మాండలికాల్లోని సారూప్యతలను, భేదాలను పరిగణనంలోకి తీసికొని ఆ భాషా వ్యవహర్తల మధ్య భావసమైక్యత, సంస్కృతీ సమైక్యతలను సాధించడం, తద్వారా భాషా వ్యవహర్తల సాధారణ అవసరాలను తీర్చడం భాషా ప్రణాళిక రచన ప్రధాన ఉద్దేశం. భాషాపటాల తయారీ, భాషలోని విశిష్ట పలుకుబళ్ళను గుర్తించడం ద్వారా భాషా వ్యవహారం మలువై ఆయా తరగతుల స్థాయిలో విద్యార్థుల కందించవలసిన భాషాంశాలను (కనిష్ఠ పదజాలం) నిర్ణయించడానికి వీలుకలుగుతుంది. ఈ విషయంలో మన రాష్ట్రంలోవిశేషమైన కృషి జరగాల్సి ఉంది.

## 5.04. పాఠ్యప్రణాళిక - భాష (Syllabus - Language) :

మన రాష్ట్రంలోని పెక్కు పాఠశాలల్లో తెలుగు ప్రథమ భాషగా, హిందీ ద్వితీయభాషగా, ఆంగ్లం తృతీయ భాషగా బోధింపబడుతున్నాయి. ఇంగ్లీషు భాషా పాఠ్య ప్రణాళికలను (Regional, Institute of English (R.I.E), Central Institute of English and Forigion Language (CIEFL) సిద్ధం చేస్తాయి. తెలుగు, హిందీ భాషలకు రాష్ట్ర ప్రభుత్వంచే నియమింపబడిన పాఠ్య ప్రణాళిక నిర్మాణ సంఘం పాఠ్యప్రణాళికలను సిద్ధంచేస్తుంది. తెలుగును, ప్రథమ భాషగా, ద్వితీయ భాషగా బోధించుటకు వేరు వేరుగా పాఠ్య ప్రణాళికలు పాఠ్య ప్రణాళికా నిర్మాణ సంఘం సిఫార్సు చేస్తుంది. ఇక వివిధ స్థాయిల్లో తెలుగు ప్రథమ భాష పాఠ్య ప్రణాళికల్లోని అంశాలను గూర్చి తెల్సుకొందాం.

### (i) ప్రథమ భాష - ప్రాథమిక దశ :

ప్రాథమిక దశలోని పాఠ్య ప్రణాళికలో పదజాలాన్ని పరిచయం చేయడం ప్రధాన గమ్యం. వీనితో బాటు విద్యార్థుల శ్రవణ, భాషణ, పఠన, లేఖన నైపుణ్యాలను అభివృద్ధిచేసి వారిని శిష్టవ్యవహర్తలుగా రూపొందించడానికి ప్రాథమికదశలోని పాఠ్యప్రణాళిక దోహదపడుతుంది. భాషావేత్తలు ఈ స్థాయిలో పరిచయం చేయాల్సిన పదజాలం ఎంత అనే అంశంపై విభిన్నాభిప్రాయాలు వ్యక్తంచేసారు. ప్రాథమిక తరగతుల్లో మొత్తం 2000 పదాలు పరిచయం చేయాలని ప్రస్తుతం రాష్ట్రప్రభుత్వం వారు ఆమోదించిన పాఠ్య ప్రణాళిక (1994) భావించగా, 2500 పదాలను పరిచయం చేయాలని

మరికొందరు అభిప్రాయ పడ్డారు. శ్రీ గొడవర్తి సూర్యనారాయణగారు (అభినవవాచార్యకకర్త) 2000 పదజాలాన్ని పరిచయం చేయాలని భావించారు. జాతీయ విద్యావిధానం (1986) ననుసరించి కనిష్ఠ అభ్యసన ప్రమాణాల కనుగుణంగా ఈ దశలోని విద్యార్థులకు కనీసం 5000 పదాలు పరిచయంకా వాలి. పాశ్చాత్యదేశాల్లో ప్రాథమిక తరగతులు పూర్తిచేసికొన్న బాలబాలికలు ఆరువేలకు పైబడిన పదాలు స్వంతం చేసికొంటారనే అభిప్రాయంకూడా ఉంది. అందువల్ల ప్రాథమికదశలో పదాలతోబాటు వాక్యనిర్మాణం స్పష్టమైన వ్యక్తీకరణం ప్రాధాన్యతలుగా పాఠ్యప్రణాళికలు రూపొందించబడతాయి

(ii) మాధ్యమిక - ఉన్నతదశలు :

మాధ్యమిక, ఉన్నత దశల్లో విద్యార్థులు ప్రాథమిక తరపగతుల్లో సాధించిన నైపుణ్యాలను పటిష్ఠంచేయడం, మరింత పదజాలాన్ని పరిచయంచేయడం, వారిలో భాషాభిరుచి, రసానుభూతి, వైఖరులు మొదలైనవి పెంపొందించడం ప్రధావాలు. విద్యార్థులను భాషావ్యవహారదక్షులుగా రూపొందించే కృషి ఈ స్థాయిలో జరుగుతుంది. వివిధ సాహిత్య ప్రక్రియలు పరిచయం చేయబడి, విద్యాప్రణాళిక మౌలికాంశాలు, గమ్యాల సాధనకై ఈ దశలో కృషిచేయాలి. ఈ స్థాయిలో సహపాఠ్య కార్యక్రమాలకు కూడా విశేష ప్రాధాన్యత ఉంటుంది. భాషేతర విషయాల అధ్యయనంలో కూడా భాష ప్రధాన పాత్ర వహిస్తుంది కనుక ఇచ్చట ద్విముఖ గమ్యాల సాధనకై పనిచేయాలి. ఈ స్థాయిలో భాషాపాఠ్యపుస్తకాల రచనలో, పాఠ్యాంశాల ఎంపికలో వైవిధ్యత అవసరం.

ఈ స్థాయిలోనే ద్వితీయభాషగా కూడా తెలుగు బోధన ప్రారంభమ ౚతుంది. భాషానైపుణ్యాల అభివృద్ధి, చిన్నచిన్న మాటల్లో భావాలను స్పష్టంగా వ్యక్తీకరించగల్గే శక్తి, సాహిత్యంలో కొంత ప్రవేశం కల్గించడంద్వారా విద్యార్థుల్ని స్థానీయ వక్తలుగా Native Speakers రూపొందించడం అవసరం.

ఈ స్థాయి లోనే ఉపవాచకాలు కూడా ప్రథమభాషా బోధనలో ప్రవేశపెట్టబడతాయి. ఇవి విద్యార్థుల వైయక్తిక, మానసికవికాసాలకు తోడ్పడాలి. ఇవి విరామ కాలాన్ని సద్వినియోగం చేసే పఠనీయ పుస్తకాలుగా ఉండాలి.

(iii) వాచకాలు, ఉపవాచకాలు, లక్షణాలు :

పాఠ్యప్రణాళికలో వాచకాలు, ఉపవాచకాలు ప్రధానమైనవి. వాచకాన్ని

ప్రధానవాచకమని, ఉపవాచకాన్ని అనుబంధ వాచకమని వ్యవహరిస్తారు. ఒకటోతరగతినుండి పదో తరగతివరకు ప్రధాన వాచకాలు, ఆరోతరగతినుండి ప్రధాన వాచకంతోబాటు ఉపవాచకాలు నిర్దేశింపబడుతాయి. ద్వితీయ భాషాబోధనలో ఆరోతరగతినుండి పదోతరగతివరకు ప్రధానవాచకాలు పదోతరగతికి ఉపవాచకం సిఫార్సు చేయబడతాయి.

వాచకాలు, ఉపవాచక రచనలో తీసికోవాల్సిన జాగ్రత్తలు :

అన్ని దశల్లోని వాచకాలు, ఉపవాచకాలు ఈ కింది బాహ్య, అంతర లక్షణాలను కల్గిఉండాలి.

a) బాహ్యలక్షణాలు :

- మన్నికగల్గిన అట్ట (పుట్ట).
- విద్యార్థులకు అందుబాటులో ఉన్నవెల.
- ఆకర్షణీయమైన ముఖచిత్రం.
- అందమైన ముద్రణ.
- ముద్రణకుపయోగించిన కాగితం నాణ్యత.
- విద్యార్థులకు అనువైన పరిమాణం (సైజు).

b) అంతర లక్షణాలు :

- దోషరహితమైన ముద్రణ.
- ప్రాథమికదశలోని పాఠ్యపుస్తకాల ముద్రణలో వివిధరంగుల ఉపయోగం.
- ప్రతి పాఠానికి స్వయం వ్యక్తాలైన చిత్రాలు.
- ప్రాథమికదశలో సంభాషణలు, గేయాలు ఎక్కువగా ఉండటం.
- ప్రాథమిక దశలో పాఠాలు వీలైతే స్వయంగా ఎంపికచేసిన పదజాలాన్ని ఆశ్రయించి రాసినవైయుండాలి.
- పై తరగతుల్లో వివిధ ప్రాచీన, ఆధునిక సాహిత్య ప్రక్రియల పరిచయం.
- మాధ్యమిక ఉన్నతదశలో పాఠాలు వివిధ రచయితల రచనలనుండి సేకరించి కూర్చాలి.
- వివిధ శైలీ భేదాలను పరిచయంచేయాలి.
- ప్రతి పాఠానికి ముందు పాఠ ఉద్దేశం, పాఠంలో పరిచయంచేస్తున్న పదజాలం పొందుపరచాలి.

- విస్తృతమైన అభ్యాసవేదికలతో బాటు పుస్తకం చివర పరిచయం చేసిన పదజాల పట్టిక.

c) రచయితలు దృష్టియందుంచుకోవాల్సిన అంశాలు :

- పాఠం చివర విస్తృతమైన అభ్యాసవేదికలు, ఉపాధ్యాయులకు విద్యార్థులకు సూచనలు, విద్యార్థి, ఉపాధ్యాయకృత్యాలు పొందుపరచడం.
- చిన్న తరగతుల్లో సంధి విడదీసిన రూపాలు, పై తరగతుల్లో సంధి ఏర్పడిన పదరూపాల పరిచయం.
- ఇతర రచయితల పాఠాలు ఎంపికచేస్తున్నప్పుడు లేదా స్వయంగా రాస్తున్నపుడు అవి విద్యాప్రణాళిక మౌలిక భావనలకు ఆటంకం కల్గించకుండా జాగ్రత్తపడటం.
- విద్యాబోధన గమ్యాల సాధనకు వీలైన పాఠ్యాంశాల ఎంపిక.
- రచనల ఎంపికలో వివిధ శైలీ భేదాలను పాటించడం.
- వివిధ విషయాలపై పాఠ్యాంశాలుండటం. అంటే చరిత్ర, రాజనీతి, రాజ్యాంగం, విజ్ఞానశాస్త్రం, యాత్రారచన, పరిసరాలు, సామాజికశాస్త్రం, ఖగోళశాస్త్రం మొదలైన వానిని స్పృశించడం.
- విద్యార్థుల వయోపరిమితి, కనీసమనోశక్తి, తరగతిస్థాయిలకనుగుణంగా పాఠాల ఎంపిక.
- ఉపవాచకాల్లో వివిధాంశాలపై రాయబడిన వ్యాసరూప లేదా కథారూప లఘురచనలుండటం.
- పాఠాలు నాతిదీర్ఘంగా ఉండటం.
- పాఠాలు విద్యార్థుల ఆసక్తుల్ని, సృజనాత్మకశక్తుల్ని పురికొల్పేవిగా ఉండటం.
- స్వయం అధ్యయనానికి వీలుకల్గించడం.

d) వాచకాలు, ఉపవాచకాలు:

- విద్యాగమ్యాలను, భాషాబోధన ఉద్దేశ్యాలను విద్యార్థులు సాధించడానికి ఉపకరించాలి.
- విద్యార్థుల్లో భాషా సాహిత్య విషయక అభివృద్ధిని సాధించాలి.
- విద్యార్థుల విరామకాలాన్ని సద్వినియోగంచేయాలి.
- తరగతిలో చదువుకొన్న అంశాలను మననం చేసికోవడానికి పునర్చలనం చేసికోవడానికి ఉపకరించాలి.
- విద్యా ప్రమాణాల్లో సమరూపత (Uniformity) సాధించాలి.

- ప్రాథమికదశలో ఇవి పెద్ద అచ్చులో ఉండుటవలన విద్యార్థుల పఠనాభ్యాసాన్ని సులభం చేయాలి.
- వాచకాలు క్షుణ్ణపఠనానికి, ఉపవాచకాలు విస్తార పఠనానికి ఉపకరించాలి.

## 5.05 పాఠ్యపుస్తకాల జాతీయీకరణ :

పాఠ్యప్రణాళిక నిర్మాణసంఘంవారు సిఫార్సుచేసిన నిర్మాణ సూత్రాలపై ఆధారపడి రాసిన, రాయించిన పుస్తకాలే వాచకాలు, ఉపవాచకాలు. జాతీయీకరణం కాక పూర్వం నిర్దేశింపబడిన పాఠ్యప్రణాళికలకనుగుణంగా ప్రైవేటు రంగంలోని ప్రచురణకర్తలు పుస్తకాలు రాయించి ప్రభుత్వంచే ఆమోదింపజేసుకొని పాఠశాలలకు సరఫరాచేసేవారు. దీనివల్ల వేరువేరు పాఠ్యపుస్తకాలు రాష్ట్ర మంతటా విద్యార్థులచేతుల్లో ఉండేవి. ఈ కారణాన రాష్ట్రమందలి విద్యార్థులు వేరువేరు పాఠ్యాంశాలు చదవడం వల్ల విద్యాప్రమాణాలు రాష్ట్రంలో వేరువేరుగా ఉండటానికి అవకాశమేర్పడింది. రచన, ముద్రణ, పంపిణీలోని లొసుగులవల్ల విద్యార్థులకు అందుబాటులో లేని వెల, కొన్ని పర్యాయాలు పుస్తకాలు కూడా అందుబాటులో లేకపోవడం కూడా జరిగేది. ప్రధానంగా విద్యార్థులు తమ నివాసస్థలాన్ని మార్చినపుడు వేరువేరు పుస్తకాలవల్ల వారికి చాలా ఇబ్బందికల్గేది. పోటీలుపడి ప్రచురణకర్తలు పుస్తకాలు రాయించినపుడు కొన్ని పర్యాయాలు నాణ్యత కల్పించినప్పటికి, కొన్ని సందర్భాల్లో నాణ్యతాలోపంకూడా చోటుచేసికొనేది. ప్రైవేటుసంస్థల పుస్తకాలవల్ల ఈనాడు అత్యంత ప్రచారంలో ఉన్న దర్శినీ పుస్తకాలు (guides) మాత్రం అంతంతమాత్రంగానే ప్రచారంలో ఉండేవి.

రాష్ట్రవ్యాప్తంగా విద్యాప్రమాణాలు ఒకేతీరున ఉండాలని పాఠ్యపుస్తక ముద్రణ, క్రయవిక్రయాల్లో ప్రైవేటు యాజమాన్యాల ఆధిపత్యాన్ని తొలగించి విద్యార్థులకు అందుబాటులో ఉండే ధరలు నిర్ణయించడానికి పాఠ్యపుస్తకాలను జాతీయంచేయాలని ప్రభుత్వం నిర్ణయం తీసికొంది. ప్రభుత్వ విద్యాశాఖవారే సిఫార్సుచేయబడిన పాఠ్యప్రణాళికలకనుగుణంగా పుస్తకాలు రాయడానికి రచయితలను ఎంపికచేస్తారు. వారు రాసిన పుస్తకాలు సంపాదకమండలి పరిచేసి ముద్రణకు అనుమతినిస్తుంది. ప్రభుత్వం వారే ముద్రించి స్వయంగా పంపిణీచేసే బాధ్యతనుకూడా స్వీకరించారు. ఇందువల్ల విద్యాప్రమాణాల్లో రాష్ట్ర మంతటా సమరూపత సాధింపబడింది. కొన్ని సందర్భాల్లో పంపిణీవ్యవస్థలో కలిగే ఇబ్బందుల్ని అధిగమించగల్గితే జాతీయీకరణం ఫలవంతమవుతుంది.

పై విద్యాప్రణాళికల నేపథ్యంలో పాఠ్యప్రణాళికలు నిర్మించబడి వివిధ రచయితలు రాసిన పాఠ్యపుస్తకాలు తరగతిగదులకు చేరతాయి. వీనిని ఉపయోగించి ఉపాధ్యాయులు విద్యాబోధన సాగించి విద్యార్థుల్లో ఆశించిన వికాసాన్ని తద్వారా ప్రవర్తనా మార్పుల్ని సాధించాలి. ఉపాధ్యాయులు తరగతిగది బోధనకు అనువైన ప్రణాళికలు సిద్ధంచేసికొని వానికనుగుణంగా బోధనను కొనసాగిస్తే విద్యార్థులు నిర్ణీతసమయాల్లో ఆశించిన ప్రవర్తనలను సంపాదించగల్గుతారు. ఉపాధ్యాయులు పాఠ్యప్రణాళికననుసరించి సిద్ధంచేయాల్సిన ప్రణాళికలు,

i) వార్షిక ప్రణాళిక (Year Plan)
ii) పాఠ్యవిభాగ ప్రణాళిక (Unit Plan)
iii) పాఠ్యపథకం (Lesson Plan)

వీని గురించి కొంత తెల్సికొందాం.

### 5.06 వార్షిక ప్రణాళిక :

ఒక తరగతికి నిర్ణయించిన పాఠ్యపుస్తకంలోని పాఠాలను సంవత్సర కాలంలో విద్యార్థులకు బోధించడానికి నెలవారీగా ఏర్పరచుకొన్న విధం వార్షిక ప్రణాళికలో వివరింపబడుతుంది. జూన్ నెలనుండి ఏప్రిల్ నెలవరకు ప్రతినెల బోధించే పద్య పాఠాలు, గద్య పాఠాలు, వ్యాకరణం, వ్యాసాలు, ఉపవాచకాంశాలు, ఇతర సహపాఠ్య కార్యక్రమాలను సమగ్రంగా సూచించడమే వార్షిక ప్రణాళిక ఉద్దేశం. ప్రతినెల మొదట, గడచిన నెలలో పూర్తిచేద్దామనుకొన్న పాఠ్య, సహపాఠ్య క్రమాలు పూర్తిచేసారో లేదో పరీక్షించుకొని అనుగుణంగా ముందు కార్యక్రమాలు చేపట్టడం దీనిద్వారా సులభమవుతుంది. ఇది భాషా విషయంలో పాఠశాలలో నిర్వహించే బోధన కార్యక్రమానికి దర్పణంవంటిది. ఇది ఉపాధ్యాయులను బోధనకు సర్వసన్నద్ధులను చేసి గమ్యాల సాధనలో వెనుకంజ వేయనీయకుండా చేస్తుంది.

### 5.07 పాఠ్యవిభాగ ప్రణాళిక (Unit Plan) :

వార్షిక ప్రణాళిక, విద్యా సంవత్సర ప్రణాళిక అయితే పాఠ్యవిభాగ ప్రణాళిక ప్రతి బోధనాంశానికి సంబంధించింది. భాషలో పద్యం, గద్యం, వ్యాకరణం, నాటకం, వ్యాస పాఠాలను బోధిస్తాం. పద్యభాగంలో, గద్యభాగంలో వివిధ రచయితలనుండి పాఠాలు సేకరించి కూర్చబడతాయి. ఈ ప్రణాళికలో ప్రతిపాఠానికి ఒక ప్రణాళిక సిద్ధంచేసికోవడం జరుగుతుంది. భాషలో ప్రతి

పాఠంకూడా ఒక యూనిట్ అని భావింపబడుతోంది. యూనిట్ అంటే ఏకలక్షణ సంపన్నత కల్గిన ఒక బోధనాంశం. పాఠ్యవిభాగ ప్రణాళికలో ఈ కింది అంశాలు చోటుచేసికొంటాయి.

i) యూనిట్ (పాఠం) పేరు
ii) శీర్షికలు (పాఠ్యాంశాలు)
iii) బోధనకు కావల్సిన సమయావధులు
iv) విషయ విశ్లేషణం - బోధనాంశాలు (ప్రధానమైనవి)
v) విద్యార్థుల్లో సాధించాల్సిన బోధన లక్ష్యాలు
vi) బోధన పద్ధతులు
vii) బోధనోపకరణాలు
viii) బోధనకుపయోగపడే పరామర్శ గ్రంథాలు, మూలగ్రంథాలు

పై వివరాలతో సమగ్రంగా ప్రతి పాఠానికి ఒక ప్రణాళికను సిద్ధంచేసికొని నిర్ణయించుకొన్న సమయావధుల్లో బోధనను పూర్తిచేయాలి.

## 5.08 పాఠ్యపథకం (Lesson Plan) :

ఇది ఒక సమయావధిలో బోధించే పాఠ్యాంశానికి (శీర్షిక) సంబంధించిన ప్రణాళిక. ఇది సమగ్రంగా ఉంటుంది. పాఠ్య విభాగ పథకంలో సూచించిన విషయవిశ్లేషణం, ఆశిస్తున్న లక్ష్యాలు, స్పష్టీకరణాలు, బోధన పద్ధతులు బోధనోపకరణాలు, అదనపు పఠన సామాగ్రితోబాటు బోధన సోపానక్రమం ఉపాధ్యాయ విద్యార్థి కృత్యాలు, నల్లబల్ల పని మొదలైన సమగ్ర వివరాలతో ఇది కూడి ఉంటుంది. ఇది 45 నుండి 50 నిముషాలకాలంలో తరగతిగదిలో ఒక పాఠ్యాంశాన్ని బోధించడానికి వీలుకల్పిస్తుంది. పాఠ్యపథకాల రచనయందు మెలకువలను సంపాదించిన భాషోపాధ్యాయులు విద్యార్థుల సర్వాంగీణ వికాసానికి దోహదపడ్తారు. ఈ పథకాన్ని పాఠ పథకం అని కూడా వ్యవహరిస్తారు.

పైన వివరించిన వివిధ ప్రణాళికల భావనలను ఉపాధ్యాయులు దృష్టియందుంచుకొని తమ నిత్యవ్యవహారంలో వివిధ ప్రణాళికలను దోషరహితంగా తయారుచేసికొని పాఠబోధనను కొనసాగించినపుడే విద్యాబోధన గమ్యాలు సాధించగల్గుతారు.

# ఆరో అధ్యాయం

# భాషానైపుణ్యాలు

### 6.01 ఉపోద్ఘాతం :

నిపుణత యొక్క భావం నైపుణ్యం. నైపుణ్యాన్ని కౌశలమని, సామర్థ్యమని కూడా వ్యవహరిస్తారు. భాషకు సంబంధించిన నైపుణ్యాలు భాషానైపుణ్యాలు. యాంత్రిక నైపుణ్యాలు, మనో నైపుణ్యాలు కూడా భాషా నైపుణ్యాలతో సంబంధం కల్గిన నైపుణ్యాలే. భాషను వినడం, మాట్లాడటం, చదవడం, రాయడం అనే చతుర్విధ పరికర్మలను భాషానైపుణ్యాలంటారు. చేతితో రాయడం, టైపులో, అచ్చులో అక్షరాకృతులను కూర్చడం, ధ్వనిలేఖనం చేయడంవంటివి యాంత్రిక నైపుణ్యాలుగా చెప్పవచ్చు. ఆలోచించడం, ఊహించడం, సృజనాత్మక శక్తుల్ని ప్రదర్శించడం మొదలైనవి మనో నైపుణ్యాలని భాషావేత్తలు భావిస్తారు. ఈ నైపుణ్యాలన్నీ సమాహార రూపంలో వ్యక్తులకు అలవడిననాడు వారు సమర్థమైన భాషాభిజ్ఞులుగా పరిగణింపబడతారు. ఈ నైపుణ్యాలు ప్రధానంగా రెండు భావనలకు సంబంధించినవి. ఇవి భావగ్రహణానికి, భావవ్యక్తీకరణకు ఉపయోగపడతాయి. భావ గ్రహణానికి శ్రవణ, పఠనాలు, భావవ్యక్తీకరణానికి భాషణ, లేఖనాలు తోడ్పడతాయి. వీని వల్లే వ్యక్తులు తమలోని భావాలను ఇతరులకు చెప్పడం, ఇతరుల ప్రతిస్పందనలను స్వీకరించడం చేస్తారు. భావగ్రహణం కేవలం వ్యక్తిగతమూ, ఆత్మగతమూ ఐతే భావవ్యక్తీకరణం సమాజగతమౌతుంది. భావవ్యక్తీకరణలో కనీసం ఇరువురు వ్యక్తులు అవసరం. భావ గ్రహణం ఇతరుల ప్రమేయం లేకుండా కూడా జరగవచ్చు. ప్రథమభాషగా తెలుగును అభ్యసించడానికి పాఠశాలకు వచ్చిన బాలబాలికలు భావ వ్యక్తీకరణ, భావగ్రహణ సామర్థ్యాల్లో కొంత సామర్థ్యాన్ని కల్గి ఉంటారు. అంటే భాషాధ్వనులను మాట్లాడగల్గుతారు. భాషా ధ్వనులకు వినగల్గుతారు. పాఠశాలకు వచ్చి విద్యనభ్యసించినా, అభ్యసించకపోయినా, పాఠశాలకు అసలే రాకపోయినా వారికి ఈ నైపుణ్యాలు సహజంగా అలవడతాయి. పాఠశాల ఈ రెండు నైపుణ్యాలను అభివృద్ధిపరచి, మిగతా రెండు నైపుణ్యాలైన పఠన, లేఖనాల్లో శిక్షణనీయాల్సి ఉంటుంది. ఈ కారణాన భాషోపాధ్యాయుల

బాధ్యత కొంతమేరకు సులువవుతుందని కొందరు భావిస్తారు. కాని ఏమీ తెలియని నేపథ్యంలో నైపుణ్యాలను పెంపొందించడం సులభంకాని తెలిసీ తెలియని తనంలో నైపుణ్యాలను మెరుగుపరచడం కష్టసాధ్యమని మరికొందరి భావన. అంటే రెండవ భాషగా బోధిస్తున్నప్పుడు భాషా నైపుణ్యాల అభివృద్ధి సులభంకాని ప్రథమభాషగా బోధిస్తున్నప్పుడు అంత సులభంకాదని ఉపాధ్యాయుల అభిప్రాయం. ఏది ఎట్లున్నను నాలుగు నైపుణ్యాలలో విశేషమైన అధికారం సంపాదించిన వ్యక్తులు సామాన్య వ్యవహర్తల స్థాయినుండి ప్రత్యేక వ్యవహర్తలుగా, విశిష్ట వ్యవహర్తలుగా పరిణితిచెందుతారు. ఈ నైపుణ్యాల్లో ఏ ఒక్కటీ ఆశించిన మేరకు వ్యక్తులు సాధించలేకపోతే అప్పుడు ఆ వ్యక్తులకు అర్థనైపుణ్యాలు లేక పాక్షికనైపుణ్యాలు మాత్రమే అలవడ్డాయని చెప్పవచ్చు. నైపుణ్యాలను సంపూర్ణంగా స్వంతంచేసికొన్న వ్యక్తులు చక్కని భాషా వ్యాపారాన్ని నిర్వహిస్తారు. వారు ఇతరులకు ఆదర్శప్రాయులౌతారు.

నాలుగు నైపుణ్యాలలో ఒకటవ, మూడవ, నైపుణ్యాలను ఒక జంటగా రెండవ, నాల్గవ నైపుణ్యాలను ఒక జంటగా వ్యవహరిస్తారు. సామాన్యవ్యవహారంలో మాత్రం శ్రవణ, భాషణ పఠన, లేఖనాలని వ్యవహరిస్తారు. శ్రవణ, భాషణాలు సామాన్య వ్యవహర్తలకు కూడా ఉండే నైపుణ్యాలు. పఠన, లేఖనాలు ప్రత్యేక వ్యవహర్తలకుండే నైపుణ్యాలు. ఈనాలుగు నైపుణ్యాలు ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి. ఒకదానిని మరొకటి ప్రభావితం చేస్తాయి. ఇవి ఉత్తరోత్తరా కఠినతమాలు. అంటే శ్రవణం కన్న భాషణం, భాషణం కన్న పఠనం, పఠనం కన్న లేఖనం కఠినాలని భాషాభిజ్ఞుల అభిప్రాయం. ఈ నైపుణ్యాలు వ్యక్తులకు అలవడటానికి చాలా సమయం తీసుకొంటాయి. ఈ నాల్గునైపుణ్యాల గురించి మరికొంత తెల్సికొందాం.

## 6.02 శ్రవణం :

భాషానైపుణ్యాలలో మొదటి నైపుణ్యం శ్రవణం. ఇది వ్యక్తికి సహజంగా అలవడే నైపుణ్యం కూడా. కేవలం శ్రవణలోపమైన చెవుడు ఉన్న వారు తప్ప తక్కిన అందరికి ఈ నైపుణ్యం సహజంగానే అలవడుతుంది. ఈ నైపుణ్యంలో శ్రవణేంద్రియం, శ్రవణనాడి, శ్రవణ శక్తులకు ప్రాధాన్యత. శ్రవణేంద్రియ లోపాలను పరిహరించడానికి ఈనాడు యంత్ర పరికరాలు లభ్యమవుతున్నాయి. వీని సాయంతో శ్రవణశక్తిని మెరుగుపరచవచ్చు.

భాష ప్రధానంగా మొదట ధ్వనిరూపంలోనే ఉంటుంది. వ్యక్తులుచేసే ధ్వని, తరంగాల రూపంలో ఎదుటివారి వరకు ప్రవహిస్తుంది. ఆ ధ్వని తరంగాలను శ్రోతల వెలుపలి చెవి స్వీకరించి వానిని మధ్య చెవిలోని కర్ణభేరి ద్వారా శ్రవణనాడికి అందిస్తుంది. శ్రవణనాడి ప్రేరేపితమై ధ్వనులను మెదడుకు చేరవేయుట ద్వారా వాని భావం అవగతమవుతుంది. ఇట్లు ధ్వనులను స్వీకరించి భావగ్రహణానికి తోడు భావ వ్యక్తీకరణానికి పూర్వరంగం సిద్ధంచేయుడానికి అనువుగా శ్రవణేంద్రియ నిర్మాణం భౌతికంగానే జరిగింది. సాధారణంగా శ్రవణేంద్రియ సాయంతో వ్యక్తులు రెండు విధాలైన ధ్వనులను వింటారు. అవి

i) అర్థవంతమైన ధ్వనులు.
ii) అర్థవంతం కావి ధ్వనులు.

అర్థవంతమైన, అర్థంవంతం కాని ధ్వనులలో వివక్షతను గుర్తించడం శ్రవణేంద్రియం చేస్తుంది. ఈ ధ్వనులు శ్రవణపేయంగా, సాధువుగా, కొన్ని పర్యాయాలు శ్రవణకఠోరంగా అసాధువుగా కూడా ఉంటాయి. శ్రవణపేయము, శ్రవణ కఠోరమైన ధ్వనులేవో కూడా శ్రవణేంద్రియం పసిగడ్తుంది. ఇతర భాషా ధ్వనులను కొన్ని సందర్భాల్లో అర్థవంతం కాని ధ్వనులుగా కూడా వ్యక్తులు భావించవచ్చు. ఇట్లు వివిధ సందర్భాల్లో ఉపాధ్యాయుల సహకారంతో, లేక ఆధ్వనులు పరిచయమున్న వ్యక్తులతో, లేక ఆధ్వనులను పదే పదే విన్నప్పుడు తమకు కల్గిన అనుభవాల ప్రాతిపదికపై అవి అర్థవంతాలా, అర్థ రహితాలా అనే విషయం వ్యక్తులు నిర్ణయించుకోవాలి. మరో భాషా ధ్వనులను గాని, తమ భాషలోనే తమకు పరిచయంకాని ధ్వనులనుగాని విని వానిని పరిచయం సుపరిచయం చేసుకోవాల్సిన అవసరం వ్యక్తులకు ఉంది. శ్రవణనైపుణ్య లక్షణాలను కింది విధంగా చెప్పుకోవచ్చు.

i) జాగ్రత్తగా ధ్వనులను వినడం.
ii) ధ్వనులను గుర్తించి తమకుముందే పరిచయమున్న ధ్వనులతో వెనువెంటనే సమన్వయ పరచుకోవడం. అవి ఏ భాషా ధ్వనులో నిర్ణయించుకోవడం.
iii) ధ్వనులు వింటున్నపుడు వాని ఊనికను, స్వరభేదాన్ని బట్టి భావాన్ని గ్రహించడం.
iv) ధ్వని ఉత్పత్తి విధానాన్ని గమనించడం.
v) ధారాళంగా గాని, సామాన్యంగా గాని మాట్లాడుతున్నప్పుడు అవధానంతో, ఏకాగ్రతతో విని అర్థంచేసికోవడం.

vi) చాలా మెల్లగాగాని, అతి వేగంగాగాని ధ్వనిచేస్తున్నప్పుడు కూడా అవధానంతో వినడం.
vii) ఆడంబరమైన రణగొణ ధ్వనుల మధ్యకూడా అవసరమైన ధ్వనులనే గుర్తించి వినడం.

సాధారణంగా శ్రవణశక్తి లోపమున్న వారిని ఈ విధంగా గుర్తించవచ్చు.

i) వారు ఒకవైపు చెవి వొగ్గి వింటారు.
ii) వారు తరగతిగదిలో ముందువరసలోనే కూర్చోనే ప్రయత్నం చేస్తారు.
iii) వారు ఉపాధ్యాయుల మాటలు వినరానప్పుడు పదేపదే పక్క విద్యార్థిని సంప్రదిస్తారు.
iv) వారు అనవసరంగా మధ్యలో కల్పించుకొని మాట్లాడతారు.
vi) వారు ఉపాధ్యాయుల ఉచ్చారణను సరిగా అనుసరించలేకపోతారు.
vii) వారు ఎదుటివారికి కూడా వినబడదనే అనుమానంతో బిగ్గరగా మాట్లాడతారు.

భాషా వ్యాపారంలో వ్యక్తులు ఎదుటివారు చేయు ధ్వనులను విని, ఆయా ధ్వనులతో తమకున్న పూర్వ పరిచయం ద్వారా వాటిని గుర్తించి వక్తల యొక్క అభిప్రాయాన్ని గ్రహిస్తారు. అందువల్ల విద్యార్థుల శ్రవణ సామర్థ్యాన్ని పెంపొందించడానికి ఉపాధ్యాయులు కింది అంశాలను దృష్టియందుంచుకోవాలి.

i) వాగ్వ్యవహారంలో భావాలను వ్యక్తంచేయడానికి ధ్వనులను స్పష్టంగా ఉచ్చరించడం.
ii) విద్యార్థులు వారి ఉచ్చారణను అనుసరించడంలో ఆలస్యమైతే విసుక్కోకపోవడం.
iii) క్రమానుగతంగా సులభమైన ధ్వనులనుండి ఉచ్చారణలో కఠినమైన ధ్వనులను పరిచయంచేయడం.
iv) శ్రవణశక్తిని తెల్సుకోవడానికి మధ్యమధ్య ఉచ్చరించమనడం.
v) అవధానంతో వింటున్నారా లేదా అన్న విషయాన్ని పరీక్షించడం.
vi) శ్రవణశక్తి లోపమున్న విద్యార్థుల్ని గుర్తించి తరగతిలోని ముందువరసల్లో కూర్చోబెట్టడం.
vii) పాఠశాల ఆరోగ్య పథకంలో భాగంగా గాని, స్థానిక ఆరోగ్య కేంద్రాల్లో గాని విద్యార్థులను పరీక్షచేయించడం.
viii) తల్లిదండ్రులకు శ్రవణ లోప విషయం నివేదించి సలహాలు ఇవ్వడం.

ix) శ్రవణశక్తి లోపమున్న విద్యార్థులను ఎవరూ ఎగతాళి చేయకుండా చూడటం.

x) సంయుక్తాక్షర ధ్వనులు, ద్విత్వాక్షర ధ్వనుల ఉచ్చారణ అభ్యాసంచేయి స్తున్నపుడు కొంత సహనం కల్గి ఉండటం.

xi) విద్యార్థుల తరగతిస్థాయి, మానసిక స్థాయికి అనుగుణమైన సంభాషణలు వినిపిస్తూ శ్రవణ అభ్యాసం చేయించడం.

xii) అనుకరణ ద్వారా ధ్వనులు విని ఉచ్చరించేందుకు విద్యార్థులు యత్నిస్తారు. కనుక ఉపాధ్యాయులు సుష్ఠూచ్చారణను వారిలో పెంపొందించడం.

ఇట్లు శ్రవణనైపుణ్యం విద్యార్థుల సహజశక్తియైనను దానిని క్రమీకరించి లోపాలున్న సవరించి వారి శ్రవణ పూర్వక అవగాహనా పటిమను పెంపొందించాల్సిన బాధ్యత ఉపాధ్యాయులదే.

## 6.03 భాషణం :

భాషానైపుణ్యాల్లో రెండోది, భావవ్యక్తీకరణ సాధనాల్లో మొదటిది భాషణం. దీన్ని 'వాచికచర్య' అని కూడా అంటారు. శ్రవణ, భాషణ నైపుణ్యాలు పరస్పరం ప్రభావితాలు. ఇవి పరస్పరాశ్రయాలు. ఈ నైపుణ్యాన్ని విద్యార్థులు సమర్థంగా అలవరచుకొని వారిని మంచి వ్యక్తీకరణమున్న వక్తలుగా రూపొందించడం ఉపాధ్యాయుల ఆశయం. మంచి వక్త అంటే దోషరహితమైన తర్కసహితమైన, శ్రోతలు అంగీకరించే భాషావ్యవహారాన్ని నిర్వహించడం అన్నమాట. డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు తమ ప్రగతిగీతలో మాటకున్న గొప్పదనాన్ని కింది విధంగా వివరించారు.

*"వాక్కుకున్న పదను వాడికత్తికిలేదు, మార్చగలదు మాట మనిషి మనసు.*
*జారవలదు నోరు జాగ్రత్త జాగ్రత్త, శబ్దములకు గొప్ప శక్తి గలదు"*

అంతేగాక 'నోరు మంచిదైతే ఊరు మంచిదౌతుంది' మొదలైన లోకోక్తులు కూడా భాషణం యొక్క గొప్పతనాన్ని తేటతెల్లం చేస్తున్నాయి. మాట్లాడే భాషకు, రాసే భాషకు మధ్య అంతరమున్నప్పటికి మాట్లాడే భాషారూపమే నిత్య వ్యవహారంలో ప్రధాన భాగస్వామి ఐనందువల్ల విద్యార్థులు భాషణంలో అత్యంత కౌశలం ప్రదర్శించాలి. ఈ భాషణ సామర్థ్యమే తరవాత పఠన, లేఖన సామర్థ్యాలను ప్రభావితం చేస్తుంది. ప్రఖ్యాత భాషావేత్త P. Gurrey ననుసరించి భాషణాన్ని కింది అంశాలు నియంత్రిస్తాయి.

i) ధ్వనులవినియోగం.

ii) ఎదుటివ్యక్తులకు అందించదల్చుకున్న సమాచారం.

iii) సమాచార వినిమయానికి ఉపయోగించే భాషారూపం.
iv) వ్యక్తుల వ్యక్తిత్వం.

పై నాల్గింటిలో వక్తల వ్యక్తిత్వం మరింత ప్రభావశాలి. వ్యక్తులకున్న భాషా స్పృహ భాషణాన్ని సమర్థం చేస్తుంది. స్పష్టమైన ఉచ్చారణ, పరిష్కృత ఊనిక, అర్థవంతమైన ధ్వనులు, హావభావాలు, శారీరక భంగిమలతో బాటు అనువంశికత, పరిసరాలు వక్తల భాషణాన్ని ప్రభావితం చేస్తాయి. పాఠశాలకు వచ్చే వరకే బాలబాలికలు తమ భావాలను ఎదుటి వారికి అందించగల్గిన భాషణ సామర్థ్యాలను కల్గి ఉంటారు. ఈ సామర్థ్యం పై గల వివిధ ప్రభావాల వల్ల వారి భాషణం కొన్ని సందర్భాల్లో శిష్టులకు అంగీకారయోగ్యం కాకపోవచ్చు. ఈ దశలో బాలబాలికల పద సంపత్తికూడా తక్కువే కనుక భావప్రకటన అత్యంత సమర్థం కాదు. అందువల్ల విద్యార్థుల పదజాల సంపత్తిని పెంచి, వారి భాషణంపై ఇతర ప్రభావాలను క్రమంగా తగ్గించి శిష్టమైన సభ్యసమాజం అంగీకరించగల్గిన భాషణశక్తిని పెంపొందించాల్సి ఉంటుంది

A) భాషణం లక్షణాలు :

ఉత్తమ భాషణానికి భాషావేత్తలు కింది లక్షణాలను పేర్కొంటారు.

i) స్పష్టత - భావస్పష్టత, ఉచ్చారణ స్పష్టత.
ii) ధారాళత.
iii) దోషరాహిత్యత.
iv) భావానుగుణమైన స్వరభేదకత.
v) సభ్యత.
vi) విమర్శనాత్మకత.
vii) భావానుక్రమత.
viii) సభాకంప రాహిత్యత.
ix) సంవేగికత్వం.
x) సందర్భోచిత భాషణం.

పై లక్షణాలను విద్యార్థుల స్థాయికి అనుగుణంగా పెంపొందించడం ఉపాధ్యాయుల బాధ్యత. భాషణశక్తిని పెంపొందించడంలో ఉచ్చారణ శిక్షణ ప్రధానపాత్ర వహిస్తుంది. శిశువు జన్మించినదాదిగా తల్లి, తండ్రి, కుటుంబంలోని ఇతరులు శిశువుకు మాటలు నేర్పడానికి ప్రయత్నిస్తారు. అత్త, అమ్మ అక్క, తాత, మామ మొదలగు బంధుత్వ సంబంధ పదజాలాన్ని మొదట తాము ఉచ్చరిస్తూ, శిశువులను ఉచ్చరించమని ప్రోత్సహిస్తారు. శిశువులు మొదట త, మ, క, త, మ అని ఏకాక్షరాలనే ఉచ్చరిస్తే అత్త

అమ్మ, అక్క, తాత, మామ అని ఉచ్చరించారని చుట్టుపక్కల వారు సంతసిస్తారు. ఇట్లు క్రమంగా ఏకాక్షర ధ్వనులు. రెండక్షరాల ధ్వనులు, మూడక్షరాల ధ్వనులు ఉచ్చరించడం శిశువులకు అలవడుతుంది. ఉచ్చారణ నేర్పే వ్యక్తుల ఉచ్చారణ ఎంత స్పష్టంగా ఉంటే శిశువులు అంతే స్పష్టంగా అనుకరించి ఉచ్చరిస్తారు. పాఠశాలకు వచ్చిన తర్వాత ఉపాధ్యాయులు బాలబాలికలకు మరింత పదజాలాన్ని అందించే దశలో స్పష్టమైన ఉచ్చారణ శిక్షణనీయాల్సి ఉంటుంది. ఉచ్చారణ శిక్షణలో ప్రధానమైంది వాగింద్రియ శిక్షణ. అందువల్ల వాగుత్పత్తి విధానాన్ని ఉపాధ్యాయులు తాము క్షుణ్ణంగా తెలిసికొని లోపరహితంగా విద్యార్థులకు శిక్షణనీయాలి.

**B) వాగుత్పత్తి క్రమం :**

వాగ్వ్యుత్పత్తి స్థానాలను కింది పటంలో గుర్తించవచ్చు.




ముఖయంత్ర పటము

1.నాసికా రంధ్రము
2.నాసికా కుహరము
3.ఓష్ఠము
4.వర్త్స్యము
5.జిహ్వ్యము(అంగిలి)
6.మూర్ధము
7.తాలువు
8.కాకలము
9.ఓష్ఠము
10.10.aదంతము
11.జిహ్వాగ్రము
12.జిహ్వామధ్యము
13.జిహ్వాపృష్ఠము
14.గళగర్తము
15.జిహ్వా మూలము
16.గో జిహ్వాక
17.స్వరపేటిక
18.నాద తంత్రికలు
19.శ్వాసనాళిక
20.ఆహారనాళిక

పై ముఖయంత్రంలోని వివిధ స్థానాలచేత మన భాషలోని ధ్వనుల్నీ ఉత్పత్తి ఔతాయి. ధ్వనులు ఉచ్చరింపబడే తీరు దిగువ విధంగా ఉంటుంది.

## స్వరాలు లేదా అచ్చులు :

అ : వివృతము, పూర్వస్వరము ఐన కంఠ్యము.
ఆ : వివృతము, ఉత్తరస్వరము ఐన కంఠ్యము.
ఇ : సంవృతము, పూర్వస్వరము ఐన తాలవ్యము.
ఈ : సంవృతము, పూర్వస్వరము ఐన తాలవ్యము.
ఉ : సంవృతము, ఉత్తరస్వరము ఐన ఓష్ఠ్యము.
ఊ : సంవృతము, ఉత్తరస్వరము ఐన ఓష్ఠ్యము.
ఋ : సంవృతము, పూర్వస్వరము ఐన మూర్ధన్యము.
ౠ : సంవృతము, పూర్వస్వరము ఐన మూర్ధన్యము.
ఌ : సంవృతము, పూర్వస్వరము ఐన దంత్యము.
ౡ : సంవృతము, పూర్వస్వరము ఐన దంత్యము.
ఎ : ఈషత్సంవృతము, పూర్వస్వరము ఐన కంఠతాలవ్యము.
ఏ : ఈషత్సంవృతము, పూర్వస్వరము ఐన కంఠతాలవ్యము.
ఐ : ఇది అ. ఇ అనే రెండు స్వరాలు అవ్యవధారంగా పలకడం వల్ల ఏర్పడి సంయుక్తాచ్చు (కంఠతాలవ్యము)
ఒ : ఈషత్సంవృతము, ఉత్తరస్వరము ఐన కంఠోష్ఠ్యము.
ఓ : ఈషత్సంవృతము, ఉత్తరస్వరము ఐన కంఠోష్ఠ్యము.
ఔ : ఇది అ, ఉ అనే రెండు స్వరాలు అవ్యవధావంగా పలకడం వల్ల ఏర్పడి పంయుక్తాచ్చు (కంఠోష్ఠ్యము)
ం : (సున్న) అనునాసికము.
ఁ : (అరసున్న) అనునాసికము.
ః : (విసర్గ): కంఠ్యము

## వ్యంజనాలు లేదా హల్లులు.

### క వర్గము :

క : అల్పప్రాణము, శ్వాసాత్మకము ఐన కంఠ్యము.
ఖ : మహాప్రాణము, శ్వాసాత్మకము ఐన కంఠ్యము.
గ : అల్పప్రాణము, నాదాత్మకము ఐన కంఠ్యము.
ఘ : మహాప్రాణము, నాదాత్మకము ఐన కంఠ్యము.

ఙ : అల్పప్రాణము, నాదాత్మకము ఐన అనునాసికము (కంఠ్యోచ్చారణతో కూడినది)

చ వర్గము :

చ : అల్పప్రాణము, శ్వాసాత్మకము ఐన తాలవ్యము.
ౘ : అల్పప్రాణము, శ్వాసాత్మకము ఐన దంత్యము.
ఛ : మహాప్రాణము, శ్వాసాత్మకము ఐన తాలవ్యము.
జ : అల్పప్రాణము నాదాత్మకము ఐన తాలవ్యము.
ౙ : అల్పప్రాణము నాదాత్మకము ఐన దంత్యము.
ఝ : మహాప్రాణము నాదాత్మకము ఐన తాలవ్యము.
ఞ : అల్పప్రాణము నాదాత్మకము ఐన అనునాసికము (తాలవ్యోచ్చారణతో కూడినది)

ట వర్గము :

ట : అల్పప్రాణము, శ్వాసాత్మకము ఐన మూర్ధన్యము.
ఠ : మహాప్రాణము, శ్వాసాత్మకము ఐన మూర్ధన్యము.
డ : అల్పప్రాణము నాదాత్మకము ఐన మూర్ధన్యము.
ఢ : మహాప్రాణము నాదాత్మకము ఐన మూర్ధన్యము.
ణ : అల్పప్రాణము, నాదాత్మకము ఐన అనునాసికము (మూర్ధన్యోచ్చారణతో కూడినది)

త వర్గము :

త : అల్పప్రాణము, శ్వాసాత్మకము ఐన దంత్యము.
థ : మహాప్రాణము, శ్వాసాత్మకము ఐన దంత్యము.
ద : అల్పప్రాణము, నాదాత్మకము ఐన దంత్యము.
ధ : మహాప్రాణము, నాదాత్మకము ఐన దంత్యము.
న : అల్పప్రాణము, నాదాత్మకము ఐన అనునాసికము (దంతోచ్చారణతో కూడినది)

ప వర్గము :

ప : అల్పప్రాణము, శ్వాసాత్మకము ఐన ఓష్ఠ్యము.
ఫ : మహాప్రాణము, శ్వాసాత్మకము ఐన ఓష్ఠ్యము.
బ : అల్పప్రాణము, నాదాత్మకము ఐన ఓష్ఠ్యము.

భ : మహాప్రాణము, నాదాత్మకము ఐన ఓష్ఠ్యము.
మ : అల్పప్రాణము, నాదాత్మకము ఐన అనునాసికము (ఓష్ఠోచ్చారణతో కూడినది)

అంతస్థాలు :

య : తాలవ్యము ; ఇది అర్థాచ్చు (Semi vowel)
ర : తాడితము (Flap)
ఱ: కంపితధ్వని (trill)
ల : దంత్యము, పార్శ్వికము.
ళ : మూర్ధన్యము, పార్శ్వికము
వ : దంతోష్ఠ్యము; ఇది అర్థాచ్చు.

ఊష్మాలు :

శ : తాలవ్యము
ష : మూర్ధన్యము.
స : దంత్యము.
హ : కంఠ్యము.

వీని వర్గీకరణ మరోవిధంగా కూడా చేస్తారు. క,చ,ట,త,ప లను పరుషాలు అని, గ,జ,డ,ద,బ లను సరళాలు అని, ఇతర హల్లులను స్థిరాలు అని అంటారు.

పై వర్గీకరణం ఆయా అక్షరాలను ఉచ్చరించేటప్పుడు ఉద్భవిస్తున్న ధ్వని తీరును బట్టి జరిగింది. ధ్వన్యుచ్చారణలో స్థానం, కరణం, ప్రయత్నం అనే మూడు అంశాలు ప్రధానాలు. స్థాన,కరణ ప్రయత్నాల్లో దేన్ని మార్చినా ఉత్పత్తి అయ్యే ధ్వని మారుతుంది. పై పెదవికి కింది పెదవిని తాకించి, నోటిలోంచి గాలిని వెలుపలికి వదిలితే 'ప' అనే ధ్వని ఉత్పత్తి అవుతుంది. ఈ ఉదాహరణంలో పై పదవిస్థానం, కింది పెదవి కరణం, గాలిని వదలడం ప్రయత్నం. దీనిలో స్థానాన్ని గాని, కరణాన్ని గాని మార్చకుండా మరింత ఊనికితో గాలి వదిలితే ఫ అనే ధ్వని ఉత్పత్తి ఔతుంది. వీనిలో ప్రయత్నాన్ని అనునాసికంచేస్తే 'మ' అనే ధ్వని ఉత్పత్తి ఔతుంది. ముఖకుహరం పై భాగంలోని ధ్వన్యుత్పత్తికి ఉపకరించే అవయవాలు స్థానాలని, కిందిభాగంలోని అవయవాలు కరణాలని అంటారు. స్థానాలు కదలని భాగాలు, కరణాలు

కదిలేభాగాలు గాలిని విడుదలచేయడం, అవయవాలు కదల్చడమే ప్రయత్నం.

ధ్వని ఉత్పత్తిలో నిచ్ఛ్వసన వాయువు ప్రధాన పాత్ర వహిస్తుంది. ఈ వాయువు శ్వాసకోశాల నుండి వెలికి వస్తున్నప్పుడు స్పందించిన నాద తంత్రులు, ముఖకుహరంలోని వివిధ అవయవాల కదిలిక సాయంతో వివిధ ధ్వనులు ఉత్పత్తిచేస్తాయి. ప్రతిధ్వనికి ఒక ఉత్పత్తిస్థానం, ఉత్పత్తికి తోడ్పడే ఒక సాధనం, ఒక ప్రయత్నం ఉంటాయి. పై వివరాలు ఈ అంశాన్నే స్పష్టంచేస్తాయి. ఈ ధ్వన్యుత్పత్తివిధానాన్ని విద్యార్థులకు తెలుపుటకు ముందు ఉపాధ్యాయులు తాము ఒక స్పష్టమైన అవగాహనను ఏర్పరుచుకొని విద్యార్థులకు ప్రతి ధ్వనికి స్థాన, కరణ ప్రయత్నాలేవో తెల్పి సరియగు ఉచ్చారణ శిక్షణ నీయాల్సి ఉంటుంది.

వక్తలు తమలోని భావాలను ఎదుటివ్యక్తులకు అందించడం భాషణం ప్రధాన ఉద్దేశం. భాషణం ప్రధానంగా ధ్వనియుక్తంగా ఉంటుంది. కాని కొన్ని సందర్భాల్లో భావ వ్యక్తీకరణం చేష్టలరూపంలోగాని, హావభావ ప్రదర్శన రూపంలోగాని లేక వీనితో కూడిన ధ్వని రూపంలోగాని ఉండవచ్చు. అందువల్ల భాషావేత్తలు ఈనాడు ధ్వనియుక్త భాషణంతోబాటు మౌనభాషణం (Silent talk) అనే భావనను కూడా ప్రతిపాదిస్తున్నారు. ప్రఖ్యాత భాషావేత్త డా॥ యం. యస్. తిరుమలై తమ Silent talk అనే గ్రంథంలో ఈ ధ్వనిలేని సమాచార వినిమయు (Non - Verbal Communication) సాధ్యాలను వివరించారు. భాషాశాస్త్రవేత్తల దృష్టిలో ధ్వనియుక్త భాషణంతో బాటు మౌనభాషణానికి కూడా సమాన ప్రాధాన్యత ఉంది. సమాజాల సంస్కృతి, సామాజిక స్థితిగతుల అధ్యయనానికి, భాషలబోధన, అభ్యసనాలను మెరుగుపరచడానికి ధ్వని రహిత భాషణాన్ని (మౌన భాషణం) అధ్యయనం చేయాలి అప్పుడే భాషాబోధన సమగ్రమవుతుందని వారు అభిప్రాయపడ్డారు. దీన్ని నిశ్శబ్ద భాషణమని కూడా అంటారు.

నిశ్శబ్దభాషణం, మౌనభాషణం, ధ్వని రహిత భాషణం (Silent talk) లో భావప్రకటనా చిహ్నాలు, చేష్టలు ముఖకవళికలు, హస్తచాలనాలు, హావభావాలు, శరీర భంగిమలు ప్రధానంగా చెప్పుకోదగ్గవి. వీనిద్వారా ఎదుటి వ్యక్తులకు సంపూర్ణభావాన్ని చేరవేయవచ్చు. భాషా వ్యాపారంలో సాధారణంగా భావ వినిమయం ఈ విధంగా జరుగుతుంది.

i) చేష్టకు సమాధానం —— చేష్టల రూపంలో / ధ్వని రూపంలో / చేష్టలు+ధ్వనుల రూపంలో

ii) ధ్వనికి సమాధానం —— ధ్వనిరూపంలో / చేష్టలరూపంలో / ధ్వనులు + చేష్టల రూపంలో

నిత్య వ్యవహారంలో కూడా ఈభావనలకు ప్రాధాన్యత ఉంది. హావభావాలు లేని భాషణం కేవలం యాంత్రిక భాషణమే తప్ప సహజంగా ఉండదు. ప్రధానంగా చెవుడు, మూగ వంటి శారీరక లోపాలున్న వారి మధ్య, మరియు వారితో ఇతరుల భావవినిమయం కేవలం మౌన భాషణం ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. అందువల్ల భాషణంలో మౌనభాషణకూడా సముచిత స్థానాన్ని సంతరించుకొంది.

భాషణ సామర్థ్యాన్ని ప్రాథమిక తరగతుల్లో మెరుగుపరచి పై తరగతుల్లో పెంపొందించాలి.

## భాషణ నైపుణ్యాన్ని పెంపొందించడానికి ఉపకరించే మార్గాలు :

i) శిశు గీతాలు - అభినయగీతాలు :

వీనిని విద్యార్థులచే పాడించడం ద్వారా పాఠశాలలో అప్పుడే చేరిన బాల బాలికల ఉచ్చారణలో స్పష్టత, సమవేగాన్ని పెంపొందించే అవకాశముంటుంది. ఉపాధ్యాయులు వీలైనవన్ని ఎక్కువ శిశుగేయాలను, అభినయగేయాలను సేకరించి విద్యార్థులచే పాడించాలి.

ii) సంభాషణలు - నాటకీకరణం :

ప్రాథమికస్థాయిలో సంభాషణలు చెప్పిస్తూ పై తరగతులకు విద్యార్థులు చేరేనాటికి పాత్రపోషణ (Role play) తో నాటకీకరణం చేయించడం వల్ల భావ వ్యక్తీకరణలో తమ వంతు వచ్చేవరకూ ఆగడం, ఇతరులు మాట్లాడుతున్నప్పుడు మధ్యలో కల్పించుకొని మాట్లాడకపోవడం మొదలైన సుగుణాలు విద్యార్థులకు అలవడతాయి. వీనితో బాటు స్పష్టమైన ఉచ్చారణ, పాత్రోచితమైన హావభావ ప్రదర్శన కూడా విద్యార్థుల స్వంతమవుతుంది.

సభాకంపం తొలగుటతోబాటు ఏకపాత్రాభినయ కౌశలం కూడా వారికి అలవడుతుంది.

iii) వక్తృత్వ శిక్షణ - ఉపన్యాసం :

ప్రాథమిక దశలో విద్యార్థులు ఏదేని ఒక అంశంపై విరివిగా మాట్లాడే శక్తిని పెంపొందించాల్సిన అవసరముంది. దీనికై మొదట వక్తృత్వ శిక్షణ ఉపకరిస్తుంది. విద్యార్థులు పదిమంది ముందు తమ భావాలను స్వేచ్ఛగా వ్యక్తీకరించగల్గిన సామర్థ్యం దీనివల్ల అలవడుతుంది. విద్యార్థులు కూర్చొని మాట్లాడటం, తాము కూర్చున్నచోటే నిలబడి మాట్లాడటం, తరగతిలోని విద్యార్థులముందు మాట్లాడటం ఇలా వరుసగా చేయించడం వల్ల వారిలో సభాకంపం తొలగుతుంది. వాద ప్రతివాదాలు, ఒకే అంశంపై మాట్లాడటం మొదలైన వానిని ప్రోత్సహించుట ద్వారా ఉన్నతదశలో విద్యార్థులు ఉపన్యసించగలిగిన స్థాయికి చేరుకొంటారు. తద్వారా వారి వాచికంలో ధారాళత, అనుక్రమత మొదలగు లక్షణాలు పెంపొందుతాయి.

iv) పొడుపు కథలు - చిక్కుప్రశ్నలు :

విద్యార్థుల్లో ఆలోచనలు రేకెత్తింపజేసి వారిని విరివిగా మాట్లాడించడానికి పొడుపుకథలు, చిక్కు ప్రశ్నలు అవసరమౌతాయి. తద్వారా వారికి లోతైన ఆలోచనా శక్తి కూడా అలవడుతుంది.

v) కథాకథనం - చిత్రాల ఆధారంగా కథలు చెప్పించడం :

బాలబాలికలు కథలంటే చెవికోసుకుంటారు. ఉపాధ్యాయులు తాము కథలుచెప్తూ విద్యార్థులందరిచే కథలు చెప్పించాలి. వీనిద్వారా కథలను, సంఘటనలను క్రమానుగతంగా కూర్చుటతోబాటు, క్రమానుగత వ్యక్తీకరణం విద్యార్థుల కలవడుతుంది. వీటితో బాటు కథా చిత్రమాలికలు ప్రదర్శిస్తూ విద్యార్థులచేత కథలు చెప్పించగల్గితే తర్వాత దశలో విద్యార్థులే స్వయంగా కథాకథనం చేయగల్గిన సామర్థ్యాన్ని సంపాదించుకొంటారు.

vi) సాహిత్య సమావేశాల్లో విద్యార్థులు పాల్గొనేట్లు చూడటం :

ఇట్టి సమావేశాలు ఉన్నత తరగతుల విద్యార్థుల భాషణ నైపుణ్యాన్ని పెంపొందించుటకు బాగా ఉపకరిస్తాయి. వివిధ వక్తల భాషణరీతుల్ని విని తమదేయైన శైలిని అలవరుచుకోవడానికి విద్యార్థులకు ఇవి ఉపకరిస్తాయి.

అవసరమైతే రేడియో, టెలివిజన్లలో వచ్చే ఉపన్యాసాలను రికార్డు చేసి కూడా తరగతిగదుల్లో వినిపించవచ్చు.

vii) పదక్రీడలు - వాక్యక్రీడలు చేయించడం :

భాషణంలో ప్రధానమైనది పదజాలం పై విద్యార్థులకు గల అధికారం. అందువల్ల విద్యార్థుల్లో పదాధికారం పెరగాలంటే పదక్రీడలను చేయించడం, పదాలను వాక్యాల్లో విరివిగా ఉపయోగించేట్లు చూడటం అవసరం.

viii. 'గుమ్మిలోన కందిపప్పు - గుమ్మికింద పందికొక్కు' మొదలైన వాక్యాలను పదేపదే ఉచ్చరింపజేయుట ద్వారా కూడా విద్యార్థుల్లో భాషణ సామర్థ్యాన్ని పెంపొందించవచ్చు. వీనిని విద్యార్థులు ఉచ్చరించడం ద్వారా, ఉచ్చారణలో వేగంతో బాటు అవధానం కూడా పెరుగుతుంది. తాము వేగంగా ఉచ్చరిస్తున్నపుడు విలోమంగా ఉచ్చరిస్తున్నామా? సరిగా ఉచ్చరిస్తున్నామా? అన్న విషయం విద్యార్థులు గమనిస్తూ ఉంటారు. విలోమంగా ఉచ్చరించకుండా జాగ్రత్తగా ఉచ్చరించ మనడం ద్వారా భాషణనైపుణ్యాన్ని విద్యార్థుల్లో పెంపొందించవచ్చు.

పై విధంగా ప్రాథమికదశ నుండి ఉపాధ్యాయులు విద్యార్థుల్ని మంచి వక్తలుగా తీర్చిదిద్దుటకు కృషిచేయాల్సి ఉంది.

C) భాషణంలో దోషాలు :

బాలబాలికలు పాఠశాలకు వివిధ పరిసరాలనుండి వివిధ సామాజిక, ఆర్థిక స్థోమతగల కుటుంబాల నుండి వస్తారు. పరిసరాలు, కుటుంబ పరిస్థితుల ప్రభావం వారి భాషణంపై తీవ్రంగా ఉంటుంది. వారి సాధారణ ఉచ్చారణ కూడా కొన్ని సందర్భాల్లో ఇతరుల కన్న భిన్నంగా ఉంటుంది కూడా. ఈ ఉచ్చారణలోని భిన్నత్వం వల్ల మరియు ఇతర కారణాల వల్ల వారి భాషణంలో దోషాలు చోటు చేసికొంటాయి. ఈ దోషాలను ప్రాథమిక దశలోనే పరిహరించాల్సిన బాధ్యత ఉపాధ్యాయులది. వాచిక చర్య సందర్భంలో విద్యార్థుల్లో కనబడే దోషాలు ప్రధానంగా మూడు విధాలుగా ఉంటాయి. ఇవి

i) భావదోషాలు.
ii) భాషాదోషాలు.
iii) ఉచ్చారణ దోషాలు.

భావదోషాలు ప్రధానంగా విద్యార్థులకు తెల్సిన విషయమే తప్పుగా మాట్లాడటంగాని, భావోద్రేకానికి లోనై మాట్లాడటం వల్లగాని దొరలుతాయి. భాషాదోషాలు ఒకపదానికి బదులుగా ఆయా సందర్భాల్లో మరోపదాన్ని ఉపయోగించడం, వాక్యనిర్మాణంలో దోషాలు చేయడం, భావానుగుణమైన పదజాలాన్ని ఉపయోగించకపోవడం వల్ల జరగవచ్చు. ఇక ఉచ్చారణ దోషాల్లో మహా ప్రాణాన్ని అల్పప్రాణంగాను, అల్పప్రాణాన్ని మహా ప్రాణంగాను ఉచ్చరించడం, ద్విత్వాక్షరాన్ని తేల్చి తేలిగ్గా పలకడం, సంయుక్తాక్షరాల్ని తేలిగ్గా పలకడం, స్వరభేదాలు పాటించకపోడం, ఒకే ధ్వనిని, పదాన్ని పదే పదే (అరిగిపోయిన రికార్డు లాగా) ఉచ్చరించడం, వాక్యాల తుదలు వదిలివేయడం మొదలైనవి అనుభవైకవేద్యాలు. ఈ భాషణ దోషాలకు కారణాలుగా కిందివానిని చెప్పవచ్చు.

i) విద్యార్థులు స్పష్టంగా వినలేకపోవడం లేదా వినకపోవడం. వింటే అనుకరించి వెంటనే ఉచ్చరించకపోవడం.

ii) వేగంగా ఉచ్చరించాలనే ప్రయత్నం చేయడం.

iii) ధ్వనియొక్క ఉత్పత్తి విధానం, స్థాన, కరణ ప్రయత్నాల స్పృహలేకపోవడం.

iv) ఉపాధ్యాయులు ప్రత్యేకంగా ఉచ్చారణ శిక్షణ నీయకపోవడం.

v) వాగింద్రియ లోపాలుండటం.

vi) అవాంతర ధ్వనుల మధ్య ఉద్దేశించిన ధ్వనిని సరిగా వినలేకపోవడం లేదా ఉచ్చరించలేక పోవడం ఉచ్చరించినా దోషంతో ఉచ్చరిచడం.

vii) అవ్యవధానంగా ఉచ్చరించడం :

పై దోషాల నివారణకు ఉపాధ్యాయులు మొదట తాము ఉచ్చారణదక్షులై విద్యార్థులకు ఉచ్చారణలో సరియైన శిక్షణనీయాలి. విద్యార్థులు చేయు సాధారణ, ప్రత్యేక వాగ్దోషాలను పట్టికలుగా రాసి తరగతిలో వ్రేలాడదీయుట ద్వారా వారు తిరిగి అలాంటి దోషాలు చేయకుండా జాగ్రత్తపడవచ్చు. బాలబాలికలతో విరివిగా ఉచ్చారణాభ్యాసాలు చేయించి ప్రోత్సహిస్తే భాషణం సమర్థమవుతుంది. అర్థవంతమవుతుంది. అవసరమైతే విద్యార్థులు చేయు ఉచ్చారణ దోషాలను రికార్డుచేసి వారికి తిరిగి వినిపించుటకై టేపురికార్డులు, లింగ్వాఫోన్ (Liingua phone), భాషా ప్రయోగశాల (Language Laboratory) వంటి ఆధునిక సాంకేతిక పరికరాలు ఉపయోగపడతాయి. వీటిద్వారా

విద్యార్థులు తమ దోషాలను తామే స్వయంగా గుర్తించి సవరించుకొనగల్గుతారు.

## 6.04 పఠనం :

భాషా నైపుణ్యాలలో మూడోది భావగ్రహణానికి తోడ్పడే నైపుణ్యాల్లో రెండోది పఠనం. ఇది వ్యక్తులను విశిష్టమైన వారిగా తీర్చిదిద్దుతుంది. విస్తృత జ్ఞానసంపాదన సమర్థవ్యవహార దక్షత పఠనం యొక్క ప్రధాన లక్ష్యం. విద్యార్థులు శ్రవణేంద్రియం ద్వారా సంపాదించిన జ్ఞానం కన్న పఠనం ద్వారా ఎక్కువ జ్ఞానాన్ని సంపాదించ గల్గుతారు. శ్రవణం ప్రకృతి ప్రసాదించిన నైపుణ్యం. పఠనం ప్రయత్న పూర్వకంగా అలవడే నైపుణ్యం. దీనికి లిపిబద్ధమైన ధ్వనిరూపం ప్రాతిపదిక. పాఠశాలా బోధనలో మాతృభాషగా తెలుగును బోధిస్తున్నప్పుడు మొదట దృష్టియందుండాల్సిన నైపుణ్యం పఠనమే. ఆ తర్వాతనే లేఖనానికి ప్రాధాన్యత. విద్యార్థుల్లో ఆలోచనాత్మకత, సృజనాత్మకత, అనుభూతులు, అభిరుచులు, ఆసక్తులు, సముచితవైఖరులు పెంపొందించగల్గిన సామర్థ్యం పఠనమే. తర తరాలుగా సంరక్షింపబడి లభిస్తున్న పుస్తకాల రూపంలోని జ్ఞాన సంపత్తిని స్వంతంచేసికోవడానికి పఠనమే శరణ్యం. అందువల్ల పఠన నైపుణ్యాభివృద్ధికి పుస్తకాలే ఆధారాలు, సాధనాలు.

వ్యక్తులు ఎందుకు చదువుతారు అని ప్రశ్నిస్తే ఆయా వ్యక్తులను బట్టి సమాధానం వస్తుంది. కొందరు వ్యక్తులు ఎందుకు చదువుతారు అని ప్రశ్నిస్తే ఆయా వ్యక్తులను బట్టి సమాధానం వస్తుంది. కొందరు విజ్ఞానాన్ని ఆర్జించడానికి లోతుగా, కూలంకుషంగా చదువుతారు. కొందరు కేవలం ఉబుసుపోకకు మాత్రమే చదువుతారు. మరికొందరు పరీక్షలకోసం చదువుతారు. మరికొందరు ఇతరులకు బోధించాలని చదువుతారు. కొందరు విరామకాలాన్ని సద్వినియోగం చేసుకోవాలని చదువుతారు. ఇలా ప్రతి ఒక్కరూ తమదే ఐన ఏదోఒక ఉద్దేశ్యంతో పఠనం చేస్తూ ఉంటారు. తద్వారా వారి నిత్య వ్యవహారంలో, భావవ్యక్తీకరణలో శిష్టతను, విశిష్టతను ప్రదర్శిస్తారు. భాషపై ఆధిపత్యాన్ని సాధించడానికి కూడా పుస్తక పఠనమే శరణ్యం. ఆ కారణాన పఠన నైపుణ్యాన్ని విద్యార్థుల్లో పెంపొందించడానికి ముందు వారిలో పఠనం ఎడల ఆసక్తిని పెంచగల్గాలి. తద్వారా విద్యార్థులు పఠనోన్ముఖులై (Reading readyness) పఠనానికి ఆవశ్యక అవయవ భాగాలైన (చెవి) కన్నులు, ముఖ యంత్రభాగాల సమన్వయం సాధిస్తారు. ఉపాధ్యాయులు నిరంతరం శ్రమిస్తే తప్ప ఆశించిన విధంగా విద్యార్థుల్లో పఠన నైపుణ్యమలవడదు.

NCERT వారు ప్రచురించిన 'Teaching Reading A Challenge' అనే గ్రంథంలో 'Reading is finding out what an author has said, trying to think what he meant by it, and deciding what sence it makes and how good it is to the reader' అని పఠనాన్ని నిర్వచించారు. అంటే ఒక రచయిత చెప్పిందేంటో తెల్సికోవడం, దాని అర్థాన్ని గూర్చి ఆలోచించడం, అది ఏ భావనను వ్యక్తీకరిస్తుందో నిర్ణయించడమే పఠనం అని అర్థం. రచయిత చెప్పదలచుకొన్నదేమిటో తెలిసికోవడానికి పదాలను స్పష్టంగా గుర్తించడం, వానికి అర్థాలను వెదుక్కోవడం కూడా అవసరమే.

## A) విద్యార్థులు ఎందుకు చదవాలనుకుంటారు :

తమకన్న పెద్దవారు ఏకారణాల వల్ల చదవాలనుకొంటారో ఆ కారణాలే పిల్లల చదువుకూ వర్తిస్తాయి. పాఠశాలల్లో పుస్తకాల ఆధారంగా బోధన నిర్వహిస్తున్నందున ఉపాధ్యాయులు విద్యార్థులంతా ఆయా పుస్తకాలు చదవాలని కోరుకొంటారు. తమ పిల్లలు మంచి చదువరులు కావాలని తలిదండ్రులు భావిస్తారు. ఈ కారణాల వల్ల పిల్లలు చదువుతారని చెప్పవచ్చు. తాము సమాజంలో ప్రత్యేక గుర్తింపు పొందాలనే కోరిక కూడా పిల్లల్లో ఉంటుంది. అందువల్ల కూడా విద్యార్థులు చదవాలని కుతూహలపడతారు. అయితే పఠనాభ్యాసం చాలా కష్టమైన కార్యం. ఉపాధ్యాయులు ఈ అభ్యసనాన్ని సులువుచేసే ప్రయత్నంచేయాల్సి ఉంటుంది.

## B) పఠనం ఉద్దేశ్యాలు :

పఠన ఉద్దేశ్యాలలో ప్రధానమైనవిగా కింది వానిని చెప్పవచ్చు.

i) రచయితల భావాలను తెలిసికోవడం.

ii) వివిధ రంగాలనుండి సమాచారాన్ని సేకరించడం.

iii) వివిధ రచనాశైలుల్ని పరిచయం చేసుకోవడం.

iv) చదివినదాన్ని, తెలిసికొన్నదాన్ని పునర్బలనం చేసుకోవడం.

v) విరామకాలాన్ని సద్వినియోగం చేసుకోవడం.

vi) వ్యక్తిత్వ వికాసం పొంది సామాన్య వ్యవహర్తల నుండి విశిష్ట వ్యవహర్తలుగా రూపొందడం.

vii) ఉపయుక్తమైన పఠన అలవాట్లను పెంపొందించుకోవడం.

viii) పఠనం సత్యాన్వేషణకు మూలాధారమని విశ్వసించడం.

C) పఠనం లక్షణాలు :

పఠనం కింది లక్షణాలను కల్గి ఉంటుంది. వాగ్రూపఅభివ్యక్తికి పఠనానికి సంబంధముంది. అందువల్ల వీని లక్షణాలు కూడా సమీప సంబంధం కల్గి ఉంటాయి.

i) స్పష్టత.
ii) ఉచ్చారణ దోష రాహిత్యత.
iii) భావానుక్రమత.
iv) అన్వయుక్రమత.
v) రాగ, భావ యుక్తత.
vi) సమమైన ఆవేశం.
vii) విరామ చిహ్నాలు పాటించుట.
viii) విసంధి పాటించుట.
ix) ధారాళత.
x) భావానుగుణమైన స్వరభేదకత.
xi) విమర్శనాత్మకత, విశ్లేషణాత్మకత.

D) పఠన దోషాలు :

విద్యార్థులు సాధారణంగా పఠనంలో కింది దోషాలు చేస్తారు.

i) ధ్వనులను సరిగా ఉచ్చరించకపోవడం.
ii) పదాలను స్పష్టంగా ఉచ్చరించకపోవడం.
iii) ధారాళంగా చదవక మధ్య మధ్య ఆగుతూ చదవడం.
iv) ఒకధ్వనిని/పదాన్ని పదే పదే చదవడం.
v) వాక్యాల తుదలు వదిలివేస్తూ చదవడం.
vi) ఊవికగా చదవడం.
vii) పై పైన తేలికగా చదవడం.
viii) విరామచిహ్నాలు పాటించకుండా చదవడం.
ix) స్వరభేదం పాటించకుండా చదవడం.

E) పఠనదోషాలకు కారణాలు :

i) ధ్వన్యుత్పత్తి అవయవాలకు నేత్రాలకు మధ్య సమన్వయం లేకపోవడం.
ii) పదాలను స్పష్టంగా గుర్తించకపోవడం.
iii) వేగంగా చదవాలనుకోవడం.
iv) సరియైన పఠనాభ్యాసం లేకపోవడం.
v) మొదట ఉపాధ్యాయుల పఠనాన్ని సరిగా అనుకరించకపోవడం :

పై పఠన దోషాల నివారణకు ఉపాధ్యాయులు కృషిచేస్తూ విద్యార్థుల పఠన నైపుణ్యాన్ని పెంపొందించుటలో కింది భావనలను దృష్టిలో పెట్టుకోవాలి. వీని ఆధారంగా పఠనాభ్యాసం చేయించాలి.

i) పూర్తిపదాన్ని గుర్తించడం (Whole word Recognition)

ఉదా :- పద సమూహాల మధ్య నిర్దేశిత పదాన్ని గుర్తించడం.

- వాక్యంలో పదాన్ని గుర్తించడం.
- ఒకే రూపంతో/ధ్వనితో మొదలయ్యే లేక అంతమయ్యే పదాలలో అవసరమైన పదాన్ని గర్తించడం.
- ఒకే అక్షర రూపం, పరిమాణం ఉండి కొద్ది మార్పు మాత్రమే ఉన్న పదాల మధ్య అవసరమైన అక్షరాన్ని గుర్తించడం.
  ఉదా:- కాలం - గాలం, కాలం - జాలం.
- పద సమూహాల్లో ఏ అక్షరం పునరావృతమైందో గుర్తించడం.
- రిక్త వాక్యాల పూరణకు అవసరమైన పదాన్ని గుర్తించడం.

ii) పదభాగాలను విశ్లేషించడం :

పదభాగాలలో అక్షరాలు, అక్షరసమూహాలు లేదా పదబంధాలలోని ప్రముఖ పదాలను విద్యార్థులు గుర్తించడం.

- పదంలో అక్షరాన్ని గుర్తించడం. ('క'ను గుర్తించడం)
  ఉదా:- పలక, కరము, మకరి, కాటుక.
- పదాల వరసలో పదభాగాన్ని గుర్తించడం. ('కల'ను గుర్తించడం)
  ఉదా:- కలము, కలత, కలవరం, పీడకల.
- వాక్యాలలో పదాన్ని గుర్తించడం.

iii) పదం దాని అర్థాన్ని అధ్యయనం చేయడం:

- అర్థభేదక రూపాన్ని, అక్షరాన్ని గుర్తించడం.
- పదాలను వర్గీకరించడం.
- పదాలను పోల్చడం.
- పదాలకు పమానార్థకాలు చెప్పడం.
- పదాలకు పర్యాయ పదాలు ఎన్నుకోవడం.
- పదాల పుట్టుకను గురించి తెలిపికోవడం.

పై వాని ఆధారంగా విద్యార్థుల్లో పఠనావగాహనను పెంపొందించవచ్చు.

F) పఠనావగాహనమంటే :

పాఠశాల దశలో విద్యార్థులు సమాచారాన్ని గుర్తించడం, గుర్తించి సమాచారాన్ని చదవడం, చదివిందాన్ని అర్థం చేసుకోవడం, అర్థంచేసుకొన్న అంశాలను ప్రశంసించడం, ప్రశంసించిన అంశాల్లోని సామాన్యభావనలను క్రోడీకరించడం, ఆ క్రోడీకరించిన భావనల్ని సారాంశరూపంలో రాసుకోవడం చేయాలి. అవసరమైన పక్షంలో రాసుకున్న దాన్ని వివరించడం, విశ్లేషించడం సూక్ష్మీకరించడం, వ్యాఖ్యానించడం ద్వారా విద్యార్థుల పఠనావగాహనాన్ని పెంపొందింపవచ్చు. ఇంతకుముందే ప్రస్తావించినట్లుగా పఠనం వివిధ కారణాలతో, వివిధ ఉద్దేశ్యాలతో చేస్తారు కనుక పఠనాన్ని కింది విధంగా వర్గీకరించవచ్చు. అవి :

i) సాధారణ పఠనం (General Reading)

ii) ప్రతిభాయుత పఠనం (Intelligent Reading)

సాధారణ పఠనం కేవలం తాత్కాలికమై, సమాచారాన్ని గుర్తించడానికి మాత్రమే ఉపకరిస్తుంది. ఇది ఒక రకంగా ఊసుపోకకు (Time passing) చేసే పఠనం కూడా. దీనియందు అవధానత ఉండవచ్చు లేదా ఉండకపోవచ్చు కాని ప్రతిభాయుత పఠనం అలా కాదు. రచయిత మనస్తత్వాన్ని కూడా తెలిపికోగల్గిన పఠనమిది. ఈ పఠనంలో విద్యార్థులు కేవలం పదాలు వాక్యాలు మాత్రమే చదవక, వాక్యాలమధ్య, వాక్యాల వెనక గల అంతరార్థాన్ని కూడా చదువుతారు. అందువల్ల నేడు ఈ పఠనానికి అత్యంత ప్రాముఖ్యత ఈయబడుతోంది. విద్యార్థులు ప్రతిభాయుత పఠనం చేయగల్గిన వారుగా ఉపాధ్యాయులు కృషిచేయాలి. అప్పుడే వారు పఠనావగాహనం కల్గిన వారుగా పరిగణింపబడతారు.

## ౮) పఠన బోధన పద్ధతులు :

పఠనాన్ని బోధించడానికి కింది పద్ధతులు ఉపకరిస్తాయి.

### i) స్వరోచ్చారణ పద్ధతి :

ప్రతి పదంలోని వివిధ ధ్వనులను స్పష్టంగా ఉచ్చరించుట నేర్పడమే ఈ పద్ధతి లోని ప్రాధాన్యత. దీనిద్వారా విద్యార్థులు అపరిచిత పదాల్లోని ధ్వనులను, స్వరాలను కూడా గుర్తించి స్పష్టంగా ఉచ్చరించగల్గుతారు.

### ii) చూచి చెప్పు పద్ధతి :

ఉపాధ్యాయులు ఈ పద్ధతిలో లిపి రూపాలను విద్యార్థులకు ప్రదర్శించడం ద్వారా లేదా, లిపి రూపాలను విద్యార్థులే పుస్తకంలోగాని, నల్లబల్లపైగాని చూస్తూ ఉంటే వాటిని ఎలా ఉచ్చరించాలో నేర్పడం చేస్తారు. పదాల భావం తెల్పడానికి సంబంధిత చిత్రం ఉపయోగించవచ్చు. విద్యార్థులు చిత్రం చూసి దాని కింద/లేదా వెనుక లేదా వేరుగా రాసిన పదాన్ని చదవగల్గుతారు. పదాలు చదువుటలో ఇంతకుముందే తాము చూసిన రూపాలను మొదట గుర్తించి, తెలియని రూపాల్ని ఉపాధ్యాయుల సాయంతో చదువుతారు. ఈ పద్ధతి విద్యార్థులకు ఆసక్తికరంగా ఉండి పఠనంలో అలసటను తొలగిస్తుంది. పదచిత్రాలు రంగుల్లో ఉంటే పఠనం మరింత సులభం అవుతుంది.

### iii) అక్షర పద్ధతి :

ఇది అనూచానంగా పఠన బోధనలో ఉపయోగిస్తున్న పద్ధతి. ఈ పద్ధతిలో వర్ణమాలలోని అక్షర రూపాలన్నిటిని వరసగా విద్యార్థికి పరిచయం చేయడం, తద్వారా విద్యార్థులకు అక్షరజ్ఞానం కల్గించడం, వానిని చదివించడం, అక్షరాలను పదాలలో గుర్తింపచేయడం జరుగుతుంది. కొన్ని సందర్భాల్లో రాయడం, చదవడం ఒకే పర్యాయం జరిగినప్పుడు ఏ ఒక దానిలో కూడా నైపుణ్యం అలవడని సందర్భాలుండవచ్చు. ఈ పద్ధతిలో ప్రధానంగా చదవడం కుంటుపడుతుంది. దగ్గరి లిపిరూపాలు ఉన్న అక్షరాల మధ్యగల ఉచ్చారణ భేదాన్ని కూడా విద్యార్థులు గుర్తించేట్లు చేయగల్గితేనే ఈ పద్ధతి బాగా ఉపకరిస్తుంది.

### iv) నవీనాక్షర పద్ధతి :

ఆధునిక కాలంలో పదం, చిత్రం వెనువెంటనే ప్రదర్శిస్తూ విద్యార్థుల్లో పఠన నైపుణ్యం పెంపొందించే పద్ధతి నవీనాక్షరపద్ధతి. ఈ పద్ధతిలో

అక్షరాలను రంగుల్లో ముద్రింపజేసి ప్రత్యేకంగా ప్రదర్శిస్తారు. ఈ పద్ధతి పఠనాభ్యాసాన్ని వేగవంతం చేస్తుంది.

v) అనుకరణ పద్ధతి :

ఉపాధ్యాయుల ఉచ్చారణకు అనుగుణంగా విద్యార్థులు ఒక్కో పదాన్నే అనుకరించి ఉచ్చరించడం లేక ఒక విద్యార్థి ఉచ్చారణను అనుకరించి చదవడం ఈ పద్ధతిలోని ప్రధాన భావనలు. సాధారణంగా ఉపాధ్యాయులు తరగతిలో ఈపద్ధతినే ఉపయోగిస్తారు. పుస్తకంలోని లిపిరూపానికి అనుగుణంగా ఉపాధ్యాయుని అనుకరించగల్గిన నైపుణ్యం విద్యార్థులకు అలవడుతుంది. ఒకవేళ లిపిరూపానికి, ఉచ్చారణకు మధ్య సమన్వయం, అవధానత లేకపోతే లిపి పఠనం అనేవి రెండూ వేరువేరు దారులౌతాయి. కొన్ని పర్యాయాలు విద్యార్థులు కంఠతా పట్టి పుస్తకం చూస్తూ లిపితో సంబంధం లేకుండా గబగబా చదవడం కూడా ప్రాథమిక తరగతుల్లో గమనించవచ్చు. అందువల్ల ఈ పద్ధతిని ఉపయోగించి పఠనాన్ని బోధిస్తున్నప్పుడు లిపికి, ఉచ్చారణకు మధ్య సమన్వయం సాధించాలి.

vi) పదపద్ధతి :

పదాల ఆధారంగా పఠనాన్ని బోధించడం ఈ పద్ధతిలోని ప్రధానభావన. ప్రథమ భాషా పుస్తకాలు పదపద్ధతి ఆధారంగానే రాయబడతాయి. 'అ' అనే అక్షరాన్ని చదివించడానికి అమ్మ, అరటి, అరక మొదలైన పదాలను స్పష్టంగా ఉచ్చరించడం నేర్పుతారు. ఈ అక్షర రూపాన్ని వివిధ పదాల్లో గుర్తించడం ద్వారా విద్యార్థులు సులభంగా చదవగల్గుతారు.

/ii) వాక్య పద్ధతి :

సంపూర్ణ భావ వ్యక్తీకరణకు వాక్యం ప్రాతిపదిక. అందువల్ల వాక్యాల ఆధారంగా పఠనం బోధించాలని మనోవైజ్ఞానికుల అభిప్రాయం. విద్యార్థుల దృష్టి పఠనంలో పూర్తి వాక్యంపై ఉంటుంది గాని ఒక్కొక్క పదంపై ండదని వారంటారు. కారణం పదాల అర్థాలను వేరువేరుగా గాక వాక్యం మొత్తంలో అవి ఇచ్చే అర్థమే ప్రధానమని వీరి భావన. ఈ పద్ధతిలో పాధ్యాయులు ఒక్కో వాక్యాన్ని ఉచ్చరిస్తూ ఉంటే విద్యార్థులు పుస్తకంలో వాక్యాలను చూస్తూ చదువుతారు. ద్వితీయ భాషగా, తృతీయభాషగా షను బోధించుటలో ఈ పద్ధతి విరివిగా ఉపయోగపడుతుంది.

viii) కథాకథన పద్ధతి :

వాక్యపద్ధతిలో వాక్యం ప్రాతిపదికగా పఠనం నేర్పుతారు. ఈ పద్ధతిలో కథలను ఎన్నుకొని వానికి సంబంధించిన కథా చిత్రమాలికలు చూపుతూ విద్యార్థులచే వాని ఆధారంగా కథను చదివించడం ఈ పద్ధతిలోని ప్రత్యేకత. బాలబాలికలకు కథలందు ఆసక్తి మిక్కుటమైనందున ఈ పద్ధతిలో అద్భుత కథలను, హాస్యకథలను, నీతికథలను వారికి తెల్సిన పదజాలం సహాయంతో చెప్పి చదివించవచ్చు.

పై పద్ధతుల్లో ఉపాధ్యాయులు తమ తరగతికి అనుకూలమైన పద్ధతిని లేదా పద్ధతులను ఎన్నుకొని విద్యార్థుల్లో పఠనం నేర్పాలి. పఠన బోధన కన్నముందు దిగువ కార్యక్రమాన్ని నిర్వహిస్తే బాగుంటుందని కొందరు భాషావేత్తల అభిప్రాయం.

i) చిత్రాలు సేకరించడం.
ii) చిత్రాల గూర్చి మాట్లాడటం.
iii) నమూనాలు తయారుచేయడం, సేకరించడం.
iv) చిత్రాలు, నమూనాలు చూసి అవి వ్యక్తంచేసే భావనలు లేదా వాని కింద రాసిన వాక్యాలను చదివించడం.
v) కథలను చదివించడం.
vi) నాటకీకరణం చేయించడం.

పఠనంలో ప్రధానమైంది లిపి పరిచయం. దీనికొరకు ఉపాధ్యాయులు వివిధాంశాలను ప్రదర్శిస్తూ లిపిని పరిచయం చేయవచ్చు.

i) అందమైన చిత్రాలు ప్రదర్శించడం.
ii) అచ్చుపుస్తకాలు ప్రదర్శించడం.
iii) పత్రికల్లోని బొమ్మలు, చిత్రాలు, అక్షరాలు కత్తిరించి ఆల్బములు తయారుచేయించి చూపడం.
iv) నల్ల బల్లపై ప్రతిరోజు సూక్తులు, వార్తలు రాసి చదివించడం.
v) తరగతి గదిలోని అన్ని వస్తువుల పై వాని పేర్లు రాసి, విద్యార్థుల పేర్లను రాసి ఆ పేర్లను చదివించడం.
vi) పాఠశాలలో చేయు ప్రకటనలను చదివించడం.

పై పద్ధతిలో లిపిని పరిచయం చేసి అనుకూలమైన పద్ధతుల ద్వారా పఠన

సామర్థ్యాన్ని పెంచినపుడు విద్యార్థులు స్వయంగా గాని, సమూహంలోగాని పఠనం చేస్తారు. విద్యార్థులు స్వయంగా, వ్యక్తిగతంగా చేసే పఠనాన్ని వైయక్తిక పఠనమని వ్యవహరిస్తారు. విద్యార్థులు గ్రంథాలయాల్లో చేయు పఠనం, పరీక్షకోసం చేసే పఠనం, మౌనంగాచేసే పఠనం, క్షుణ్ణంగా చేసే పఠనం ఈ పరిధిలోకి వస్తాయి. విద్యార్థులు జట్లలో అందరూ కలిపి ఉమ్మడిగా చేసే పఠనాన్ని సమూహ పఠనమంటారు. గేయాలు, అభినయగీతాలు, యుగళగీతాలు చదవడం, ఒక్కొమ్మడిగా అందరూ ఒకే విషయాన్ని చదవడం ఈ పఠనం పరిధిలోకి వస్తాయి. ప్రాథమిక తరగతుల్లో విద్యార్థులు ఈ తరహా పఠనం ఎక్కువగా చేస్తారు. వీలయినంత మేరకు ఈ పఠనాన్ని నిరుత్సాహపరచాలి.

ఉపాధ్యాయులు గాని మరో విద్యార్థి గాని పుస్తకం చూస్తూ చెప్తూ ఉంటే విద్యార్థులు పుస్తకంలో సంబంధిత లిపి రూపాన్ని చూస్తూ చేసే పఠనాన్ని అనుగుణ పఠనమని గాని అనుసరణ పఠనమని గాని అంటారు. దీనిద్వారా విద్యార్థుల్లో లిపి, నేత్ర సంబంధం పెరిగి, లిపి, నేత్రం, ముఖ యంత్ర భాగాల మధ్య సమన్వయం సాధింపబడుతుంది. అన్ని దశల్లోని పాఠ్యబోధనలో భాగంగా ఉపాధ్యాయులుచేసే ఆదర్శపఠన సమయంలో విద్యార్థులు పుస్తకం చూస్తూ వినడనం, ఉపాధ్యాయులతో బాటు చదవడం సహజంగా చేస్తారు. ఈ పఠనం ద్వారా విద్యార్థుల్లో పఠనాభిరుచిని విరివిగా పెంపొందించవచ్చు.

పఠనంలో లిపి, ధ్వని, నేత్రం, ఉచ్చారణ ప్రధానమైనవి. ధ్వని ఆధారంగా చేసే పఠనాన్ని ప్రకాశ పఠనమని ధ్వనిరహితంగా చేసే పఠనాన్ని మౌన పఠనమని వ్యవహరిస్తారు. ఈ రెండు విధాలైన పఠనాలను గూర్చి తెల్సుకుందాం.

## H) మౌన పఠనం :

మౌనంగా చదివే విధానాన్ని మౌనపఠనం అంటారు. వ్యక్తులు పెదవులు కదల్చకుండా కేవలం నేత్రాల సాయంతో చదవడం ఈ పఠనంలోని ప్రత్యేకత. మౌన పఠనంలో నేత్రగతి (Eye span), తదనుగుణమైన మనోగతి అత్యంత ప్రధానమైనవి. అభ్యాసం ద్వారా నేత్రగతిలో వేగాన్ని సాధింపవచ్చు. ఒకే పర్యాయం కొన్ని వాక్యాల సముదాయాన్ని గాని, కొన్ని పదాల సముదాయాన్ని గాని చూచి చదవడానికి, ఆకళింపు చేసుకోవడానికి మౌన పఠనంలో అవకాశముంటుంది.

### మౌన పఠనం ప్రయోజనాలు :

మౌనపఠనం ద్వారా కింది ప్రయోజనాలు సిద్ధిస్తాయి.

i) విస్తృతమైన జ్ఞాన ప్రాప్తికి సహకరిస్తుంది.

ii) గ్రంథాలయ వినియోగానికి సహాయకారి.

iii) మానసిక విశ్రాంతి కల్గిస్తుంది.

iv) మనోరంజకతను కల్గిస్తుంది.

v) అనతికాలంలో అపారమైన పఠనావకాశాన్ని సమకూరుస్తుంది.

vi) పఠనమునందు వేగమును పెంపొందిస్తుంది.

vii) వాగింద్రియాలకు శ్రమ లేకుండా చేస్తుంది.

viii) నేత్ర, మనో సంయోగావకాశం కల్పిస్తుంది.

పై ప్రయోజనాలతోబాటు దీని ద్వారా అర్థగ్రహణ తీవ్రత పెంపొందుతుందవి, ఆ కారణాన తప్పనిసరిగా విద్యార్థులకు అలవడవలసిన నైపుణ్యమని భాషావేత్తలు అభిప్రాయపడుతున్నారు. ఐనప్పటికి ప్రాథమిక తరగతుల్లో ఈ విధమైన పఠనానికి అవకాశమీయక కేవలం ఉన్నత తరగతుల్లో మాత్రమే దీన్ని ప్రోత్సహించాలని కూడా వారి అభిప్రాయం. కారణం ప్రాథమిక దశలో విద్యార్థులు మౌన పఠనం చేస్తే వారి ఉచ్చారణను సరిచేయలేకపోవడం వల్ల ఉచ్చారణ దోషాలు చోటుచేసికొనే అవకాశం మిక్కుటంగా ఉంటుంది. కేవలం ఈ స్థాయిలో ప్రకాశపఠనాన్నే ప్రోత్సహించాలని వీరి ఉద్దేశ్యం. మూడో తరగతినుండే మౌన పఠనాన్ని ప్రోత్సహించవచ్చునని మరికొందరి అభిప్రాయం.

### మౌన పఠనం చేయించునపుడు దృష్టియందుంచుకోవల్సిన అంశాలు :

i) ఏకాగ్ర చిత్తంతో మౌన పఠనం చేయించాలి.

ii) మొదట పాఠ్యాంశ విషయాన్ని చెప్పి ఆ తర్వాత మౌన పఠనం చేయించాలి.

iii) నేత్రగతిలో ప్రత్యాగతి, తిరోగతి, సమగతి అభ్యాసం చేయించాలి.

iv) నయనమితికి సంబంధించిన శిక్షణనీయాలి. దీనివల్ల అతితక్కువ సమయంలో ఎక్కువ పదాలను వాక్యాలను చూడగల్గుతారు, చదువగల్గుతారు.

v) గద్యబోధనలో మౌన పఠనాన్ని ప్రోత్సహించాలి. పద్యబోధనలో పాఠశాల దశలో ఈ విధమైన పఠనాన్ని ప్రోత్సహించరాదు, వీలైనంతవరకు నిరుత్సాహపరచాలి.

vi) మౌన పఠన వేగాన్ని పెంపొందించడానికి ఉపాధ్యాయులు తగు సూచనలీయాలి.

vii) మౌనపఠనం చేస్తున్నారా లేదా అనే విషయాన్ని సమయానుకూలంగ పరీక్షించాలి.

viii) మౌన పఠనానికి పాఠ్యపుస్తకాన్ని గాని, ఉపవాచకాలను గాని, ఇతర పుస్తకాలను గాని ఉపయోగించవచ్చు.

ix) గ్రంథాలయం, పఠనాలయాల్లో మౌనపఠనం మాత్రమే చేయాలని చెప్పాలి.

x) పరీక్షలకై పదిమంది కల్సి కూర్చొని చదివేటపుడు మౌనపఠనం మాత్రమే చేయాలని చెప్పాలి.

xi) మౌన పఠన అభ్యాసానికి తరగతి బోధనలో కొంత సమయం కేటాయించాలి.

xii) మౌన పఠనం చేయునపుడు పెదవులు కూడా కదుపరాదని చెప్పాలి.

మౌనపఠనం ద్వారా విద్యార్థులు గ్రహించిన అంశాలపై స్వల్పంగా ప్రశ్నిస్తే ఈ పఠనాన్ని ప్రయోజనకారి చేయవచ్చు. శారీరక శ్రమ, లేకుండా కేవలం మనో, నేత్ర క్రియల ద్వారా అర్థగ్రాహ్యత కుపకరించే ఈ పఠనం విద్యావంతులైన మానవుల నిత్య జీవితంలోనే అత్యంత ప్రముఖమైంది.

## D) ప్రకాశ పఠనం :

ప్రకాశ పఠనం విద్యావంతులు మొదట అలవరచుకొనే పఠన నైపుణ్య భాగం. జీవితంలో అడుగడుగునా ఈ పఠనానికే అవకాశముంది. ధ్వనియుక్త పఠనాన్ని ప్రకాశపఠనమంటారు. కొందరు దీన్ని బాహ్యపఠనం అనికూడా వ్యవహరిస్తారు. ఈ పఠనంలో లిపి, నేత్రం, మనస్సు, ఉచ్చారణకు ఉపకరించే అవయవాలు ప్రధానాలు. అందువల్ల ప్రకాశపఠనంలో కింది అంశాలు ప్రాధాన్యత సంతరించుకొంటాయి.

i) లిపి, ఆకృతులు.

ii) ఉచ్చారణ విధం.

iii) వాక్యంలోని విరామ చిహ్నాలు.

ఈ పఠనం ద్వారా కింది ప్రయోజనాలు కల్గుతాయి.

i) సుష్ఠూచ్చారణను పెపొందించడానికి అనుకూలమైంది.

ii) ఉచ్చారణదోషాలను సవరించవచ్చు.

iii) అక్షర రమ్యత, నాదగుణం ప్రధానంగా గల పద్యాలను చదువుతూన్నపుడు రసానుభూతి కలుగుతుంది.

iv) తమదేయైన పఠనశైలిని ప్రదర్శించవచ్చు.

v) భావానుగుణంగా చదవగల్గే నేర్పు అలవడుతుంది.

ప్రకాశ పఠనం చేయునపుడు గమనించాల్సిన అంశాలు :

i) ప్రకాశ పఠనంలో వాగింద్రియాలకు అలసట కల్గుతుంది. ఈ శ్రమను తట్టుకోవాలి. అవసరమైతే పఠనంలో మధ్య మధ్య కొంత విరామాన్ని పాటించవచ్చు.

ii) నిత్యబోధనలో ప్రకాశ పఠనానికే అత్యంత ప్రాధాన్యత నీయాలి.

iii) ప్రాథమిక తరగతుల్లో ప్రకాశ పఠనాన్నే ప్రోత్సహించాలి.

v) పద్యబోధనలో కేవలం ప్రకాశ పఠనమే చేయించాలి.

vi) పఠనంతో బాటు పాఠ్యవిషయాన్ని కూడా గ్రహించేట్లు చూడాలి అప్పుడే అది అర్థవంతమైన పఠనం (Meaningful Reading) అవుతుంది. లేకుంటే అర్థరహిత పఠనం (Non - sense Reading) అవుతుంది.

vii) ప్రకాశ పఠనంలో స్పష్టమైన ఉచ్చారణకు, ఊనికకు ప్రాధాన్యత ఇవ్వాలి.

viii) ప్రకాశ పఠనంలో కూడా పఠన వేగాన్ని పెంపొందించాలి.

ix) నయనమితి, పలుకుమేర రెండున్నూ సమన్వయంతో ఒకదాని వెంట ఒకటి నడచునట్లు చూడాలి.

ఉద్దేశ్యాలననుసరించి, దృష్టియందుంచుకోవల్సిన అంశాల ననుసరించి పఠనం రెండు రకాలు. ఇవి క్షుణ్ణ, విస్తార పఠనాలు. ఇవి చదివే అంశాల లోతుపాతులు, వ్యక్తుల చదువు ధ్యేయాలపై ఆధారపడియున్న పఠన నైపుణ్యభాగాలు. వీనిని గురించి కొంత తెల్సికొందాం.

J) క్షుణ్ణ పఠనం :

Bacon అను భాషావేత్త దృష్టిలో పుస్తకాలను ఆపోశన పట్టడం ద్వారా విస్తారమైన లోకజ్ఞానాన్ని సంపాదించవచ్చు. అతడు 'some books are to be tasted, others are to be Swallowed and some few are to be chewed

and digested' అని వక్కాణించారు. కొన్ని పుస్తకాలను రుచిచూడాలని, కొన్నిటిని మింగివేయాలని, మరికొన్నిటిని నమిలి జీర్ణం చేసికోవాలని వీరి అభిప్రాయం. భావాలను నమిలి జీర్ణం చేసుకోగల్గిన పఠనమే క్షుణ్ణ పఠనం. తరగతిగదుల్లో చేసే పాఠ్యపుస్తక పఠనం క్షుణ్ణ పఠనంగా వ్యవహరింపబడుతుంది. పాఠ్యపుస్తకాన్ని పరీక్షలకోసం, విద్యార్జనకోసం ఆమూలాగ్రం ఉపాధ్యాయులు బోధిస్తారు. తద్వారా విద్యార్థులు ఆయా అంశాలను స్వంతం చేసికోవడం జరుగుతుంది. ఈ పఠనం ప్రకాశంగా గాని, మౌనంగా గాని లేదా రెండు విధాలుగా గాని జరుగుతుంది. ఈ పఠనం కింది ప్రయోజనాలు కల్గిస్తుంది.

i) విషయంపై సంపూర్ణ అవగాహన కల్గించడం.
ii) తార్కిక శక్తిని, ఆలోచనాశక్తిని పెంపొందించడం.
iii) వాక్యాలలోని అంతరార్థాన్ని చదవడం. వాక్యాల మధ్య, వెనక గల భావాన్ని గుర్తించగల్గడం.
iv) ఆయా అంశాలపై వ్యాఖ్యానించగల్గడం.
v) కావ్య సౌందర్యాన్ని, భావ సౌందర్యాన్ని గుర్తించగల్గడం, ఆస్వాదించగల్గడం.
vi) పఠించిన విషయం ఆధారంగా సృజనాత్మకతను పెంపొందించడం.

ఈ పఠనాన్ని గూర్చి శ్రీ గొడవర్తి సూర్యనారాయణ గారు తమ అభినవాచార్యకంలో 'ఇది ఒక కావ్యాన్ని గాని, వ్యాసాన్ని గాని ఆమూలాగ్రం, ప్రతి శబ్దం మీద, అర్థం మీద పరిపూర్ణం గా దృష్టి సారించి విశేషంగా పఠించడం' అని అభిప్రాయపడ్డారు. వాక్యాలు చదువుతూ పూర్వాపర అన్వయం చేస్తూ అర్థ,భావాల ఎడ దృష్టిని నిల్పడం, పదౌచిత్యాన్ని, భావౌచిత్యాన్ని గ్రహిస్తూ, స్వారస్యాన్ని గ్రహించడం ఈ పఠనం ప్రధాన ఉద్దేశ్యం. దీని ద్వారా బాల బాలికల సక్రియా పదజాలం పెరిగి భాష వారి ఆధీనంలో ఉంటుంది. Jesperson భావించినట్లుగా క్షుణ్ణ పఠనం ద్వారా 'The main point is for the pupils to be occupied with the texts repeatedly in such a way that they do not lose sight of the meaning, so that they may thus become so familiar with it, that at least they know it almost or entirely by heart without having been direetly required to commit it to memory. అని వివరించారు. ఈ పఠనం ద్వారానే విద్యార్థులు భాషా సాహిత్యాలపై సముచిత అధికారాన్ని సంపాదించుకోగల్గుతారు.

## K) విస్తార పఠనం :

క్షుణ్ణపఠనంలో భాషాంశాలకు ప్రాధాన్యత ఇస్తే విస్తారపఠనంలో భావానికి

విషయానికి ప్రాధాన్యత ఈయబడుతుంది. ఈ పఠనంలో శబ్దాలు, అర్థాలు ఆనుషంగికాలు. భావం మాత్రమే ప్రధానం. వాటి స్థూలమైన అర్థాలను విద్యార్థులు గ్రహిస్తే ఈ పఠనోద్దేశ్యం నెరవేరుతుంది. ఈ పఠనం కింది ప్రయోజనాలు సాధిస్తుంది.

i) బుద్ధి వికాసానికి ఉపకరిస్తుంది.
ii) సారస్వతాభిరుచికి దోహదపడుతుంది.
ii) విరామకాల సద్వినియోగానికి ఉపయోగపడుతుది.
iii) విశేషజ్ఞానాన్ని సంపాదించడానికి తోడ్పడుతుంది.
iv) గ్రంథాలయ పఠనాన్ని ప్రోత్సహిస్తుంది.
v) విద్యార్థుల్లో మౌన పఠన సామర్థ్యాన్ని అభివృద్ధి పరుస్తుంది.
vi) విద్యార్థుల్లో వైయక్తిక పఠనాశక్తి, పఠనాసక్తిని పెంపొందిస్తుంది.

విస్తార పఠన నైపుణ్యాన్ని ప్రాథమికదశలో కన్న మాధ్యమిక దశనుండి ప్రోత్సహించవచ్చు. మాధ్యమిక దశకు చేరుకున్న విద్యార్థులు లిపిని చక్కగా గుర్తించగల్గి, ఇతరుల సాయం లేకుండా చక్కగా, స్పష్టంగా, స్వయంగా చదివే నైపుణ్యం కల్గి ఉంటారు. ఈ పద్ధతిలో ఉపాధ్యాయుల ప్రమేయం కన్నా విద్యార్థుల స్వయంకృషికే ప్రాధాన్యత హెచ్చు. విద్యార్థులు ఊసుపోకకు (Time Spending ) చేసే, గ్రంధాలయాల్లో చేసే (Reading in libraries) పఠనం విస్తార పఠనం పరిధిలోకి వస్తాయి. ప్రస్తుత పాఠ్య ప్రణాళికల కనుగుణంగా ఆరో తరగతి నుండి ప్రవేశపెడుతున్న ఉపవాచకాల అధ్యయనంతో విస్తార పఠనం ప్రారంభమౌతుంది. ఉపాధ్యాయులు ఉపవాచకాల బోధనద్వారా విద్యార్థుల్లో విస్తార పఠనమునందాసక్తిని పెంపొందించాలి.

ఈ విధమైన పఠనంలో అతి తక్కువ సమయంలో ఎక్కువ విషయాన్ని చదువుతూ ఆకళింపు చేసికోవచ్చు. పలుకుమితి (Speech span) నయనమితి (Eye span ) రెండున్నూ సమన్వయంతో ముందుకు సాగినపుడే ఇది సాధ్యమవుతుంది. అంతేగాక అవసరమైన సందర్భాల్లో మండూకప్లుతి (Skimming) ని కూడా అనుసరించాలి. ఇట్టి పఠనాన్ని మండూకప్లుతి పఠనం అంటారు. (Reading by Skimming) అంటే పుస్తకంలోని అన్ని వాక్యాలు చదవక ఒక వాక్యం చదివి, తర్వాత వాక్యాల్ని వదిలి ఆతర్వాత భాగాల్ని చదివి మొత్తం అర్థాన్ని, భావాన్ని గ్రహించడం ఈ మండూకప్లుతి ద్వారా సాధ్యమవుతుంది. తద్వారా పఠనంలో సమయం ఆదాయై అతి తక్కువ సమయంలో ఎక్కువ విషయాన్ని చదవవచ్చు. విస్తార పఠనంలో

మౌన పఠనమే ప్రధాన స్థానం ఆక్రమిస్తుంది. దీని వల్ల ముఖయంత్రానికి ఎలాంటి అలసట కలుగనందున విస్తార పఠనం అలవోకగా కొనసాగుతుంది.

ప్రాథమిక దశలో కూడా పెద్దచ్చులోని కథలు పుస్తకాలు చదివించి విస్తార పఠనాన్ని ప్రోత్సహించవచ్చునని కొందరి అభిప్రాయం. పైన వివరించిన క్షుణ్ణ, విస్తార పఠనాలు పఠన భేదాలు మాత్రమే. ఇవి పఠన పద్ధతులు కావు. విషయ గ్రహణంలో తరతమ భేదాలు ఈరెండు పఠనాల్లో గోచరిస్తాయి.

## L) విద్యార్థులు సాధారణంగా చేసే పఠన దోషాలు, కారణాలు నివారణ :

బాలబాలికలు పఠనంలో దోషాలు చేయడం సహజం. పఠనదోషాలపై Booner అనే భాషావేత్త ఎన్నో ప్రయోగాలు నిర్వహించారు. ఈదోషాలను మెంజిల్స్ సవివరంగా క్రోడీకరించారు. సాధారణంగా విద్యార్థులు చేయు పఠనదోషాలు, కారణాలు, నివారణోపాయాలు ఈ విధంగా ఉంటాయి.

పఠన దోషాలు :

i) పదాలను సరిగా గుర్తించకపోవడం.
ii) నేత్రగతిలో తారతమ్యముండటం.
iii) నేత్ర లోపముండటం.
iv) అస్పష్ట ఉచ్చారణం.
v) పఠనం చేస్తూ అర్థాన్ని గ్రహించకపోవడం.
vi) వ్యవధి ఇస్తూ చదవడం.
vii) అపరిచిత పదాలను చదవలేకపోవడం.
viii) అనవసరమైన ఊనికతో చదవడం.

కారణాలు :

i) దృష్టిదోషం.
ii) పఠన సామాగ్రి కాఠిన్యత.
iii) దోషమైన బోధన.
iv) పదాలను గుర్తిస్తూ చదవకపోవడం.
v) వాగుత్పత్తి అవయవాల లోపం.
vi) పదరూపంతో బాటు అర్థాన్ని గ్రహించకపోవడం.
vii) నేత్రగతిలో లోపం.
viii) అభ్యాసలోపం.

ix) సరియైన ఉచ్చారణ శిక్షణ నీయకపోవడం.

నివారణోపాయాలు :

i) కళ్ళద్దాలు సమకూర్చుట.
ii) వైద్యుల సలహాలు పొందుమనుట.
iii) ఆకర్షణీయమైన పఠన సామాగ్రి సిద్ధం చేయుట.
iv) సులభమైన పఠన సామగ్రి అందుబాటులో ఉంచుట.
v) నేత్రగతికి సంబంధించిన సూచనలీయుట.
vi) పదాలను వేళ్ళతో గుర్తిస్తూ చదివించుట.
vii) ముఖయంత్ర భాగాల లోపాలున్న సూచించుట.
viii) ధ్వని నిర్మాణాన్ని, ధ్వన్యుత్పత్తిని గూర్చి తెల్పుట.
ix) ఉచ్చారణలో శిక్షణనిచ్చుట.
x) పదాల నిర్మాణం, వాని అర్థాలకు సంబంధించిన వివరాలు చెప్పుట.
xi) పదజాల స్ప్రూహకు, నిఘంటువు వినియోగాన్ని ప్రోత్సహించుట.
xii) ప్రకాశ పఠన అభ్యాసం చేయించుట. దీనికి పూర్వం ఆదర్శ పఠనానికి అనుగుణమైన పఠనం అలవాటు చేయుట.
xiii) పఠనానికి కాలవ్యవధి నిర్ణయించుట.
xiv) పరిచిత పదాల సహకారంతో అపరిచిత పదాలను ఎలా గుర్తించి చదవాలో తెల్పుట.

ఇట్లు పఠన దోషాలను గుర్తించి, కారణాలను వెదకి వాటిని నివారించడానికి ఉపాధ్యాయులు ప్రయత్నించాలి. విద్యార్థుల్లో పఠనాభ్యాసాన్ని పెంపొందించడానికి ప్రత్యేకంగా పఠన పరిచ్ఛేదాలు (Reading passages) సేకరించాలి. ఇవి మొదట సులభంగా ఉండి రానురాను కఠినంగా ఉండాలి. ఇట్లు క్రమీకృత పఠన పరిచ్ఛేదాలను(Graded Reading paragraphs) సమకూర్చుకొని విద్యార్థులచేత చదివించడం ద్వారా వారి పఠన నైపుణ్యాన్ని మెరుగు పరచవచ్చు. ఈ నైపుణ్యాన్ని మదింపువేయుడానికి పఠన నికషలను (Reading tests) కూడా ఉపయోగించవచ్చు. ఉపాధ్యాయులు క్లిష్టతరమైన ఈనైపుణ్యాన్ని విద్యార్థుల్లో పెంపొందించడానికి విశేషంగా కృషిచేయాలి.

## 6.05 లేఖనం :

భాషానైపుణ్యాల్లో నాలుగోదీ, భావ వ్యక్తీకరణ మార్గాల్లో రెండోది

అయిన నైపుణ్యాం లేఖనం. ఇంతకుముందే ప్రస్తావించినట్లుగా ఈనైపుణ్యాం కఠినతమమైన నైపుణ్యాం. అంటే భాషా నైపుణ్యాలన్నింటిలోకి కఠినమైంది అని అర్థం. శ్రవణం కన్న భాషణం, భాషణం కన్న పఠనం, పఠనం కన్న లేఖనం ఉత్తరోత్తరా కఠినతమాలని చెప్తారు. ఈ నైపుణ్యాలన్నీ ఒకదానిపై ఒకటి ఆధారపడి పరస్పరం ప్రభావితమవుతాయి. మన పాఠశాలల్లో లేఖనాన్ని మొదటే నేర్పడం ఆనవాయితీగా వస్తోంది. మనో వైజ్ఞానికులు, భాషాబోధకుల మధ్య ఈ విషయంలో అభిప్రాయభేధాలున్నాయి కూడా. బాలబాలికలకు మొదట లేఖనాన్నే నేర్పాలి అని మాంటిస్సోరి అభిప్రాయం. ఆమె ననుసరించి లేఖనం అవయవ చలన క్రియ మాత్రమే. దీనిద్వారా బాలబాలికలు లిపి రూపాలు, చిహ్నాలు, వాని ఉచ్చారణ విధానం. మొదలైనవి తెల్సికొని భాషపై అధికారం సంపాదిస్తారు. అందువల్ల పఠనం కన్న లేఖనం సులువైన నైపుణ్యమని` ఆమె అభిప్రాయం.

సాధారణంగా పఠనంలో లిపి రూపాన్ని గుర్తించడం, ఉచ్చరించడం మాత్రమే బాలబాలికలు చేయాల్సింది. కాని లేఖనంలో ఈ రెండు క్రియలతో బాటు ఆకృతులకనుగుణంగా కండరాలు కదల్చడం, ఆ ఆకృతులను రాయడంలో ఓర్పు మొదలైనవన్నీ ఆవశ్యకాలే. రాసే వేళ్ళు సులభంగా, ధ్వనికనుగణంగా, ఆకృతులు కల్పించడానికి ప్రయత్నిస్తే లేఖనం సులువవుతుంది. కాని మొదట ధ్వని తెలియక కేవలం ఆకృతులు మాత్రమే తెలిస్తే అంతగా ప్రయోజన ముండదని మనో వైజ్ఞానికుల అభిప్రాయం. ఒక భాషను చదివి, విషయాన్ని సులభంగా గ్రహించవచ్చుగాని ఆ భాషలో రాయడం కఠినమవుతుంది అని కొందరి అభిప్రాయం.

A) లేఖనం ప్రాధాన్య౼ •

ఒక భాషపై అధికారా౼న్ని సంపా౼దించ౼లంటే ఆ భాషలో వినడం, మాట్లాడటం, చదవడాలతో బాటు రాయడం కూడా అవసరమే. అందువల్ల బాషాధికార పరిపూర్ణతకు లేఖనం అవశ్యమైన నైపుణ్యాం. ప్రాచీనకాలంనుండీ మనదేశంలో అందమైన రాతకే ప్రాధాన్యత ఎక్కువ. ఒకే వరసలో అందంగా, సౌష్ఠవంతో రాయడం అనేది ఒక కళగా గుర్తింపు పొందింది కూడా. ఆనాటి నుండి నేటివరకు కూడా అందమైన లేఖనం కోసం (Caligraphy) ఎందరో కృషిచేస్తూ తమ ప్రతిభను ప్రదర్శిస్తున్నారు. ముద్రణా యంత్రాలు, టైపు యంత్రాలు, నిత్యవ్యవహారంలోకి వచ్చినప్పటినుండి లేఖన విధానం లేఖన కళ మరింత కొత్త సొగసులు సంతరించుకొంది. అధునాతనమైన

కంప్యూటర్లు లేఖనాన్ని కొత్త పుంతలు తొక్కిస్తున్నాయి. వ్యక్తుల జీవన విధానాన్నే తెలియజేప్పే శక్తి లేఖనానికుందని విద్యావేత్తలు అంటారు కూడా. ఆకారణాన లేఖనం భాషాభ్యసనంలో, భాషాబోధనలో అత్యంత ప్రధానమైన అంశంగా భావింపబడుతోంది.

B) లిపి వికాసం :

భాషాశాస్త్రవేత్తలు లిపి ఏర్పడిననాటి నుండి వివిధ పరిణామాల నొంది నేటిరూపాన్ని సంతరించుకొందని అభిప్రాయపడతారు. సంకేతలిపి, చిత్రలిపి, ప్రతీకాత్మక లిపి నేటి లిపి రూపాలకు ఆధారమని చెప్తారు. తెలుగు లిపికి బ్రాహ్మీ లిపి మూలమని దానినుండే మనం నేడు రాస్తున్న లిపి రూపం పరిణమించిందని భాషాశాస్త్రవేత్తల విశ్వాసం. భారతీయ భాషల లిపులన్నింటిలో ఒక ప్రత్యేకత కల్గిన లిపిగా తెలుగు లిపి గుర్తింపు పొందింది.

C) తెలుగు లిపి : ప్రత్యేకతలు :

తెలుగు లిపి కొన్ని ప్రత్యేక లక్షణాలు కల్గి ఉంది.

i) తెలుగు అక్షర రూపాలన్నీ వర్తులాలు, అర్థ వర్తులాలు, రేఖలతో ఏర్పడతాయి.
ii) వీలయినంతవరకు ప్రతి ధ్వనికి ఒక లిపి ఆకృతి ఉంది.
iii) ఇతర భాషలనుండి గ్రహించిన Coffee లాంటి పదాల్లోని ఫ కారాన్ని 'ఫ' ం గా సూచించాలని ఒక అభిప్రాయముంది.
iv) ప్రతి పొల్లు హల్లుతో అచ్చుచేరి ఒక్కో హల్లు పదహారు రూపాలుగా ఏర్పడుతుంది.
v) భారతీయ లిపులన్నింటిలో అందమైంది. ముత్యాల సరం వలె గోచరిస్తుంది.

పై ప్రత్యేకతలు గల్గిన లిపి ఎడ విద్యార్థుల్లో జిజ్ఞాస కల్గించడం, వారు మంచి లేఖకులుగా రూపొందడానికి ప్రోత్సహించడం ఉపాధ్యాయుల కర్తవ్యం. బాలురు ఎల్లప్పుడూ ఏదో ఒకటి రాయాలనుకొనే క్రియాశీలురు. అందువల్ల వారికి వివిధ చిత్రాలు చూపి వానిని గీయడం, గీతలు గీయడం, ఆకృతులు గీయడం నేర్పించాలి. వీనికోసం మొదట ఇసుకపై, తర్వాత పలకపై బలపంతో, తర్వాత కాగితంపై పెన్సిలుతో రాసే అలవాటు చేయించాలి. ఈ రాత నేర్పడం అనేది చాలా కష్టమైన చర్యగా Ryburn అభిప్రాయ పడ్డారు. అతడు తన 'Suggestions for Teaching Mother

Tongue' అనే పుస్తకంలో "It is much more difficult to learn to write than learn to read. Great muscular co-ordination is required for the task, and that has not been developed in the little child just learning to read' అని అభిప్రాయపడ్డారు. బాలబాలికలు నిదానంగా మొదట అక్షర రూపాలను గమనించి, వానిని విశితంగా పరిశీలించి ఆ తర్వాత ఆకృతులను రాయడానికి ప్రయత్నించేట్లు చూడాలి. సాధారణంగా శిశువుల చేతికి ఒక పలకా బలపం ఇచ్చినట్లైతే మొదట వారు పలకపై సునాయాసంగా గీసేవి గీతలు, వర్తులాలు అనే విషయాన్ని ఉపాధ్యాయులు మరువరాదు. ఇలా గీయడాన్ని ప్రోత్సహిస్తే చేతివేళ్ళు, కండరాలు రాతకు అనుకూలించే విధంగా మారి వారు రాను రాను రాయడంలో నైపుణ్యాన్ని, ఉత్సాహాన్ని ప్రదర్శిస్తారు.

D) లేఖనం నేర్పడానికి కొన్ని సూచనలు :

బాల బాలికలకు రాత నేర్పడానికి ముందు కింది అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి.

i) రాతను కూడా ఒక క్రమపద్ధతిలో నేర్పాలి.

ii) రాతలో అక్షరాల మధ్య పదాలమధ్య వ్యవధానం సమదూరంలో ఉండాలి.

iii) రాయడంలో ఏ అక్షరాకృతిని చాలా సులభంగా రాయొచ్చో ఆ అక్షరాకృతినే మొదట నేర్పితే రాత నేర్పడం సులభమౌతుంది. మొదటి రూపాన్నే కొంత పరివర్తనం చేస్తూ పోతే మరో అక్షరాకృతి రూపొందేట్లయితే మరీ బాగుంటుంది. దీనిద్వారా బాలబాలికలు అక్షర రూపాల్లోని స్థూల, సూక్ష్మ భేదాలను గ్రహిస్తారు. వానిని త్వరగా గుర్తిస్తారు, రాస్తారు కూడా.

iv) మొదట రాతలో వేగానికి ప్రాధాన్యత నీయక నిదానంగా రాయడాన్ని ప్రోత్సహించాలి.

v) మొదటే అక్షరాలు బాగా రాయాలని గాక బాలబాలికలను స్వేచ్ఛగా రాయనిచ్చి ఆ తర్వాత బాగా రాస్తే ఎలా ఆకర్షణీయంగా ఉంటుందో చెప్పాలి.

vi) మొదట బాలబాలికలు విన్న, మాట్లాడిన, చదివిన విషయాలనే రాయించాలి. కొత్త విషయాన్ని తర్వాతర్వాత రాయించాలి. దీనివల్ల రాతలో దోషాలు తగ్గుతాయి.

vii) బాలబాలికల పేర్లు, తలిదండ్రుల పేర్లు, బంధువుల పేర్లు, సహ వయస్కుల పేర్లు, పరిసరాల్లోని వస్తువుల పేర్లు కూడా రాయమని ప్రోత్సహించాలి.

viii) బాలబాలికలు మొదట ఇసుకలో చేతివేళ్ళతో, పలకపై బలపంతో, తర్వాత కాగితంపై పెన్సిలుతో, ఆ తర్వాత కాగితంపై పెన్నుతో రాయడం అభ్యాసం చేయించాలి.

ix) తరగతిలో నల్లబల్ల కూడా బాలబాలికలకు అందుబాటులో ఉండి దానిపై రాయడానికి తగిన స్వేచ్ఛ ఇవ్వాలి.

x) రాత నేర్పుతున్నప్పుడు బాలబాలికలపై వ్యక్తిగత శ్రద్ధ కనబరచాలి.

E) లేఖన బోధన పద్ధతులు :

సంప్రదాయికంగా మన పాఠశాలల్లో వర్ణమాలా క్రమంలోనే అక్షరాలు రాయడం నేర్పబడుతోంది. దీని ద్వారా బాలబాలికలు అక్షరాలు, తర్వాత గుణితాలు, ఒత్తులు మొదలైనవి నేర్చుకోవడంలోనే ఎక్కువ సమయం తీసుకొంటున్నది ఉపాధ్యాయులకు అనుభవంలోని విషయమే. 'ఇ' అనే అక్షరం రాయడంలో విద్యార్థులు ఎక్కువ సమయాన్ని తీసికోవడం గమనించవచ్చు. అట్లే 'క' అనే అక్షరం వద్ద విద్యార్థులు చాలాసేపు ఆగిపోవడం కూడా కద్దు. ఇట్లు వర్ణమాలా క్రమంలో రాత నేర్చుకోవడం సుమారు మూడు నెలలనుండి సంవత్సరకాలం తీసికొన్న సందర్భాలు, వ్యక్తిగత శ్రద్ధతీసికోకపోతే మరింత దీర్ఘకాలం అవసరమయ్యే సందర్భాలు కూడా ఉపాధ్యాయుల అనుభవం లోనివే. అందువల్ల సంప్రదాయిక పద్ధతియైన వర్ణమాల పద్ధతి కన్న ఆధునికమైన మనో వైజ్ఞానిక పద్ధతిని అనుసరించడం వల్ల రాత త్వరగా నేర్పవచ్చునని భాషా బోధకుల అభిప్రాయం. ఈ పద్ధతిలో అక్షరాల మధ్య సారూప్యత, సులభత నుండి కఠినత అనే అంశాలు ప్రధానాలు. ఒక అక్షరాకృతిని మార్పుచేస్తూ పోవుట ద్వారా మరో అక్షరాకృతిని సాధించే ఈ పద్ధతిలో బాలబాలికలు త్వరగా అక్షరాకృతులను గ్రహించి వీలయినంత తక్కువ కాలంలో మొత్తం లిపి రూపాలను స్వయంగా రాయగల్గుతారు. కాని వర్ణమాలాక్రమంలో రాయలేకపోవుటవల్ల సంప్రదాయవాదులు కొంత అభ్యంతరం చెప్పవచ్చు. అక్షరాలన్నీ పదాలు వర్ణమాలాక్రమంలో కూర్చబడవనే అంశాన్ని గమనిస్తే ఈ అభిప్రాయాన్ని పూర్వపక్షం చేయవచ్చు. అక్షరాకృతులన్నీ రాయవచ్చింతర్వాత వర్ణమాలా క్రమాన్ననుసరించి రాయించడంలో అభ్యంతరం

ఉండకపోవచ్చు. వర్ణమాలాక్రమం అక్షరాల మధ్య ఉచ్చారణలో గల భేదాన్ని మాత్రమే చెప్తుంది. ఈ అంశాన్ని తర్వాతతర్వాత దృష్టిలో పెట్టుకొంటే మనోవైజ్ఞానికుల దృష్టిననుసరించి రాత నేర్పడం సులభమవుతుంది.

ఈ పద్ధతిలో మన తెలుగు అక్షరాలు ఇంతకుముందే ప్రస్తావించినట్లుగా వర్తులాలు, అర్ధవర్తులాలు, రేఖలతో కూడి ఉంటాయి. కనుక మొదట బాలబాలికలకు వీనిని అందంగా రాయడం నేర్పితే ఆ తర్వాత వీని ఆధారంగా ఇతర అక్షరరూపాలను రాయించవచ్చు. ఈ క్రమంలో కింది పద్ధతి అనుసరణీయమని భాషావైజ్ఞానికుల అభిప్రాయం.

\- - - - - -

c c c c c c

ㅇ ㅇ ㅇ ㅇ ㅇ ㅇ

ం ర ఠ ఈ ఝ

ల అ ఆ త ట ఱ

ఉ డ ఢ ఊ

ఎ ఏ ప ఫ ఫ ష వ హ మ ఘ య

ద ధ థ

ఇ (ఞ) ఐ ణ (ౡ ౘ)

ఒ ఓ బ భ జ ఔ (జే) (జ) ఋ (ౠ)

గ న ప

చ (చే) ఛ

క శ ళ

ఖ

పై విధంగా అక్షరాకృతుల్ని కొలది మార్పులు చేర్పులతో విస్తరించడం ద్వారా అన్ని రూపాలను అతి తక్కువ కాలంలో నేర్పవచ్చని ఈ పద్ధతిని అనుసరించి లిపి నేర్పిన ఉపాధ్యాయులు అభిప్రాయపడతారు.

అయితే ఈ అక్షరాకృతుల్ని నేర్పేటపుడు అక్షరాన్ని రాయడం ఎక్కడ ప్రారంభించాలి, ఎక్కడ ముగించాలి అనేది గ్రహించేట్లు చేయడం ప్రాథమిక అంశం. అంతేగాక బాలబాలికలు పరధ్యానంగా తరగతి గదుల్లో పదేపదే పలకపై బలపంతో అక్షరాకృతులు దిద్ది అక్షర పరిమాణాలను విస్తరించే కన్న కొద్దిసార్లే అక్షరాలను అవధానంతో రాయిస్తే సరిపోతుంది కూడా. మరికొన్ని సందర్భాల్లో ఉపాధ్యాయుల దృష్టిపడకపోతే బాలబాలికలు పలకలు

తిప్పి తలకిందులుగా అక్షరాలను దిద్దుతూండడం కూడా గమనించవచ్చు. అందువల్ల ఈ అంశాలను ఉపాధ్యాయులు బహు జాగ్రత్తగా గమనించి తగు జాగ్రత్తలు తీసుకుంటూ రాయడం నేర్పడానికి పూసలు, రంగు దారాలు, చింతగింజలు మొదలైన వాని నుపయోగిస్తూ, వివిధ అక్షరాకృతులను కూర్చేట్లు చూస్తే రాయడాన్ని ఒక క్రీడగా భావించి బాలబాలికలు రాతలో ఆసక్తికనబరుస్తారు. రాత త్వరగా నేరుస్తారు తరగతి స్థాయికనుగుణంగా బాలబాలికలు చదవగల్గిన పదాలను, వాక్యాలను కాఠిన్యతాక్రమంలో రాయగల్గిన నేర్పును పెంపొందించాలి. అక్షరాలతో బాటు గుణితం, ద్విత్వాక్షరాలు, సంయుక్తాక్షరాలు రాయడం, క్రమానుగతంగా నేర్పవచ్చు.

F) మంచి రాతకుండాల్సిన లక్షణాలు :

రాయడం ద్వారా వ్యక్తులు తమ భావాలను ఎదుటి వ్యక్తులకు అందిస్తారు. రాత భాషయొక్క స్థిరరూపం. భావవ్యక్తీకరణకు ఉచ్చారణలో ఎంత స్పష్టత అవసరమో లేఖనంలో అక్షరాకృతుల స్పష్టత కూడా అంతే అవసరం. రాసిన రాత ఇతరులకు అర్థమయ్యేదిలా, చదవడానికి వీలుగా సులభంగా ఉండాలి. అందువల్ల రాత గొలుసుకట్టుగాగాని, ఇఱుకు ఇఱుగ్గా, మిలుకుమిలుకుగా గాని కాక అక్షరాల మధ్య పదాలమధ్య సముచిత వ్యవధానంతో అందంగా రాయగల్గే నేర్పు విద్యార్థులకు అలవడాలి. విరామ చిహ్నాలుకూడా రాత నేర్పడంలో, నేర్వడంలో ప్రధానాలే. అందువల్ల వీని స్పృహ బాలబాలికల్లో కల్గాలి. రాత లక్షణాలుగా కింది వానిని చెప్పుకోవచ్చు.

i) సౌష్ఠవత - అందం :

తెలుగు అక్షర రూపాలు రేఖలు, అర్థ వర్తులాలు, వర్తులాలు మొదలైన వానితో ఏర్పడతాయి కనుక ఇవి అందంగా ఉంటాయని చెప్పొచ్చు. వర్తులం ఎంత గుండ్రంగా రాయగల్గిన నేర్పు కల్గితే అక్షరాలకు అంత అందం వస్తుంది. అచ్చులోగాని, టైపులోగాని, ఆధునికమైన కంప్యూటర్లలో గాని అక్షర రూపాలు ప్రత్యేక అందాలను సంతరించుకొని చూడగానే చదవాలనే, రాయాలనే ఆసక్తిని కల్గిస్తాయి. అందమైన రాత వ్యక్తుల మనో పరిణితికి నిదర్శనంగా భావిస్తారు. దీనికోసం అక్షరాలు సమపరిమాణంలో, పంక్తులు ఒకే వరసలో (సరళ రేఖలో) పొందికగా విరామచిహ్నాలుపయోగిస్తూ రాయడం విద్యార్థులకు అలవరచాలి. అక్షరాల మధ్య, పదాలమధ్య, వాక్యాల మధ్య వ్యవధానం కూడా సమతూకంలో ఉండాలి. పదాలమధ్య ఒక అక్షర

రూపానికి కావల్సిన వ్యవధానం, వాక్యాలమధ్య రెండక్షర రూపాలకు కావల్సిన వ్యవధానాన్ని పాటించి రాయాలని మంచి లేఖకుల అభిప్రాయం.

ii) స్పష్టత - దోషరాహిత్యత :

వర్ణక్రమ దోషాలు లేకుండా స్పష్టంగా రాయడం కూడా రాత లక్షణాల్లో ఒకటి. సాధారణంగా (మ - యు), (శ - ళ), (ప - వ), (స - వ) మొదలైన రూపాల మధ్య భేదాన్ని దృష్టిలో ఉంచుకోకపోవడం ద్వారా రాతలో లోపం జరుగుతుంది. వీనిని గమనించుట ద్వారా రాతలో దోషాలు, అస్పష్టత తగ్గుతాయి. వ్యవహారికభాషలో ఎలా మాట్లాడుతున్నామో అలానే రాయడం కూడా విద్యార్థులకు అలవడాల్సిన అంశమే.

iii) సమవేగం :

సమవేగంగా రాయడం కూడా రాత లక్షణాల్లో ఒకటి. సమవేగం అందంగా రాయడానికి, రాతలో అవధానతకు దోహదపడుతుంది. శీఘ్రలేఖనం కేవలం సంకేత లేఖనం ('Stenogrephy') లోమాత్రమే ఉపయోగకరం. అంతేగాక పరీక్షల్లో, పై తరగతుల్లో ఉపన్యాసకుల ఉపన్యాసాల్లోని సారాంశాన్ని త్వరత్వరగా రాసుకోవడానికి శీఘ్రలేఖనం ఉపకరిస్తుంది. ప్రాథమికదశలో సమవేగాన్ని, నిదానంగా రాయడాన్ని ప్రోత్సహించి పై తరగతుల స్థాయిలో శీఘ్రలేఖనాన్ని ప్రోత్సహిస్తూ రెండు సందర్భాల్లో కూడా స్పష్టత, సౌష్ఠవత, దోషరాహిత్యతలు కూడా దృష్టిలో ఉండేట్లు జాగ్రత్త వహించాలి.

రాయడంలోని ప్రధావ అంశాలను ఈ విధంగా క్రోడీకరించవచ్చు.

i) పంక్తులు వంకర టింకరగా గాక ఒకే సరళరేఖలో రాయడం. దీనికోసం మొదట గీతల పుస్తకాల్లోనే రాత అభ్యాసం చేయించాలి.

ii) పదాలు వాక్యాల మధ్య సమదూరాన్ని పాటించడం.

iii) అక్షరాలన్నీ ఒకే పరిమాణంలో ఉండేట్లుగా జాగ్రత్త తీసుకోవడం. దీనికోసం జంట పంక్తుల పుస్తకాలు (Double - rule books), గళ్ళనోటు పుస్తకాలు (Graph note books) ఉపయోగించాలి. ప్రాథమిక దశలో వీని ఉపయోగాన్ని ప్రోత్సహించాలి.

iv) పదాలు అందంగా, స్పష్టంగా ముత్యాల వరుసవలె సౌష్ఠవంగా ఉండేట్లు రాయడం.

v) రాత అభ్యాసాలు విరివిగా చేయించడం.

విద్యార్థుల్లో లేఖన నైపుణ్యం సమర్థంగా అలవడడానికి రెండు విధాలైన లేఖనాల్ని చేయించవచ్చు. అవి ఉక్తలేఖనం, దృష్టలేఖనం.

G) ఉక్తలేఖనం :

ఉపాధ్యాయులు చెప్తూ ఉంటే విద్యార్థులు పుస్తకాలేవీ చూడకుండా అక్షరాకృతులను జ్ఞప్తికి తెచ్చుకొంటూ రాయడం ఉక్తలేఖనం ప్రధానాంశం. ఈ లేఖనంలో ద్వారా వినడం, ఉచ్చరించడం, రాయడం, చదవడం అనే నాలుగు నైపుణ్యాలు అలవడుతాయి. మొదట ఉపాధ్యాయులు ఉచ్చరించిన ఉక్తలేఖనాంశాలను అవధానంతో వినడం, మౌనంగా ఉచ్చరిస్తూరాయడం, రాసిందాన్ని చదవడం అనేవి ఉక్తలేఖనంలో ప్రధానాలు. ఈ నైపుణ్యాన్ని పెంపొందించడానికి ఉపాధ్యాయులు ఉక్తలేఖనానికి ఇచ్చే అంశాన్ని మూడు పర్యాయాలు చెప్పాలి. ఒకేసారి పూర్తి వాక్యం చెప్పకుండా అర్థవంతమైన వాక్య భాగాల్ని చెప్పాలి. మొదట మెల్లగా చెప్పడం ప్రారంభించి క్రమంగా తరగతి స్థాయి పెరిగినకొలది వేగాన్ని పెంచాలి. తద్వారా విద్యార్థులు వేగంగా, అందంగా రాయడం మాత్రమేగాక పై తరగతుల్లో ఉపన్యాసంలోని ముఖ్యాంశాలను రాసుకోగల్గుతారు. బాలబాలికలకు మొదట తెల్సిన పదాలను, వాక్యాలను చెప్తూ తర్వాత తెలియని పదాలను వాక్యాలను చెప్పాలి. వీలయినంతవరకు ఉక్తలేఖనాంశం ఒక పేరాకు లేదా నాలుగైదు వాక్యాలకు మించరాదు. మొదట విద్యార్థులను లేఖనానికి సన్నద్ధపరచి తరగతిస్థాయికి అనుగుణమైన అంశాలను ఎంపిక చేసికోవాలి. ఉక్తలేఖనంలో విద్యార్థులు పాటించాల్సిన నియమాలు.

i) మొదటిసారి ఉపాధ్యాయులు చెప్పింది వినాలి.

ii) రెండవసారి చెప్పినప్పుడు రాయాలి.

iii) మూడవసారి చెప్పినపుడు రాసింది సరిచూసుకోవాలి.

ఉక్తలేఖనం లోని దోషాలు సవరించుటకు ఉపాధ్యాయులు కింది పద్ధతులు అనుసరించవచ్చు.

i) ఉపాధ్యాయులే అందరు విద్యార్థులు రాసిందాన్ని సరిచూడటం.

ii) అంశాన్ని నల్లబల్లపై రాసి విద్యార్థులనే అనుగుణంగా సరిచూసుకొమ్మనడం.

iii) ఇద్దరు విద్యార్థులు పరస్పరం సరి చూసుకోవడం.

iv) జట్టు నాయకుల సాయంతో సరిచూయించడం.

పైన వివరించిన రెండవ, మూడవ, నాల్గవ సందర్భాల్లో ఉపాధ్యాయులు కేవలం ప్రేక్షకులుగా కాక విద్యార్థులు ఏ మేరకు సరిచూస్తున్నారో, ఎలా సరిచూచుకుంటున్నారో గమనిస్తూ తగు సూచనలీయాలి.

H) దృష్టలేఖనం :

ఈ లేఖనాన్ని చూచిరాత అనికూడా వ్యవహరిస్తారు. సాధారణంగా పాఠశాలల్లో జంట పంక్తుల నోటు పుస్తకం (Double Rule Note book) లో చూచి రాత రాయిస్తుంటారు. ఈ చూచిరాతను మూడు విధాలుగా రాయించవచ్చు.

i) ఉపాధ్యాయులు మొదటి వరుసపంక్తుల్లో మాదిరి వాక్యాలు రాసి మిగిలిన వరసల్లో అనుగుణంగా విద్యార్థులతో రాయించడం.

ii) మార్కెట్లో రాత అభ్యాసానికి లభించే పుస్తకాలు కొని వాని కనుగుణంగా రాయించడం.

iii) విద్యార్థులనే అంశాన్ని ఎన్నుకొని అన్ని పంక్తుల్లో వరసగా రాయమనడం.

మొదటి రెండు పద్ధతుల్లో మొదటి వరసలోని వాక్యాన్ని ఆదర్శవాక్యం అని, మేలుబంతి వాక్యం అని అంటారు. ఈ రెండు పద్ధతులను ప్రాథమిక తరగతుల్లోను మూడో పద్ధతిని ఉన్నత తరగతుల్లోను ప్రోత్సహించాలి. దృష్టలేఖనం లో మొదటి రెండు పద్ధతులు అనుసరిస్తున్నప్పుడు కింది జాగ్రత్తలు విధిగా తీసికోవాలి.

మేలు బంతి వాక్యం చూచి వరసగా కింది పంక్తుల మధ్య వరసల్లో రాస్తున్నపుడు చివరి వరస పంక్తుల్లోని రాతకు మేలు బంతి రాతకు మధ్య ఏ మాత్రం సంబంధం లేకపోవడం సామాన్యంగా గమనింపవచ్చు. దీనికి కారణం వరసలు కిందికి వస్తున్నా కొద్దీ దృష్టి పరిమితమై పై వరసలోని రాతయే ఆదర్శంగా నిలుస్తుంది. చివరి వరసలో రాస్తున్నప్పుడు తాము రాసిన ఆ పై వరసలోని రాతయే ఆదర్శమవుతుంది కాని ఉపాధ్యాయులు రాసి ఇచ్చిన మేలుబంతి వాక్యం ఆదర్శంకాదు. కారణం విద్యార్థులు

రాస్తున్నప్పుడు దృష్టి మొదటి వాక్యం వరకు విస్తరించదు కనుక. అంతేగాక దృష్టలేఖనాన్ని విద్యార్థులు తరగతి గదుల్లోనే పీరియడ్ల విరామాల మధ్య గబగబా అనవధానంతో పూర్తిచేస్తుంటారు. ఈ లోపాలను సవరించడానికి విద్యార్థులతో మేలుబంతి వాక్యం చూస్తూ అట్టడుగు పంక్తిలో మొదట రాయించి వరసగా పై వరసల్లో రాయించడం చేస్తే ప్రతిసారి తాము రాసింది తమ చేతితో కప్పబడి ఉపాధ్యాయుల మేలుబంతి వాక్యమే ఆదర్శంగా నిలుస్తుంది. దీనివల్ల రాతలో వేగం తగ్గి, అవధానత పెరిగి దోషరహితంగా స్పష్టంగా బాలబాలికలు రాయగల్గుతారు. ఈ లేఖనం ద్వారా విద్యార్థులకు నాలుగు ప్రయోజనాలు కల్గుతాయి. అవి :

i) జ్ఞానేంద్రియ శిక్షణ.
ii) రాత ద్వారా అభ్యాసం, అభ్యసనం.
iii) అనుకరణ ద్వారా అభ్యాసం, అభ్యసనం.
iv) స్వయం అభ్యసనం.

మూడో పద్ధతిలో పుస్తకంలోని కొన్ని పేరాలను చూచి రాయమని చెప్పవచ్చు. పైతరగతి విద్యార్థులకు దృష్టలేఖనాన్ని ఉపాధ్యాయుల ముందే తరగతిగది నిర్దేశ్యంగా చేయిస్తే ఆశించిన ప్రయోజనాలు సాధించవచ్చని కొందరు విద్యావేత్తల అభిప్రాయం.

పై పద్ధతులు విద్యార్థుల రాత నైపుణ్యాన్ని పెంపొందించడమే ప్రధాన ధ్యేయంగా కలవి. కొందరు ఉపాధ్యాయులు ఉక్తలేఖనం చెప్పి తప్పురాసిన పదాలను పది పర్యాయాలు, ఇరవై పర్యాయాలు రాయమని తద్వారా విద్యార్థుల రాత నైపుణ్యం అభివృద్ధి అవుతుందని భావిస్తారు. ఇట్టి భాషాశిక్ష లేక సాహితీశిక్ష ను అంతగా ప్రోత్సహించరాదని భాషావేత్తల అభిప్రాయం. దీనివల్ల విద్యార్థుల్లో రాత ఎడ ఉదాసీనత పెరుగుతుందే తప్ప రాసిన అంశాల్లోని దోషాన్ని గుర్తించడం చాలా సందర్భాల్లో జరుగకపోవచ్చు. అందువల్ల లేఖన నైపుణ్యాన్ని పెంపొందించడంలో ఉక్త, దృష్ట లేఖనాలు విశేష పాత్ర వహిస్తాయి. ఉపాధ్యాయులు వీనిని జాగ్రత్తగా నిర్వహించాలి.

I) రాత దోషాలు - కారణాలు - నివారణ :

విద్యార్థులు రాతలో వివిధ దోషాలు చేస్తారు. ఆ దోషాలు ఈవిధంగా ఉండవచ్చు.

1. వర్తనీ (Spelling) దోషాలు

i) అల్ప ప్రాణాన్ని మహాప్రాణంగా రాయడం.
ఉదా :- కరము - ఖరము

ii) మహాప్రాణాన్ని - అల్ప ప్రాణంగా రాయడం.
ఉదా :- ఉపాధ్యాయుడు - ఉపాద్యాయుడు

iii) అక్షరాలలోని ఒత్తులను వ్యత్యస్తంచేయడం.
ఉదా :- భేదం - బేధం

iv) ఒక అక్షరానికి మరో అక్షరం రాయడం.
ఉదా:- శివుడు - సివుడు

2. పదదోషాలు.
3. భావదోషాలు.
4. వ్యాకరణ దోషాలు.
5. విరామ చిహ్నాల దోషాలు.
6. అక్షరాలు, పదాలు, వాక్యాలమధ్య సమదూరాన్ని పాటించకపోవడం.

పై దోషాలకు కింది కారణాలు కావచ్చు

i) అక్షరాకృతులపై సరియైన అవగాహన లేక వాటిని సరిగా గుర్తించకపోవడం.
ii) శీఘ్రంగా రాయాలనే కోరిక.
iii) అనవధానత.
iv) ఉపాధ్యాయుల ఉచ్చారణను సరిగా వినకపోవడం.
v) ఒకసారి రాసింతర్వాత తిరిగి చదివి, సరిచూడకపోవడం.
vi) ద్విత్వ, సంయుక్తాక్షరాలు రాస్తున్నప్పుడు ఉచ్చారణకనుగుణంగా రాస్తు న్నామా లేదా అన్న అంశాన్ని పరిగణనలోకి తీసికోకపోవడం.

పై దోషాలను కింది విధంగా నివారించవచ్చు :

i) విద్యార్థులతో విరివిగా దృష్టలేఖనం చేయించడం.
ii) ప్రతిరోజు ఉక్తలేఖనం చెప్పడం.
iii) విద్యార్థులు చేయు సాధారణ దోషాలను పట్టికగా రాసి తరగతిలో ప్రదర్శించి విద్యార్థులు వానిని పదే పదే చూసేట్లు చూడడం.
iv) భాషాశిక్ష విధించక చేసిన దోషాన్ని గుర్తించేట్లు చేయడం.

v) ధ్వన్యుత్పత్తి, ధ్వని ఆకృతికి సంబంధించిన జ్ఞానాన్ని, స్పష్టమైన ఉచ్చారణను నేర్పడం. తద్వారా దోషరహిత లేఖనాన్ని పెంపొందించడం.

పై అంశాలతో బాటు లిఖిత అభివ్యక్తి అనే బోధనా లక్ష్యంలో వివరించిన వివిధ స్పష్టీకరణాల్ని కూడా రాత నేర్పడంలో ఉపాధ్యాయులు తమ దృష్టి యందుంచుకోవాలి. ఉపాధ్యాయుల రాతను విద్యార్థులు సాధారణంగా అనుకరిస్తారు కనుక తాము రాసే విధానాన్ని మొదట ఉపాధ్యాయులు మెరుగుపరచుకొని తద్వారా విద్యార్థుల రాత నైపుణ్యాన్ని పెంపొందించాలి.

J) లిఖిత రచనలు - రకాలు :

లేఖన సామర్థ్యాన్ని విద్యార్థుల్లో పెంపొందించిం తర్వాత వారు వివిధ రచనలను చేయగల్గినవారుగా తీర్చి దిద్దడం ఉపాధ్యాయుల బాధ్యత. రచన మొదట దృష్టలేఖనం, ఉక్త లేఖనాలతో ప్రారంభమైనప్పటికి రచనల్లో అత్యున్నత అంశమైన వ్యాసరచనను విద్యార్థులు నిర్వహించే విధంగా ప్రోత్సహించాలి. (వ్యాస రచన బోధన వేరేచోట వివరంగా ప్రస్తావించబడింది.) విద్యార్థులు మొదటి స్థాయి రచనలనుండి అత్యున్నత స్థాయి రచన యైన వ్యాసరచన చేయడానికి మధ్య వివిధరీతుల్లో రచనలుచేస్తారు. పాఠ్య పుస్తకాల్లోని అభ్యాసవేదికల్లో సూచించిన విధంగా పదాలకు అర్థాలు, పదప్రయోగం, ప్రశ్నలకు సమాధానాలు, మొదలైనవి దర్శినీ పుస్తకాలపై (Guides) ఆధారపడక స్వయంగా రాయగల్గే నేర్పు విద్యార్థుల్లో పెంపొందించాలి. దీని ఆధారంగా విద్యార్థులు తరగతి స్థాయి కనుగుణంగా వివిధ రచనలను చేయగల్గుతారు. ఇట్లు వివిధ రచనలను చేయగల్గినవాడే లేఖననైపుణ్యం అర్థవంతమౌతుంది. లిఖిత రచనలలో కొన్ని :

i) సంభాషణ రచన.
ii) కథా రచన.
iii) సారాంశ రచన.
iv) వార్తా రచన.
v) వ్యాస రచన.
vi) నాటక రచన.
vii) వివరణ రచన.
viii) వర్ణన రచన.
ix) విశ్లేషణ రచన.
x) సంక్షిప్తీకరణ రచన.
xi) ప్రకటన రచన.
xii) స్వాగత రచన.
xiii) ప్రశంసా రచన.
xiv) కృతజ్ఞతా రచన.
xv) వ్యాఖ్యా రచన.
xvi) భాషాంతరీకరణ రచన.
xvii) దస్తావేజుల రచన.
xviii) లేఖా రచన.
xix) వినతిపత్ర, అభ్యర్థనపత్ర రచన.
xx) ధృవపత్ర రచన.

పై రచనలన్నీ విద్యార్థులు తమ లోని సృజనాత్మకతను ప్రదర్శించడానికి ఉపకరిస్తాయి. ఈ రచనలను విద్యార్థులచే చేయించునపుడు ఉపాధ్యాయులు కింది జాగ్రత్తలు తీసికోవాలి.

i) మొదట రూపురేఖల ఆధారంగా రచనచేయించడం.
ii) అనుకరించి రచన చేయించడం.
iii) ప్రారంభం, ముగింపు రెండూ ఇచ్చి రచన చేయించడం.
iv) చిత్రాల ఆధారంగా రచన చేయించడం.
v) లోకోక్తులు జాతీయాలను వివరించి రాయమనడం.
vi) సాధారణ పత్ర వ్యవహారం చేయించడం.
vii) పాఠ్యాంశాలను సంభాషణారూపంలో రాయించడం.
viii) పాఠశాలలో నిర్వహించే వివిధ కార్యకలాపాలపై రచనలు చేయించడం.

Andrew Wilkinson మరియు ఇతర భాషావేత్తలు తమ Assessment of Language Development అనే గ్రంథంలో రాతకు సంబంధించిన కొన్ని నమూనాలు సూచించారు. పైన వివరించిన రచనాభేదాలు వారి అభిప్రాయంలో రచనా నమూనాలు. వీటిని ఉపాధ్యాయులు పాఠశాలస్థాయిలో విద్యార్థులకు అలవడునట్లు చేయగల్గితే అత్యంత క్లిష్ట భాషా నైపుణ్యమైన లేఖనం విద్యార్థులకు అలవడిందని చెప్పవచ్చని వారి అభిప్రాయం. అందువల్ల ఉపాధ్యాయులు తరగతిస్థాయికనుగుణంగా విద్యార్థులకు పై రచనాభేదాలను పరిచయం చేసి వారిచే విరివిగా అభ్యాసం చేయించాలి.

విద్యార్థులు చేసే వివిధ రచనలలోని దోషాలను సరిచూడటం, లిఖిత రచనల పుస్తకాలను దిద్దడంలో ఉపాధ్యాయులు ఇబ్బందులెదుర్కొంటారు. ఒకే ఉపాధ్యాయుడు నాలుగైదు తరగతులకు బోధిస్తున్నప్పుడు, విద్యార్థులు అధికసంఖ్యలో ఉన్నపుడు అందరు విద్యార్థుల రాత పుస్తకాలను సరిచూడటం జరగదు. అందువల్ల ఉపాధ్యాయులు మార్గాంతరం ఆలోచించి ప్రతిభావంతులైన విద్యార్థుల సహకారంతోగాని, జట్టు నాయకుల సహకారంతో గాని, పై తరగతి విద్యార్థుల సహకారంతో గాని అందరి రాత పుస్తకాలు సరిచూడాలి. ఈ సరిచూడటం ఆవశ్యకత గురించి Thompson అనే భాషావేత్త తమ Teaching of English in India అనే గ్రంథంలో ఇలా వివరించారు. వారు ' A Correction Which is not impressed upon the offender is nothing but just waste of time' అన్నారు. అందువల్ల ఉపాధ్యాయులు రాత దోషాలను ఎత్తి చూపడానికి తమకనుకూలమైన విధానాన్ని ఎంపికచేసికోవాలి.

సాధారణంగా దోషాలు తెల్పడానికి ఒక నిశ్చితమైన సంకేత పూర్వకమైన (Abbreviation) విధానాన్ని ఉపయోగించుకోవాలని భాషావేత్తల అభిప్రాయం. అవి

| సంకేతం | భావం - వివరణ |
|---|---|
| × | అనావశ్యకం |
| ∧ | ఏదో ఒక అంశం మధ్య రాయబడలేదు. లేదా మరవబడింది |
| వ్యా. | వ్యాకరణ సంబంధ దోషం |
| భా | భాషా సంబంధ దోషం |
| ? | అస్పష్టం |
| ?? | అత్యంత అస్పష్టం |
| వి. | విరామ చిహ్నదోషం |
| అ.వి. | అక్షర విన్యాస (వర్తనీ) (spelling) దోషం |
| :? | విషయం అత్యుక్తిగా చెప్పబడింది |
| అ. | అప్రస్తుతాంశాలున్నాయి |
| వా. | వాక్యదోషం |
| ప. | సరియైన పదంకాదు |
| !!! | అసాధారణంగా చెప్పబడింది |
| !? | ఇది నిజమా? |
| చే.రా. | చేతిరాత బాగాలేదు |

పై వానితో బాటు మరికొన్ని సంకేతాలు కూడా ఉపాధ్యాయులు తమ అవసరానుగుణంగా ఏర్పరచుకొని విద్యార్థుల లేఖన దోషాలను పరి చేసి వారి నైపుణ్యాన్ని మెరుగుపరచాలి.

పైవిధంగా వినడం, మాట్లాడటం, చదవడం, రాయడమనే నాలుగుభాషా నైపుణ్యాలు విద్యార్థులకు సమర్థంగా అలవడిన నాడే భాషాభ్యసనం సుకరమవుతుంది. భాషా బోధన - అభ్యసన ప్రయోజనం సిద్ధిస్తుంది.

# ఏడో అధ్యాయం

# సామాన్య బోధన పద్ధతులు

## 7.01 ఉపోద్ఘాతం :

బోధన, అభ్యసనం రెండు విద్యా ప్రక్రియలోని ప్రధాన భావనలు. అభ్యసనాన్ని సమర్థంచేయడానికి ప్రాచీనకాలం నుండే బోధనలో వివిధ వ్యూహాలు, పద్ధతులు అనుసరించబడుతున్నాయి. కాలానుగుణంగా బోధనలో వివిధ ఆధునిక వ్యూహాలు, ధోరణులు కూడా చోటుచేసికొంటున్నాయి. అభ్యసనాన్ని వేగవంతమూ, సమర్థమూ చేసి విద్యార్జనను సుస్థిరంచేయడానికి వివిధ పద్ధతులు ప్రతిపాదింపబడ్డాయి. సాధారణంగా బోధనలో ఉపయోగి స్తున్న కొన్ని పద్ధతులను, భాషాబోధనలో వానినెట్లు వినియోగించుకోవచ్చో తెలిసికొందాం.

## 7.02 ఉపన్యాస పద్ధతి :

బోధనాంశాన్ని ఉపాధ్యాయులే మౌఖికంగా అనుస్యూత (Continnous) రూపంలో భాషిస్తూ వివరించడమే ఉపన్యాస పద్ధతి ప్రధాన లక్షణం. ఈ పద్ధతిలో విద్యార్థుల శ్రవణేంద్రియానికి మాత్రమే పని కల్గుతుంది. విషయ వివరణకు ఈ పద్ధతి చాలా కాలంగా ఉపాధ్యాయులు ఉపయోగిస్తున్నారు. ఈ పద్ధతిలో విషయప్రస్తావన, భావానుక్రమం, క్రోడీకరణ ప్రధాన ఘట్టాలు. విద్యార్థుల్లో బోధనాంశాల యెడ ఆసక్తిని పెంచే వస్తువును ఎంపికచేసికోవడం, వస్తువును ప్రస్తావించడం మొదలైనవి ఈ పద్ధతిలో దృష్టియందుంచుకోవాల్సిన అంశాలు.

ఈ పద్ధతి ప్రాథమిక, మాధ్యమిక తరగతుల విద్యార్థులకు అంతగా ప్రయోజనకరం కాదని పెక్కురి అభిప్రాయం. ఈ దశల్లో విద్యార్థుల భావగ్రహణ సామర్థ్యాలు పరిపక్వత చెందియుండకపోవడమే కాక భాషపై వారికి అంతగా అధికారముండకపోవచ్చు కూడా. అందువల్ల ఈ స్థాయి విద్యార్థులకు ఈ పద్ధతి ఉపకరించదని వారి అభిప్రాయం. సెకండరీ దశలో కూడా ఈ పద్ధతి తగినది కాదని కారణం కేవలం శ్రవణేంద్రియ

ప్రాధాన్యతే తప్ప భాషణ, పఠన, లేఖనాలకు ఈ పద్ధతిలో ప్రాధాన్యత లేదని మరికొందరి అభిప్రాయం. విద్యార్థులు కొన్ని సందర్భాల్లో బోధనాంశాన్ని సవివరంగా తమకుతామే క్రోడీకరణం చేసికోవాల్సిన అవసరం ఈ పద్ధతిలో ప్రధానం కావున సెకండరీ దశలోని విద్యార్థులు ఈ సామర్థ్యాన్ని అంతగా కలిగియుండరని కూడా వారి అభిప్రాయం. కేవలం యాంత్రికంగా విషయ వివరణ, విషయ నిరూపణ జరగడం వల్ల ఈ పద్ధతి ఉన్నత తరగతుల్లో మంచి ఫలితాలనిస్తుందని మరో అభిప్రాయం.

ఉపన్యాస పద్ధతి ఒకవిధంగా విషయాన్ని నేరుగా ప్రస్తావించే పద్ధతి. ఉపాధ్యాయులు తమశక్తి యుక్తుల్ని పరిమితంగా విచక్షణతో ఉపయోగించకపోతే ఉపన్యాస పద్ధతి కంఠశోష అవుతుంది తప్ప అర్థవంతం కాదు. ఉపన్యాస కాలపరిమితి విద్యార్థుల వయోపరిమితిని, విద్యార్థుల మానసికస్థాయిని దృష్టి యందుంచుకొని నిర్ణయించాలి. ఈ పద్ధతిలోని ప్రధాన అవరోధాలు రెండు అవి ప్రధానాంశాల క్రోడీకరణం, భాషణం కొన్ని పర్యాయాలు వేగంగా చేయలేకపోడం. ఉపన్యాసంలోని పదజాలం కఠినమైనదైతే బోధనాభ్యసన క్రియ నిర్వీర్యమవుతుంది. సెకండరీదశలో పూర్వకథా పరిచయానికి, రచయిత పరిచయానికి కొన్ని పర్యాయాలు ఉపన్యాస పద్ధతిని ఉపయోగించవచ్చు. వ్యాస బోధనలో, ఉపవాచక బోధనలో ఈ పద్ధతిని ఉపయోగించడానికి అవకాశాలున్నప్పటికి అచట ఉపన్యాసానికిసమయం లభించదు. నిపుణులైన ఉపాధ్యాయులు ఈ పద్ధతిలోని పరిమితులను దృష్టిలో పెట్టుకొని దీనిని ఉపయోగించుకోగల్గితే భాషాబోధనలో చక్కని ఫలితాలు సాధించవచ్చు.

## 7.03 ప్రశ్నోత్తర పద్ధతి :

మొదట ప్రశ్న, సమాధానం, ఆ సమాధానంపై తిరిగి ప్రశ్న ఇలా కొనసాగే లక్షణం గల ఈ పద్ధతి ప్రఖ్యాత గ్రీక్ తత్వవేత్త "సోక్రటీస్" మొదట ఉపయోగించినట్లుగా భావింపబడుతోంది. అతడు తన వద్దకు వచ్చిన విద్యార్జనాకాంక్ష గలవారి సందేహ నివృత్తికి ఈ పద్ధతిని అనుసరించాడు. జ్ఞానపిపాసను తీర్చుకోవడానికి ప్రతి వ్యక్తి జ్ఞానమున్న ఎదుటివ్యక్తిని ప్రశ్నిస్తాడు. సందేహ నివృత్తి కొరకు, ఆలోచనల తేనెతుట్టెలను కదిలించడానికి ప్రశ్న ఒకే ఒక ప్రభావకారి యైన సాధనంగా పరిగణింపబడుతోంది. ప్రశ్నపద్ధతి వినియోగంలో ఉపాధ్యాయులు కౌశలాన్ని, చాతుర్యాన్ని ప్రదర్శించి పాఠ్యబోధనను సమర్థం చేయాల్సిన అవసరం ఉంది.

ప్రశ్నించడం వల్ల కొన్ని ప్రయోజనాలు నెరవేరుతాయి. దీనిద్వారా విద్యార్థుల జ్ఞానావగాహనల్ని పరీక్షించవచ్చు. కొత్త విషయాల పట్ల వారికి గల ఆసక్తిని తెల్సుకోవచ్చు. వారిని నూతన విషయానికి ఉన్ముఖులను చేయవచ్చు. పాఠ్యాంశ పరిధిలో విద్యార్థులు ఏమేరకు ఆశించిన ప్రవర్తనామార్పులు కనబరచారో తెల్సికోవడానికి ఉపకరించే సాధనాల్లో ప్రశ్నలు ప్రధానమైనవి. ఇవి పాఠ్య విషయ వివరణకు, పునర్విమర్శనకు ఉపకరిస్తాయి. ఎట్లు, ఎందుకు, ఎవరు, ఎప్పుడు మొదలైన ప్రశ్నపదాలతో కూడిన వివిధ ప్రశ్నలు విద్యార్థులలో ఆలోచనలు రేకెత్తించడానికి ఉపకరిస్తాయి.

ప్రశ్నలు వివిధ రకాలుగా ఉంటాయి. ఇవి తమలోనే సమాధాన భాగాన్ని ఇముడ్చుకొని ఉండవచ్చు లేదా ఇతర సమాధానాలను ఆశించవచ్చు. ప్రశ్నలు దిగువ విధంగా ఉంటాయి.

i) మూల పాఠ్యాంశాన్ని వివరించడానికి ఉపకరించే ప్రశ్నలు.
ii) పాఠ్య సన్నివేశాలకు సంబంధించిన ప్రశ్నలు.
iii) పాఠ్యాంశాలతో విద్యార్థుల నిత్యజీవిత అనుభవాలను జోడించే ప్రశ్నలు.
iv) ఆలోచనలు రేకెత్తించే ప్రశ్నలు.
v) కేవలం జ్ఞాపకశక్తిని మాత్రమే పరీక్షించే ప్రశ్నలు.

సమాధానాల పరిధిని బట్టి ప్రశ్నలను కింది విధంగా వర్గీకరించవచ్చు :

i) కేవలం ఔను లేదా కాదు అని సమాధానం ఆశించేవి.
ii) ఒకేపదంలో సమాధానం ఆశించేవి.
iii) ఒకే వాక్యంలో సమాధానం ఆశించేవి.
iv) రెండు మూడు వాక్యాలలో సమాధానం ఆశించే లఘు ప్రశ్నలు.
v) ఒక పేరా సమాధానం ఆశించే ప్రశ్నలు.
vi) వ్యాసరూప సమాధానం ఆశించే ప్రశ్నలు.

ప్రశ్నలడుగు సందర్భాలు :

i) విద్యార్థులను పూర్వ జ్ఞానాన్ననుసరించి ప్రస్తుత పాఠం వైపు ఉన్ముఖీకరణం చేయడానికి.
ii) విద్యార్థుల అవధానాన్ని పెంపొందించడానికి లేదా ఆకర్షించడానికి.
iii) బోధించిన పాఠం విద్యార్థులకు ఏమేరకు అర్థమైందో తెల్సికోవడానికి.
iv) విద్యార్థుల భాషా నైపుణ్యాలను సమీక్షించడానికి.

v) పాఠ్యాంశాలను పునర్విమర్శ చేయడానికి.
vi) అభ్యసనాన్ని పునర్బలనం చేయడానికి.

ప్రశ్నలడుగుటలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు :

i) ప్రశ్నలు స్పష్టంగా ఉండాలి.
ii) ప్రశ్నల్లోని భాష సరళంగా ఉండాలి.
iii) ప్రశ్నలు వీలైనంతవరకు ఒకే సమాధానాన్ని ఆశించాలి.
iv) ఒక ప్రశ్న సమాధానం మరో ప్రశ్న సమాధానానికి ఆధారం కారాదు.
v) ప్రశ్నకు వచ్చిన సమాధానంపై తరవాత ప్రశ్నను నిర్మించాలి.
vi) వేరువేరు ప్రశ్న రూపాలను ఉపయోగించాలి.
vii) ప్రశ్నలు వీలైనంత చిన్నగా ఉండాలి.
viii) ప్రశ్నల్లో అన్ని పాఠ్యాంశాలకు సమాన ప్రాతినిధ్యముండాలి.
ix) వివిధ లక్ష్యాల ఆధారంగా ప్రశ్నలుండాలి.
x) సులభం, మధ్యరకం, కఠినం అనే మూడు స్థాయిలలో ప్రశ్నలుండాలి.

ఈ పరిమితులతో ప్రశ్నోత్తర పద్ధతిని తరగతిగదుల్లో ఉపాధ్యాయులు ఉపయోగించి బోధన నిర్వహిస్తే విద్యార్థులకు ఎక్కువ ప్రయోజనం చేకూరుతుంది.

## 7.04 చర్చా పద్ధతి :

ఇది ప్రశ్నోత్తరాల ఆధారంగా నిర్వహించే పద్ధతి. ప్రశ్నోత్తర పద్ధతిలో ఉపాధ్యాయులు ప్రశ్నించడం, విద్యార్థులు సమాధానం చెప్పడం ప్రధానం. చర్చా పద్ధతి విద్యార్థుల ఆలోచనలకు, ప్రతి స్పందనలకు అవకాశం కల్పించి, వానిని క్రోడీకరించి, క్రమీకరించే అవకాశం కల్పిస్తుంది. ప్రాథమిక దశలో ఈపద్ధతి అంతగా ఉపకరించకపోయినప్పటికి పై తరగతుల్లో దీన్ని ఉపాధ్యాయులు వినియోగించుకోవచ్చు. ఉపాధ్యాయులు ప్రతిపాదించిన ఒక అంశంపై విద్యార్థులు ప్రశ్నలకు సమాధానాలు చెప్తూనే, తమ అభిప్రాయాలను, భావాలను వ్యక్తీకరిస్తారు. విషయ సంబంధమైన సంపూర్ణ భావాలు వ్యక్తీకరింపబడిన తర్వాత ఉపాధ్యాయులు వానిని క్రోడీకరించి సాధరణీకరణం చేస్తారు. ఈ పద్ధతిని పద్యం, గద్యం, ఉపవాచకం, వ్యాసం బోధిస్తున్నప్పుడు ఉపయోగించుకోవచ్చు.

## 7.05 వివరణ పద్ధతి :

ఉపాధ్యాయులే పాఠ్యాంశంలోని ప్రధాన భావనలను విద్యార్థులకు నేరుగా వివరించే పద్ధతే వివరణ పద్ధతి. ఉదాహరణకు పాఠరచయితకు సంబంధించిన సమాచారం, పూర్వ కథకు సంబంధించిన సమాచారం, కథాంతర్గత కథనం, జాతీయాలు, లోకోక్తుల వివరణ మున్నగునవి కొన్ని పర్యాయాలు ఉపాధ్యాయులే నేరుగా చెప్పాల్సి ఉంటుంది. ఉపమానాలు, కఠినభావనలు, చారిత్రకనేపథ్యం, పరామర్శలు (refernces) కూడా ఈపరిధిలోకి వస్తాయి. పాఠ్యాంశ పరకథా వివరణకు కూడా ఈ పద్ధతి అవసరం. ఈ పద్ధతిలో ఉపన్యాస పద్ధతిలోవలెనే విద్యార్థులు కేవలం శ్రోతలుగా ఉండే అవకాశం ఉంది. అందువల్ల వివరాలను సూటిగా, చిన్న మాటల్లో, మనోరంజకంగా చెప్పి ప్రధానాంశాలను నల్లబల్లపై రాయగల్గితే ఈ పద్ధతి కొంతమేరకు ఫలవంతమౌతుంది. ఈ పద్ధతి ఎక్కువగా ఉపవాచక భోధనలో ఉపకరిస్తుంది.

## 7.06 విశ్లేషణ పద్ధతి :

ఈ పద్ధతిలో బోధనాంశాన్ని ఉపాధ్యాయులు వివిధ కోణాల్లో వివరించయత్నిస్తారు. బోధనాంశంలోని పదం, రూపం, విభజన, వ్యుత్పత్తి, లక్షణం మొదలైనవి ఈ పద్ధతి పరిధిలోకి వస్తాయి. పాఠశాలనిత్య బోధనలో ఇది అంతగా ఉపకరించక పోయినప్పటికి ప్రధానంగా వ్యాకరణ బోధనలో ఉపాధ్యాయులకు సాయపడుతుంది.

ఈ పద్ధతి ద్వారా విద్యార్థుల్లో తార్కిక శక్తి, లోతైన ఆలోచనాశక్తి, పెరుగుతుందని యంగ్ అనే మనస్తత్వశాస్త్రవేత్త అభిప్రాయపడ్డారు. Analysis and synthesis అనే రెండు ప్రధాన భావనల సమాహార రూపమే విశ్లేషణ పద్ధతి అని మరికొందరు విద్యావేత్తల అభిప్రాయం.

## 7.07 కథన పద్ధతి :

ప్రాథమిక తరగతుల్లో ఈ పద్ధతి ఉపకరిస్తుంది. విద్యార్థులు కథలంటే, కథనమంటే చెవి కోసుకొంటారు. విద్యార్థుల అవధానాన్ని ప్రతిష్ఠించి, ఆసక్తిని పురిగొల్పి వారిలో శ్రవణేంద్రియ నిగ్రహాన్ని పెంపొందించడానికి ఈ పద్ధతి సాయపడుతుంది. అన్ని తరగతుల్లో ఉపవాచకపాఠాలు, కథా పాఠాలు బోధిస్తున్నపుడు ఈ పద్ధతిని వినియోగించవచ్చు. విద్యార్థులతో కథలు చెప్పిస్తూ వారి భావ వ్యక్తీకరణలో స్పష్టతను కూడా సాధింపవచ్చు.

సాధారణంగా పద్య, గద్య బోధనలో పాఠ్య సంబంధ పూర్వకథ, పరకథలను చెప్పడానికి కథన పద్ధతి ఉపకరిస్తుంది.

పై పద్ధతులన్నీ ఏదో ఒక సందర్భంలో గాని, కొన్ని సందర్భాల్లో గాని ఉపకరిస్తాయి. ఏఒక్క పద్ధతి సంపూర్ణంకాదు. సమగ్రం కాదు. ప్రతి పద్ధతికి పరిమితులున్నాయి. అందువల్ల ఉపాధ్యాయులు తమ తరగతి స్థాయి, విద్యార్థుల స్థాయి, పాఠ్యాంశం మొదలైన వానిపై ఆధారపడి ఏదేని ఒక పద్ధతిని గాని, కొన్ని పద్ధతులుగాని అనుసరించి పాఠ్య భోధన చేయవచ్చు.

**బోధనలో ఆధునిక ధోరణులు :**

పై పేరాల్లో వివరించిన సామాన్య బోధన పద్ధతులు కాక పాశ్చాత్య దేశాల్లో అనుసరింపబడి సత్ఫలితాలిస్తున్న కొన్ని ఆధునిక బోధన పద్ధతుల్ని కూడా తెల్సికోవాల్సి ఉంది. వీనిలో కొన్నిటిని గూర్చి తెల్సికొందాం.

## 7.08 వ్యక్తి పద్ధతి :

ఈ పద్ధతిని వ్యష్టిపద్ధతి, నియోజనాల పద్ధతి అని వ్యవహరిస్తారు. అమెరికాలోని డాల్టన్ నగరంలో ఈ పద్ధతిని మొదట Helen park Hurst అనే విద్యావేత్త అమలు చేయుటవల్ల ఈ పద్ధతికి డాల్టన్ పద్ధతి అని పేరు వచ్చింది.

మనో వైజ్ఞానిక శాస్త్రంలోని మానవ వ్యక్తిత్వ వికాసంలో వైయక్తిక భేదాలగురించిన వివరణ ఉంది. విద్యార్థుల్లో వీనిని గుర్తించి ఆయా భేదాలకనుగుణంగా వారి అభ్యసనాన్ని వేగవంతం చేయడానికి ఈ పద్ధతి అత్యంత ఉపయోగకారి. ఈ పద్ధతిలో పాఠ్యక్రమాన్ని మార్చకుండా తరగతులనే ప్రత్యేక పద్ధతిలో రూపొందించుకోవాలి. విద్యార్థుల వైయక్తిక దృక్పథాలకనుగుణంగా కింది సిద్ధాంతాలపై ఆధారపడి బోధన కార్యక్రమం కొనసాగాలి.

i) బాలబాలికల్లో ప్రతిభావంతులు, మధ్యస్థులు, మందబుద్ధులు అనే మూడు విధాలైన వారుంటారు. వారి అభ్యసన తీవ్రత వేరు వేరుగా ఉంటుంది. ప్రతిభావంతులు పాఠ్యాంశాల్ని త్వరగా గ్రహిస్తే మందబుద్ధులు ఆలస్యంగా గ్రహిస్తారు.

ii) ఈ పద్ధతిలో విద్యార్థులు సంపూర్ణ స్వతంత్రులు. వారి ఇచ్ఛానుసారంగా తరగతిలో తమ ఆలోచనలను ఇతరులతో పంచుకోవచ్చు.

(iii) ఈ పద్ధతిలో బాలబాలికలు స్వయంగా అభ్యసిస్తారు. ఉపాధ్యాయులు కేవలం అభ్యసన మార్గదర్శకులు మాత్రమే.

బోధన ప్రణాళిక :

ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు పాఠ్యాంశాన్ని వివిధ నియోజనాల్లోకి పరివర్తనం చేస్తారు. నిర్దిష్టసమయంలో పూర్తిచేసే విధంగా తరగతి లోని వేరువేరు ప్రతిభాస్థాయిల్లోని విద్యార్థుల కనుగుణంగా నియోజనాలు (assignments) సిద్ధంచేస్తారు. సాధారణంగా అనుసరించే తరగతి పద్ధతికి బదులుగా విషయ కక్ష్యల్లో (subject rooms) విద్యార్థులు ఆయా నియోజనాలను సాధిస్తారు. విద్యార్థులు తమ ఆసక్తులు, అభిరుచు లకనుగుణంగా విషయ కక్ష్యంలో పాఠ్యాంశాలను స్వేచ్ఛగా అభ్యసిస్తారు. దీనికోసం ప్రత్యేకంగా కాలనిర్ణయ పట్టిక అంటూ ఉండదు. విషయ నిపుణులు (resource persons) విద్యార్థుల వైయుక్తిక ప్రతిభలను గుర్తించి వారికి మార్గదర్శనం చేస్తూ అభ్యసనాన్ని మెరుగు పరుస్తారు. విద్యార్థుల ప్రతిభా భేదాల కనుగుణంగా ప్రతిపాఠంపై కనీసం మూడు విధాలైన నియోజనాలు సిద్ధంచేసి విషయ కక్ష్యల్లో సిద్ధంగా ఉంచుతారు. నియోజనాలు సులభం, మధ్యమం, కఠినం అని మూడు విధాలుగా ఉంటాయి. విద్యార్థులు మొదట సులభమైన నియోజనాన్ని పూర్తిచేసి, తర్వాత మధ్యమం, ఆతర్వాత కఠినమైన నియోజనాన్ని పూర్తి చేస్తారు. ప్రతి నియోజనం ఎలా పూర్తిచేయాలో సమగ్రమైన సూచనలు, పరామర్శించదగిన పుస్తకాల పట్టికలను నియోజనం చివర పొందుపరుస్తారు. సంప్రదించాల్సిన పుస్తకాలు కూడా అదే కక్ష్యలో అందుబాటులో ఉంటాయి. విద్యార్థులు నియోజనాల్ని పూర్తి చేయుటలో కాఠిన్యతను ఎదుర్కొన్నపుడు మాత్రమే ఉపాధ్యాయుల్ని సంప్రదిస్తారు. ఈ పద్ధతిద్వారా ఉపాధ్యాయులు విద్యార్థుల స్వీయ అధ్యయనాన్ని పెంపొందించడానికి అవకాశముంటుంది.

భాషాబోధనలో ఈ పద్ధతిని ఉపయోగించుట ద్వారా వాచిక కృషి, లేఖనకృషి, స్వీయపఠనం, పఠనావగాహనం, నిఘంటువులను సంప్రదించే అవకాశం, అదనపు సమాచార సేకరణ, రచయిత వివరాలు, పూర్వ కథ, పరకథలను విద్యార్థులు వేగంగా స్వంతం చేసికొంటారు. నియోజనాలు కృత్యాలు, ప్రశ్నోత్తరాల రూపంలో ఉంటాయి. కావున విద్యార్థులు కృత్యాధార అభ్యసనమను ఆధునిక ధోరణికి కూడా అలవాటు పడతారు. అంతర్గత చర్చల ద్వారా నిశిత విశ్లేషణ సామర్థ్యాలు కూడా విద్యార్థులకు అలవడతాయి.

మన తరగతి బోధనలో ఈ పద్ధతిని పూర్తిగా అమలు చేయడానికి ప్రస్తుతం అంతగా అవకాశాలు లేకపోయినప్పటికి కనీసం కొన్ని పాఠాలైనా ఈ పద్ధతిలో బోధించగల్గితే విద్యార్థులకు ఇతోధికంగా లాభం చేకూరుతుది. దీని ద్వారా విద్యార్థులు తమకు ఆసక్తి ఉన్న బోధనాంశంలో మరింతముందుండి తమ ప్రతిభను ప్రదర్శిస్తారు.

## 7.09 ప్రాజెక్టు పద్ధతి :

John Dewey ప్రతిపాదించిన విద్యాతత్వ మూలసూత్రాలపై ఆధారపడిన పద్ధతి ఇది. ప్రఖ్యాత విద్యావేత్త కిల్‌ప్యాట్రిక్ ఈ పద్ధతిని మొదట ప్రయోగించి ప్రయోజనం సాధించినట్లుగా విద్యావేత్తలు అభిప్రాయపడతారు. కిల్‌ప్యాట్రిక్ ననుసరించి 'ప్రాజెక్టు ఒక ఉద్దేశ్య పూర్వకమైన క్రియ. దీనిద్వారా సామాజిక వాతావరణ కల్పన సాధ్యమౌతుంది'. స్టీవెన్ పన్ అభిప్రాయంలో 'స్వాభావికమైన పరిస్థితుల్లో సమస్యాపరిష్కార పద్ధతియే' ప్రాజెక్టు పద్ధతి. 'బల్లార్డ్' ఈపద్ధతిని ఒక జీవన విధానంగా మరియు జీవితాంతర్భాగంగా గుర్తించారు. ఈ పద్ధతిలో భోధన క్రమం దిగువ విధంగా ఉంటుంది.

(i) సమస్యను గుర్తించి సంబంధిత వాతావరణాన్ని కల్పించడం.
(ii) సమస్యకు సంబంధించిన పూర్వాపరాల చర్చ.
(iii) సమస్యా పరిష్కారానికి తగిన కార్యాచరణ ప్రణాళిక రచన.
(iv) సమస్యాపరిష్కారంలో సాధించిన ఫలితాలను క్రోడీకరించుట.
(v) సాధించిన ఫలితాలను మూల్యాంకనం చేసి ఫలితాలను నిర్ధారించుట.

సాధారణ బోధనప్రణాళిక కన్న భిన్నమైన ఈ పద్ధతిననుసరించి చేసే భోధన ప్రభావయుతమని విద్యావేత్తల అభిప్రాయం. ఈ పద్ధతిని ప్రకల్పన పద్ధతి అని, సమస్యా పరిష్కార పద్ధతి అని, ఉద్యమ పద్ధతి అని కూడా వ్యవహరిస్తారు.

ఈపద్ధతిలో మొదట విద్యార్థులు స్వయంగా సమస్యను గుర్తించే వాతావరణాన్ని ఉపాధ్యాయులు కల్పించాలి. సమస్యను గుర్తించి తర్వాత దాని పరిష్కారానికి కావల్సిన ప్రణాళికను సూచించి విద్యార్థులే దాన్ని స్వయంగా నిర్వహించేట్లు చూడటం ఉపాధ్యాయుల కర్తవ్యం. ఉదాహరణకు పాఠశాలలో 'దీపావళి' అనే పాఠాన్ని భోధించాల్సి ఉందని భావిద్దాం. ఈ పాఠానికి సంబంగిం౧ిన పార్య సామగ్రి, పుస్తకాలు, పత్రికలు, చిత్రాలు మొదలైనవి

విద్యార్థులు సేకరిస్తారు. వానిని చదివి దీపావళి రోజు ఏంచేస్తారో ఆపండగ ప్రాధాన్యత ఏమిటో వారు తెల్సికొంటారు. ఈ పండక్కి ఎవరెవరిని ఆహ్వానించాలో నిర్ణయించుకుంటారు. పండుగ జరుపుకొన్న తర్వాత తాము నిర్వహించిన తీరును మదింపు వేసికొంటారు. దీపావళి గేయాలు చెప్పడం, కథలు సేకరించడం, చిత్రాలు సేకరించడం మొదలైన కృత్యాలెన్నో చేస్తూ విద్యార్థులు స్వయంగా విషయాన్ని గ్రహిస్తారు.

మరో ఉదాహరణ పాఠశాలల్లో నిర్వహించే గణతంత్ర దినోత్సవానికి సంబంధించిన ఏర్పాట్లు చేయడం. దీనికై మొదట కార్యక్రమ వివరాల్ని సిద్ధం చేయడం, ఆహ్వానితుల పట్టిక రాయడం, ఆహ్వానాలు రాయడం, పంచడం, సభను ఏర్పాటు చేసి సభికుల్ని ఆహ్వానించడం, పతాకావిష్కరణ తర్వాత ప్రసంగించడానికి ప్రసంగ పాఠం సిద్ధం చేయడం, కార్యక్రమం చివర కృతజ్ఞతలు తెల్పడం తోబాటు కార్యక్రమాన్ని గూర్చి, తల్లిదండ్రులకు స్నేహితులకు లేఖలు రాయడం మొదలైన ఎన్నో అంశాలు విద్యార్థులే స్వయంగా నిర్వహిస్తారు. ఈ పద్ధతి విద్యార్థుల్లో సునిశిత పరిశీలనాశక్తిని పెంపొందించి వారి అభ్యసనాన్ని మెరుగుపరుస్తుంది.

## 7.10 క్రీడా పద్ధతి :

క్రీడలు బాలబాలికల్ని ఆహ్లాదపరిచే శక్తి కలవి. తద్వారా వారు మానసికమైన అలసటను పోగొట్టుకుంటారు. క్రీడలంటే వారికి చాలా ఇష్టం. ఈ క్రీడల ఆధారంగా నిర్వహించే బోధన పద్ధతే క్రీడా పద్ధతి. మనస్తత్వ శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు ఈ పద్ధతి ఆవశ్యకతను నొక్కి చెప్పారు. Schiller మరియు Herbert Spencer అనే విద్యావేత్తలు ప్రకృతి ప్రతి వారికి కొన్ని శక్తి యుక్తుల్ని ప్రసాదిస్తుందని వీనిని జీవనోప యుక్తంగా మార్చుకొనే అవకాశాలు కల్పించి తద్వారా విద్యార్థుల సమగ్ర వికాసాన్ని సాధించవచ్చని అభిప్రాయపడిరి. Spencer క్రీడను యంత్రాల్లోని ఒక safety valve తో పోల్చాడు. Safety Valve ద్వారా యంత్రశక్తి క్రమబద్ధంగా వెలువడి యంత్రం ఎలా సురక్షితంగా ఉంటుందో అట్లే క్రీడా శక్తి ద్వారా విద్యార్థుల శక్తియుక్తుల్ని మెరుగుపెట్టవచ్చని అభిప్రాయ పడ్డారు. Lord kims, Kilpatrik లు కూడా ఈసిద్ధాంతాన్ని బలపరచి బాలబాలికలు స్వేచ్ఛగా ప్రవర్తించే స్థలం క్రీడా ప్రాంగణం కావున అచటనే వారి అభ్యసనానికి పునాదులు నిర్మించాలని అభిప్రాయ పడ్డారు.

Karl Groos మరియు Valentine గారలు విద్యార్థుల్ని సమర్థమైన భావిజీవనానికి తయారుచేయ గల్గిన సిద్ధాంతంగా ఈపద్ధతిని పరిగణించారు. Stanely Hale మరియు Ross అను విద్యావేత్తలు క్రీడను ఒక పునరావర్తన సిద్ధాంతంగా ప్రతిపాదించి దీనిద్వారా విద్యార్థులు తమ జీవితానుభవాలను పునరావృతం చేసికొంటారని, వారు సాధారణంగా ఆడే దాగుడుమూతలాట లాంటి ఆటల ద్వారా విషయాన్ని త్వరగా తేలిగ్గా అభ్యసించడానికి వీలుకల్గుతుందని అభిప్రాయ పడ్డారు. Ryburn క్రీడల విశేషాలను కింది విధంగా క్రోడీకరించారు.

(i) బాలబాలికలు ఆటలాడుటకు సన్నద్ధులైనప్పుడు వీరికి ప్రత్యేక ఉద్దేశ్యాలేవీ ఉండవు. కేవలం ఆటల్ని ఒక ఆటగానే భావిస్తారు.

(ii) క్రీడ మనోల్లాసంతో కూడిన స్వతంత్ర క్రియ, వారు ఎంత సమయమైనా ఆడుకోగల్గుతారు. ఆడే సమయానికి పరిమితులేవీ లేవు.

(iii) క్రీడల ద్వారా మానసికమైన అలసటను తొలగించవచ్చు.

(iv) క్రీడల ద్వారా నిశిత ఆలోచన, సూక్ష్మ పరిశీలనాశక్తి పెంపొందుతాయి.

(v) అందరూ కల్సిమెల్సి ఆడుకుంటారు కావున సమూహ భావన, సమైక్యతా భావన పెంపొందుతుంది.

(vi) ఆత్మగౌరవ భావనకు కూడా క్రీడల్లో స్థానముంటుంది.

Gullick అనే విద్యావేత్త తన Philosophy of play అనే గ్రంథంలో 'play is what we do, when we are free to do when we will' అని వివరించారు. అంటే స్వేచ్ఛగా, స్వతంత్రంగా నిర్వహించే మనోల్లాసక్రియయే క్రీడ అని వారి అభిప్రాయం.

పాఠశాలల్లో సాధారణ క్రీడలకు ఇచ్చే సమయంతో బాటు వివిధ బోధనాంశాలను కూడా క్రీడామాధ్యమం ద్వారా బోధించవచ్చు. Ryburn బోధన సంబంధమైన క్రీడలను ఇలా వర్గీకరించారు.

i) ప్రకల్పనా సబంధ క్రీడలు.

ii) రచనా క్రీడలు.

iii) నాటకీకరణ క్రీడలు.

పై క్రీడలను ఉపయోగించి భాషాబోధనను సమర్థం చేయడానికి అవకాశాలున్నాయి. ఈ పద్ధతి ప్రాథమిక తరగతుల్లో అధిక ప్రయోజనకారి. ఐనప్పటికి పై తరగతుల్లో కూడా ఉపయోగపడుతుంది. భాషలో

i) అక్షర క్రీడలు
ii) పదనిర్మాణ క్రీడలు.
iii) వాక్య క్రీడలు.
iv) పొడుపు కథల క్రీడలు.
v) గళ్ళనుడి కట్టు - పదబంధ ప్రహేళికలు పూర్తిచేయుక్రీడ.
vi) క్విజ్ క్రీడ.
vii) నాటకీకరణం - సంభాషణ క్రీడలు.
viii) పద్య పఠన క్రీడలు.

మొదలగు వానిని ఆటలాడుటలో భాగంగానే నిర్వహించి విద్యార్థుల జ్ఞాన పరిధుల్ని పెంచవచ్చు. పై తరగతుల్లో కథాకథనం, ఉక్తరచన, ముఖాముఖీ (Interview) నైపుణ్యం, వర్ణన, ఆశువు, అభినయం క్రీడల్లో భాగంగా నిర్వహించవచ్చు. పద్యపఠనం కూడా క్రీడల్లో భాగంగా చేయించవచ్చు. ఇట్లు వైవిధ్యభరితమైన భాషాంశాలను ఆటల మాధ్యమం ద్వారా విద్యార్థులు అభ్యసించేట్లు చూచి, అపంకల్పితంగానే వారి అభ్యసనాన్ని మెరుగుపచవచ్చు. ఉపాధ్యాయులు బోధన వ్యూహంగా ఈ పద్ధతిని అనుసరించి సత్ఫలితాలను సాధించవచ్చు.

## 7.11 కిండర్ గార్డన్ పద్ధతి :

ఈ పద్ధతిని బాలోద్యాన పద్ధతి అని వ్యవహరిస్తారు. దీనిని ప్రతిపాదించి అమలుచేసిన విద్యావేత్త ఫ్రోబెల్. వీరి అభిప్రాయంలో పాఠశాల ఒక ఉద్యానవనం లాంటిది. బాలబాలికలు అందరూ ఉద్యానంలోని చిన్న మొక్కలవంటి వారు. తోటమాలి ఎలా మొక్కల పోషణభారాన్ని పూర్తిగా స్వీకరిస్తాడో అట్లే ఉపాధ్యాయుడనే తోటమాలికూడా విద్యార్థులనే మొక్కల్ని బోధనద్వారా పెంచి వారి జ్ఞాన పరిధుల్ని విస్తరించాలి. తద్వారా ఉద్యానం వంటి పాఠశాలకు అందచందాలు, పేరు ప్రఖ్యాతులు సమకూరుతాయి. ఈ పద్ధతిలో బాలబాలికల ఎదుగుదలకు కావల్సిన సహజ వాతావరణాన్ని సంపాదించి వారు స్వేచ్ఛగా కార్యకలాపాల్ని నిర్వహించే వీలు కల్గించి,

కేవలం వారి కార్యకలాపాల్ని పరిశీలించేవారుగా మాత్రమే ఉపాధ్యాయులు వ్యవహరించాలి. ఈ పద్ధతిలో స్వేచ్ఛాయుత క్రీడలకు అధిక ప్రాధాన్యత ఉంటుంది. తరగతి గదుల్లో కూడా క్రీడా సామాగ్రి అందుబాటులో ఉండుట వల్ల విద్యార్థులు ఆనందంగా పాఠశాలలో గడుపుతారు. ఈ పద్ధతిలో విద్యార్థులు చిన్న చిన్న గేయాలు, కథలు, అభినయగీతాలు, హావభావప్రదర్శన మొదలైన కార్యకలాపాల్ని నిర్వహించవచ్చు. Parkar అనే విద్యావేత్త ఈపద్ధతి యొక్క గొప్పతనాన్ని నొక్కిచెప్పారు. చాలా ప్రాంతాల్లో కిండర్ గార్డన్ పేరుతో పిలవబడుతున్న పాఠశాలల స్థాపన ఈ పద్ధతినే ప్రారంభమైంది. అయితే ఈ నాటి పాఠశాలలు కేవలం ఐదు సంవత్సరాల్లోపు శిశువులకు Lower K.G, Upper K.G, అనే రూపంలో విద్యాబోధన చేస్తున్నాయి తప్ప అసలైన పద్ధతిని దాని ఉద్దేశ్యాలను పాటించుట లేదు. ఈ పద్ధతిద్వారా విద్యార్థులు కృత్యనిర్వహణ ద్వారా స్వేచ్ఛాయుత అభ్యసనానికి అవకాశం కల్పించినపుడే కిండర్ గార్డన్ పద్ధతి సార్థకమవుతుంది.

## 7.12 మాంటిసోరి పద్ధతి :

మేడమ్ మాంటిస్సోరి ప్రతిపాదించిన పద్ధతి ఇది. విద్యార్థుల సర్వాంగీణ వికాసాన్ని, వారి శక్తియుక్తుల్ని, స్వయం వ్యక్తీకరణ భావనలను పెంపొందించడానికి ఈ పద్ధతి ఉపకరిస్తుంది. ఆమె పేరుపై ఈ పద్ధతి మాంటిసోరీ పద్ధతిగా ప్రచారంలో ఉంది. బోధనాభ్యసన ప్రక్రియలో జ్ఞానేంద్రియాలకు అత్యంత ప్రాధాన్యత ఉందని, వీనిద్వారానే జ్ఞాన ద్వారాలను తెరవ వచ్చుని వీరి అభిప్రాయం. వివిధ బోధనోపకరణాల సాయంతో, బాలబాలికలు స్వయంగా అభ్యసించడం (Auto learnning) ద్వారా వారిలో ఆత్మ విశ్వాసం పెంపొందుతుంది. మూడునుండి ఏడు సంవత్సరాల ప్రాయంలోని బాలబాలికలు ఈ బోధన పద్ధతి పరిధిలోకి వస్తారు. ఈ పద్ధతిలో

- సాధారణ వ్యవహార నిర్వహణ,
- జ్ఞానేంద్రియాల శిక్షణ,
- ప్రారంభ పాఠ్యాంశాలు,

ప్రధానంగా దృష్టియందుంచుకోబడతాయి. బాలబాలికలు అక్షర రూపాలను గుర్తించడం, రాయడం, పదాలను ధ్వనులను విశ్లేషించడం, చదవడం మొదలైన సామాన్య నైపుణ్యాలను అలవరచుకొంటారు. మనోవైజ్ఞానిక

సిద్ధాంతాల ప్రాతిపదికపై అభివృద్ధి చేయబడిన ఈ పద్ధతిలో విలువైన బోధనోపకరణాలు అవసరం. ఈ బోధనోపకరణాలను సమకూర్చుకోగల్గితే ఈ పద్ధతి చిన్నారి బాలబాలికలకు ఎంతో ప్రయోజనకారి ఔతుంది.

పై పద్ధతులతో బాటు, విస్తరించిన మనో వైజ్ఞానిక శాస్త్రంఆధారంగా విద్యావేత్తలు మరొకొన్ని పద్ధతుల్ని కూడా ప్రతిపాదించారు. వానిలో ప్రధానమైన వానివి కొన్నిటిని తెలుసుకొందాం.

## 7.13 కార్యక్రమయుత బోధన (Programmed Learning) :

Skinner అను మనో వైజ్ఞానిక శాస్త్రవేత్త Opperent conditioning Theory of Learning ప్రతిపాదించారు. వారి దృష్టిలో అభ్యసనం ప్రవర్తనం పరివర్తన. బోధన ప్రవర్తనాపరివర్తనకు వీలు కల్పిస్తుంది. ఈ సూత్రాన్ని తాను రూపొందించిన బోధన యంత్రం (Teaching Mechine) సాయంతో మొదట జంతువులపై ప్రయోగాలుచేసి అవి విషయగ్రహణంలో కనబరచిన ఆశ్చర్యకరమైన ప్రతిస్పందనల ఆధారంగా కార్యక్రమయుత అభ్యసనాన్ని అభివృద్ధిపరచారు. Skinner తాను రాసిన The Technology of Teaching అనే గ్రంథంలో అభ్యసనంలో పునర్బలనం (Reinforcement in Learnning) ఆవశ్యకతను నొక్కిచెప్పారు. గిల్బర్ట్ కూడా అధ్యయనాంశాలను చిన్న కృత్యాలుగా (tasks) ఆకృతీకరించి బోధన చేసి సత్ఫలితాలు పొందారు. దీనిపై మరింత విశేషంగా కృషిచేసినవారిలో ప్రఖ్యాత మనోవైజ్ఞానికులు Gagne (1965) Goodman (1975) మరియు Pask (1969) చెప్పుకోదగ్గవారు. వీరు ఈపద్ధతిలో Feed-back మరియు Control అనే అంశాలకు విశేష ప్రాధాన్యత ఇచ్చి అభ్యాసి కేంద్రీకృత అభ్యసన పద్ధతి (Learner centred Teaching method) ద్వారా విద్యార్థుల జ్ఞాన పరిధిని విస్తరించడానికి ప్రయత్నించారు. ఈనాడు విశ్వవ్యాప్తంగా బోధనలో అనుసరింపబడుతున్న పద్ధతుల్లో ఇది ప్రధానమైన పద్ధతిగా భావింపబడుతోంది. ఈ పద్ధతి ననుసరించిన బోధన నిర్వహణలో, చిన్నమెట్లు (Small Steps), వీనిని క్రమంగా వరసల్లో కూర్చడం (Sequencing) ప్రధానాలు. విద్యార్థులు తాము చేయాల్సిన కృత్యక్రమ పరిణామం ఏమిటి? ప్రతిమెట్టు వద్ద ఏంచేయాలి? రెండో మెట్టుకు ఎలా వెళ్ళాలి? మొదలగునవి తెలిసికొని అభ్యసనాన్ని కొనసాగిస్తారు. ఈ పద్ధతి శాఖీయ కార్యక్రమమని, రేఖీయ కార్యక్రమమని రెండు విధాలుగా ఉంటుంది.

ఈ పద్ధతిలో విషయాన్ని చిన్న చిన్న ఖండాలుగా చేసి విద్యార్థులకందిస్తారు.

ఒక అంశానికి మరో అంశానికి సమన్వయం కూరుస్తూ విద్యార్థులు విషయాన్ని స్వయంగా సమగ్రంగా అభ్యసిస్తారు. మొదటిదశలో ఈ పద్ధతిలో అభ్యసనానికి కొంత ఎక్కువ సమయం తీసికొన్నప్పటికి తర్వాత దశలో అభ్యసనంలో వేగం పెరుగుతుంది. ఈ పద్ధతిలో తయారుచేసిన విషయ ఖండికల చట్రాలను (Frames) చూడటం ద్వారా, చదవడం ద్వారా వాని యందలి భావనలు, నిర్వచనాలు విద్యార్థులు స్వయంగా గ్రహిస్తారు. ప్రతి అంశానికి సంబంధించిన సమాధానాలు వెనువెంటనే మరో చట్రంలో అందుబాటులో ఉండి తమపూర్వ అభిప్రాయాలను తమంతటతామే సరిచేసుకొంటారు. విద్యార్థులు తమంతతామే దోషాలను గుర్తించడం ద్వారా స్వయం అభ్యాసాన్ని అలవరచుకొని తమ అంతర్గత శక్తి సామర్థ్యాలను సద్వినియోగం చేసికొంటారు. ఈ పద్ధతి ద్వారా వ్యాకరణం, ఉపవాచకం, కథ, గద్యం, పద్యం మొదలైన వివిధ ప్రక్రియలు బోధించడానికి వీలుకల్గుతుంది. ఈ పద్ధతిలో ఆధునిక యంత్ర పరికరాలైన కంప్యూటర్లను కూడా వినియోగించవచ్చు. మనోవైజ్ఞానిక శాస్త్ర సమ్మతమైన ఈ పద్ధతి విద్యార్థుల్లో స్వీయ అధ్యయన శక్తిని పెంపొందిస్తుంది.

## 7.14 సూక్ష్మాంశ బోధన (Micro Teaching) :

A.W. Dwight అను విద్యావేత్త సూక్ష్మాంశ బోధన (Micro Teaching) భావనను Stanford విశ్వవిద్యాలయంలో ప్రతిపాదించి అనుసరించారు. ప్రస్తుతం అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఇంగ్లండు లాంటి వివిధ దేశాల్లో ఈ బోధన పద్ధతిని ఉపయోగించి సత్ఫలితాలు సాధిస్తున్నారు. సూక్ష్మాంశబోధన -నే భావన ఒక శిక్షణాభావన (Training concept). ఈ భావన వృత్తిపూర్వక, వృత్త్యంతర ఉపాధ్యాయ శిక్షణా కార్యక్రమాల్లో ఉపయోగించి ఛాత్రోపాధ్యాయుల, ఉపాధ్యాయుల బోధన సామర్థ్యాలను మెరుగుపరచవచ్చు. సాధారణంగా తరగతిగదుల్లో ఉపాధ్యాయులు బోధనలో ఎదుర్కొనే వివిధ సమస్యల్ని విభజించి, వానిని సాధించుటకు ప్రయత్నించడం, తద్వారా వారు ఆత్మవిశ్వాసం పెంపొందించుకోవడానికి ఈ పద్ధతి ఉపకరిస్తుంది. ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు తమ బోధనను తామే మదింపు (Assess) వేసికొనే అవకాశముండి ఫలితా ఫలితాలను తెల్సుకోగల్గుతారు. ఈ పద్ధతిలోని ప్రధాన భావనలు:

i) తరగతిలో విద్యార్థుల సంఖ్య (5 నుండి 10 మంది)పరిమితం.
ii) బోధనసమయం (5 నుండి 10 నిముషాలు) పరిమితం.

iii) బోధనాంశం ఒకే భావనకు పరిమితం.(ఒక పదం, ఒక వ్యాకరణాంశం.)
iv) ఒక ఉద్దేశ్యాన్ని పూర్తిచేయుటకు ఒకే బోధన పద్ధతిని వినియోగించడం.
v) లోపాలను గుర్తించడం.
vi) లోపాలను పరిచేపికోవడం.
vii) తిరిగి బోధించడం.
viii) ఫలితాలను విశ్లేషించడం.

ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు బోధించే విధాన్ని దృశ్యంగా మలచడానికి వీడియోగ్రాఫీని ఉపయోగించుకోవచ్చు. వీడియోచిత్రం ప్రదర్శించి ఉపాధ్యాయుల తరగతి ప్రవర్తనలను, బోధనతీరును తెరపై చూచి లోపాలను సవరించుకోవచ్చు.

ఈ పద్ధతి ప్రయోజకమూ, అర్థవంతమూ ఐన బోధనకు ఉపకరిస్తుంది. బోధనలోని క్లిష్టతను తొలగించి ఉపాధ్యాయుల్లో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తుంది. ఈ పద్ధతిలో బోధనా క్రమం దిగువ విధంగా ఉంటుంది.

i) సూక్ష్మాంశం ఎంపిక.
ii) సూక్ష్మ పాఠ్య పథకరచన.
iii) బోధన.
iv) చర్చ - పరిపుష్టి.
v) పాఠ్య పథకాన్ని సవరించడం (అవసరమైతే)
vi) పునః బోధించడం.
vii) పునర్విమర్శ - పరిపుష్టి.

పై క్రమంలో ఉపాధ్యాయులు ఏదేని ఒక ప్రక్రియలోని వివిధ అంశాలను బోధించి భాషాబోధనలో ఆశించిన ఫలితం సాధించవచ్చు. తమ బోధన విధానాన్ని తామే సవరించుకోవచ్చు.

## 7.15 కృత్యాధార బోధన (Activity Based Teaching) :

విద్యా బోధనలో గుణాకత్మను పెంపొందించడానికి నిరంతరం కృషి జరుగుతోంది. ఈ గుణాత్మకత సాధన దిశలో మొదట ప్రాథమిక తరగతుల్లో కృత్యాధార బోధన పద్ధతిని అనుసరించడం ఒకటి. అభివృద్ధి చెందిన పెక్కు దేశాల్లో ఈ పద్ధతిని ఉపయోగిస్తూ సత్ఫలితాలు సాధించిన నేపథ్యంలో మన పాఠశాలల్లో కూడా అనుసరించి సత్ఫలితాలను సాధించవచ్చు.

కృత్యాల (task) ప్రాతిపదికగా బోధన నిర్వహించడమే కృత్యాధార బోధనలోని ప్రధాన భావం. విద్యార్థుల మానసిక, శారీరక శక్తుల్ని సమన్వయ పరచి అర్థవంతమైన కృత్యాల ఆధారంగా పాఠ్యాంశాలను విద్యార్థులకందించడమే ఈ పద్ధతి పరమావధి. విద్యార్థులు ఈ పద్ధతిలో అత్యుత్సాహంతో బోధన క్రియలో పాల్గొని అభ్యసనాన్ని సమర్థం చేసికొంటారు. బాలల మనోవైజ్ఞానిక శాస్త్ర సిద్ధాంతాలు (Theories of Child Psychology) కృత్యాధార బోధన అభ్యసన ప్రాధాన్యతంను నొక్కి చెప్తున్నాయి. ప్రధానంగా ప్రాథమిక దశలోని చిన్నారులు ఈ పద్ధతి ద్వారా ఇతోధిక ఫలితం పొందుతారు. విద్యార్థులు కేవలం కూర్చొని చాలాసేపు వినాల్సివస్తే (మామూలు బోధనలో) వారికి తొందరగా విసుగు వచ్చి అవధానం కోల్పోయే అవకాశాలు ఎక్కువ. దీనివల్ల అశ్రద్ధ, నిరుత్సాహం వారిని ఆవరిస్తుంది. బడికి రావడం మానివేసే అవకాశం కూడా కొన్నిసార్లు ఏర్పడవచ్చు. ఒకవేళ బాలబాలికలను అర్థవంతమైన కృత్యాలలో నిమగ్నం చేస్తే వారిలోని శక్తియుక్తుల్ని కనుగొనడంతోబాటు వారిని అభ్యసనం వైపు ఉన్ముఖులను చేయవచ్చు. విద్యార్థులు కృత్యాలు చేస్తున్నప్పుడు అవసరం మేరకు వారికి సహకరిస్తూ, ప్రోత్సహిస్తూ ఉపాధ్యాయులు తగిన మార్గదర్శకత్వం నెరపితే అభ్యసనం సులువవుతుంది.

కృత్యాధార అభ్యసనం అనే భావనను సులభంగా అవగాహన చేసికొనడానికి ఇందులో ఇమిడివున్న అంశాలను ఆరు సూత్రాలుగా విద్యావేత్తలు పేర్కొన్నారు. అవి

i) ఉపాధ్యాయులే స్వయంగా అభ్యసన కృత్యాలు రూపొందించడం.

ii) క్రియలు,అన్వేషణ, ప్రయోగాల ద్వారా అభ్యసనాన్ని ప్రోత్సహించడం.

iii) వ్యక్తిగత, జట్టు, పూర్తి తరగతి పనిని అభివృద్ధిపరచడం.

iv) వైయక్తిక భేదాలను దృష్టియందుంచుకొని తగిన అభ్యసన కృత్యాలు సూచించడం.

v) కృత్య నిర్వహణకై స్థానిక పరిసరాలను వినియోగించుకోవడం.

vi) విద్యార్థుల కృత్య సాక్ష్యాలను చక్కగా ప్రదర్శించుట ద్వారా ఆసక్తికరమైన తరగతిని రూపొందించడం.

### కృత్యాధార బోధన అభ్యసనాన్ని అమలుపరచడం ఎలా?

పైన పేర్కొన్న ఆరు సూత్రాల ప్రాతిపదికగా బోధనను తరగతి

స్థాయిలో అమలు చేయవచ్చు. పాఠానికి తగిన కృత్యాలను ఎంపిక చేసి, వానిని తయారుచేసి వైయక్తికంగా, జట్టులో, తరగతి మొత్తం మీద విద్యార్థులతో చేయించవచ్చు. ఈ పద్ధతి అమలులో కింది అంశాలను దృష్టియందుంచుకోవాలి.

i) పాఠం లేదా అధ్యాయాన్ని క్షుణ్ణంగా చదవడం.

ii) పాఠం లేదా అధ్యాయంలోని ముఖ్యాంశాలను గుర్తించి వానిని పట్టికగా రాసుకోవడం.

iii) ఒక్కొక్క ముఖ్యాంశాన్ని బోధించడానికి అనువైన కృత్యాన్ని లేదా కృత్యాలను ఎంపిక చేయడం. వానిని రూపొందించడం.

iv) ఎంపిక చేసిన కృత్యాల నిర్వహణ విధానాన్ని నిర్ణయించుకొని తరగతిలో అమలుచేయడానికి తగిన కార్యాచరణ ప్రణాళికలు సిద్ధం చేయడం.

v) అవసరమైన బోధన, అభ్యసన సామగ్రి సమకూర్చుకోవడం.

vi) కృత్యాల ఆధారంగానే పాఠం బోధించడం. విద్యార్థుల ఆర్జనను మూల్యాంకనం చేయడం.

కృత్యాధార అభ్యసనాన్ని అమలుపరచడానికి స్థానిక వనరుల వినియోగం అత్యవసరం. వనరుల్లో ప్రధానమైనవి సామాజిక వనరులు, భౌతికవనరులు, ఆర్థికవనరులు. సమాజంలోని వ్యక్తులు, వారి సేవలు మరియు సామాజిక సంస్థలు సామాజిక వనరుల పరిధిలోకి వస్తాయి. పాఠశాలల్లో లభ్యమయ్యే అన్ని భౌతిక వనరుల్లో పలురకాల సామగ్రి చేరుతుంది. సంపదలు (నగదు రూపంలోవి) కూడా ప్రభుత్వంనుండి గాని దాతలనుండిగాని సేకరించి బోధనకు ఉపయోగించుకోవచ్చు. పై వనరులను అవసరానుగుణంగా వినియోగించుకొంటూ చక్కని అవగాహన కొరకు అన్వేషణలు, ప్రయోగాలు కూడా తరగతి స్థాయిలో ఉపాధ్యాయులు నిర్వహించాలి. ఈ బోధన నిర్వహణ, వనరుల వినియోగం ఉపాధ్యాయుల అంకిత భావం, కృషి, సృజనాత్మకత, విషయజ్ఞానాన్ని సమయస్ఫూర్తితో సమన్వయం చేయడం మొదలైనవానిపై ఆధారపడి ఉంటుంది.

విన్నది మరచిపోతాం, చూచింది గుర్తుంచుకొంటాం, చేసింది స్వంతం చేసికొంటాం అనే నానుడి ననుసరించి ఉపాధ్యాయులు కృత్యాలు

చేపట్టి, విద్యార్థుల్తో వానిని చేయించి వారిని లోపరహితమైన విద్యార్జనకై ప్రోత్సహించాలి. తద్వారా విద్యాగమ్యాలు సాధించాలి.

## 7.16 పర్యవేక్షణాత్మక అధ్యయనం : (Supervised Study)

ఆధునిక బోధన విధానంలో స్వయం అధ్యయనానికి అధిక ప్రాధాన్యముంది. క్రమబద్ధంగా విషయాన్ని అధ్యయనం చేసి సంపూర్ణ జ్ఞాన ఫలాన్ని పొందడానికి ఉపయోగించే ప్రక్రియ పర్యవేక్షణాత్మక అధ్యయనం (Supervised study). దీన్ని నియంత్రిత అధ్యయనం అని కూడా అంటారు. ఈ ప్రక్రియలో విషయ విశ్లేషణ, తార్కికమైన ఆలోచన, పమస్యల గుర్తింపు మొదలైనవి ప్రధానాంశాలు. ఉపాధ్యాయుల పర్యవేక్షణలో, సూచించిన పద్ధతిలో విద్యార్థులు పాఠాలను అధ్యయనం చేయడం, అధ్యయనంలో ఎదురయ్యే సందేహాలను నివృత్తిచేసికోవడం, పాఠం చివర ఇవ్వబడిన అభ్యాసాలను పూర్తిచేయడం, నిఘంటువులను, పరామర్శ గ్రంథాలను సంప్రదించడం ఈ పద్ధతిలో భాగం. ఉపాధ్యాయులు మార్గదర్శకులై విద్యార్థులకు స్ఫూర్తినిచ్చి వారి అధ్యయనంలో వేగాన్ని, తీవ్రతను ప్రోత్సహించాలి.

ఈనాడు మన రాష్ట్రంలోని గురుకుల పాఠశాలల్లో ఈపద్ధతి ననుసరించి విద్యార్థుల్లో స్వయం అధ్యయన శక్తిని ప్రోత్సహించడం జరుగుతోంది. సాధారణ పాఠశాలల్లో కూడా ప్రతిరోజు ఒక బోధనాంశానికి చివరి సమయావధి (Last period) కేటాయించి ఉపాధ్యాయుల నేతృత్వంలో ఈ పద్ధతిని ప్రోత్సహించడం జరుగుతోంది. ప్రాథమిక దశలో కన్న మాధ్యమికదశ, ఆ పై దశల్లో ఈ పద్ధతి బహుళ ప్రయోజనకారి అని చెప్పవచ్చు.

## 7.17 లోపనివారణ బోధన ( Remedial Teaching) :

విద్యార్థుల్లో కొందరు కొన్ని అధ్యయనాంశాల్లో మాత్రమే ఎక్కువ ప్రతిభ కనబరచి మరికొన్నిటిలో తక్కువ ప్రతిభ కనబరచడం, మరికొందరు అన్ని అంశాలను కఠినంగానే భావించడం సర్వసాధారణం. కొన్ని పర్యాయాలు చురుకైన విద్యార్థులు కూడా అధ్యయనంలో వెనుకంజవేయడం ఉపాధ్యాయుల నిత్య అనుభవంలోనిదే. ఈ అంశాన్ని వివిధ దృక్కోణాల్లో పరిశీలించిన విద్యావేత్తలు విద్యార్థుల అభ్యసనంపై పరిసరాలు, వైయుక్తికాంశాలు, మొదలైనవి ప్రభావితం చేస్తాయని గుర్తించారు. తద్వారా విద్యార్థుల ఆర్జనాతీవ్రతల్లో ఒడిదుడుకు లేర్పడుతాయని అభిప్రాయపడ్డారు. అయితే ఈ ప్రభావాలను

అధ్యయనం చేసి, విద్యార్థులు కనబరిచే లోపాలను సవరించి వారిని తగు విధంగా ప్రతిభోన్ముఖులను చేయడానికి వీలు కల్గించే పద్ధతి లోపనివారణ బోధన. భాషా బోధనలో విద్యార్థుల శ్రవణ, భాషణ, పఠన, లేఖన నైపుణ్యాల్లోని లోపాలను తెల్సికొని వానిని నివారించుటకు ఉపాధ్యాయులు ఈ పద్ధతిలో తగు ప్రణాళికల్ని సిద్ధంచేసికోవచ్చు. విద్యార్థులు అభ్యసనంలోఎలాంటి మానసిక ఒత్తిడులకు లోనుకాకుండా అభ్యసనం తమకు అసంభవం అనే భావాన్ని తొలగించుకోవడానికి ఈ పద్ధతి ఉపకరిస్తుంది. ఉపాధ్యాయులు విద్యార్థుల్లోని లోపాలను కనుగొని వ్యక్తిగతంగా వారికి సూచనలిచ్చి వైయక్తిక సంబంధాలు మెరుగు పరచుకొనే సముచిత అధ్యయన వాతావరణాన్ని కల్పించడం ఈ పద్ధతి ప్రధాన ధ్యేయం.

ఈ పద్ధతులన్నీ అవసరానుగుణంగా ఉపాధ్యాయులు ఉపయోగించుకొని తమ బోధనా సామర్థ్యాన్ని మెరుగు పరచుకోవడంతో బాటు విద్యార్థుల అభ్యసన తీవ్రతలను కూడా పెంపొందించాలి. అప్పుడే విద్యా బోధన, భాషాబోధన సార్థకమవుతుంది.

# ఎనిమిదో అధ్యాయం

# పాఠబోధన పద్ధతులు

## 8.01 ఉపోద్ఘాతం :

పాఠశాల స్థాయిలో మాతృభాషా బోధనలో విద్యార్థులకు గద్యం, పద్యం, నాటకం, కథ మొదలైన ప్రక్రియలతో బాటు భాషాస్వరూపాన్ని నియంత్రించే వ్యాకరణ శాస్త్రాన్ని మరియు ఉపవాచకాన్ని, వ్యాస రచన విధాన్ని బోధిస్తారు. వివిధ పాఠాల బోధన ఉద్దేశ్యాలు, అనుసరించాల్సిన పద్ధతులు, బోధన క్రమాన్ని గూర్చి తెల్సికొందాం.

## 8.02 గద్యబోధన :

విద్యార్థుల భాషాధికారాన్ని పెంపొందించడానికి ఉద్దేశించిందే గద్యబోధన. గద్యాన్ని వచనమని కూడా అంటారు. లాక్షణికులు పద్యరచన కన్నా గద్య రచన కష్టతరమని అభిప్రాయపడతారు. విద్యార్థుల భావ, భాషా వ్యాపారాన్ని మెరుగుపరచడమే ప్రధానగమ్యంగా గద్యం బోధించాల్సి ఉంటుంది.

I). గద్యబోధన ప్రధాన ఉద్దేశ్యాలు :

a) భాషపై అధికారాన్ని (Mastery) పెంపొందించడం.
b) పదాల అర్థాలను తెల్సికొని సందర్భానుగుణంగా వానిని వాక్యాలలో ఉపయోగించడం.
c) పదజాల స్వరూప స్వభావాన్ని తెల్సికోవడం.
d) భావగ్రహణంలో, భావ వ్యక్తీకరణంలో నైపుణ్యాన్ని ప్రదర్శించడం.
e) శ్రవణ, పఠన సామర్థ్యాలను పెంపొందించడం.
f) వివిధ రచనా రీతుల్ని గుర్తించి అనుకరించడం.
g) విషయ బోధన ద్వారా జ్ఞాన పరిధిని విస్తరించడం.
h) భాషాభిరుచి, సృజనాత్మక శక్తుల్ని పెంపొందించడం.
i) విషయాన్ని వివరించడం, విశ్లేషించడం, విమర్శించడం, సూక్ష్మీకరించడం.

j) విద్యార్థుల్లో సముచిత వైఖరుల్ని పెంపొందించడం.

II) భాషపై అధికారాన్ని పెంపొందించే విధం :

గద్య పాఠాల్లో పదాలు, వాని నిర్మాణం, జాతీయాలు, లోకోక్తులు, వాక్యరచనారీతులు విరివిగా పరిచయం చేయబడతాయి. పాఠ్యాంశాల్లోని వివిధాంశాలను గ్రహించి విరివిగా సంభాషించడం ద్వారా భాషపై అధికారాన్ని సంపాదించవచ్చు.

ధ్వని, ఉచ్చారణ, అర్థభేదాలు, మొదలైనవి భాషపై అధికారాన్ని పెంపొందించడానికి ఉపకరిస్తాయి. గద్యంలో వ్యాకరణాంశాలను తెల్సికోవడం ద్వారా భాషాదోషాల్ని, వ్యవహార దోషాల్ని నివారించుకోవచ్చు. గద్యబోధనలో కేవలం పాఠ్యపుస్తకంలోని విషయాలకే పరిమితం కాక పాఠ సంబంధ విశేషాంశాలు, పరిసరాలు మొదలగునవి దృష్టిలో పెట్టుకుంటే విషయ పరిపుష్టి జరిగి భాషాభివృద్ధి సుగమవుతుంది.

III) గద్యరచన భేదాలు :

గద్యరచనల్లో వివిధ భేదాలు కనబడతాయి. వీనిలో కథ, జీవితకథ, ఆత్మకథ, నవలిక, యాత్రాకథ, వ్యాసం, సంభాషణ మొదలైనవి ఉండవచ్చు. ఈ పాఠాలు ప్రాథమిక దశలో పాఠ్యపుస్తక రచయితలు స్వయంగా రాస్తారు, పై తరగతుల్లో ఇతరుల రచనలనుండి సేకరిస్తారు. అందువల్ల ఉపాధ్యాయులు ఆయా రచయితల రచనాశైలుల్ని పరిచయం చేసికొని విద్యార్థులకు సంతృప్తికరంగా బోధించాల్సి ఉంటుంది.

IV) గద్యబోధనలో అనుసరింపదగు పద్ధతులు :

a) చర్చాపద్ధతి : పాఠ్యాంశంపై విద్యార్థులు, ఉపాధ్యాయులు కల్సిగాని, విద్యార్థులు తమలో తాము గాని సమగ్రంగా మాట్లాడుకోవడం ఈ పద్ధతిలో ప్రధానమైంది. ఉపాధ్యాయులు మొదట చర్చను ప్రారంభించి చర్చం సారాంశాన్ని చివర సాధారణీకరణం చేయాలి. విద్యార్థుల అభిప్రాయాల వ్యక్తీకరణకు అవకాశమీయాలి. కొన్ని పర్యాయాలు ప్రశ్నోత్తర పద్ధతిలో కూడా చర్చ జరుపవచ్చు.

b) ప్రవచన పద్ధతి (Text Book Method) : ఇది చాలా ప్రాచీన పద్ధతి. ఉపాధ్యాయులు పాఠ్యపుస్తకం చదువుతూ విషయాన్ని వివరిస్తారు. ఇది మనోవైజ్ఞానిక సూత్రాలకు విరుద్ధమైంది. అందువల్ల ఈ పద్ధతిని పాఠశాల

దశలో ఉపాధ్యాయులు ఉపయోగించరాదని కొందరి అభిప్రాయం.

c) ఉపన్యాస పద్ధతి : పాఠ్యాంశంలోని విషయాన్ని ఉపాధ్యాయులు కొన్ని పర్యాయాలు తామే విద్యార్థులకు చెప్తారు. ఈ పద్ధతిలో విద్యార్థులు కేవలం శ్రోతలు మాత్రమే. అందువల్ల పాఠశాల స్థాయిలో అంతగా ఉపయుక్తం కాదని కొందరి అభిప్రాయం.

d) ప్రశ్నోత్తర పద్ధతి : ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు పాఠ్యాంశాన్ని కేంద్రంగా గ్రహించి విద్యార్థుల్ని ప్రశ్నిస్తూ సమాధానాలు రాబడతారు. విద్యార్థుల భాషణశక్తిని మెరుగుపరచడానికి ఈ పద్ధతి ఉపకరిస్తుంది. పాఠశాల స్థాయిలో ఈ పద్ధతి అత్యంతప్రయోజనకారి.

e) వివరణ పద్ధతి : ఉపాధ్యాయులు రచయితల వివరాలను, పూర్వ పరకథలను, విశేషాల్ని, అదనపు సమాచారాన్ని స్వయంగా విద్యార్థులకు చిన్నచిన్న మాటల్లో చెప్పే పద్ధతి వివరణ పద్ధతి. ఈ పద్ధతి గద్యబోధనలో ఉపయుక్తమౌతుంది.

f) ఉదాహరణ పద్ధతి : పదజాలాన్ని పరిచయం చేస్తున్నప్పుడు విద్యార్థులకు తెల్సిన అంశాలు. ఉదాహరణగా చెప్పి పాఠ్యపుస్తకంలోని అంశాలను వివరించమనడం ఈ పద్ధతిలోని ప్రధాన భావన. ఉపాధ్యాయులు విస్తృత ఉదాహరణలీయ గల్గితే ఈ పద్ధతి మిక్కిలి ఉపయుక్తమౌతుంది.

పై పద్ధతుల్లో ఏ ఒక్క పద్ధతినో గాక వివిధ పద్ధతులను ఉపయోగించుకొని ఉపాధ్యాయులు గద్యబోధన చేయాల్సి ఉంటుంది అప్పుడే బోధన ఆశించిన ఉద్దేశ్యాలను నెరవేరుస్తుంది.

V) గద్య బోధన క్రమం :

మొదట ఉపాధ్యాయులు విద్యార్థుల్ని పూర్వపాఠం పై ప్రశ్నించాలి. అవసరమైతే ప్రస్తుత పాఠానికి సంబంధించిన పూర్వ జ్ఞానంపై ప్రశ్నించవచ్చు. దీన్ని పూర్వజ్ఞాన పరిశీలనం అంటారు. తద్వారా తరగతిగదిలో ఆరోజు బోధించే పాఠ్యాంశ సంబంధ వాతావరణాన్ని సృజించవచ్చు. దీనిపై ఆధారపడి విద్యార్థుల్ని ప్రశ్నిస్తూ ప్రస్తుత పాఠ్యాంశాన్ని ప్రవేశపెట్టాలి. విద్యార్థులు పాఠ్యోన్ముఖులై శీర్షికను గుర్తించగల్గుతారు.

శీర్షికను ప్రకటించి పాఠ రచయితను పరిచయం చేయాలి. రచయితకు సంబంధించిన వివరాలు అన్నీ పాఠం మొదటి రోజు గాని లేక పాఠం

చెప్పినన్ని రోజులు (అంటే పాఠాన్ని ఎన్ని శీర్షికలుగా చేసి చేస్తే అన్ని రోజులు గాని కొంతకొంత) చెప్పవచ్చు. ఆ తర్వాత పూర్వాంశాన్ని, పూర్వకథను పరిచయం చేయాలి. (రెండవరోజు అదే పాఠ్యభాగాన్ని కొనసాగించే పక్షంలో పూర్వజ్ఞాన పరిశీలన ప్రశ్నలు గతదినపు పాఠంపై ఆధారపడి ఉంటే ఇచట మళ్ళీ పూర్వకథ, పూర్వాంశం చెప్పాల్సిన అవసరముండదు.) తర్వాత ఆదర్శ పఠనం చేయాలి. ఈ పఠనం మొదట పాఠ్యపుస్తకంలోని క్రమంలో, రెండవసారి అవసరమైన చోట్ల పదాల మధ్య సంధి విడదీస్తూ చదవాలి. తద్వారా ఆనాటి బోధనాంశం ఎలా చదవాలో విద్యార్థులకు తెలుస్తుంది. పఠనం తర్వాత ముఖ్యమైన పదాలలోని సంధులను విడదీయించడం, సమాసపదాలకు విగ్రహవాక్యాలను చెప్పించడం, కొత్త పదాలకు సందర్భానుగుణంగా అర్థాలు చెప్పించడం చేయాలి. ఇచట ఉదాహరణ పద్ధతిని, వాక్యనిర్మాణ పద్ధతిని ఉపయోగించుకోవచ్చు. ఆ తర్వాత ప్రకృతి, వికృతులు, నానార్థాలు, పర్యాయ పదాలు, వ్యుత్పత్త్యర్థాలు మొదలైనవానిని అవసరమైన మేరకు చెప్పి విద్యార్థులు పాఠ్యాంశాన్ని ఓ మారు మౌనంగా చదువుకోడానికి అవకాశమీయాలి.

మౌన పఠనం తర్వాత ప్రశ్నోత్తర రూపంలో చర్చచేస్తూ (చర్చ చివర గాని) పాఠ సారాంశాన్ని విద్యార్థులచే చెప్పించి, సరిచేస్తూ నల్లబల్లపై రాయాలి. ఆ తర్వాత పాఠ్యాంశంలోని విశేషాంశాలను వివరించి విద్యార్థులచే ప్రకాశ పఠనం చేయించాలి. విద్యార్థులు చదువుతున్నపుడు వారి ఉచ్చారణ దోషాలను సవరించి స్పష్టోచ్చారణను ప్రోత్సహించాలి. కొన్ని జాతీయాలు, కొన్ని ముఖ్యమైన పదాలిచ్చి వాక్యాల్లో ప్రయోగించమని కోరి ప్రశ్నోత్తర పద్ధతిని ఉపయోగించి పునర్విమర్శ చేసి ఆ తర్వాత ఇంటిపని ఇచ్చి పాఠం ముగించాలి. ఇలా ప్రవేశం, ప్రదర్శన, పునర్విమర్శ, ఇంటిపని అనే నాలుగు ప్రధానసోపానాల్లో గద్యబోధనను ఉపాధ్యాయులు నిర్వహించి పాఠ్యాంశం ఆశించిన లక్ష్యాలను సాధించాలి.

## 8.03 పద్యబోధన :

'రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దం', 'ఇష్టార్థ వ్యవచ్ఛిన్నమైన పదావళి', 'రసాత్మకమైన వాక్యం' కావ్యమని ఆలంకారికుల నిర్వచనాలు. కవికృతమై ఛందోబద్ధమైన రచన పద్యమై కావ్యరూపంలో సాహిత్యంగా స్థిరపడింది. ఛందోలయాత్మకమైన రచన పద్యమని సామాన్యుల అభిప్రాయం. ఆంగ్ల పండితుడైన Colridge పద్యాన్ని 'Best words in Best order' అని నిర్వచించారు.

Keats మానవుల ఆలోచల్ని రేకెత్తించగల్గిన, ఆనందాత్మకమైన రచన పద్యమని అభిప్రాయపడ్డారు. పై అభిప్రాయాల ననుసరించి పద్యం, గద్యం కన్న విలక్షణమైన విశిష్ఠమైన సాహితీ ప్రకియ గా భావించవచ్చు. ఇది సాహిత్యంలో ఒక శాశ్వత స్థానాన్ని సంపాదించుకొంది. ఆధునిక కాలంలో పద్యం గేయంగా, వచన కవితగా కొత్త రూపాలను తొడుక్కొంది. ఛందోబంధాలను ఛేదించుకొని వచ్చిన వచన కవితలు కూడా ఈవాడు పాఠశాల స్థాయి పాఠ్యపుస్తకాల్లో చోటు చేసికొంటున్నాయి. అందువల్ల పద్యం ప్రాచీనమైనా అర్వాచీనమైనా బోధనలో ఒక ప్రత్యేకతను సంతరించుకొంటుంది.

I) పద్య బోధన ఉద్దేశ్యాలు :

a) సాహిత్యంలోని ఉదాత్త భావ సంపత్తిని విద్యార్థులకు పరిచయం చేసి వారి హృదయవైశాల్యాన్ని పెంచడం.
b) పఠనం ద్వారా తన్మయత్వం పొంది జగత్తును సుందరంగా దర్శించి ఆనందించుట ద్వారా రసానుభూతిని పొందడం.
c) ఉత్తమ భావనలను రేకెత్తించి, వాని కనుగుణంగా ప్రవర్తించడం.
d) సాహిత్య ప్రశంస చేయడం.
e) ఉత్తమ సాహిత్య పఠనాభిలాషను ప్రోత్సహించడం.
f) సంస్కృతి - సంప్రదాయాలను తెలియజెప్పడం.
g) సాహితీ లక్షణాలను తెల్సికొని తమదైన స్థాయిలో రచనలు చేయగల్గడం.
h) అనంతమైన భావాన్ని మంచి మాటల్లో వివరించగలిగే సామర్థ్యాన్ని పెంపొందించడం.
i) సముచిత వైఖరుల్ని పెంపొందించడం.
j) సృజనాత్మకతను వెలికి తీయడం.

పై ఉద్దేశ్యాల సాధన ద్వారా విద్యార్థుల సంపూర్ణ మూర్తిమత్వ వికాసానికి, వారిలో మానవీయువిలువలను ప్రోది చేయడానికి ఉపాధ్యాయులు కృషి చేయాలి.

II) పద్య బోధన పద్ధతులు :

పద్య బోధనలో అనుసరించదగు కొన్ని పద్ధతులను తెల్సికొందాం.

a) పూర్ణ పద్ధతి : ఈ పద్ధతిలో పద్యం యొక్క భావాన్ని వివరించి విద్యార్థుల్లో ఆనందానుభూతిని పెంపొందించవచ్చు. ఇది ఖండ పద్ధతికి

భిన్నమైంది. తాత్పర్య పద్ధతికి దగ్గరది. ప్రాచీనకాలంలో పద్యబోధన చాలావరకు ఈ పద్ధతిలోనే సాగేది.

b) ఖండ పద్ధతి : పద్యంలోని పదాలను విడదీసి ప్రతిపదానికి అర్థంచెప్తూ, వివరణ ఇస్తూ, పద స్వరూప స్వభావాల్ని చెప్పే పద్ధతిని ఖండపద్ధతి అని వ్యవహరిస్తారు. దీన్ని ఒకవిధంగా ప్రతిపదార్థ పద్ధతి అని కూడా చెప్పవచ్చు. ఇట్లు పద్యాన్ని ఖండాలుగా చేసి చెప్పడంవల్ల రసాస్వాదనకు అనుకూలం కాదని భాషావేత్తల అభిమతం. ప్రాచీనులు ఈ పద్ధతినుపయోగించి పద్యంలోని క్రమాన్ని, పదజాలాన్ని విశ్లేషించి, పదనిర్మాణం, వ్యాకరణకార్యం మొదలైన వివరాలన్నీ చెప్పేవారు. నేటి కాలంలో ఈ పద్ధతి అంతగా అనుసరణీయంకాదని కొందరి మతం.

c) పఠన పద్ధతి : ఉపాధ్యాయులు కేవలం పద్యాన్ని చదువుట ద్వారా మాత్రమే విద్యార్థులకు పద్యభావాన్ని అర్థం చేయించడం ఈ పద్ధతిలోని మౌలికభావన. Poetry must be read, but not taught అనే నానుడికి ప్రతిబింబమీ పద్ధతి. ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు రాగ భావ, అర్థ యుక్తంగా పద్యం చదువగల్గినపుడే విద్యార్థులు రసానుభూతిని పొందుతారు. రాగయుక్తంగా చదవలేకపోయినా కనీసం భావయుక్తంగానైనా చదవగల్గితే పద్యబోధన ఆశిస్తున్న ప్రధాన లక్ష్యాలను సాధించవచ్చు. సాధారణ ప్రతిభావంతులున్న తరగతిలో కూడా పద్యం ఆశిస్తున్న లక్ష్యాలను ఈ పద్ధతి ద్వారా సాధించవచ్చు.

d) ప్రశంసా పద్ధతి : ఈ పద్ధతిలో పూర్వోక్త పద్ధతులను మిళితంచేసి విద్యార్థుల శ్రవణశక్తిని, గ్రహణశక్తిని పెంపొందించుట ద్వారా పద్యం అంతఃసౌందర్యాన్ని ప్రశంసించగల్గే స్థాయికి విద్యార్థుల్ని చేర్చవచ్చు. Poetry for appreciation అనే ప్రధాన ప్రయోజనాన్ని ఆశించి ఈ పద్ధతిని ఉపాధ్యాయులు తరగతిగదిలో ఉపయోగించుకోవాలి. ప్రతిభావంతులైన విద్యార్థులున్న తరగతిలో ఈ పద్ధతి ఎక్కువ ప్రయోజనకారి.

### III) పద్య బోధన క్రమం :

గద్యబోధనలో వలెనే పద్యబోధనలో ఉపాధ్యాయులు మొదట విద్యార్థుల పూర్వజ్ఞానాన్ని పరిశీలించి, తదాధారంగా విద్యార్థులను ప్రస్తుత పాఠ్యాంశం వైపు ఉన్ముఖీకరణం చేయాలి. వారినుండి శీర్షికను రాబట్టి ప్రకటించాలి.

ఆ తర్వాత కవిని పరిచయం చేసి పూర్వకథను చెప్పాలి. ఈ దశలో మొదట ప్రశ్నోత్తర పద్ధతిని, తర్వాత వివరణ పద్ధతిని ఉపయోగించుకోవచ్చు. పద్యాన్ని ఆ తర్వాత మూడు పర్యాయాలు ఉపాధ్యాయులు చదివి వినిపించాలి. మొదటిసారి రాగ, భావయుక్తంగా, రెండవ పర్యాయం అవసరమున్న చోట్ల సంధిని విడదీస్తూ, మూడవ పర్యాయం అన్వయ క్రమంతో పద్యాన్ని చదవాలి. ఇట్లు ముమ్మారు చదువుట ద్వారా విద్యార్థులకు పఠనపూర్వకమైన భావవగాహన కలుగుతుంది. పద్యం ఇట్లు చదివింతర్వాత పద్యభాగాన్ని విద్యార్థులు స్థూలంగా ఏ మేరకు గ్రహించారో తెల్సికోవడానికిగాను ఒకటి, రెండు చిన్న ప్రశ్నలడిగి సమాధానాలు రాబట్టాలి. దీన్ని స్థూలార్థ సంగ్రహణమంటారు. సాధారణంగా ప్రతిభావంతులైన విద్యార్థులే ఈ ఒకటి రెండు ప్రశ్నలకు సమాధానాలు చెప్పగల్గుతారు. కేవలం పఠనం ద్వారా విద్యార్థులు ఏ మేరకు కేంద్రభావాన్ని గ్రహించారో తెల్సికోవడం ఈసోపానం ప్రధాన ఆశయం. (పఠనం తర్వాత స్థూలార్థ సంగ్రహణం చేయించడానికి ముందే విద్యార్థులచేత పద్యాన్ని ప్రకాశ పఠనం చేయించుట ద్వారా ప్రశంసా పద్ధతిని, పఠన పద్ధతిని సమన్వయించి వారిలో రసానుభూతిని సాధించవచ్చని మరికొందరి అభిప్రాయం. ఉపాధ్యాయులు తమ తరగతికి అనుకూలమైన విధానాన్ని అనుసరించవచ్చు.)

స్థూలార్థసంగ్రహణం తర్వాత పద కాఠిన్యత, అర్థ కాఠిన్యతలు తొలగించడానికి గద్యంలో వలెనే సంధి, సమాసపదాలు, నూతన పదాలు పరిచయంచేయాలి. వీనిని పరిమితంగానే చెప్పాలి గాని గద్యంలో వలె చాలా పదాలు చెప్పరాదు. వీనిని పరిచయం చేయుటద్వారా పద్యబోధన ప్రధాన ధ్యేయమైన రసానుభూతి కుంటుపడరాదు. ఆ తర్వాత ఉపాధ్యాయులే మరో పర్యాయం పద్యాన్ని భావయుక్తంగా చదివి వినిపించి కొందరు విద్యార్థులచే ప్రకాశ పఠనం చేయిస్తూ పద్యపఠన విధానాన్ని సరిచేసి దోషాలున్న సవరించాలి. ఆ తర్వాత విషయ వివరణకై ప్రశ్నోత్తర రూపంలో చర్చ చేయాలి. చర్చలో మధ్య మధ్య గాని చర్చ చివరగాని భావాన్ని తాత్పర్యరూపంలో విద్యార్థులనుండి రాబట్టి నల్లబల్లపై రాయాలి. పద్యంలోని సాహిత్య అంశాలు, కవితాసౌందర్య రూపంలో విద్యార్థులకు వివరిస్తూ వారు రసానుభూతి పొందునట్లు చూడాలి. తర్వాత పునర్విమర్శచేసి ఇంటిపని ఇచ్చి పాఠబోధన పూర్తి చేయాలి. పద్యాన్ని కంఠస్థం చేయించడం, భావయుక్తంగా, ఉచ్చారణాదోషరహితంగా చదివించడం మొదలైనవి ఉపాధ్యాయుల దృష్టియందుండాలి. కవితాసౌందర్యంలో అలంకారం, రసం, విశేషాంశాలు. అంతరార్థాలు మొదలైనవి విప్పి చెప్పాలి. విద్యార్థులకు

గద్యంలో వలె నానార్థాలు, పర్యాయపదాలు మొదలైన అదనపు సమాచారాన్ని బోధించరాదని కొందరు భాషాబోధకుల అభిప్రాయం. ఉపాధ్యాయులు పద్యబోధనను కడు జాగరూకతతో నిర్వహించి పద్యంతో తాము తాదాత్మ్యం చెంది విద్యార్థులను తాదాత్మ్యం చెందించగల్గిన నాడు పద్యబోధన ఉద్దేశ్యాలు నెరవేరుతాయి.

ఇట్లు చాలా జాగ్రత్తలతో బోధిస్తే సుందరమైన ప్రతి అంశాన్ని ఆస్వాదించే సామర్థ్యం పద్యం కల్గిస్తూ, విద్యార్థుల ఆలోచనా సాంద్రతలను కదిలించగల్గితే ఉపాధ్యాయులు ఆశించిన బోధన లక్ష్యాలను సాధించినట్లే.

## 8.04 వ్యాకరణ బోధన :

అత్యంత ప్రాచీనకాలం నుండి మనదేశంలో వ్యాకరణశాస్త్ర అధ్యయనం, అధ్యాపనం కొనసాగుతోంది. ఈ శాస్త్రానికి సంబంధించిన పెక్కు గ్రంథాలు వెలువడ్డాయి. ధ్వని విజ్ఞానం, ఉచ్చారణ, పదం, పదభేదం, సంధి, సమాసం మొదలైన ఎన్నో అంశాలు వ్యాకరణం ద్వారా తెల్సికొని దోషరహితమైన భాషావ్యాపారాన్ని నిర్వహించవచ్చు. ఆధునికకాలంలో వ్యాకరణాన్ని ప్రత్యేక అధ్యయనాంశంగా చదవనవసరం లేదని ఇతర పాఠ్యాంశాల్లో భాగంగానే వ్యాకరణ నియమాల్ని అధ్యయనం చేయాలని ఒక దృఢమైన అభిప్రాయముంది. ఈ అభిప్రాయం మనోవైజ్ఞానిక ఆధారాలపై నిర్మింపబడిందని కారణం సాధారణ వ్యవహారంలో ఏ వ్యవహర్త కూడా దోషాలు చేయడని ఆధునికుల మతం. ఏది ఏమైనప్పటికి పాఠశాల స్థాయిలో పద్య, గద్య పాఠాలలో అంతర్భాగంగా వ్యాకరణాంశాలు బోధించినప్పటికి, ప్రత్యేకంగా కూడా వ్యాకరణాన్ని బోధించాల్సిన అవసరముందని పెక్కురు భాషావేత్తలు అభిప్రాయపడ్తున్నారు. అందువల్ల ఈనాడు మన పాఠశాలల్లో, ఇతర పాఠాల్లో ప్రస్తావించిన వ్యాకరణాంశాలను క్రోడీకరించి ఒకే చోట వ్యాకరణ పాఠంగా చెప్పడం జరుగుతోంది.

I) వ్యాకరణానికి సంబంధించిన కొన్ని భావనలను పరిశీలిద్దాం.

a) శబ్దాలను శాసించేది వ్యాకరణమని పాణిని తన అష్టాధ్యాయిలో వివరించారు. వ్యాకరణం మూలంగా మనం భాషను సువ్యవస్థితం చేయువచ్చని వారి అభిప్రాయం. ధ్వని, ఉచ్చారణ, పదం, అర్థాల మధ్యగల సంబంధ స్థాపనకు కూడా వ్యాకరణం ఉపకరిస్తుంది.

b) Dr. Sweet అనే వ్యాకరణవేత్త 'Grammar is the practical analysis of a Language, its anatomy' అని నిర్వచించారు. వ్యాకరణం భాషయొక్క ప్రయోగాత్మక విశ్లేషణ. భాషా శరీరధర్మశాస్త్రం అని వీరి అభిప్రాయం. (New English Grammar p. 4)

c) Prof.Sonnen Schein అను భాషావేత్త 'Grammar deels merely with differrence in the grouping of words in the sentence' అని చెప్పారు. కేవలం వాక్యంలోని పద సమూహాల మధ్యగల ఆంతరిక సంబంధమేమిటో వ్యాకరణం తెల్పుతుంది అని వీరి భావం. (The Soul of Grammar p.11)

d) Hazlitt అను భాషావేత్త 'Description of a peculiar structure of a language is grammar' అన్నారు. భాషయొక్క ప్రత్యేక ఆకృతుల వివరణే వ్యాకరణం అని వీరి భావం.

e) Modern English అనే గ్రంథంలో 'Grammar, especially for School purposes is a description of the main laws of the structure of current language couched in terms which are sufficiently precise' అని వివరింపబడింది. అంటే వ్యవహారంలోని భాషారూపాలకుగల సంబంధాలను చెప్పే ఒక సూక్ష్మరూప నియమావళి మాత్రమే వ్యాకరణమని భావం. ఈ భావనల ఆధారంగా వ్యాకరణ బోధనోద్దేశ్యాలను తెల్పికొందాం.

## II) వ్యాకరణ బోధన ఉద్దేశ్యాలు :

a) ధ్వని, ఉచ్చారణల జ్ఞానాన్ని, స్పృహను కల్గించడం.
b) పదస్వరూపాన్ని గ్రహించడం.
c) వాక్యంలోని పదాల మధ్య గల సంబంధాలను, ఆసక్తుల్ని తెల్పికోవడం.
d) దోషరహిత భావప్రకటన సామర్థ్యాన్ని పెంపొందించడం.
e) పద, వాక్య సమ్మేళన సంప్రదాయ వైచిత్రిని గుర్తించి వానిని విశ్లేషించగల్గడం.
f) పదస్వరూప, స్వభావాల్ని గ్రహించి సూత్రాలు నిర్మించడం.

## III) వ్యాకరణ బోధన పద్ధతులు :

వ్యాకరణ బోధనలోని కొన్ని పద్ధతుల్ని తెల్పికొందాం.

a) నిగమోపపత్తి పద్ధతి : ఈ పద్ధతిని సంప్రదాయక పద్ధతి అని, నిష్పత్తి

పద్ధతి అని, సూత్ర పద్ధతి అని వ్యవహరిస్తారు. ఆంగ్లంలో Deductive method అంటారు. ఈ పద్ధతిలో మొదట సూత్రాన్ని చెప్పి తర్వాత ఉదాహరణలు చెప్తారు. సూత్రానుగుణంగా ఉదాహరణలను విశ్లేషించి సూత్ర నిరూపణచేస్తారు. ఈ పద్ధతి విద్యార్థుల్లో లోతైన పరిశీలనా శక్తిని, విమర్శనా శక్తిని పెంచి వ్యాకరణ శాస్త్ర అధ్యయనంలో ఆసక్తిని పెంపొందిస్తుంది. శాస్త్ర అధ్యయనం చేయాలనుకునేవారికి ఈ పద్ధతి బహుళ ప్రయోజనకారి. వ్యాకరణశాస్త్ర పుస్తకాలు కూడా ఈ పద్ధతిలోనే లభిస్తాయి. ఈ పద్ధతి మనోవైజ్ఞానిక సిద్ధాంతాలకు భిన్నమైన పద్ధతి అని ఆధునికులు భావిస్తారు.

b) అనుమానోపపత్తి పద్ధతి : దీనిని వైయాకరణ పద్ధతి, ఉదాహరణ పద్ధతి లేదా Inductive method అని వ్యవహరిస్తారు. గద్య; పద్య పాఠాల్లో విద్యార్థులకు పరిచయం చేసిన పదబంధాలను ఉదాహరణలుగా గ్రహించి వాని యందలి సారూప్యతను, సామాన్య ధర్మాలను పరిశీలింపజేసి, విశ్లేషించి, వీని ఆధారంగా సూత్రాలు నిర్మించడం, సూత్రాల నిర్మాణం కూడా విద్యార్థుల స్వంతమాటల్లోనే ఉండడం ఈ పద్ధతిలోని ప్రత్యేకత. దీనివల్ల సూత్రాన్ని నిర్మించింది తామే అనే సంతృప్తి విద్యార్థులకు కల్గుతుంది.

c) అనుసంధాన పద్ధతి : వ్యాకరణ పుస్తకాల పఠనం ద్వారా విద్యార్థులు సంపాదించిన సంప్రదాయజ్ఞానాన్ని వాచకంలోని రూపాలతో అనుసంధానించుట ద్వారా వ్యాకరణ నియమాల్ని అభ్యసించడం ఈ పద్ధతిలోని ప్రత్యేకత.

d) ప్రయోగ పద్ధతి : ఈనాడు "వ్యాకరణం ప్రయోగశరణ"మనే భావన వ్యాప్తిలో ఉంది. పాఠాంతర్గతంగా( Functional Grammar) నే వ్యాకరణాన్ని బోధించాలన్నది ఈ పద్ధతిలోని ప్రధాన ధ్యేయం.

పై పద్ధతులను దృష్టిలో పెట్టుకొని పాఠాలలోని వ్యాకరణాంశాలను అచటచట బోధిస్తూనే ప్రత్యేకంగా పరీక్షదృష్టితో బాటు శాస్త్రదృష్టితో వ్యాకరణాన్ని బోధించాల్సిన అవసరముందని చాలామంది భావిస్తారు. అందువల్ల పై పద్ధతుల సమన్వయంతో ఈనాడు తరగతిగదుల్లో ప్రత్యేక వ్యాకరణ పాఠం కూడా చెప్పాల్సిన అవసరమేర్పడుతోంది.

IV) వ్యాకరణ బోధన క్రమం :

పద్య, గద్య పాఠాల్లో వలెనే ఉపాధ్యాయులు మొదట విద్యార్థుల

పూర్వజ్ఞానాన్ని పరిశీలించి ప్రస్తుత పాఠ్యాంశం వైపు వారిని ఉన్ముఖులనుచేసి శీర్షికను విద్యార్థుల నుండి రాబట్టి ప్రకటించాలి. ఆ తర్వాత విద్యార్థులకు గద్య, పద్య పాఠాల్లో పరిచయం చేసిన ఆ రోజు బోధించే వ్యాకరణాంశానికి సంబంధించిన ఉదాహరణలను ప్రశ్నలద్వారా రాబట్టాలి. సేకరించిన ఉదాహరణలను ఒక్కొక్కటి తీసికొని పదస్వరూపాన్ని విశ్లేషిస్తూ వాని మధ్యగల సమానధర్మాన్ని విద్యార్థులు స్వంతమాటల్లో చెప్పగలిగేటట్లు చూడాలి. ఇట్లు విద్యార్థులే సూత్రాన్ని నిర్మించిన తర్వాత అనుగుణమైన మరికొన్ని ఉదాహరణలను చెప్పి వానిని విశ్లేషింపజేయుట ద్వారా సూత్ర అభ్యాసం పునర్బలనం జరుగుతుంది. ఆ తర్వాత పునర్విమర్శ చేసి ఇంటిపని ఇచ్చి పాఠం ముగించాలి. ఈ విధమైన బోధనలో మొదట నిగమోపపత్తి పద్ధతి, రెండవ దశలో అనుమానోపపత్తి పద్ధతి రెండున్నూ సమన్వయింపబడి ప్రాచీన ఆధునిక అభిప్రాయాలను మన్నిస్తుంది.

విద్యార్థులు ప్రయోగ రూపంలో గద్య పద్య పాఠాల్లో తెల్సికొన్న పదబంధాలలోని సామాన్య ధర్మాలను విశ్లేషించి వ్యాకరణ సూత్రాల విజ్ఞానం పొందడం ద్వారా దోషరహిత వ్యవహార దక్షత ప్రాప్తిస్తుంది.

## 8.05 వ్యాస (రచన) బోధన :

విద్యార్థుల్లో అంతర్లీనంగా ఉన్న ఆలోచనాశక్తిని వెలికితీసి సృజనాత్మక రచన చేయడానికి వారిని ప్రోత్సహించడం వ్యాసబోధనలోని ప్రధాన ఉద్దేశ్యం. వ్యాసాన్ని బోధించడం అంటే వ్యాసరచనాశక్తిని ప్రోత్సహించడం అన్నమాట. వ్యాసరచన బోధనక్రమాన్ని తెల్సుకొనేముందు వ్యాసమంటే ఏమిటో తెలిసికొందాం.

### I) వ్యాసమంటే :

ప్రపంచ సాహిత్యంలోనే మొదటగా ఫ్రెంచి రచయిత మాన్‌టైన్ (1571) వ్యాసం రాసినట్లుగా భావింపబడుతోంది. ఆ తర్వాత Francis Bacan వ్యాససంపుటి Myself, 18వ శతాబ్దంలో Steal మరియు Edison అనే ప్రఖ్యాత ఆంగ్ల రచయితల Spectator ఆంగ్ల పత్రికలోని రచనల పరంపరలు వ్యాసాలని వ్యవహరింపబడ్డాయి. ఈ వ్యాసాలు ప్రత్యేక లక్షణాలు కల్గి విమర్శనాత్మకంగా ఉండుటవల్ల ప్రపంచవ్యాప్తంగా ఒక ప్రత్యేక రచనాశైలిగా గుర్తింపు పొందాయి. Spectator వ్యాసాల నేపథ్యంలోనే కీ॥శే॥ పానుగంటి

లక్ష్మీనరసింహారావుగారి 'సాక్షి' వ్యాసాల సంపుటి వెలువడిందని పెక్కురు భావిస్తారు.

వ్యాసం అనేపదం మన భాషలో మొదట వాడుకలో కనబడదు. క్రీ.శ. 1840-50 సం॥రాల మధ్య శ్రీ సామినేని ముద్దు నరసింహంగారు 'హితసూచని' అనే పత్రికలో ఎనిమిది అంశాలపై రాసిన ప్రమేయాలు ఈనాటి వ్యాసలక్షణాలకు దగ్గరగా ఉన్నాయని భావిస్తున్నారు. ఇవే నేటి వ్యాసానికి పూర్వ రూపాలని విశ్వాసం. ఆ తర్వాత శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులుగారు 'సంగ్రహం' అనే పేరుతో, శ్రీ కందుకూరి వీరేశలింగం గారు 'ఉపన్యాస'మనే పేరుతో వివిధ పత్రికల్లో రాసారు. ఇవన్నీ నేటి వ్యాసానికి దగ్గరగా ఉన్న రచనా రూపాలు. బ్రౌణ్య నిఘంటువులో వ్యాసం అనే పదం పేర్కొనబడింది. 19వ శతాబ్దం ద్వితీయార్థం నుండి వ్యాసం అనే పదం మనభాషలో విరివిగా వాడుకలోకి వచ్చిందని పలువురి అభిప్రాయం. హిందీభాషలో వ్యాసాన్ని నిబంధ్, ప్రబంధ్, లలిత ప్రబంధ్, లేఖా, సందర్భ అని వ్యవహరిస్తారు. బెంగాలీ, ఒరియా భాషల్లో ప్రబంధ్, నిబంధ్ అని అంటారు. సృజనాత్మక శక్తులకు ప్రతిబింబమైన వ్యాసం ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా ఈనాడు గుర్తింపుపొందింది.

శబ్దరత్నాకరం వ్యాసం అనే పదానికి 'ఏదేని ఒక అంశంపై విరివిగా రాయడం' అనే అర్థంచెప్పింది. విజ్ఞాన సర్వస్వంలో 'ఏ విషయాన్నైనా తెల్పికొని వాని యందలి అంశాలను విభజించి వివరించుట' అని వ్యాసాన్ని నిర్వచించడం జరిగింది. ఆచార్య రామచంద్ర శుక్లా 'కవికి గీటురాయి గద్య అయితే, గద్యకు గీటురాయి వ్యాసం' అని వ్యాసరచనా క్లిష్టతను గొప్పతనాన్ని ప్రస్తుతించారు. భాషావేత్తల కవిత్వంలో lyric ఎలాంటిదో వచనరచనలో Essay అలాంటిదని, The true essay is essentially personnel అని పేర్కొన్నారు. అందువల్ల వ్యాసం కేవలం మెదడుకు సంబంధించిన అంశంగా కాక హృదయానికి సంబంధించిందిగా ఉండి ఆత్మాశ్రయమవాలని ప్రాచ్య, పాశ్చాత్య భాషావేత్తలు, సాహితీమూర్తుల నిశ్చితాభిప్రాయం.

II). వ్యాసం లక్షణాలు :

వ్యాసం ప్రధానంగా ఈ కింది లక్షణాలను కల్గి ఉండాలి.

a) వాటి దీర్ఘంగా ఉండాలి.

b) తేలికగా ఉండాలి.

c) స్వల్పకాలంలో చదివేదిగా ఉండాలి.

d) రచనారీతి హృద్యంగా ఉండాలి.
e) సరళమూ, సున్నితమూ అయి హాస్యస్ఫోరకంగా ఉండాలి.
f) రచయిత సైద్ధాంతిక బలాలను పాఠకులపై రుద్దునట్లుండరాదు.
g) వర్ణనలు తగ్గించాలి.
h) సూటిగాచెప్పాలి, చదువుతుంటే మరోసారి చదవాలనే ఆసక్తిని కల్గించాలి.
i) జటిల సమాస బంధురంగా ఉండరాదు.
j) ఏదేని ఒకే అంశానికి పరిమితం కావాలి.
k) అంశంయొక్క పూర్వాపరాలను స్థూలంగా వివరించగల్గాలి.
l) పేరాలుగా విభజింపబడాలి. మొదటి పేరా ఉపోద్ఘాతంగా చివరి పేరా ముగింపుగా ఉండాలి.
m) చిన్న చిన్న వాక్యాలలో ఉండాలి.

III) వ్యాసాల్లో రకాలు :

వ్యాసం రచనాతీరును బట్టి వివిధాలుగా ఉంటుంది. ఇవి ప్రధానంగా

i) వర్ణనాత్మక వ్యాసాలు.
ii) విమర్శనాత్మక వ్యాసాలు.
iii) సాహిత్య వ్యాసాలు.
iv) ధార్మిక వ్యాసాలు.
v) చారిత్రక వ్యాసాలు.
vi) రాజకీయ వ్యాసాలు.
మొదలగునవి

మన పాఠశాల స్థాయిలో వివిధాంశాలపై ఒకటి రెండు పేజీలు, నాలుగైదు పేరాలు, ఇరవై ముప్పై వాక్యాలకు మించని రచనలుచేయించడం ద్వారా విద్యార్థుల్లో వ్యాసరచనాశక్తిని పెంపొందించి తద్వారా వారిలోని సృజనాత్మకతను అంచనావేయవచ్చు.

IV) వ్యాస (రచన) బోధన ఉద్దేశ్యాలు :

వ్యాస బోధనొద్దేశ్యాల్లో ప్రధానమైనవానిని తెల్సికొందాం. అవి

a) విషయజ్ఞానాన్ని పెంపొందించడం.
b) సృజనాత్మక శక్తుల్ని వెలికితీసి ప్రోత్సహించడం.
c) రచనను పరిచ్ఛేదాలుగా విభజించడం.

d) భావానుక్రమంగా రాయడం.

e) విమర్శనాత్మక ధోరణిలో రాయడం.

f) నిశిత పరిశీలనాశక్తిని పెంపొందించడం.

g) కల్పనాశక్తిని, ఆలోచనాశక్తిని క్రమబద్ధంచేయడం.

h) వివిధ రచనారీతుల్ని పరిచయంచేయడం.

i) విద్యార్థులతో తమదేయైన శైలిలో రచనలు చేయించడం.

V వ్యాస బోధన పద్ధతులు :

a) అనుకరణ పద్ధతి : ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు మొదట ఏదేని ఒక అంశంపై కొన్ని వాక్యాలు విద్యార్థులకు రాయించి మరో సారూప్య అంశం పై వారిని అదే విధంగా రాయమనడం జరుగుతుంది. విద్యార్థుల్లో మొదటిదశలో రచనాశక్తిని పెంపొందించడానికి అనుకరణ పద్ధతి ఉపకరిస్తుంది. కారణం భాషాభ్యసనం అనుకరణ ద్వారా జరుగుతుంది కనుక. ఉదా :- 'ఆవు' అనే అంశంపై మొదట పదివాక్యాల్లో వ్యాసం రాయించి, విద్యార్థులతో 'గేదె' అనే అంశంపై ఆ వాక్యాల్లో చిన్న మార్పులు చేసి రాయమనడం ద్వారా ఈ పద్ధతిని ఉపయోగించుకోవచ్చు.

b) అభివర్ణన పద్ధతి : ఏదేని ఒక చిత్రంగాని, దృశ్యంగాని ప్రదర్శించి వాటిపై రాయమని విద్యార్థుల్ని కోరడం అభివర్ణన పద్ధతిలోని ప్రత్యేకత. విద్యార్థులు తాము చూస్తున్న చిత్రం, దృశ్యంలోని భావాలను వర్ణిస్తూ రాస్తారు. పంటపొలాలు, వర్షం మొదలైన అంశాలకు సంబంధించిన చిత్రాలను ప్రదర్శించి విద్యార్థుల్లోని ఊహాశక్తుల్ని క్రమబద్ధం చేసి రాయించడానికి ఈ పద్ధతి ఉపకరిస్తుంది.

c) చర్చా పద్ధతి : రాయాల్సిన అంశాన్ని మొదట ప్రస్తావించి ప్రశ్నోత్తరరూపంలో విషయాన్ని కూలంకషంగా చర్చించి ప్రధానాంశాలను, ముఖ్య పదాలను గుర్తింపజేయడం ఈ పద్ధతిలోని ప్రత్యేకత. చర్చ ఆధారంగా విద్యార్థులు స్వయంగా వ్యాసరచన చేయగల్గుతారు. పై తరగతుల్లో ఈ పద్ధతి అనుసరణ యోగ్యం.

d) ప్రయత్నపద్ధతి : విద్యార్థులే స్వయంగా ఒక అంశాన్ని ఎంపికచేసికొని ఆ అంశంపై రాయడానికి ప్రయత్నంచేస్తారు. ఉపాధ్యాయులు వారికి సహకరిస్తూ మార్పులు చేర్పులకు సూచనలిస్తారు. విద్యార్థులు తర్వాత పూర్తి

వ్యాసాన్ని రాస్తారు. పై తరగతి విద్యార్థుల్లో ఈ పద్ధతి ద్వారా వ్యాసరచనను ప్రోత్సహించవచ్చు.

e) ప్రకల్పనా పద్ధతి : ప్రాజెక్టు పద్ధతిలో భాగంగా విద్యార్థులు నిర్వహించిన ప్రకల్పనకు సంబంధించిన అంశాలను క్రమబద్ధంగా రాయమనడం ఈ పద్ధతిలోని ప్రత్యేకత. దీని పూర్వరంగంలో విద్యార్థుల మధ్య చర్చకు కూడా అవకాశమీయవచ్చు. తర్వాత అందరూ కలిసి కూర్చొని తమ రచనలను పరిచేసుకోవచ్చు కూడా.

f) ప్రశంసా పద్ధతి : ఏదేని ఒక రచన, రచయిత, అంశాన్ని గ్రహించి ప్రశంసిస్తూ రచనచేయడం ప్రశంసా పద్ధతిలోని ప్రత్యేకత. పై తరగతుల్లో ఈ పద్ధతి బాగా ఉపకరించినప్పటికీ 'నాకునచ్చింది' 'నాకునచ్చనిది' అనే భావనల ఆధారంగా చిన్న తరగతుల్లో కూడా రచనలు చేయించవచ్చు.

g) ఆలోచనాత్మక పద్ధతి : ఇది ఒకవిధంగా ప్రశంసాపద్ధతికి ప్రతిరూపం. ఇది విమర్శనాత్మకంగా ఉంటుంది వ్యాసకర్త స్వీయ అభిప్రాయాలను ఇతరుల అభిప్రాయాలతో సమన్వయించి రాయగల్గితే ఉన్నతస్థాయి వ్యాసరచన ఔతుంది.

పై పద్ధతుల్లో తరగతికనుకూలమైన పద్ధతిని ఉపాధ్యాయులు ఎన్నుకొని వ్యాసరచనను విద్యార్థుల్లో ప్రోత్సహించాల్సిన అవసరం ఉంది.

VI) వ్యాసబోధన క్రమం :

ఇతర పాఠాల్లోవలెనే పూర్వజ్ఞాన పరిశీలన, ఉన్ముఖీకరణం, శీర్షికాప్రకటనాన్ని నిర్వహించి వ్యాసరచనాపద్ధతిని, పరిచయం చేయడం గాని లేక చర్చించడంగాని ఉపాధ్యాయులు చేయాలి. ఆ తర్వాత పేరాలవారీగా ప్రశ్నోత్తర రూపంలో విషయంపై సమగ్ర చర్చచేస్తూ క్రమపద్ధతిలో విషయంలోని ముఖ్యమైన పదాలను పేరాలవారీగా నల్లబల్లపై రాయాలి. చర్చ పూర్తయిన తర్వాత నల్లబల్లపై రాసిన పదాల ఆధారంగా పేరాలవారీగా విద్యార్థులందర్ని తరగతిలోనే వ్యాసం రాయమని ప్రోత్సహించాలి. విద్యార్థులు రాసిన వ్యాసాలను కొందరిచే చదివించి దోషాలున్న సవరించి మార్పులు చేర్పులు సూచించాలి. ఆ తర్వాత పునర్విమర్శచేసి ఇంటిపని ఇవ్వాలి. ఇంటిపనిలో విద్యార్థులు తరగతిగదిలో అసంపూర్తిగా రాసిన వ్యాసాన్ని పూర్తిగా రాయమని గాని, రాసిన వ్యాసాన్నే తిరిగి మార్పులు చేర్పులు చేస్తూ రాయమని గాని

క్షోరవచ్చు. మరో సారూప్య అంశానికి సంబంధించిన విషయమిచ్చి దానిపై రాయడానికి తగిన ముఖ్య పదాలను ఎంపిక చేయమని కూడా చెప్పవచ్చు. ఈవిధంగా విద్యార్థులకు మార్గదర్శకత్వం వహిస్తూ చేయించే వ్యాసరచన ద్వారా విద్యార్థుల్లోని సృజనాత్మక శక్తుల్ని వెలికితీయవచ్చు.

## 8.06 ఉపవాచక బోధన :

విద్యార్థుల్లో విస్తార పఠనాభిలాషను పెంపొందించడానికి ఉద్దేశించిన పాఠ్యవస్తువు ఉపవాచకం. పాఠ్యపుస్తకంతోబాటు అనుబంధంగా ఆరో తరగతి నుండి విద్యార్థులకు అందుబాటులో ఉండే పుస్తకం ఉపవాచకం. ఉపవాచక బోధన మాధ్యమిక తరగతులనుండి ప్రారంభమౌతుంది. విద్యార్థులు విశేషజ్ఞానాన్ని సముపార్జించుటకు ఉపవాచకం ఉపకరిస్తుంది.

**I) ఉపవాచక బోధన ఉద్దేశ్యాలు :**

a) విద్యార్థుల్లో విస్తార పఠనాభిలాషను పెంపొందించడం.
b) విరామకాలాన్ని సద్వినియోగం చేయడం.
c) భాషాభిరుచిని పెంపొందించడం.
d) సమగ్రమైన విషయజ్ఞానాన్ని పెంపొందించడం.
e) మూలగ్రంథాలు, పరామర్శ గ్రంథాలు, సంప్రదించే అలవాటు పెంపొందించడం.
f) పఠన వేగాన్ని పెంచడానికి మౌన పఠనాన్ని ప్రోత్సహించడం.
g) గ్రంథాలయ వినియోగాన్ని ప్రోత్సహించడం.

పై ఉద్దేశ్యాల సాధనకు కింది బోధన పద్ధతులు ఉపకరిస్తాయి.

**II) ఉపవాచక బోధన పద్ధతులు :**

ఉపవాచక బోధన పద్ధతుల్లో ప్రధానమైన కొన్నిటిని తెల్సికొందాం.

**a) కథాకథనపద్ధతి :**

ఉపాధ్యాయులు మొదట ఒకనాటి బోధనాంశాన్ని కథనరూపంలో విద్యార్థులకు వివరించాలి. ఆ తర్వాత ఉపవాచకంలోని విషయ భాగాన్ని విద్యార్థులు చదువుకుంటారు. ముఖ్యాంశాలను ఉపాధ్యాయులు నల్లబల్లపై రాస్తారు.

b) చర్చా పద్ధతి :

ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు విద్యార్థులను ముందు కొంత విషయభాగాన్ని చదవమని ఆ తర్వాత ఆ విషయంపై ప్రశ్నోత్తర రూపంలో చర్చచేస్తారు. అవసరమైన ముఖ్యాంశాలను నల్లబల్లపై రాస్తారు.

c) పఠన పద్ధతి :

ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు తాము ఉపవాచకంలోని అంశాలను చదివి, విద్యార్థులచే చదివించి ముఖ్యాంశాలను క్రోడీకరిస్తారు. కేవలం మొదటి దశలో విద్యార్థుల పఠననైపుణ్యాన్ని పెంపొందించడానికి ఈ పద్ధతి ఉపకరిస్తుంది. కాని పై తరగతుల్లో ఆచరణ యోగ్యం కాదని బోధన శాస్త్రజ్ఞుల నమ్మకం.

d) ఉపన్యాస పద్ధతి :

ఉపాధ్యాయులే నేరుగా ఉపవాచకాంశాన్ని విద్యార్థులకు చెప్పడం ఈ పద్ధతిలోని ప్రత్యేకత. విద్యార్థులు ఈ పద్ధతిలో కేవలం శ్రోతలే. పాఠశాల దశలో ఈ పద్ధతి అనుసరణయోగ్యం కాదని కొందరి అభిప్రాయం.

III) ఉపవాచక బోధన క్రమం :

ఇతర పాఠాల బోధనలో వలెనే ప్రవేశసోపానాన్ని (పూర్వజ్ఞాన పరిశీలనం, ఉన్ముఖీకరణం, శీర్షికాప్రకటనం) నిర్వహించి ఆనాటి ఉపవాచకాంశంలోని సుమారు ముప్పాతిక భాగాన్ని ఉపాధ్యాయులు కథాకథనరూపంలో ఆసక్తికరంగా విద్యార్థులకు చెప్పాలి. అవసరమైన ముఖ్యాంశాలను నల్లబల్లపై రాయాలి. కథనం పోగా మిగిలిన పాఠభాగాన్ని తరగతిలోనే విద్యార్థుల్ని మౌనంగా చదువుకొమ్మని కోరాలి. వారు మౌనపఠనం చేసిన తర్వాత కథితాంశంపై, పఠితాంశం పై ప్రశ్నోత్తర రూపంలో సమగ్రమైన చర్చ జరపాలి. అవసరమున్న చోట్ల అదనపు సమాచారాన్ని విద్యార్థులకు అందించాలి. ఆ తర్వాత పునర్విమర్శ చేసి ఇంటిపని ఇవ్వాలి. ఇంటిపని ప్రశ్నలలో పేరాలు సూచించి వానిపై ప్రశ్నలకు సమాధానాలు రాయించడం, శీర్షికను నిర్ణయించమనడం, ప్రశ్నలు తయారుచేయడం లాంటి వివిధ రకాల ప్రశ్నలీయాలి. తద్వారా అపరిచిత గద్యాంశాలను పఠనపూర్వకంగా ఎలా అవగాహనచేసికోవచ్చో విద్యార్థులు గ్రహిస్తారు. ఈ పద్ధతి ద్వారా ఉపవాచక బోధన తన ఉద్దేశ్యాలను సాధించి విద్యార్థుల్లో ఆశించిన ప్రవర్తనా మార్పుల్ని కనపరుస్తుంది.

## 8.07 నాటక బోధన :

నాటకం సంభాషణాత్మకమూ, అభినయాత్మకమూ ఐన ప్రక్రియ. సంభాషణలతో బాటు పాత్రలకనుగుణమైన హావభావ ప్రకటన కూడా నాటక లక్షణమే. సాహిత్యంలో నాటకం చిట్టచివరి ప్రక్రియ అని లాక్షణికుల మతం. అందుకే 'నాటకాంతంహి సాహిత్యం' అన్న నుడి ప్రచారంలోకి వచ్చింది. పాఠ్యపుస్తకాల్లో సంభాషణా రూపంలో నాటకపాఠాలుంటాయి. ప్రాథమిక తరగతుల్లో సంభాషణా పాఠాలు ఎక్కువగా, పై తరగతుల్లో కనీసం ఒకటి రెండైనా ఉంటాయి. వీని ఆధారంగా పాత్రానుగుణ వ్యక్తీకరణ సామర్థ్యాలను పెంపొందించాల్సి ఉంటుంది.

### I) నాటక బోధన ఉద్దేశ్యాలు :

నాటక బోధన ద్వారా కింది ఉద్దేశ్యాలను సాధించవచ్చు.

a) సామాన్య జనజీవన వ్యవహారాన్ని పరిచయం చేయడం.
b) మానవ స్వభావాల్ని అధ్యయనం చేయడం.
c) విభిన్న పరిసరాల్లో, అవసరాల్లో పాత్రల ప్రవర్తనలను పరిశీలింపజేయడం.
d) ఎదుటివ్యక్తి భాషించిన అంశానికి అనుగుణంగా భాషించడం.
e) ఒకేసారి ఒకే వ్యక్తి మాట్లాడాలని, ఇతరులు మాట్లాడుతుంటే మధ్యలో ఆటంకపరచరాదను స్పృహను కల్గించడం.
f) దృశ్య అనుభవాల్ని కల్గించడం ద్వారా ఆనందానుభూతిని పెంపొందించడం.
g) సంభాషణల కనుగుణమైన హావభావ ప్రదర్శన చేయడం.

పై ఉద్దేశ్యాల సాధనకు ఈ కింది పద్ధతులు ఉపకరిస్తాయి.

### II) నాటక బోధన పద్ధతులు :

#### a) వ్యాఖ్యాపద్ధతి :

నాటకంలోని వివిధ సన్నివేశాలు, పాత్రలు, వాని భాషారూపం, నాటక నేపథ్యం, నాటకంలోని భావసౌందర్యం మొదలైన అంశాలపై ఉపాధ్యాయులు వ్యాఖ్యానరూపంగా విద్యార్థులకు వివరించి నాటకంలోని విశేషాలను వారు గ్రహించేట్లు చేయాలి. తర్వాత విద్యార్థులు నాటక పాఠం చదువుకొని తరగతిలో బోధించిన అంశాలతో సమన్వయించు కొంటారు.

b) ప్రదర్శన పద్ధతి :

ఉపాధ్యాయులు ఈ పద్ధతిలో పాత్రలను వాచికాభినయం ద్వారా అనుకరిస్తూ విద్యార్థులు విషయాన్ని గ్రహించేట్లు చేయాలి. తద్వారా పాత్రోచితంగా సంభాషణలను చెప్తూ విద్యార్థులు ఉపాధ్యాయుల్ని అనుకరిస్తారు.

c) ప్రయోగ పద్ధతి :

ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు విద్యార్థులచే పాత్రపోషణ చేయించి ఆంగిక, వాచిక, ఆహార్యాల ఆధారంగా నాటకాన్ని ప్రదర్శించే ఏర్పాటు చేస్తారు. ఆహార్యాన్ని మినహాయించి కూడా విద్యార్థులతో, తరగతిగదిలో, ఆహార్యంతో రంగస్థలంపై నాటకాన్ని ప్రదర్శించుట ద్వారా విద్యార్థులు నాటకంలో లీనమై రసానుభూతిని పొందుతారు.

III) నాటకబోధన క్రమం :

ఇతర పాఠాల వలెనే ప్రవేశసోపానం నిర్వహించి నాటక రచయిత గురించి నాటక నేపథ్యాన్ని గురించి విద్యార్థులకు వివరించాలి. సంభాషణలు తాను చెప్తూ పాత్రోచితంగా విద్యార్థులచే చెప్పిస్తూ అనుకరణ పద్ధతిలో విద్యార్థులకు బోధించాలి. అవసరమైన చోట్ల ముఖ్య భావనలను వివరిస్తూ, విశ్లేషిస్తూ బోధన చేయాలి. తర్వాత విద్యార్థులచే ఒకసారి నాటక భాగాన్ని చదివించి పునరావృత్తి చేసి ఇంటిపని ప్రశ్నలీయాలి. తరగతిగదిలో విద్యార్థులచే నాటక ప్రయోగం కూడా చేయించవచ్చు. రంగస్థల ప్రయోగం కూడా ప్రత్యేక సన్నివేశాల్లో నిర్వహించి ఈ ప్రక్రియ ద్వారా ఆశించిన గమ్యాలను సాధించవచ్చు.

## 8.08 కథా బోధన :

బాలబాలికలు కథలంటే చెవికోసుకుంటారు. మానవుల సామాజిక, ధార్మిక, నైతిక అంశాలు, వీరగాథలు జానపద కథల రూపంలో ప్రచారంలో ఉన్నాయి. ఈనాడు కథ, కథానిక విశిష్టమైన సాహితీ ప్రక్రియలుగా గుర్తింపు పొందాయి. సందేశాత్మకమూ, నాతిదీర్ఘమూ అయిన కథలు ప్రాథమిక తరగతి పాఠ్యపుస్తకాల్లో ఎక్కువగా చోటుచేసికొంటాయి. ఉన్నత తరగతుల్లో కథా పాఠాల సంఖ్య తక్కువయైనమూ ఉన్న ఒకటి రెండు పాఠాలు సందేశాత్మకంగా కథాసాహిత్యానికి ప్రతినిధులై ఉంటాయి. ఈ పాఠాల బోధనద్వారా విద్యార్థుల్లో పఠననైపుణ్యాన్ని, కథన నైపుణ్యాన్ని పెంపొందించవచ్చు.

G.A. Yokahn మరియు R.G. Simpson గారలు తమ Modern Methods and Techniques of Teaching' అనే గ్రంథంలో కథలయొక్క విశిష్టతను ఇలా పేర్కొన్నారు. వారు 'The Story can be justified for its recreational values alone., if a Story points a moral well and good, if it improves language habits so much better, but the story must of all be a good story and story telling must be worth while for its own sake' అని అభిప్రాయపడ్డారు.

విద్యార్థులలో కథా బోధన ద్వారా సామాజిక, నైతిక విలువల్ని ప్రోదిచేసి వారిని మంచి కథకులుగా, కథా రచయితలుగా తీర్చిదిద్దడమే కథాబోధన ప్రధాన ఆశయం.

I) కథల రకాలు :

కథలు దిగువ విధంగా ఉంటాయి.

a) హాస్యకథలు.
b) నీతి కథలు.
c) అద్భుత కథలు.
d) జానపద కథలు.
e) వీర గాథలు.
f) చారిత్రక కథలు మొదలగునవి

II) కథా బోధన ఉద్దేశ్యాలు :

కథా బోధన ద్వారా దిగువ ఉద్దేశ్యాలు సాధించాలి.

a) విద్యార్థుల ఆలోచనా శక్తిని వికసింపజేయడం.
b) భావసౌందర్యాన్ని విద్యార్థులు ఆస్వాదించేట్లు చూడడం.
c) కథన కౌశలాన్ని పెంపొందించడం.
d) సాహిత్యాభిరుచిని పెంపొందించడం.
e) అతి చిన్న విషయంలోనే నైతిక విలువల్ని విద్యార్థులు గ్రహించేట్లు చేయడం.

III) కథా బోధన పద్ధతులు :

కథాబోధన పద్ధతుల్లో ప్రధానమైన కొన్నిటిని గూర్చి తెల్సికొందాం.

a) కథన పద్ధతి :

ఉపాధ్యాయులే ఆసక్తికరంగా కథను విద్యార్థులకు చెప్పాలి. తద్వారా విద్యార్థులు కథాంశాన్ని విని వారు కూడా తిరిగి ఆసక్తికరంగా కథను చెప్పగల్గుతారు.

b) ప్రదర్శన పద్ధతి :

ఉపాధ్యాయులు కథకు సంబంధించిన వరస చిత్ర మాలికలను సేకరించి తరగతిలో ప్రదర్శించాలి. విద్యార్థులు ఆ కథాచిత్రాలు చూస్తూ వరసగా కథను తమ మాటల్లో చెప్పడానికి ప్రయత్నిస్తారు. విద్యార్థులు కథా చిత్రాలను అనుసరించి భావాన్ని వ్యక్తీకరించలేని చోట్ల ఉపాధ్యాయులు వారికి సహకరిస్తారు. చిత్రాలు చదివి కథ చెప్పే పద్ధతి చిన్నతరగతుల్లో బహుళ ప్రయోజనకారి.

c) పూరణ పద్ధతి :

ఉపాధ్యాయులు కొంతమేర కథను చెప్పి తర్వాతి కథాభాగాన్ని ఊహించమంటారు. విద్యార్థులు ఊహించిన కథాభాగం సరియైనపక్షంలో ఆ కథను పూర్తిగా విద్యార్థులతో చెప్పిస్తారు. లేని పక్షంలో తామే మిగతా కథాభాగాన్ని చెప్పి విద్యార్థులచేత చెప్పిస్తారు. పై తరగతుల్లో ఈ పద్ధతి ద్వారా విద్యార్థుల్లో ఆలోచనా శక్తిని పెంపొందించవచ్చు.

d) అభినయ పద్ధతి :

కొన్ని కథలను విద్యార్థులతో అభినయపూర్వకంగా చెప్పించడం ద్వారా కథ విద్యార్థులకు మరింత చేరువౌతుంది. దీనివల్ల పాత్రోచిత హావభావ ప్రదర్శనకు కూడా వీలు కల్గుతుంది.

పై పద్ధతుల్లో తరగతికి అనువైన పద్ధతిని ఉపాధ్యాయులెన్నుకొని కథాబోధన చేయాలి.

IV) కథా బోధన క్రమం :

ఇతర పాఠాల్లో వలెనే ఉపాధ్యాయులు మొదట ప్రవేశసోపానాన్ని నిర్వహించి ఆనాటి కథను శీర్షికరూపంలో ప్రకటించాలి. తర్వాత కథా భాగాన్ని తెల్పుటకుముందే కథా రచయిత పేరు తెలిస్తే చెప్పాలి. కథను స్థూలంగా విద్యార్థులకు కథాచిత్రాల సాయంతో ఆసక్తికరంగా చెప్పాలి. తర్వాత పాఠ్యపుస్తకంలోని కథను విద్యార్థుల్ని మౌనంగా చదవమని, ఆ తర్వాత

ముఖ్య కథాంశాలపై ప్రశ్నించాలి. విద్యార్థులతో కథాంశాన్ని కొంతమేరకు చెప్పిస్తూ కథను పూర్తిచేయాలి. ఆ తర్వాత పునర్విమర్శచేసి ఇంటిపని ఇచ్చి పాఠబోధనను ముగించాలి.

పై క్రమాన్ని పాటించి కథను బోధించినపుడు విద్యార్థుల్లో కథనం మరియు కథ రెంటియందు ఆసక్తి కల్గి వారు మంచి కథకులుగా మారే అవకాశముంటుంది.

పైన వివరించిన వివిధ పాఠాల బోధనలో సూచించిన క్రమాలు కేవలం సూచన ప్రాయాలు మాత్రమే. ఉపాధ్యాయులు తమ తరగతి గదికి, పాఠ్యాంశానికి, విద్యార్థుల స్థాయికి అనుగుణమైన క్రమాన్ని, పద్ధతిని అనుసరించాల్సి ఉంటుంది. బోధన పద్ధతులు, బోధనక్రమం ఏవీ నిర్దుష్టమూ, సమగ్రమూకావు. కాని వీనికి విద్యా, తాత్త్విక, సామాజిక, మనస్తత్వశాస్త్ర ఆధారాలున్నాయి. ఉపాధ్యాయులు తాము ఎంపికచేసికొనే బోధన పద్ధతి, బోధనక్రమం (సోపాన క్రమం) ఈ ఆధారాల కనుగుణంగా ఉన్నాయో లేవో ఒకసారి పరిశీలించి పరిచూసుకోవాలి. అందువల్ల ఉపాధ్యాయులు స్వేచ్ఛగా తమకు అనుకూలమైన పద్ధతిని లేదా పద్ధతులను విద్యాసూత్రాల పరిధిలో అవలంభించి పాఠబోధనను ఫలవంతం చేయవచ్చు.

# తొమ్మిదో అధ్యాయం

## బోధన నైపుణ్యాలు (Teaching Skills)

### 9.01 ఉపోద్ఘాతం :

ఉపాధ్యాయులు తరగతిగది బోధనలో వివిధ పద్ధతులు అనుసరిస్తారు. ఆయా విషయాలకు అనుగుణమైన బోధన వ్యూహాలను ఎన్నుకొంటారు. ఈ పద్ధతులు లేదా వ్యూహాల్లో సాధారణంగా వారు దృష్టియందుంచుకోవాల్సినవి మరియు బోధనను సమర్థంచేయడానికి ఉపయోగపడేవే బోధన నైపుణ్యాలు. వృత్తిపూర్వ శిక్షణ పొందుతున్న ఛాత్రోపాధ్యాయులు ఈ బోధన నైపుణ్యాల్ని స్వంతం చేసికోగలిగితే వారు పరిణతి చెందిన ఉపాధ్యాయులై విద్యార్థుల అభిమానాన్ని చూరగొంటారు.

Allen మరియు Ryans గారలు బోధననైపుణ్యాలుగా కొన్ని అంశాలను గుర్తించారు. వానిలో :

i) ప్రేరణలో వైవిధ్యత (Stimulus Variation).
ii) అంశాన్ని ప్రవేశపెట్టుట (Set induction).
iii) ముగింపు చెప్పడం (Closure).
iv) నిశ్శబ్ద హావభావ ప్రకటన (Silence and Nonverbal eues).
v) విద్యార్థుల భాగస్వామ్య పునర్బలనం (Reinforcement of student participation).
vi) ప్రశ్నలడుగుటలో ధారాళత (Fluency in asking questions).
vii) సమగ్ర పరిశోధనను ప్రోత్సహించే ప్రశ్నలు (Probing Questions).
viii) అపవృత ప్రశ్నలు (వైవిధ్యతగల ప్రశ్నలు) (Divergent Questions).
ix) అవధానతా రూపంలోని ప్రవర్తనల గుర్తింపు (Recognising attending behaviour).
x) ఉదాహరణల వినియోగం, వివరణ (Illustrating the use of examples).
xi) ఉపన్యసించడం (Lecturing).
xii) ప్రణాళికా బద్ధ పునరుక్తి (Planned Repetition).

xiii) సంపూర్ణ భావ ప్రకటన (Completeness of communication).

B.K. పస్సిగారు, బోధనాలక్ష్యాలు రాయడం, ఉన్ముఖీకరణం చేసి పాఠాన్ని ప్రవేశపెట్టడం, ప్రశ్నలడుగుటలో ధారాళత, ఆలోచనలు రేకెత్తించే ప్రశ్నలడుగుట, వివరించుట, ఉదాహరణలతో వివరించుట, ప్రేరణలో వైవిధ్యత, హావభావప్రకటన, విద్యార్థుల అభ్యసనాన్ని పునర్బలనం చేయుట, విద్యార్థుల్ని అభ్యసనానికి ప్రోత్సహించుట, నల్లబల్ల వినియోగం, పాఠానికి ముగింపు చెప్పడం, విద్యార్థుల అవధానతను స్థాపించుట మొదలగు వానిని బోధన నైపుణ్యాలుగా పేర్కొన్నారు. మరికొందరు విద్యావేత్తలు వీనితోబాటు విశ్లేషించడం, సాధారణీకరణం చేయడం, తరగతినిర్వహణ, ఇంటిపని ఇవ్వడం, బోధనోపకరణాల వినియోగం కూడా వీనిలో చేర్చారు. సూక్ష్మ సన్నివేశాల్లో వీనిని అభ్యాసం చేసి, లోపాలను సవరించుకొని, అవసరమైన సన్నివేశాల్లో వీనిని అనుసరించగల ఆత్మవిశ్వాసాన్ని ఉపాధ్యాయులు పెంపొందించుకోవాలి.

బోధన నైపుణ్యాల్లో కొన్నిటిని గూర్చి ఇచట తెల్సికొందాం.

## 9.02 ఉన్ముఖీకరణం చేయడం (Motivation) :

తరగతి గదిలో ప్రవేశించిన ఉపాధ్యాయులు తమ పాఠ్యాంశ బోధనకు విద్యార్థుల్ని సన్నద్ధుల్ని చేయడమే ఉన్ముఖీకరణం. తద్వారా విద్యార్థులు ఇతఃపూర్వం చదువుకొన్న విషయ వాతావరణంనుండి ప్రస్తుతాంశంలోకి వస్తారు. విద్యార్థులు అవధానాన్ని ప్రస్తుతాంశంవైపు మళ్ళిస్తారు. ఉన్ముఖీకరణాన్ని వివిధాలుగా నిర్వహించే నైపుణ్యం ఉపాధ్యాయులు స్వంతంచేసికోవాలి.

ప్రశ్నల ద్వారా ఉన్ముఖీకరణం చేయడం ఒక పద్ధతి. నేరుగా పాఠ్యాంశ నేపథ్యానికి సంబంధించిన రెండు మూడు ప్రశ్నలు లేక పాఠ్యసంబంధ పూర్వ జ్ఞానానికి సంబంధించిన ప్రశ్నల ద్వారా ప్రస్తుతాంశాన్ని సమన్వయించవచ్చు. ఉన్ముఖీకరణంలో అడిగే చివరి ప్రశ్న సాధారణంగా ఆరోజు చెప్పబోయే పాఠ్యాంశ శీర్షికను గుర్తించగల్గేదిగా ఉండాలి. ఉన్ముఖీకరణంలో నాలుగైదు ప్రశ్నలకు మించకుండా పూర్వ ప్రస్తుతాంశాలను సమన్వయిస్తూ మెలకువతో ప్రశ్నించాలి.

బోధనోపకరణాలను ప్రదర్శిస్తూ ఉన్ముఖీకరణం చేయడం మరో పద్ధతి. ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు ఇతఃపూర్వమే తయారుచేసిన ఉపకరణాన్ని

ప్రదర్శించిగాని, నల్లబల్లపై పద్యోచిత్రాన్ని గీసి గాని ప్రస్తుతాంశాన్ని ప్రవేశ పెట్టవచ్చు. మరో పద్ధతిలో ఉపాధ్యాయులు ఏదేని ఒక సంఘటననుగాని, కథనుగాని చెప్పి విద్యార్థుల్ని ప్రస్తుతాంశంవైపు మళ్ళించవచ్చు. ఇది మెలకువతో చేయాల్సిన పని. ఉన్ముఖీకరణంలో ప్రస్తుతాంశాన్ని నేరుగా చెప్పి పాఠ్యబోధనకు ఉపక్రమించే పద్ధతి మరోటి. దీన్ని సాధారణ ఉపాధ్యాయులు అనుసరిస్తారు. ఈ పద్ధతిలోని ప్రధానలోపం అభ్యసనానికి అనువైన వాతావరణాన్ని కల్పించకపోవడం. విద్యార్థుల చిత్తవృత్తులు ప్రస్తుతాంశంపై కేంద్రీకరింపబడక పూర్వ పాఠ్యాంశంపై గాని, ఇతరత్రాగాని అన్యమనస్కంగా ఉండుట వల్ల ఈ పద్ధతిని ఉపయోగించినపుడు పాఠ్యబోధన ఉద్దేశ్యం నేరవేరదని కొందరి అభిప్రాయం.

ఉన్ముఖీకరణాన్ని నిర్వహించుటలో ఉపాధ్యాయులు కనబరచిన మెలకువ పాఠబోధనను విజయవంతమూ, ప్రభావయుతమూ చేస్తుంది. ఉన్ముఖీకరణం చేసిన విధాన్ని బట్టి ఉపాధ్యాయుల బోధన నైపుణ్యాన్ని అంచనావేయవచ్చు. ఉన్ముఖీకరణాన్ని బాగా నిర్వహించగల్గిన ఉపాధ్యాయులు ఆత్మవిశ్వాసంతో తరగతిని సమర్థంగా నిర్వహిస్తారు. పై పద్ధతుల్లో ఏదేని ఒకపద్ధతిని ఉపయోగించి ఉపాధ్యాయులు ఉన్ముఖీకరణం చేయగల్గితే బోధన సమర్థమై స్థిరమౌతుంది. విద్యామనో విజ్ఞాన శాస్త్రంలో వివరించిన అభ్యసన సిద్ధాంతాల ననుసరించి ఉన్ముఖీకరణాన్ని నిర్వహించాలి.

## 9.03 సాధారణీకరణం చేయడం (Generalisation) :

పాఠ్యాంశ బోధనలో వివిధ సంఘటనలు, సన్నివేశాలను గురించి ఉపాధ్యాయులు వివరించడమో లేక వాటిలోని ముఖ్యాంశాల్ని ప్రస్తావించడమో చేసి విద్యార్థుల్ని చర్చకు సమాయత్తం చేస్తారు. చర్చలోని ప్రధాన భావాలను క్రోడీకరించి సాధారణీకరణం చేయడం అవసరం. తద్వారా విద్యార్థుల్లో పాఠంలోని ప్రాధాన్యతాంశాలు, సారూప్యతాంశాల స్పృహ పెరిగి విద్యార్థులు కూడా చదివిన, వినిన విషయాలను సాధారణీకరణం చేస్తారు. వ్యాకరణ పాఠంలో ఉదాహరణల్లోని సారూప్యతను గుర్తించి సూత్రనిర్మాణం చేసే శక్తి అలవడటం సాధారణీకరణం ద్వారా జరుగుతుంది. తద్వారా విద్యార్థులు సిద్ధాంత ప్రతిపాదన, సూత్ర ప్రతిపాదన చేయగల శక్తిని పొందుతారు.

## 9.04 ఆలోచనలు రేకెత్తించడం :

పాఠ్యబోధనలో పుస్తకంలోని అంశాలు మాత్రమే విద్యార్థులకు వివరించడం ప్రధానం కాదు. కేవలం పాఠ్యాంశ బోధనే ఐతే విద్యార్థులు తామే స్వయంగా చదువుకొని విషయాన్ని గ్రహించి పరీక్షల్లో ఉత్తీర్ణులవుతారు. పాఠబోధన ఉద్దేశం కేవలం పాఠంలోని అంశం మాత్రమే బోధించడం కాక ఆ అంశంపై విద్యార్థుల్ని వివిధ రకాలుగా ప్రశ్నించుట ద్వారా వారి ఆలోచనల తేనెతుట్టెను కదిలించాలి. ఆయా సన్నివేశాలు జరిగి ఉండకపోతే ఏం జరిగేది, ఆ సన్నివేశాల్లో తానే ఒక పాత్ర ఐతే తాను ఎలా ప్రవర్తించేవాడు. ఇలా ఆలోచనలు రేకెత్తించే విధంగా ప్రశ్నిస్తూ సమాధానాలు చెప్పించాలి. ఈ పద్ధతిలో బోధిస్తే పాఠ్యాంశం విద్యార్థుల్లో చిరకాలముంటుంది. పాఠశాలలో వారు గడపిన సమయం సద్వినియోగం ఐందని భావిస్తారు. పాఠ్యాంశ పరిధుల నతిక్రమించకుండా పరిసరాల్ని, విలువల్ని, సమన్వయపరుస్తూ ఆలోచనలు రేకెత్తించి వానికి ఒక రూపాన్ని కల్పించాల్సిన బాధ్యత ఉపాధ్యాయులపై ఉంటుంది. ఈ ఆలోచనలు ధనాత్మకమైవి కావాలి. ఇచట తమ స్వంత ఆలోచనల్ని ఉపాధ్యాయులు విద్యార్థులపై ఏవిధంగానూ రుద్దరాదు.

## 9.05 విశ్లేషించడం (Analysis) :

పాఠ్యాంశ భాగాలను, సందర్భాలను ప్రస్తావించి ఒక్కొక్క అంశాన్నే విభజించి విశ్లేషించడం ఉపాధ్యాయులు అలవరచుకోవాల్సిన మరో బోధన నైపుణ్యం. ఒక అంశాన్ని వివిధ దృక్కోణాల్లో తాము పరిశీలించి, వివరించి, మరో అంశాన్ని విద్యార్థులను వివిధ దృక్కోణాల్లో పరిశీలించి విశ్లేషించమనాలి. దీనివల్ల ఆయా అంశాలపైన విద్యార్థులకు లోతైన అవగాహన కల్గుతుంది. దేవాలయాలు అనే పాఠంలో కేవలం హిందూ దేవాలయాలేగాక ఇతర మతస్థుల దేవాలయాలు, ఆధునిక దేవాలయాలు (ప్రాజెక్టులు) మొదలైన వానిని కూడా ప్రస్తావించి వానియందలి సామాన్యాంశాలను విశ్లేషించడం నేర్పాలి. తద్వారా విద్యార్థులు విషయాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకొనే వీలుకల్గుతుంది.

## 9.06 వివరించడం (Explaining) :

ఉపాధ్యాయులు ఏదేని ఒక అంశాన్ని తామే స్వయంగా చెప్పడమే వివరణ. ఇది కథనరూపంలో లేదా ప్రస్తావనరూపంలో ఉండవచ్చు. వివరణ లో ఒక అంశం యొక్క పూర్వాపరాలన్నీ చోటుచేసికొంటాయి. ఉదాహరణకు

కవిపరిచయం, పూర్వ కథా పరిచయం, చర్చలో ప్రాసంగికంగావచ్చిన అంశాలు ఉపాధ్యాయులే స్వయంగా వివరించాల్సి ఉంటుంది. కథాంతర్గత కథనంలో కూడా వివరణ అవసరం. ఉపవాచకంలో కథాభాగాన్ని, వ్యాసబోధనలో దత్తాంశాలను, కీలకాంశాలను, పారిభాషిక పదాలను వివరించాల్సి ఉంటుంది. జాతీయాల, లోకోక్తుల వివరణ కూడా ఉపాధ్యాయులు చేయాల్సి ఉంటుంది. ఇట్లు వివరించే సామర్థ్యం కల్గి ఉన్న ఉపాధ్యాయులే తరగతిగదిలో విద్యార్థుల్ని సంతృప్తిపరచగలుగుతారు. దీనికోసం ఉపాధ్యాయులకు విస్తృతమైన పఠనావగాహనం ఉండాలి. అప్పుడే ఇది సాధ్యమవుతుంది.

## 9.07 ప్రశ్నించడం (Questioning) :

బోధన నైపుణ్యాల్లో ప్రశ్నించడం ఒక ప్రత్యేకమైన కళ. పైన వివరించిన అన్ని నైపుణ్యాంకు ప్రశ్నించడం సహాయకారి. ప్రశ్నించడం ఉపాధ్యాయులు నిర్మించే ప్రశ్నరూపాలు, ఆ ప్రశ్నల స్వభావాలపై ఆధారపడి ఉంటుంది. వీనిని వివిధ సందర్భాల్లో ఉపాధ్యాయులు ఉపయోగించుకోవచ్చు. ఆ సందర్భాలలో కొన్ని దిగువన ఈయబడ్డాయి.

a) పూర్వజ్ఞానాన్ని పరీక్షించుటకు.
b) పాఠ్యాంశాన్ని ప్రవేశపెట్టుటకు.
c) విషయ వివరణచేసి విద్యార్థులు ఏమేరకు విషయ గ్రహణ చేసారో తెల్సికోవడానికి.
d) విద్యార్థుల అవధానాన్ని ఆకర్షించడానికి.
e) విద్యార్థుల జ్ఞాపకశక్తిని పరీక్షించడానికి.
f) చర్చచేయడానికి.
g) సారాంశం రాయించడానికి.
h) ఆలోచనలు రేకెత్తించడానికి.
i) సాధారణీకరణం చేయించడానికి.
j) విశ్లేషించడానికి, వివరించడానికి.
k) పాఠ్యాంశాన్ని పునర్విమర్శ చేయడానికి.
l) అభ్యసనాన్ని పునర్బలనం చేయడానికి.

ఇట్లు వివిధ సందర్భాల్లో ప్రశ్నలను ఒక బోధన వ్యూహంగా వినియోగించుకోవచ్చు. పరిణితిచెందిన ఉపాధ్యాయులు వైవిధ్యం కల్గిన ప్రశ్నలను తయారుచేస్తారు.

i) ప్రశ్నల లక్షణాలు :

ప్రశ్నించే విధానం ఈ కింది విధంగా ఉండాలని భాషా బోధకులు భావిస్తారు.

a) ప్రశ్నలు సూటిగా ఉండాలి.

b) ప్రశ్నలలోని పదాలు, భాష స్పష్టంగా, సరళంగా ఉండాలి.

c) కొన్ని సందర్భాల్లో ప్రశ్నలోనే కొంత సమాధానం కూడా ఉండొచ్చు.

d) విద్యార్థులను అడిగిన మొదటి ప్రశ్నకు వచ్చిన సమాధానంపై రెండో ప్రశ్న, ఆ ప్రశ్న సమాధానంపై మూడో ప్రశ్న ఇలా ఒక భావన పూర్తి అయ్యేంతవరకూ ప్రశ్నల వరుస (Question Sequence) కొనసాగాలి. ప్రశ్న, సమాధానం, ప్రశ్న అనే గొలుసులో ప్రశ్న విధానముండాలి.

e) వీలయినంతవరకు ఔను/కాదు అనే సమాధానం వచ్చే ప్రశ్నలు అడగరాదు.

f) ఆశిస్తున్న సమాధానానికి అనుగుణమైన ప్రశ్న నిర్మించాలి.

g) ఇవి బోధన లక్ష్యాలు, స్పష్టీకరణలపై, కృత్యాలపై ఆధారపడి ఉండాలి.

h) వివిధ రూపాల్లో ప్రశ్నలుండాలి.

i) ప్రతి విద్యార్థిని కఠినం, సులభం, మధ్యస్థమైన ప్రశ్నలడగాలి.

j) ఏదో ఒక అంశానికి, ఏదో ఒక లక్ష్యానికి పరిమితం కాక అన్ని అంశాలకు, అన్ని లక్ష్యాలకు ప్రాధాన్యత నీయాలి.

k) విద్యార్థులు ప్రశ్నలకు చెప్పిన సమాధానాలను, చెప్పలేని విద్యార్థులచే చెప్పించాలి.

l) ప్రశ్నలకు సమాధానం చెప్పే మెలకువలు నేర్పాలి.

m) ప్రశ్నలకు సమాధాన పరిధి ఎంతో తెల్పాలి.

n) ప్రశ్నలు ఎలా తయారుచేయాలో తెల్పాలి. అప్పుడు మాత్రమే విద్యార్థులు సరియైన సమాధానాలు చెప్పగల్గుతారు.

ii) ప్రశ్నలు తయారుచేసే విధం :

ఉదా : రాముడు అడవికి వెళ్ళుచున్నాడు. (సాధారణవాక్యం)

రాముడు ఎచటికి వెళ్ళుచున్నాడు? (ప్రశ్నవాక్యం)
ఎవరు అడవికి వెళ్ళుచున్నారు? (ప్రశ్నవాక్యం)
రాముడు ఏంచేస్తున్నాడు? (ప్రశ్నవాక్యం)
రాముడే అడవికి వెళ్తున్నాడా? (ప్రశ్నవాక్యం)
రాముడు అడవికే వెళ్తున్నాడా? (ప్రశ్నవాక్యం)
రాముడు అడవికి వెళ్తున్నాడా? (ప్రశ్నవాక్యం)
ఎవరు ఎచటికి వెళ్తున్నారు? (ప్రశ్నవాక్యం)

ఇలా వివిధాలుగా ప్రశ్నించడం నేర్వాలి.

ఇలా వివిధ రకాలుగా వివిధ ఉద్దేశ్యాలతో ప్రశ్నించే నేర్పు ఉపాధ్యాయులు అలవరచుకోవాలి. ప్రశ్నించడం ఉపాధ్యాయుల హక్కు, సమాధానం చెప్పడం విద్యార్థుల విధి అనిగాక విద్యార్థులు కూడా ప్రశ్నించేట్లు ప్రోత్సహించాలి. ప్రశ్న, సమాధానం, ప్రశ్న అనే వరస బోధనను వేగవంతంచేసి సులభతరం చేస్తుంది. ఇట్లు విశేష జ్ఞానసంపాదనకుపకరించే ప్రశ్నలు బోధనకే ప్రాతిపదిక.

పై బోధన నైపుణ్యాలను ఉపాధ్యాయులు స్వంతంచేసికొని వివిధ పాఠాలకు, తరగతిగదికి అనువైన నైపుణ్యాలను సమయస్ఫూర్తితో వినియోగించి బోధించాలి. అప్పుడే భాషాబోధన సార్థకమౌతుంది.

# పదో అధ్యాయం

## భాషాబోధనలో విద్యా సాంకేతిక శాస్త్రం
## (Educational Technology in Language Teaching)

### 10.01 విద్యాసాంకేతిక శాస్త్రం (Educational Technology) :

ఈనాడు బోధనలో సహాయకారులుగా ఉన్న వివిధ ఎలక్ట్రానిక్ ఉపకరణాలే విద్యా సాంకేతిక శాస్త్రమని భావించరాదని విద్యావేత్త Derek Rowntree గారి అభిప్రాయం. విద్యాసాంకేతిక శాస్త్రం ( Educational Technology) అనేది విద్యారంగం ఎంత విస్తృతమైనదో అంతే విస్తృతమైంది. విద్యా ప్రణాళికలను రూపొందించడంలో, మూల్యాంకనం చేయడంలో కూడా దీనికి ప్రమేయముంటుంది. విద్యార్థులకందించే అభ్యసన అనుభవాలకు, అభ్యసనంలో ఎదురయ్యే సమస్యల పరిష్కారానికి, అభ్యసనంలో కొత్తపుంతలు తొక్కడానికి విద్యాసాంకేతిక శాస్త్రం ఉపకరిస్తుంది. ఇది విద్యా సంబంధ సమస్యల పరిష్కారాన్ని సూచించే సాధనంగా మాత్రమే గాక బోధనాభ్యసన క్రియ గూర్చి విమర్శనాత్మకంగా, విశ్లేషణాత్మకంగా ఆలోచింపజేస్తుంది కూడా. విద్యాసాంకేతిక శాస్త్రం వివిధ ఉపకరణాల ఆధారంతో ప్రాథమికంగా అభివృద్ధిచేయబడినప్పటికి అవే సర్వస్వం కావు. ఇది ఉపకరణాలనుండి వ్యవస్థల వరకు (Tools to systems) ఎదిగిన ప్రక్రియ. ఎలక్ట్రానిక్ సాధనాలు ఎక్కువగా విద్యా వ్యవస్థ వెలుపల తయారుచేయబడేవే ఉపయోగించినప్పటికి వీనిలో ఉపయోగించే Software మాత్రం ఉపాధ్యాయులే వారి అవసరాల మేరకు తయారుచేసికోవాల్సి ఉంటుంది. వీని తయారీకి ఉపయోగపడే సాంకేతిజ్ఞతయే విద్యా సాంకేతిక శాస్త్రంగా పరిగణించవచ్చు. ఇది ఒక విధంగా నిర్మాణ కళను క్రమబద్ధంగా వెలికి తెచ్చి ప్రదర్శించే శాస్త్రం.

విద్యా సాంకేతిక శాస్త్ర భావనలు ఈనాటివి కావు. 1930 సంవత్సరం ప్రాంతాల్లోనే Ralph Taylar వంటి విద్యావేత్తలు, విద్యా ప్రణాళికల సంస్కర్తలు

బోధనలో శాస్త్రీయ పద్ధతి (Scientific method) ని, శాస్త్రీయ దృక్పథం ఆవశ్యకతను గుర్తించారు. ప్రసార మాధ్యమాల్లో పరిశోధనల ఫలాలు, వ్యవస్థావిశ్లేషణ (Systems analysis), విద్యా మనోవైజ్ఞానిక శాస్త్రం, శిశుకేంద్ర విద్యా సిద్ధాంతం, భావన వ్యక్తీకరణ సిద్ధాంతం, లక్ష్యాధారబోధన నిర్వహణ, విద్యార్జనా ఫలితాల మదింపు, బోధననైపుణ్యాల విశ్లేషణ, విద్యా ప్రణాళిక అభివృద్ధి, కార్యక్రమయుత అభ్యసనం, తరగతి గది నిర్వహణ మొదలైన వాని సమాహార రూపమే విద్యా సాంకేతిక శాస్త్రమని Derek Rowntree గారి అభిప్రాయం. విద్యా సాంకేతిక శాస్త్రం నాలుగు దశల్లో (Phase) ఉంటుందని చెప్పవచ్చు.




(విద్యా సాంకేతిక శాస్త్రంలోని దశలు)

ఆధునికకాలంలో ఈ విద్యా సాంకేతిక శాస్త్ర ప్రాధాన్యత విశేషంగా పెరిగింది. ఉపాధ్యాయులు మెలుకువగా, చొరవతో ఈ శాస్త్రాన్ని ఉపయోగించుకోగల్గితే బోధన సులువగుటయే గాక అభ్యసనం వేగవంతమౌతుంది. దీనిలో బోధనోపకరణాలతో బాటు కింది అంశాలు కూడా చేరి ఉంటాయి.

i) సిములేషన్ క్రీడలు (Simulation games).
ii) కార్యక్రమయుత అభ్యసనం (Programmed learning).
iii) వ్యవస్థల విశ్లేషణ (Systems analysis).
iv) కంప్యూటర్ సాయంతో అభ్యసనం (Computer Assisted Learning).
v) కంప్యూటర్ ద్వారా బోధననిర్వహణ (Computer managed Teaching).

ఉపాధ్యాయులు అవసరానుగుణంగా వీనిని ఉపయోగించి తరగతిగదిని ఆహ్లాదకరంగా రూపొందించి బోధనను సమర్థంచేయవచ్చు.

## 10.02 బోధన ఉపకరణాలు (Teaching aids) :

బోధనను ప్రభావితంచేసి అభ్యసనానికి ఉపకరించేవే బోధనోపకరణాలు. వీనిని బోధనలో సహాయకారులని కూడా వ్యవహరిస్తారు. వీని ప్రధాన ప్రయోజనాలను ఈవిధంగా క్రోడీకరించవచ్చు.

i) ఇవి బోధనను ప్రభావితం చేస్తాయి.
ii) విద్యార్థుల అభ్యసనాన్ని త్వరితం చేస్తాయి.
iii) అభ్యసనాన్ని శాశ్వతం చేస్తాయి.
iv) మాటల్లో వ్యక్తీకరించలేని భావనలను కూడా వ్యక్తీకరిస్తాయి.
v) అభ్యసనంలో విద్యార్థుల ఆసక్తిని పెంపొందిస్తాయి.
vi) విద్యార్థుల అవధానాన్ని ఆకర్షించి స్థిరంగా నిల్పుతాయి.

ఈ ఉపకరణాలను పాఠ్యబోధనలో వివిధ సందర్భాల్లో ఉపయోగించవచ్చు. వీనిని

i) పాఠ్యాంశం ప్రవేశపెట్టడానికి.
ii) విద్యార్థుల్ని ఉన్ముఖీకరణం చేయడానికి.
iii) విషయాన్ని వివరించడానికి (కఠిన భావనలను).
iv) పునర్విమర్శ చేయడానికి.
v) విద్యార్థుల అవధానాన్ని స్థిరం చేయడానికి ఉపయోగించవచ్చు.

పై ప్రయోజనాల సాధన ఆయా పన్నివేశాల్లో ఉపాధ్యాయులు వివిధ బోధనోపకరణాలను ఉపయోగించాల్సి ఉంటుంది. భాషేతర విషయాల బోధనలో వీని వినియోగం అడుగడుగునా అవసరమవుతుందని, భాషాబోధనలో వీని ఆవశ్యకత అంతగాలేదని కొందరి అభిప్రాయం. భాషేతర విషయాల అభ్యసనంలో వీని పాత్రకు సమాంతరంగా భాషలో కూడా క్లిష్టతరమైన భావాల్ని సులభతరంచేయడానికి ఉపకరణాలే ఉపాధ్యాయులకు శరణ్యం. అందువల్ల బోధనాంశాలేవైనా ఉపకరణాలు అవసరాలే.

ఉపకరణాలు ఒక పాఠ బోధనలో ఎన్ని వినియోగించాలి? వానిని ఎలా సేకరించాలి? ఎలా ప్రదర్శించాలి? ఎలా తయారుచేయాలి?

అనే అంశాలు ఉపాధ్యాయుల స్వీయ అనుభవాలపై ఆధారపడి ఉంటాయి. ఉపాధ్యాయులే స్వయంగా వీని ఔపయోగికత్వాన్ని నిర్ణయించుకొని తరగతి గదులను ఆకర్షణీయమైనవిగా రూపొందించాలి ఏ పాఠం బోధించినప్పటికి అత్యవసరమైన నల్లబల్ల, సుద్దముక్క, పాఠ్య పుస్తకం, తుడుపు గుడ్డలను కూడా కొందరు బోధనోపకరణాలుగా పేర్కొంటారు. ఇవి తరగతి బోధనకు కనీస అవసరాలు, ప్రతినిత్యం తరగతిలో వినియోగించాల్సినవి. వీటిని ప్రత్యేకంగా బోధనోపకరణాల జాబితాలో పేర్కొనకుండా ఉపాధ్యాయులు సేకరించే తయారుచేసే భాషాబోధనకు అనువైన ఇతర ఉపకరణాలను గూర్చి తెల్సికొందాం. ఇవి ప్రధానంగా మూడు రకాలు.

i) దృశ్య ఉపకరణాలు.
ii) శ్రవ్య ఉపకరణాలు.
iii) దృశ్య - శ్రవ్య ఉపకరణాలు.

## i) దృశ్య ఉపకరణాలు :

ఈ ఉపకరణాలు జ్ఞానేంద్రియాలకు పని కల్పిస్తాయి. దృశ్య ఉపకరణాలు ప్రధానంగా నేత్రేంద్రియానికి పని కల్పించి బోధనాంశాన్ని విద్యార్థుల మనస్సుల్లో హత్తుకునేట్లు చేస్తాయి. ఒకసారి విన్న దానికన్న చూచింది వ్యక్తిలో చిరకాలముంటుందనే మూలసూత్రం మీద దృశ్య ఉపకరణాల ఉపయోగం ఆధారపడుతుంది. వీనిలో ప్రధానమైనవి.

a) చిత్రాలు :

i) పాఠసంబంధ చిత్రాలు.
ii) కవి/రచయితల చిత్రాలు.
iii) కథాచిత్ర మాలికలు మొదలైనవి.

వీని ద్వారా విద్యార్థులకు ఆయా అంశాలు సులభంగా అర్థంమౌతాయి. కవుల రచయితల చిత్రాలు ప్రదర్శించుట ద్వారా వారి ఎడల గౌరవ భావాన్ని కల్గించడంతో బాటు వారిని నిజజీవితంలో గుర్తించగల్గుతారు. తరగతి గది గోడలకు చిత్రాలను వ్రేలాడదీసి తరగతిని ఆకర్షణీయంగా రూపొందించవచ్చుకూడా.

b) బొమ్మలు, పోటోలు, నమూనాలు :

పాఠ్యాంశ సంబంధమైన అంశాలకు, పాత్రలకు సంబంధించి మట్టితో, ప్లాస్టి

క్తతో చేసిన బొమ్మలు, నమూనాలు విద్యార్థులకు విషయాకృతిని దర్శింపజేస్తాయి. ఫోటోలు స్వయంవ్యక్తాలై భావనలను విశదీకరిస్తాయి.

c) మెరపుటట్టలు (Flash cards) :

ప్రాథమిక తరగతుల్లో బోధనకు ఇవి ఎక్కువగా ఉపకరిస్తాయి. అట్టముక్కలపై ఒకవైపు అక్షరం లేదా పదం మరోవైపు సంబంధించిన చిత్రం గీయించి వానిని విద్యార్థులకు ప్రదర్శిస్తూ పఠనాన్ని, లేఖనాన్ని నేర్పవచ్చు. పఠననైపుణ్యం పెంపుదలకు ఈ మెరపుటట్టలు ఎక్కువగా ఉపకరిస్తాయి.

d) చార్టులు (Charts, illustrations):

కవులు రచయితల వివరాలు, పూర్వ,పరకథలు, విశేషాంశాలు మున్నగునవి చార్టులలో రాసి ప్రదర్శించి విద్యార్థులచే చదివించి తర్వాత వివరించవచ్చు. వ్యాసరచన, లేఖారచన మొదలైనవాని రూపురేఖల్ని, రేఖా కృతుల్ని (outlines) చార్టుల ద్వారా ప్రదర్శించి విద్యార్థులచే రచనాభ్యాసం చేయించవచ్చు.

e) తోలు బొమ్మలు (Puppets):

సంభాషణ రూపంలోని నాటక పాఠాలను ప్రాథమిక తరగతుల్లో తోలుబొమ్మల (Puppets) సాయంతో బోధించుటద్వారా విద్యార్థులకు మనోల్లాసంతో బాటు వేగవంతమైన అభ్యసనం జరుగుతుంది. పాఠ్యాంశాన్ని సులువుగా విద్యార్థులు అర్థంచేసుకొంటారు కూడా.

f) బులిటెన్ బల్ల (Bulletin Board):

సాహితీ సంబంధ, భాషా సంబంధ, కార్యకలాపాల వివరాలను ఈబోర్డులపై విద్యార్థుల సమాచారంకోసం ప్రదర్శించవచ్చు. వివిధ సందర్భాల్లో తీసిన ఫోటోలు, పత్రికల్లోని కత్తిరింపులు మొదలైనవి ఈ బల్లపై ప్రదర్శించుట ద్వారా విద్యార్థుల్లో సముచిత ప్రేరణను, ఆసక్తిని కల్గించవచ్చు.

g) ఫ్లానెల్ బల్ల (Flannel Board):

వ్యాకరణ పాఠాల బోధనలో ఉదాహరణలు, సూత్రాలు దళసరి అట్టముక్కలపై రాసి వానిని ఫ్లానెల్ బోర్డుపై అతికిస్తూ ప్రదర్శించుట ద్వారా అభ్యసనం సులువౌవుతుంది. పద్య, గద్య, నాటక, కథా పాఠాల్లో కూడా ఫ్లానెల్ బల్లలను వినియోగించుకోవచ్చు.

h) మూకీ చిత్రాలు (Silent Pictures): నిశ్చలన చిత్రాలు (Stills) పద్యోచిత్రాలు, కార్టూన్లు, ఫిల్మ్ స్ట్రిప్స్, స్లైడులు మున్నగునవి కూడా దృశ్య ఉపకరణాల్లోవే. వీనిని ఉపాధ్యాయులు మెలుకువతో ఉపయోగించాలి.

ii) శ్రవ్య ఉపకరణాలు :

శ్రవ్య ఉపకరణాలు విద్యార్థుల శ్రవణేంద్రియానికి పని కల్పిస్తాయి. మంచి శ్రవణశక్తి గల విద్యార్థులు వీనిని సద్వినియోగం చేసికొంటారు. శ్రవ్య ఉపకరణాల్లో ప్రధానమైన వానిని గూర్చి తెల్సికొందాం.

a) రేడియో :(Radio).

వివిధాంశాల జ్ఞానంతో బాటు విద్యార్థుల్లో భాషాభిరుచిని, రసానుభూతిని పెంపొందించడాని ఉపకరించే ఉపకరణాల్లో రేడియో ఒకటి. విద్యార్థుల వాగ్రూప వ్యక్తీకరణ సామర్థ్యాలను రికార్డుచేయించి రేడియోలో ప్రసారం చేయుటద్వారా ఆత్మవిశ్వాసం వారిలో పెరుగుతుంది. రేడియో పాఠాలు, ప్రసంగాలు, వార్తలు, దేశభక్తి గీతాలు, లలిత సంగీతం మొదలైన వివిధ సాహిత్య సంబంధ కార్యక్రమాల్ని విని ఆనందించుటతోబాటు జ్ఞాన పరిధిని పెంచుకొని తాము కూడా ఆ కార్యక్రమాల్లో పాల్గొనాలనే కాంక్షను విద్యార్థులు పెంపొందించుకుంటారు. భాషలోని వివిధ మాండలిక భేదాలను, వివిధ రచయితల శైలిని, నుడికారపు సొంపును తెల్సికోవడానికి రేడియో వీలు కల్పిస్తుంది.

b) టేపు రికార్డరు :(Tape Recorder).

దీని ద్వారా విద్యార్థుల వాచిక కృషిని మెరుగుపరచవచ్చు. విద్యార్థుల ఉచ్చారణను ధ్వని ముద్రితంచేసి తిరిగి వారికి వినిపించుట ద్వారా వారే స్వయంగా దోషాలను గ్రహించి సవరించుకోగల్గుతారు. ప్రసంగాలు, దేశభక్తిగేయాలు మున్నగువానిని కేసట్టులో బంధించి వీలుకొలది విన్పించవచ్చు. ఉపాధ్యాయులు పద్యబోధనలో పద్యాన్ని భావయుక్తం గా చదవలేని పక్షంలో ఇతరులతో చదివించి, రికార్డుచేయించి పాఠబోధన సమయంలో వినియోగించుకోవచ్చు. టేపుచేసిన అంశాలు పదేపదే వినుటద్వారా పునర్బలనం జరుగుటయే గాక విద్యార్థులు వానిని చిరకాలం తమతో ఉంచుకోవడానికి వీలుకల్గుతుంది.

ఇవిగాక సంగీత వాయిద్యాలైన హార్మోనియం, తబలా, వీణ, గిటార్ మొదలైనవి కూడా ఆయా సందార్భాల్లో ఉపకరిస్తాయి. గ్రామఫోను సాయంతో పాటలు, దేశభక్తి గీతాలు మొదలైనవి వినిపించవచ్చు.

### iii) దృశ్య శ్రవ్య ఉపకరణాలు :

శ్రవణేంద్రియాన్ని, నేత్రేంద్రియాన్ని రెంటినీ ఉత్తేజితంచేసి అభ్యసనాన్ని చిరముద్రితం చేసే ఉపకరణాల్లో దృశ్యశ్రవ్య ఉకరణాలు ప్రధానమైనవి. వీనిలో కొన్నిటిని గూర్చి తెల్సికొందాం.

a) చలనచిత్రాలు :(Motion Pictures).

చలన చిత్రాలు ఆయా భాషా సంస్కృతులను ప్రతిబింబిస్తాయి. పాఠ్యపుస్తకాల్లోని అంశాలకు సంబంధించిన చలనచిత్రాలను ప్రదర్శించుట ద్వారా విషయాలను విద్యార్థులు పూర్తిగా స్వంతంచేసికొంటారు. డాక్యుమెంటరీ చిత్రాల ప్రదర్శన ద్వారా సాధారణ సమాచారంతో బాటు, అద్యతన సమాచారాన్ని కూడా విద్యార్థులు తెల్సికొంటారు. బాలలకోసం ప్రత్యేకంగా బాలల చిత్రాలే ప్రదర్శించాలి. ఇవి విజ్ఞానదాయకాలైనప్పుడే విద్యార్థులకు ఉపకరిస్తాయి.

b) టెలివిజన్ :(Television).

ఇది ఆధునిక సాంకేతిక విజ్ఞాన ఫలం ఈనాటి జనజీవన విధానంలో అంతర్భాగం. దీని ప్రభావం ప్రతివారిపై తీవ్రంగా ఉంది. చిన్ని తెరపైనే వీలయినంత ఎక్కువ సమాచారాన్ని తెలుసుకొనే అవకాశాలు రోజురోజుకూ పెరుగుతున్నాయి. ఉపాధ్యాయులు విద్యార్థుల విరామ సమయాన్ని సద్వినియోగం చేయడానికి టెలివిజన్‌లో ప్రసారమయ్యే భాషా, సాహిత్య, వైజ్ఞానిక సంబంధ కార్యక్రమాల గురించి పరిచయం చేసి, అవి చూచినతర్వాత వానిపై చర్చించి ముఖ్యాంశాలు రాయించాలి. ఇట్లు విద్యార్థుల జ్ఞాన పరిధుల్ని విస్తరించడానికి చిన్నితెర ఉపకరిస్తుంది. విద్యాశాఖ పక్షాన ప్రసారం చేయబడే టెలివిజన్ పాఠాలను కూడా విద్యార్థులు చూచుటకు ప్రోత్సహించాలి.

c) వీడియో చిత్రాలు :(Video Pictures).

వీడియోచిత్రాలు ఒక విధంగా పద్యో అంశాలను వెనువెంటనే ప్రదర్శించడానికి వీలు కల్పిస్తాయి. ఉపాధ్యాయులు కూడా తమ బోధనలోని

లోపాలను, సమర్థతను వీడియోచిత్రాల ద్వారా తెల్సికోవచ్చు. బోధనను మెరుగు పరచుకోవచ్చు. విద్యార్థుల ప్రవర్తనలను, ప్రతిస్పందనలను కూడా వీడియోతీయించి ప్రదర్శించుట ద్వారా వారిలో ఆశించిన ప్రవర్తనలను గుర్తించవచ్చు. అవసరమైన చోట్ల సరిచేయవచ్చు.

పైన వివరించిన దృశ్య, శ్రవ్య, దృశ్యశ్రవ్య ఉపకరణాలను ఉపాధ్యాయులు అత్యంత నైపుణ్యంతో ఉపయోగించుకొన్నప్పుడే ఇవి ఆశించిన ప్రయోజనాన్ని నెరవేరుస్తాయి.

## 10.03 బోధనోపకరణాల ప్రదర్శనలో తీసికోవల్సిన జాగ్రత్తలు :

వీని ప్రదర్శన కేవలం ప్రదర్శనకోసం కాదు. ప్రదర్శించిన ఉపకరణాలను తరగతిగదిలో ఉపయోగిస్తేనే వానికి సార్థకత. అందువల్ల వీనిని ప్రదర్శించుటలో ఉపాధ్యాయులు తగు జాగ్రత్త వహించకపోతే, వీని ప్రదర్శన అభ్యసనాన్ని మెరుగుపరచకపోగా విసుగుదలను పెంపొందిస్తుంది. అందువల్ల బోధనోపకరణాల ఎంపికలో, ప్రదర్శనలో కింది జాగ్రత్తలు తీసుకోవాలి.

i) బోధన లక్ష్యానికి అనుగుణమైన ఉపకరణం ప్రదర్శించాలి.
ii) శీర్షికకు సంబంధించిన ఉపకరణం ప్రదర్శించాలి.
iii) ఉపకరణం విషయాన్ని స్వయంవ్యక్తం చేయగల్గిందై ఉండాలి.
iv) ఉపకరణం ప్రామాణికమై, సత్యాన్ని చెప్పగలగాలి.
v) ఉపకరణం ఆధ్యతనంగా (update) ఉండి సంపూర్ణ భావనను వ్యక్తీకరింపగల్గాలి.
vi) ఉపకరణాన్ని ఒకసారి చూచినంతనే విషయావగాహన జరగాలి.
vii) తరగతిలో ప్రదర్శించిన ఉపకరణాన్ని వీలయినన్ని ఎక్కువ సందర్భాలలో వినియోగించాలి.
viii) సన్నివేశానికనుగుణమైన ఉపకరణ ప్రదర్శన అవసరం.
ix) పాఠం మొత్తంపై ఎన్ని ఉపకరణాలు ప్రదర్శించామని గాక ఏవి ప్రదర్శించామనేది ప్రధానం.

## 10.04 భోధనోపకరణాల సేకరణ, తయారీ, నిలువ ఉంచుట :

బోధనోపకరణాల సేకరణకు, తయారీకి ఉపాధ్యాయులు తమదేయైన కార్యాచరణప్రణాళికను సిద్ధం చేసుకోవాలి. బోధనోపకరణాలను ఉపయోగించాల్సిన పాఠ సన్నివేశాలేమిటో మొదటే గుర్తించాలి. నమోదు చేసుకోవాలి. తర్వాత ఆ ఉపకరణాన్ని సేకరించడమో, తయారుచేసుకోవడమో చేయాలి.

ఉపాధ్యాయులు పత్రికల్లోని వివిధ చిత్రాల కత్తిరింపులు, యాజమాన్యం సరఫరా చేసే ఉపకరణాలు, ఇతర ఉపాధ్యాయులు ఉపయోగించిన ఉపకరణాలు సేకరించవచ్చు. దాతలనుండికూడా వీనిని సేకరించవచ్చు. తాము స్వయంగాగాని విద్యార్థులతోగాని ఉపకరణాలను తయారు చేయించవచ్చు. తక్కువ ధరల్లో పరిసరాల్లో లభించే వస్తువులను వినియోగించుకొంటే ఉపకరణాలఖర్చు తగ్గుతుంది. ఇట్లు తయారుచేసిన ఉపకరణాలు పాఠ్యపుస్తకం మారనంత కాలం ఉపయోగించుకోవడానికి వీలుగా వానిని నిలువఉంచాలి. ఉపకరణాలను నిలువ ఉంచుట ద్వారా సమయాన్ని ధనాన్ని ఆదాచేయవచ్చు. ఈనాడు Low cost, no cost బోధనోపకరణాలు సిద్ధం చేసికొనే మెలకువలు నేర్పడానికి ఉపాధ్యాయులకు వృత్యంతర శిక్షణా కార్యక్రమాలు కూడా నిర్వహింపబడుతున్నాయి. వీనిని సద్వినియోగం చేసికొని ఉపాధ్యాయులు తరగతిగది బోధనను సమర్థంచేసుకోవచ్చు.

ఇట్లు బోధనోపకరణాలు కేవలం ప్రదర్శనకోసం కాక బోధనలో వానిని వినియోగించుకొన్న తీరుపై వాని ఉపయుక్తత ఆధారపడుతుంది.

# పదకొండో అధ్యాయం

# ద్వితీయ భాషగా తెలుగు బోధన

## 11.01 ఉపోద్ఘాతం :

ఒక రాష్ట్రంలోని అత్యధిక సంఖ్యాక ప్రజలు మాట్లాడేభాష వారికి ప్రథమ భాషగా, మాతృభాషగా వ్యవహరింపబడుతుందని తెల్సికొన్నాం. అల్పసంఖ్యాకులైన ప్రజలు తాము మాట్లాడేభాషతో బాటు అత్యధికులు మాట్లాడే ప్రాంతీయభాషను కూడా అధ్యయనంచేయాల్సి ఉంటుంది. ఈ భాషను ద్వితీయభాష అంటారు. మన రాష్ట్రంలో ఉర్దు, కన్నడం, తమిళం, ఒరియా, మరాఠీ మొదలగు ప్రథమభాషల వారికి తెలుగు ద్వితీయభాషగా బోధింపబడుతోంది. భాషాప్రయుక్త రాష్ట్రాలేర్పడిం తర్వాత దేశసమైక్యత, జాతీయ సమైక్యత, భావసమైక్యతల సాధనకు పాఠశాల విద్యలో మూడుభాషల బోధనను ప్రతిపాదించడం జరిగింది. దీనిననుసరించి విద్యార్థులు తమ భాషతో బాటు జాతీయభాషలేదా ప్రాంతీయభాషను ద్వితీయభాషగా మరియు ఇంగ్లీషును తృతీయభాషగా అభ్యసిస్తారు. తద్వారా రాజ్యాంగం ఆశించిన భావ సమైక్యతతో బాటు జాతీయ సమైక్యత సాధింపబడుతుంది. మనదేశంలోని ప్రధానభాషలు ఆయా రాష్ట్రాల్లో ప్రథమభాషలుగా, ప్రాంతీయభాషలుగా, అల్పసంఖ్యాకులకు ఈ భాషలు ద్వితీయ భాషలుగా బోధింపబడుతున్నాయి. ఉత్తరభారతదేశంలోని హర్యానా, ఉత్తరప్రదేశ్ వంటి కొన్ని రాష్ట్రాల్లో తెలుగు మొదలైన దక్షిణాది భాషలు ద్వితీయభాషలుగా బోధింపబడుతున్నాయి.

## 11.02 ద్వితీయ భాషా బోధన ఉద్దేశ్యాలు :

ద్వితీయభాషగా తెలుగును బోధించుటలోని ప్రధాన ఉద్దేశ్యాలు ప్రథమభాష బోధనోద్దేశ్యాలకన్న పరిమితమైనవి. ఈ ప్రయోజనాలను దిగువ విధంగా పేర్కొనవచ్చు.

i) నిత్యజీవితంలో బాలబాలికలు ప్రయాసలేకుండా భావ వినిమయం చేయగల్గడం.
ii) భాషను వినడం, చదవడం, రాయడం, మాట్లాడటానికి కావల్సిన సాధారణ పరిజ్ఞానాన్ని సంపాదించడం.
iii) భాషతోబాటు సాహిత్యాన్ని పరిచయంచేయడం.
iv) విషయజ్ఞానాభివృద్ధితో బాటు ఆనందానుభూతిని పొందడం.
v) భాషా సంస్కృతిని, భాషీయుల సంస్కృతిని తెలుసుకోవడం.
vi) తనభాషలోని భావాలను రెండో భాషలోకి, రెండోభాషలోని భావాలను తన భాషలోకి పరివర్తనం చేయడం.

పై ప్రయోజనాల సాధనకు ఉపాధ్యాయులు కృషిచేయాలి. ఈ విషయంలో వారు దృష్టియందుంచుకోవల్సిన అంశాలు.

i) ప్రథమభాషగా ఒక భాషను అభ్యసించే విద్యార్థులు పాఠశాలకు వచ్చేనాటికే ఆభాషను వినగల్గి, మాట్లాడే స్థితిలో ఉంటారు.
ii) రెండవభాషగా ఒక భాషను అభ్యసించే విద్యార్థులు అభాషా ధ్వనులను విని ఉండవచ్చుకాని వారికి ఉచ్చరించడంగాని, చదవడంగాని, రాయడం గాని రాదు. అందువల్ల ఉచ్చారణ, పఠనం, రాయడం మొదలైన నైపుణ్యాలను కల్గించాల్సి ఉంటుంది.
iii) విద్యార్థులు తమ భాషలోనే ఆలోచిస్తారు. రెండోభాషలో ఆలోచించలేరు.
iv) విద్యార్థులు భాషాంతరీకరణం చేసికోగల్గితేనే భావ వినిమయం సులువవుతుంది.

పై కారణాల వల్ల రెండోభాషగా తెలుగును బోధించడం మొదటిభాషగా బోధించడం కన్న కష్టతరమని భాషాబోధకుల అభిప్రాయం. ద్విభాషలు, త్రిభాషలు మాట్లాడగల్గిన భాషా ప్రాంతాల్లోని (Bilingual and Trilingual areas) బాలబాలికలకు ఏదో ఒక భాష మాత్రమే ప్రథమ భాషయై మిగతావి ద్వితీయ ప్రాధాన్యాన్ని పొందుతాయి. ఈ సందర్భంలో ద్వితీయభాషాబోధన కేవలం సుష్టూచ్చారణ, పఠనం, లేఖనాలకు పరిమితమౌతుంది. అందువల్ల ద్వితీయభాషాబోధన కొంత సులువవుతుంది.

బాలబాలికలు వీలయినన్ని భాషలు బాల్యంలోనే సులభంగా అభ్యసించగల్గుతారని మనోవైజ్ఞానికుల అభిప్రాయం. ఒక భాషాభ్యసనం మరో భాషాభ్యసనాన్ని శిక్షణ బదలాయింపు (Transfer of learning) అనే సూత్రం ఆధారంగా

సులభతరంచేస్తుంది. అందువల్ల ఉపాధ్యాయులు తమ విద్యార్థులు వీలయినన్ని భాషలు నేర్చేట్లు ప్రోత్సహిస్తే వారి జ్ఞాన పరిధులు విస్తరిస్తాయి. ద్వితీయభాషగా ఒక భాషను బోధిస్తున్నపుడు అనుసరించాల్సిన వ్యూహాలు :

i) మొదట మాట్లాడటం నేర్పి ఆతర్వాతనే చదవడం, రాయడం నేర్పాలి.
ii) భాషానిర్మాణ సూత్రాలు గాక, నిత్య వ్యవహారంలోని భాషారూపాన్నే మొదట పరిచయం చేయాలి.
iii) పూర్తివాక్యంలోనే భావాన్ని వ్యక్తీకరించేట్లు చూడాలి.
iv) వాక్య పరివర్తన పద్ధతిలో వాక్య నిర్మాణం నేర్పాలి.

ఉదా : అతడి పేరేమి?
అతడు రాముడు
అతడు రాముడా?
అతడు రాముడుకాదు. ఇట్లు

v) వాక్య విస్తరణను నేర్పాలి.
నీరు.
మంచినీరు.
నదిలోని మంచినీరు.
గోదావరి నదిలోని మంచినీరు.
ఇది గోదావరి నదిలోని మంచినీరు ఇట్లు

vi) సుష్టూచ్చారణను పెంపొందించడానికి ధ్వని వ్యవస్థను పరిచయం చేయాలి.
vii) పదజాలం పెంచడానికి పదనిర్మాణం, పదక్రీడలు నేర్పాలి.
viii) తమభాష, ద్వితీయభాష లందలి సమానార్థక, భిన్నార్థక పదాలను తెల్పాలి.
ix) మాటకీ, రాతకీ మధ్యగల సంబంధాన్ని చెప్పాలి.
x) విద్యార్థుల ఆర్జన తీవ్రతల ననుసరించి భాషనేర్పాలి.
xi) భాషాంతరీకరణ సామర్థ్యాన్ని ప్రోత్సహించాలి.
xii) వ్యవహారికభాషతో బాటు ప్రామాణిక భాషా రూపాన్ని పరిచయం చేయాలి.
xiii) ప్రశ్నోత్తర పద్ధతిలో ఆలోచనలు రేకెత్తించాలి.
xiv) వీలయినన్ని ఎక్కువ భాషాభ్యాసాలు చేయించాలి.
xv) లిపి రాయడంలో సమవేగాన్ని, అందాన్ని, శైలిని ప్రోత్సహించాలి.
xvi) విద్యార్థుల్ని మెచ్చుకోవడం ద్వారా భాషాభ్యసనంలో వారి ఆసక్తిని పెంచాలి.
xvii) భాషా సంస్కృతులను పరిచయం చేయాలి.

xviii) తమ భాషాప్రభావాన్ని రెండో భాషపై ప్రసరించకుండా జాగ్రత్తపడమనాలి

పై అంశాలు దృష్టిలో పెట్టుకొని వివిధ పద్ధతులుపయోగించి ద్వితీయ భాషా బోధన నిర్వహించాలి.

## 11.03 బోధన పద్ధతులు :

ద్వితీయభాషగా తెలుగును బోధిస్తున్నప్పుడు కింది పద్ధతులు ఉపాధ్యాయులక ఉపకరిస్తాయి.

i) వ్యాకరణం - భాషాంతరీకరణ పద్ధతి :

ఈ పద్ధతిలో వ్యాకరణ నియమాలకు, భాషాంతరీకరణానికి సమా ప్రాధాన్యత ఉంటుంది. ఇది భాష యొక్క సుష్ఠూచ్ఛారణకు అధిక ప్రాధాన్య ఇస్తుంది. ధ్వని, ఉచ్ఛారణ, ఆకృతి మొదలైన ప్రాతిపదిక వ్యాకరణాంశాలత బాటు తనభాషనుండి ద్వితీయభాషకు విషయాన్ని అనువదించగలిగిన శక్తి విద్యార్థులకు కల్గిస్తుంది. విస్తృతమైన పద సంపత్తిని పెంచడమేగాక భావవినిమయాన్ని సులభంచేయడం ఈ పద్ధతి ప్రధాన ప్రయోజనం.

ii) ప్రత్యక్ష పద్ధతి :

Kohoe Monika అనే భాషావేత్త 'Language is learned in contac as well as in context. Infact the situational element is the very fabri of the Direct method' అని ఈ పద్ధతి గొప్పదనాన్ని వివరించారు భాషాభ్యసనానికి అనుకరణ ప్రాతిపదిక. అనుకరణ ద్వారానే బాలబాలికలు వయోజనులు అభ్యసిస్తారు. విద్యార్థులు మాట్లాడుతుంటే వ్యాకరణ నియమాల వాటంతటవే స్వంతమౌతాయి. 'The emphasis of the direct method thu is one speaking the language and learning the formal grammar as byproduct of the effort to learn the spoken form అని Monika గా అభిప్రాయం.

ద్వితీయభాషా బోధనలో ప్రత్యక్ష అనుభవాలకే ప్రాధాన్యత ఇచ్చి వివిధబోధనోపకరణాల ద్వారా దృశ్య, శ్రవ్య సంబంధాన్ని నెలకొల్పి సులభంగా విద్యార్థులకు భాష అలవడుతుంది.

iii) లండన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్ భాషాబోధనలో విశేషమై పరిశోధనలు నిర్వహించింది. ఈ పరిశోధనల ఫలితంగా శ్రవణ, భాషణ

రేఖన పద్ధతిని ప్రతిపాదించి ద్వితీయ భాషాబోధనను సుగమం చేసింది ఈ పద్ధతిలో వ్యాకరణాంశాలకు ప్రాధాన్యతనీయక భాషానిర్మాణ రీతుల్ని సువ్యవస్థిత పద్ధతిలో బోధించ యత్నించారు. నిత్యవ్యవహారం లో విరివిగా ఉపయోగించే భాషా రూపానికే ప్రాధాన్యత ఇచ్చి పదాలు, వాక్యాలు నేర్పి, వాక్య విస్తరణ చేయించుట ద్వారా భాషను సులభంగా నేర్పవచ్చని పరిశోధకులు అభిప్రాయపడ్డారు.

ఉదా :

నేను అన్నం తింటాను (మూలవాక్యం)
నేను అన్నం తిన్నాను.
నేను అన్నం తిందును.
నేను అన్నం తినను.
నేను అన్నం తింటానా?
నేను అన్నం తిననా.
నేను అన్నం తినగలనా?
నేను అన్నం తిన్నానా?
నేను అన్నం తినలేదు.
నేను అన్నం తినలేను.

ఇట్లు వాక్య నిర్మాణం, విస్తరణ చేయించుట ద్వారా విద్యార్థులు రెండో భాషను సులభంగా అభ్యసిస్తారు.

భాషావైజ్ఞానిక (శాస్త్ర) పద్ధతి :

భాషాశాస్త్రవేత్తలు ప్రతిపాదించిన ఈ పద్ధతిలో నిత్య వ్యవహారంలో ఉపయోగపడే వాక్యాలు ఉపాధ్యాయులు విద్యార్థులతో ఉచ్చరింపజేస్తారు. వాక్యాల ఉచ్చారణ అభ్యాసం విరివిగా చేయించుట ద్వారా విద్యార్థులు దైనందిన కార్యకలాపాల్ని సులువుగా నిర్వహించగల్గుతారు. ఈ పద్ధతిలో సాధారణ వాక్యాలను మొదట, ఆ తర్వాత క్లిష్టమైన వాక్యాలను క్రమ పద్ధతిలో పరిచయం చేయాలి. భాషారూపాన్ని ధ్వని, ఉచ్చారణ, ఆకృతి, పదం, వాక్యం మొదలైనవిగా విశ్లేషించి విద్యార్థుల్లో వాచిక కృషిని ప్రోత్సహించాలి. భాషాప్రయోగశాల వినియోగం ద్వారా విద్యార్థులు భాషను సులభంగా నేర్చుకోవడమేగాక దోషాలను కూడా గుర్తించి సవరించుకోగల్గుతారు.

౬) ఆకృతి పద్ధతి (Structure Method)

ఈ పద్ధతి మనస్తత్వశాస్త్ర ఆధారాలపై ప్రతిపాదింపబడింది. విద్యార్థుల అంతర్లీన శక్తుల్ని వెలికితీసి అక్షర రూపాల మధ్యగల సామ్యత, సారూప్యతం ఆధారంగా బోధించడం ఈ పద్ధతిలోని ప్రత్యేకత.

పై పద్ధతులుగాక బోధనయంత్రాల సాయంతో భాషను స్వయంగా అభ్యసించడానికి వీలుకల్గుతుంది. తమ తరగతికి, తమ విద్యార్థులకు అనువైన బోధనపద్ధతిని ఉపయోగించి ద్వితీయ భాషా బోధనోద్దేశ్యాలను సాధించే బాధ్యత ఉపాధ్యాయులపై ఉంది.

# పన్నెండో అధ్యాయం

## 12.0 పాఠ్యాంశాలు - పరిసరాల సమన్వయదృష్టి :

భాషాబోధన విద్యార్థుల్ని అతి సామాన్య వ్యవహర్తనుండి విశిష్ట వ్యవహర్తలుగా రూపొందింపడానికి, వారి జ్ఞాన పరిధుల్ని విస్తరించడానికి ఉద్దేశింపబడింది. ఈ ధ్యేయసాధనకు ఉపాధ్యాయులు వివిధ పాఠ్యాంశాలను కేవలం భాషాదృష్టితో గాని, కేవలం విషయ దృష్టితోగాని బోధించినచో సరిపోదు. ఈ రెంటిని దృష్టియందుంచుకొని విద్యార్థుల నిజజీవిత అనుభవాలకు, సన్నివేశాలకు దగ్గరగా పాఠ్యాంశాలను తీసికొనిపోగల్గితే ఆ పాఠాలు విద్యార్థులకు పూర్తి స్వంతమౌతాయి.

పాఠశాలల్లో భాషలు, భాషేతర విషయాలు బోధింపబడుతున్నాయి. భాషలు భాషలుగా కాక, భాషేతరవిషయాలుగానే నేటి పాఠశాలల్లో బోధిస్తున్నారు. ఉదాహరణకు సాంఘికశాస్త్రం బోధించే ఉపాధ్యాయులు భాషారూపాన్ని, భాషలుబోధించే ఉపాధ్యాయులు తమ పాఠాల్లోని సామాజికశాస్త్ర అంశాల్ని గాని దృష్టియందుంకోవడంలేదు. దీనివల్ల బోధనలో సమగ్రత కొరవడి వివిధ విషయాలు వేటికవే బోధింపబడుతూ ఒకదానితో ఒకటి సంబంధంలేని అంశాలుగా పరిగణింపబడతున్నాయి. మరికొన్ని సందర్భాల్లో భాషోపాధ్యాయులు భాషాంశాలకు ప్రాధాన్యతనీయక పాఠ్యాంశ విషయాలకే ప్రాధాన్యతనీయడం కూడా అనుభవంలోని విషయమే. ఇంతేగాక ఆయా పాఠాల్లోని సన్నివేశాలు ఆపాఠ రచనాకాలానికి ప్రతిబింబాలు. పాఠాల్లోని సాంకేతిక సమాచారం మొదలైనవానిలో కాలానుగుణంగా మార్పులు చేర్పులు జరగవచ్చు. అద్యతన స్పృహలేని ఉపాధ్యాయులు పుస్తకాల్లోని విషయాన్నే ప్రమాణంగా తీసికొని విద్యార్థులకు అసత్యమూ, అసందర్భమూ అయిన సమాచారాన్ని కూడా అందించడం జరుగుతోంది. అందువల్ల ఈ లోపాన్ని సవరించుటకై విషయాన్ని అద్యతన సమగ్రదృష్టితో పరిశీలించి బోధించాల్సి ఉంటుంది.

ప్రధానంగా భాషలో పాఠ్యాంశాలన్నీ వివిధ నేపథ్యాలు కల్గి ఉంటాయి. అవి

శాస్త్రాలు, చరిత్ర, పౌరశాస్త్రం, భౌగోళికవిజ్ఞానం, ఖగోళవిజ్ఞానం, సంస్కృతి, ప్రాచీన సాహిత్యాలనుండి సేకరించి సంకలనం చేయబడతాయి. అందువల్ల భాషోపాధ్యాయులు కేవలం భాషాదృష్టితోనే వీనిని పరిశీలించక విషయసమగ్ర దృష్టితో పరిశీలించాలి. తాము వాటిపై ఒక అవగాహనకు వచ్చి విద్యార్థులకు బోధించాలి. కొన్ని పర్యాయాలు పాఠాల్లోని సన్నివేశాలు ఆయా కాలాలకు ప్రతిబింబాలైనపుడు అవి ఈనాటి సమాజానికి ఎలా ఆదర్శప్రాయాలో, ఎలా ఉపయుక్తాలో, వానినుండి గ్రహించాల్సింది ఏమిటో విద్యార్థులకు వివరించాల్సి ఉంటుంది. అందువల్ల పరిసరాలను, విద్యార్థుల అనుభవాలను పాఠ్యాంశాలతో సమన్వయించి బోధించడం అవసరమౌతుంది.

ఉదాహరణకు 'దేవాలయాలు' అనే పాఠాన్ని బోధిస్తున్నప్పుడు ప్రాచీనదేవాలయాలతో బాటు ఇతర మతసంబంధ పవిత్ర ప్రదేశాలు కూడా దేవాలయాలే, వీనితోబాటు జాతి పునర్నిర్మాణంలో అత్యంత సేవజేస్తున్న ప్రాజెక్టులు, కర్మాగారాలు మొదలైన ఆధునిక దేవాలయాల గురించి కూడా ప్రస్తావించాల్సి ఉంటుంది. 'రిక్షావాడు' అనే ఒక జీవిత చిత్రణను బోధిస్తున్నప్పుడు రచయిత ఆపాత్ర ద్వారా వెలిబుచ్చిన అభిప్రాయాలు నిజజీవితంలో ఎంతవరకు సత్యాలో, సత్యానికి ఎంత దగ్గరగా ఉన్నాయో మొదలైన విషయాలన్నీ విద్యార్థులతో చర్చించి వారి అనుభవాలను, పరిశీలనలను కూడా క్రోడీకరించాలి. యాత్రలు, జాతరల గూర్చి బోధిస్తున్నపుడు విద్యార్థులు చూచిన జాతర, ఉత్సవం, వారుచేసిన యాత్రల గురించి చెప్పి రెంటిమధ్య పోలికలు చెప్పించవచ్చు. చారిత్రక విశేషాలు చెప్తున్నపుడు స్థానికంగా ఉన్న చారిత్రక ప్రదేశాలను చూడమని ప్రోత్సహించవచ్చు. భాషాపాఠాల్లో భాషకు ప్రాధాన్యత ఇచ్చి విషయాన్ని అనుషంగికం చేసి, భాషేతర విషయాల్లో విషయానికి ప్రాధాన్యమిచ్చి భాషను అనుషంగికం చేసి బోధిస్తే బోధన ఫలవంతమౌతుంది.

ఇట్లు ఉపాధ్యాయులు వైవిధ్యభరితంగా పరిసరాలను వినియోగింపుకోగల్గి విద్యార్థుల ఆలోచనలు రేకెత్తించగల్గినపుడు బోధన సమర్థమౌతుంది. అందువల్ల నేటిబోధనలో కాలానుగుణమైన అన్వయం, పరిసరాలు, అభిప్రాయాలకు ప్రాధాన్యతనీయడం అత్యంతావశ్యకం.

## 12.02 విలువలు - పాఠ్యబోధనలో వాని ఆవశ్యకత :

విద్యాబోధనలో విలువలను దృష్టిలో ఉంచుకొని వానిని విద్యార్థుల్లో

పెంపొందించుట, వారి ప్రవర్తనల్లో అవి ప్రతిబింబించునట్లు చూచుట అవసరం. విద్య వ్యక్తిత్వ వికాసానికి బాధ్యత వహిస్తుంది. విలువ ఈ వికాసానికి దర్పణం వంటిది. అందువల్ల విలువలకు సంబంధించిన భావనలను స్థూలంగానూ, సూక్ష్మంగానూ అవగాహనచేసికోవాల్సి ఉంది. సమాజంలోని అత్యధిక సంఖ్యాకులు ఆమోదించి తమ ప్రవర్తనల్లో, తమ ఆలోచనల్లో కనబరుస్తున్న ప్రవర్తనారూపాలే విలువలని చెప్పవచ్చు. ప్రాచీనకాలం నుండే ఇవి మన విద్యాబోధనలో అంతర్భాగాలు. విద్యార్థుల్లో కేవలం జ్ఞానాన్ని, నైపుణ్యాన్ని పెంపొందించుటే విద్యపరమావధికాదని ప్రాచీనుల మతం. వీనితోబాటు విలువల్ని కూడా రంగరించిపోసి విద్యార్థుల్ని ఉత్తమపౌరులుగా తీర్చిదిద్దాలని అన్నిసమాజాలు భావిస్తాయి. కారణం విలువలు ఆయా సమాజాల సంస్కృతిలో అంతర్భాగాలు. అందువల్ల సంస్కృతీ నిర్మాణానికి విలువలబోధన అవసరమౌతుంది. 'విలువ అంగీకార యోగ్యమైన ప్రవర్తనం ప్రతిరూపం' ఐనపుడు ఇవి సమాజాల మధ్య విభేదించే అవకాశముంది. అందువల్ల పాఠశాలల్లో విలువల్ని దృష్టియందుంచుకొని ఆయా పాఠ్యాంశాలు బోధిస్తున్నప్పుడు సార్వకాలిక విలువల్ని, విద్యార్థుం చుట్టూరా ఉన్న సమాజం అంగీకరిస్తున్న విలువల్ని కూడా పరిగణనలోకి తీసికోవాలి. అత్యధిక సంఖ్యాకులు ఆమోదించే విలువల వ్యవస్థను బోధనలో అంతర్భాగంగా మంచి, చెడు, చేయగల్గినవి, చేయరానివి మొదలైనవాని రూపంలో ఉండి సద్భావనలు ప్రతిబింబించాలి. విద్యార్థుల్లో జ్ఞానవగాహన నైపుణ్యాలతో బాటు అనుభూతులను (feelings), వైఖరులను పెంపొందించుట ద్వారా విలువలకు పట్టం కట్టవచ్చు. ఈ ప్రాతిపదిక విలువలు ఒకజాతి యొక్క సామాజిక, తాత్విక భావనలపై ఆధారపడి ఉంటాయి.

విలువల్ని భౌతికవిలువలని, నైతిక విలువలని, లౌకిక విలువలని, ఆధ్యాత్మిక లేదా పారమార్థిక విలువలని నాలుగు విధాలుగా విశ్లేషిస్తారు. కేవలం భౌతిక అవసరాలపై, వాని దృక్పథంపై ఆధారపడిన విలువలు భౌతిక విలువలు. వీనిని Physical Values అని అంటారు. నిత్యావసరాలైన ఆహారం, దుస్తులు, నివాసం, ఇతర శారీరక అవసరాలు ఈ భౌతిక విలువల పరిధిలోకి వస్తాయి. ఈ అవసరాలను సమకూర్చుకోవడంలో అవలంభించే పద్ధతి విలువల్ని ప్రతిబింబిస్తుంది. ఆహార సంపాదన న్యాయబద్ధంగా జరిగిందా, ఇతర విధాలుగా జరిగిందా అనేది విలువల ఉచితానుచితాలను తెల్పుతుంది. వీని ఎడల వ్యక్తులకుగల దృక్పథం తాత్కాలికమైందా? శాశ్వతమైందా? అనే అంశం కూడా విలువలను నిర్వచిస్తుంది. కేవలం ఆహారంకోసమే

ఆహారాన్ని తీసికొనే వ్యక్తులకు శరీరంలోని శక్తిని నిలుపుకోవడానికి కావల్సిన ఆహారాన్ని మాత్రమే గ్రహించే వ్యక్తులకు, మధ్య భేదముంటుంది. కొందరు ఉన్నదని తినడం, ఆబగా తినడం మొదలైన సంఘటనలు సమాజంలో నిత్యం అనుభవంలోనివే. ఇట్లు తాత్కాలిక అవసరాల కోసం కాక శాశ్వత అవసరాలకై అనుసరించే భౌతిక విలువలు వ్యక్తులకు, వ్యక్తులు వారు నివసిస్తున్న సమాజానికి శాశ్వతత్వం కల్పిస్తాయి. కనీస జీవిత అవసరాలు తీర్చుకోవడం శాశ్వత భౌతిక విలువగా గుర్తింపు పొందుతుంది.

ఇక నైతిక విలువలనేవి ఆయా సమాజాల దృక్పథాలు, వాని నాగరికతలు సంస్కృతులపై ఆధారపడి ఉంటాయి. ఒక సమాజం విశ్వసించే నైతిక విలువ మరో సమాజం అంగీకరించకపోవచ్చు. ఉదాహరణకు బహుభార్యాత్వం, బహుభర్తృత్వం పాక్షికమైన నైతికవిలువలు. కొన్ని సమాజాలు వీనిని అంగీకరిస్తాయి. కొన్ని సమాజాలు అంగీకరించవు. కాని సత్యం, అహింస మొదలైన విలువలు సార్వజనీనాలు, సార్వకాలికాలు. ఈ నైతిక విలువలు కూడా వానిని అనుసరించే వ్యక్తుల్ని బట్టి పాక్షికాలౌతాయి. అబద్ధాలాడకూడదనే విలువ చాలా సందర్భాల్లో పాక్షికమవుతుంటుంది. కొన్ని పర్యాయాలు అవసరానికి అబద్ధమాడటం కూడా చూస్తాం. అందువల్ల నిజమైన నైతికవిలువల్ని మనోవాక్కాయకర్మలయందు విశ్వసించిన సమాజాలే ఆదర్శవంతమైన సమాజాలు గా, ఆవ్యక్తులే ఆదర్శమూర్తులుగా పరిగణింపబడతారు.

లౌకిక విలువలు ప్రజలు ఎన్నుకొన్న ప్రభుత్వాల విశ్వాసాల ననుసరిస్తాయి. మనం ప్రజాస్వామ్య పంథా ఎన్నుకొన్నాం. లౌకిక విలువల్ని విశ్వసిస్తున్నాం. అందువల్ల అన్ని మతాలను సమానంగా ఆదరించడం, ఏ మతాన్నీ, ఏ జాతినీ అసహ్యించుకోకపోవడం ఈ విలువల ప్రధాన ఉద్దేశ్యం.

మరో విధమైన విలువలు ఆధ్యాత్మిక, పారమార్థిక విలువలు. ఇవి వైయక్తిక, కుటుంబ జీవనానికి సంబంధించినవి. తాము విశ్వసించే మతం, ఆ మతభావనలు తమ గృహ జీవితంలోనే ఆచరించడం ఇతరుల ఆధ్యాత్మిక, పారమార్థిక విలువల్ని గౌరవించడం ఈ విలువల్లో ప్రధానాంశాలు.

పై నాల్గు విధాలైన విలువల్ని విద్యార్థులకు పాఠ్యాంశాలతోబాటు రంగరించిపోయాలి. పాఠశాలలో బోధింపబడే వివిధ విషయాల్లో భాషలే విలువల్ని పెంపొందించడానికి తగిన అంశాలు. మాతృభాషాబోధకులే విలువలకు తమ బోధనలో అత్యధిక ప్రాధాన్యతనీయాలి. ఈ విలువలతోబాటు

జాతీయవిద్యా విధానం సూచించిన విద్యాప్రణాళికలోని మౌలికాంశాలు ప్రతిపాదిస్తున్న విలువల్ని కూడా దృష్టియందుంచుకోవాలి.

విలువలన్నీ ఒకదానితో ఒకటి అంతరసంబంధం కల్గిన అంశాలు. వీనిని విద్యార్థుల వయో పరిమితులు, పాఠ్యాంశ సన్నివేశాల కనుగుణంగా ఎంపికచేసికోవాలి. విలువలకోసమే ప్రత్యేకంగా బోధించడం గాక, ఇవి నిత్యబోధనలో అంతర్భాగాలై, పాఠ్యాంశాలతో సమన్వయింపబడాలి. జాతీయ పంచశీలంతోబాటు శుభ్రత, కాయకష్టం, సమానత్వం, సహకారం, సానుభూతి, దయ, సహనం, ధైర్యం, హక్కులు, బాధ్యతలు, దురాచార నిర్మూలన మొదలైన వాని ఎడ విద్యార్థుల్లో సద్వైఖరులను ప్రోత్సహించాలి. ఉపాధ్యాయులు పాఠ్యబోధనకన్న ముందే ఆయా పాఠ్యాంశాల్లో విలువలను సమన్వయించడానికి అనుకూలమైన సన్నివేశాలను గుర్తించినచో వీనిని సమర్థంగా విద్యార్థుల్లో పెంపొందించవచ్చు. కింది కార్యకలాపాలు విద్యార్థులతో చేయించి విలువల వైపు దృష్టి మరల్చవచ్చు.

i) పరిసరాల్ని శుభ్రంచేయడం.
ii) ఇతర మతస్థుల పండగల్లో, ఉత్సవాల్లో పాల్గొనడం.
iii) బలహీనులకు, అసహాయులకు, వృద్ధులకు, స్త్రీలకు సహాయం చేయడం, వారిఎడ సానుభూతి చూపడం.
iv) దురాచారాలను, మూఢనమ్మకాలను ఎదిరించడం.
v) ఇతరులను, పెద్దలను గౌరవించడం.
vi) తమ విధులను నిర్వర్తించడం. బాధ్యతలు గుర్తించడం.
vii) చిన్నకుటుంబ భావనను ప్రచారం చేయడం.
viii) దురలవాట్లను వదిలివేయడం.
ix) వ్యక్తుల, కుటుంబ, సమాజ ఆరోగ్యాలను కాపాడటం.
x) క్రమశిక్షణ పాటించడం.

పై కార్యక్రమాలతో బాటు లోకోక్తులు, సూక్తులు సేకరించి, వివరించి చెప్పటద్వారా విలువల్ని విద్యార్థుల మనఃకుహరాల్లో ప్రతిష్ఠితం చేయవచ్చు. ఇది కేవలం భాషాబోధనలోనే, భాషోపాధ్యాయులతోనే సాధ్యమౌతుంది. ఇందుకోసం దిగువ వ్యూహాలను ఉపాధ్యాయులు అనుసరించవచ్చు.

i) విద్యార్థులే స్వయంగా, స్వేచ్ఛగా, నిర్భయంగా బోధనాంశాలను ఎంపిక చేసికొనే అవకాశం కల్పించడం.

ii) ఎంపికచేసికొన్న అంశాల ప్రత్యమ్నాయాలను వివరించడం.

iii) ప్రతి అంశాన్ని వివిధ దృక్కోణాలనుండి పరిశీలించే నేర్పును పెంపొందించడం.

iv) విద్యార్థులు ఏం భావించారో, ఏం అర్థంచేసికున్నారో, ఎలా ప్రతిస్పందించారో విశ్లేషించడం.

v) పరిణామాలను అధ్యయనం చేసి ధనాత్మకంగా ప్రతిస్పందించడం.

పై కార్యక్రమాన్ని స్వీకరిస్తే విద్యార్థులు విలువలలోని ఉచితానుచితాలను గ్రహిస్తారు. విద్యాబోధనలో సాధించాల్సిన విలువల్ని మరికొందరు సాహిత్య విలువలని, ప్రత్యేక విలువలని కూడా విభజించారు. సామాన్యవిలువల్లో వైయక్తిక విలువలు, సామాజిక విలువలని రెండు విధాల విలువల్ని ప్రతిపాదింపవచ్చు. ప్రత్యేక విలువలు చారిత్రక, సాంస్కృతిక అవసరాలపై ఆధారపడి ఉంటాయి. వీనిని సౌందర్యానుభవ విలువలు, నైతికవిలువలు, సాంస్కృతిక విలువలు, సృజనాత్మక విలువలు మొదలైనవిగా విభజించవచ్చు. అందువల్ల విద్యాబోధనలో, ప్రధానంగా భాషాబోధనలో విలువలదృష్టి, బోధన అవసరమౌతాయి. విద్యార్థుల్లో ప్రతి అంశం ఎడల ధనాత్మక దృక్పథాన్ని (Positive out look) పెంపొందించి ఋణాత్మక దృక్పథాన్ని (Negetive out look) పరిహరించేట్లు చూడటం ఉపాధ్యాయుల కర్తవ్యం. సభ్యసమాజం ఆమోదించే విలువల్ని పాఠ్యాంశాలతో సమన్వయిస్తూ ధనాత్మక దృక్పథాలను పెంపొందించి విద్యార్థుల్ని ఉన్నత వ్యక్తిత్వం గల్గిన ఆదర్శమానవతా మూర్తులుగా తీర్చిదిద్దిన నాడు విద్యాబోధన ఉద్దేశ్యాలు పరిపూర్ణంగా సిద్ధిస్తాయి.

## 12.03. సృజనాత్మక కార్యకలాపాలు - భాషాబోధన :

విద్యాబోధనోద్దేశ్యాల్లో సృజనాత్మకను పెంపొందించుట కూడా ఒకటి. అన్ని సమాజాలు, సంస్కృతులు సృజనాత్మకతను ప్రధానాంశంగా గుర్తిస్తాయి. 'సృజనాత్మకత ప్రత్యేక వ్యక్తుల్లో కనబడే ఒక ప్రత్యేక గుణం'. ఇది వ్యక్తుల అంతర్గత శక్తుల్ని వెలికితెచ్చే ప్రక్రియ. విశేషమైన ప్రజ్ఞాశీలురు సృజనాత్మక శక్తిగలవారని చెప్తారు. సృజనాత్మకతను కొంగ్రొత్తతనంగా, స్వకీయభావనగా, అసాధారణమైనదిగా నిర్వచించవచ్చు. 'Creativity is distinguished by novelty' by originality and is unusually inventive' అని శ్రీ యస్. నారాయణరావు గారి అభిప్రాయం. సృజనాత్మకత ఒక ప్రత్యేక లక్షణం కల్గిన

అసాధారణ కానుక కాదని, వ్యక్తుల్లోగల ప్రాతిపదిక శక్తియని ఈ మధ్య జరిగిన పరిశోధనల ఫలితాలు వెల్లడిస్తున్నాయి. సృజనాత్మకతకు కింది అంశాలు ప్రాతిపదికలని కొందరు మనోవైజ్ఞానికుల అభిప్రాయం.

i) అసాధారణమూ, అసామాన్యమూ ఐనది (Unusualness)
ii) ఉపయుక్తమైంది (Appropriateness)
iii) అనూచానంగా ఉన్న అవరోధాలను అధిగమించి కొత్త భావనల్ని సమాజానికి అందించేది. (Transformation of meterial or Ideas to over come conventional constraints)
iv) సంక్షేపించే లక్షణం కలది (Condensation).

పై అంశాలకనుగుణంగా సృజనాత్మకత వ్యక్తుల్లోని అంతర్లీనభావాలను వెలికితీస్తుంది. దీని ప్రభావం వల్ల ప్రతివారికి తమదేయైన రచనాశైలి అలవడుతుంది. ఆలోచనలు కొత్త పుంతలు తొక్కుతాయి. సృజనాత్మకమైన ఆలోచనలకు సన్నద్ధత (Preperation) వ్యూహాత్మకత (Incubation), స్ఫూర్తి (Illumination or inspiration), ఉత్పత్తి (Production) అనే నాలుగు లక్షణాలుంటాయని Walls (1926) అనే మనో వైజ్ఞానిక శాస్త్రవేత్త వివరించారు. సృజనాత్మకతపై వ్యక్తుల సామాజిక స్థితిగతులు, పరిసరాలు, కుటుంబ జీవన విధానాలు మొదలైనవి ప్రభావం చూపుతాయి. వీనిని తట్టుకొని విద్యార్థుల్లో నిబిడీకృతమైన రచనాశక్తిని, ఆలోచనాశక్తిని వెలికితీయడానికి ఉపాధ్యాయులు ఉద్యమించాలి. కింది కార్యక్రమాల ద్వారా సృజనాత్మకతను విద్యార్థుల్లో పెంపొందించవచ్చు.

i) విద్యార్థులనుండి వారి స్వీయ ఆలోచనలను ఆశించడం.
ii) ప్రశ్నించడం, గౌరవమూపడం, ఉత్సుకతచూపడాల ఎడ విద్యార్థులను ప్రోత్సహించడం.
iii) విద్యార్థులకు బాధ్యతలనప్పగించడం.
iv) స్వేచ్ఛా వాతావరణాన్ని కల్పించి బోధన చేయడం.
v) ప్రతి సమస్యను ఒక సవాలుగా స్వీకరించమనడం. ఆలోచనలకు రూప కల్పన చేయడం.
vi) విద్యార్థులు ఊహించలేని అనూహిత పరిష్కారాలను సూచించి వారి ప్రతిస్పందనలను గమనించడం. వారిని ఇతర పరిష్కారాలు సూచించమనడం.
vii) పూర్వ ప్రాథమిక, ప్రాథమికదశలోనే విద్యార్థుల శక్తియుక్తుల్ని గుర్తించడం.

సృజనాత్మకతలోని అంశాలు :

i) Novelty or Newness. నవీనత
ii) Unarthodox and Unexpected ness of the Result సంప్రదాయేతర అనూహిత ఫలితం.
iii) Correctness ఖచ్చితత్వం.
iv) Hormony సామరస్యం
v) Uniqueness and orginality ప్రత్యేకత, మౌలికత

సృజనాత్మకతను పెంపొందించగల్గిన బోధనాంశాల్లో భాషలే ప్రధానాలు. మాతృభాషాబోధన సృజనాత్మకతను పెంపొందించుటకు ఉపకరిస్తుంది. భాషద్వారావే విద్యార్థుల్లో ధారాళత (fluency), నమ్యత (flexiblity), మౌలికత (originality), సవివరణాత్మక (Eloboration)మైన ఆలోచనలు పెంపొందుతాయి.

ఉక్తరచన, లిఖితరచన, కథాకథనం, వ్యాసరచన, భాషాంతరీకరణం మొదలైన వివిధ ప్రక్రియల ద్వారా సృజనాకత్మక శక్తుల్ని ప్రోత్సహించిన భాషోపాధ్యాయులు సమర్థమైన బోధకులౌతారు. దీనికోసం భాషోపాధ్యాయులు కింది కృత్యాలు నిర్వహించవచ్చు.

i) పాఠ్యాంశాల్లోని వాస్తవాలకన్న భావనలకు ప్రాధాన్యతనీయడం.
ii) నిర్దేశ్యాలు తగినన్ని ఇచ్చి తమ పర్యవేక్షణలో పూర్తిచేయించడం.
iii) ఇతర ఉపాధ్యాయులతో చర్చించే, మాట్లాడే అవకాశమీయడం.
iv) సత్యాన్వేషణయే ధ్యేయంగా బోధించడం.
v) విద్యార్థుల్ని సహచరులుగా భావించడం.
vi) పరిసరానుగుణ్యమైన బోధన నిర్వహించడం.
vii) విద్యార్థుల్లోని ఋణాత్మక దృక్పథాన్ని పరిహరించడం.
viii) ఒకే వస్తువును వివిధాలుగా ఎలా ఉపయోగించుకోవచ్చో చెప్పడం.
ix) పరస్పర విరుద్ధ ప్రశ్నలడగడం.
x) నిర్మాణాత్మకమైన విమర్శను ప్రోత్సహించడం.
xi) అంశాన్ని వివిధ దృక్కోణాలనుండి అధ్యయనం చేయాలని చెప్పడం.
xii) పెద్దలుచెప్పిన విషయాన్ని విశ్లేషించే నేర్పును కల్గించడం.
xiii) పూర్వాపరాల దృష్టిలో అంశాలను విశ్లేషించడం.

పై వ్యూహాల ననుసరించిన భాషోపాధ్యాయులు కాలానుగుణంగా విద్యార్థుల్లోని శక్తియుక్తుల్ని గుర్తించి వానిని వెలికితీసి సృజనాత్మకతను ప్రోత్సహించవచ్చు.

## 12.04. భాషాబోధన - గ్రంథాలయాలు :

మానవజీవితంలో గ్రంథాలయాలు ప్రముఖపాత్ర వహిస్తాయి. వీనిసాయంతో వ్యక్తులు తమ జ్ఞానాన్ని వృద్ధిచేసుకొంటారు. ఇవి మానసిక తృప్తిని కల్గించి విరామసమయాన్ని సద్వినియోగం చేస్తాయి. అంతేగాక వ్యక్తుల మానసిక ఔన్నత్యాన్ని పెంచుతాయి. వైజ్ఞానికంగా ఎదిగిన ఈ కాలంలో తరగతిలో బోధింపబడుతున్న పాఠ్యాంశాలే విద్యార్థులకు పరమార్థంకాదు. వానితోబాటు ఆయా పాఠ్యాంశాలను సుసంపన్నంచేయడానికి విస్తృతమైన సమాచారాన్ని విద్యార్థులు స్వంతం చేసికొన్నరోజే వారిలో ఆశించిన ప్రవర్తనా మార్పులు గోచరిస్తాయి. వారి సభ్యతా సంస్కృతులను పదునుపెట్టి ప్రాచీన, అర్వాచీన సామాజిక సంస్కృతులను సమన్వయంచేసికోగల శక్తిని గ్రంథాలయాలు ప్రసాదిస్తాయి.

భాషాభ్యసనంలో గ్రంథాలయాల పాత్ర ఎనలేనిది. పాఠ్యప్రణాళిక నిర్మాణానికి, పాఠ్యాంశాలను పరిపుష్టంచేయడానికి గ్రంథాలయాలే శరణ్యాలు. బోధనాక్షేత్రంలో వస్తున్న మార్పుల్ని, భావనల్ని తెలిసికోవడానికి కూడా గ్రంథాలయాలే ఆధారాలు. విద్యార్థులకు, ఉపాధ్యాయులకు తోడ్పడే గ్రంథాలయాలు పాఠశాలల ఆత్మగా పరిగణింపబడుతున్నాయి.

### A) గ్రంథాలయ వ్యవస్థ :

గ్రంథాలయాలు ప్రభుత్వం పక్షాన, గ్రంథాలయసంస్థ పక్షాన మనరాష్ట్రంలో పాఠకులకు అందుబాటులో ఉన్నాయి. ప్రాంతీయ, జిల్లా కేంద్ర గ్రంథాలయాలతో బాటు గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో కూడా గ్రంథాలయాలున్నాయి. పాఠశాల స్థాయి గ్రంథాలయాలు కూడా విద్యార్థులకు అందుబాటులో ఉన్నాయి. పాఠశాల గ్రంథాలయాలు పాఠశాల కేంద్ర గ్రంథాలయాలని, తరగతిగ్రంథాలయాలని రెండు విధాలు. పాఠశాలలోని కేంద్ర గ్రంథాలయం విద్యార్థులందరికీ అందుబాటులో ఉంటుంది. ఉపాధ్యాయులు, విద్యార్థులు ఉమ్మడిగా దీనిని ఉపయోగించుకోవచ్చు. ఈ గ్రంథాలయంలో నిఘంటువులు, మూలగ్రంథాలు, పరామర్శగ్రంథాలు, ఇతర పుస్తకాలుంటాయి. కొన్ని పాఠశాలల్లో తరగతిస్థాయి ననుసరించి విద్యార్థుల వయోపరిమితికి తగినవిధంగా గ్రంథాలయాలుంటాయి. ఇవి తరగతిలోని విద్యార్థులకు మాత్రమే ఉపయోగపడతాయి. ఉపాధ్యాయులు పాఠశాలకు రానిరోజు విద్యార్థులు తమ సమయాన్ని వృథాకానీయక ఈ గ్రంథాలయాన్ని వినియోగించుకోవాలి.

B) పుస్తకాలసేకరణ :

గ్రంథాలయానికై సేకరించే పుస్తకాలు విద్యార్థుల స్థాయికి అనుగుణంగా ఉండాలి. పాఠశాలనిధులనుండి, ప్రభుత్వనిధులనుండి, దాతలనుండి నిధులు సేకరించి పుస్తకాలు సమకూర్చాలి. సేకరించే పుస్తకాలు ఆకర్షణీయంగా, విద్యార్థుల స్థాయికి తగినవిధంగా ఉండాలి. వీనిలో నిఘంటువులు, సచిత్ర నిఘంటువులు, అట్లాసులు, మూలగ్రంథాలు, పరామర్శగ్రంథాలు, కథా సాహిత్యం, బాలసాహిత్యం, శాస్త్రసాంకేతిక, విజ్ఞానశాస్త్రగ్రంథాలు ఉండాలి. పుస్తకాలను కేటలాగులో రాయించాలి. కేటలాగు చదువరులకు అందుబాటులో ఉండాలి కూడా.

C) పుస్తకాలను చదువువపుడు అనుసరించాల్సిన పద్ధతులు :

విద్యార్థులు, ఉపాధ్యాయులు పుస్తకాలను చదివేటపుడు తాము చదివిన పుస్తకాల్లోని ముఖ్యాంశాలను 'గ్రంథాలయచర్య' (Library work) అనే పేరుతో ఒక నోటు పుస్తకంలో నమోదుచేసికోవాలి. తద్వారా తర్వాతకాలంలో పుస్తకాన్ని సంప్రదించకుండానే విషయాన్ని తిరిగి మననం చేసికోవడానికి వీలు కల్గుతుంది. చదివిన వివరాలు దిగువ విధంగా నమోదు చేసికోవచ్చు.

i) పుస్తకం పేరు, రచయిత, ప్రచురణసంస్థ, వెల.
ii) పఠన సమయం, పుస్తకం గ్రంథాలయంనుండి తెచ్చిన తేదీ, ఇచ్చిన తేది.
iii) వచ్చిన సన్నివేశం, పాత్ర, పుటసఖ్య, వివరాలు.
iv) వచ్చని సన్నివేశం, పాత్ర, పుట సంఖ్య, వివరాలు.
v) పుస్తకంపై సొంత అభిప్రాయం.
vi) ఇతివృత్తం, ముఖ్యాంశాలు, పాత్రలు, సన్నివేశాలు.

పై వివరాలు నమోదుచేసికోవడం ద్వారా విద్యార్థుల జ్ఞానసంపద అద్యతనం update అగుటమే గాక నిత్యవ్యవహార దక్షతకూడా మెరుగుపడుతుంది.

గ్రంథాలయాలకు అనుబంధంగా పఠనాలయం కూడా పాఠశాలల్లో ఉండాలి. ఇవి తరగతి గ్రంథాలయానికి అనుబంధంగా గాక పాఠశాల కేంద్ర గ్రంథాలయానికి అనుబంధంగా ఉంటాయి. పఠనాలయంలో కూర్చొని కొంతసేపు చదువుకోవడానికి, ముఖ్యాంశాలు రాసుకోవడానికి అవకాశముండాలి. పఠనాలయంలో లభ్యమయ్యే వార్తాపత్రికలు కూడా చదివి విద్యార్థులు నైమిత్తిక జ్ఞానాన్ని (day to day knowledge) పొందవచ్చు. పఠనాలయంలో బాలల

పత్రికలు అందుబాటులో ఉండాలి. పత్రికలు కొనడానికి ప్రభుత్వనిధులు సరిపోనిపక్షంలో దాతలనుండి పత్రికలు సేకరించవచ్చు. ఇట్లు సేకరించిన వానిని భద్రపరచి విరామసమయంలో విద్యార్థులు చదివేట్లు చూడాలి.

D) గ్రంథాలయం - పఠనాలయాన్ని ఉపయోగించే పద్ధతులు :

i) పుస్తకాలు ఏస్థలంనుండి తీస్తారో అదే స్థలంలో మళ్ళీ పెట్టాలి. దీనిద్వారా ఇతరులకు పుస్తకాలు సులభంగా దొరుకుతాయి.

ii) పుస్తకాల్లో గీతలుగీయడం, రాయడం, పేజీలు నలపడం, చించడం, అట్టలు ఊడదీయడం చేయరాదు.

iii) పుస్తకం వినియోగయోగ్యం కానపుడు గ్రంథాలయ అధికారి దృష్టికి తేవాలి.

iv) గ్రంథాలయం, పఠనాలయాలో మౌనం పాటించాలి. మౌన పఠనమే చేయాలి.

v) పత్రికలు చదివునపుడు పేజీలు వేరుచేయరాదు.

పఠనాలయ, గ్రంథాలయ వినియోగంలో కింది అంశాలు కూడా దృష్టియందుంచుకోవాలి.

i) పుస్తకాలంటే విద్యార్థులకు మక్కువ కల్గించాలి.
ii) పుస్తకాల ఆధారంగా నిర్దేశ్యాలీయాలి.
iii) పఠనసంఘాలు (Reading club) ఏర్పాటుచేయాలి.
iv) చదవాల్సిన కనీస పుస్తకారేవో సూచించాలి, సమీక్ష చేయమనాలి.
v) ఎక్కువ పుస్తకాలు చదివిన వారికి బహుమతులిచ్చి ప్రోత్సహించాలి.
vi) పుస్తకాలు చదివిన తర్వాత విద్యార్థులకు కల్గిన సందేహాలను నివృత్తిచేయాలి.
vii) విద్యార్థులకు పుస్తకాలు నేరుగా అందుబాటులో ఉంచాలి.

పై సూచనలు పాటించి గ్రంథాలయాలను, పఠనాలయాలను వినియోగించుకొన్న విద్యార్థులు సర్వాంగీణ వికాసం పొందుతారు.

## 12.05. భాష సహపాఠ్య కార్యక్రమాలు

**(Language - co curricular activities) :**

పాఠ్య కార్యక్రమాలతో బాటు పాఠశాలలో నిర్వహించే ఇతర కార్యకలాపాలే సహపాఠ్య కార్యకలాపాలు. వీనిని అనుబంధ పాఠ్య కార్యక్రమాలని వ్యవహరించేవారు. ప్రస్తుతం అనుబంధంగా గాక విద్యాప్రణాళికలో భాగంగా

నిర్వహింపబడుట వల్ల పాఠ్యాంశాల్లో అభ్యసించిన అంశాలను పునర్బలనం చేసికోవడానికి ఉపకరించే కార్యక్రమాలై, ఇవి తప్పనిసరిగా నిర్వహించే కార్యక్రమాలయ్యాయి. పాఠ్యకార్యక్రమాలకున్నంత ప్రాధాన్యత వీనికి కూడా ఉంది. వీని నిర్వహణ ద్వారా విద్యార్థుల్లో ఆశించే ప్రవర్తనా మార్పుల్ని దిగువ విధంగా పేర్కొనవచ్చు.

i) విద్యార్థుల వైయుక్తిక భేదాలను గుర్తించడం.
ii) విద్యార్థుల ప్రతిభా విశేషాలను గుర్తించడం.
iii) విద్యార్థుల ఆసక్తులు, అభిరుచులు తెలిసికోవడం.
iv) విద్యార్థులు వివిధ సందర్భాల్లో ప్రవర్తించే తీరును పరిశీలించడం.
v) విద్యార్థుల్లో విశిష్ట వ్యవహారదక్షతను పెంపొందించడం.
vi) విద్యార్థుల్లో సహకారభావన, పరస్పరప్రేమ పూర్వక సంభాషణలను ప్రోత్సహించడం.
vii) విద్యార్థుల భాషా నైపుణ్యాల్ని విస్తరించడం.
viii) విద్యార్థుల జ్ఞానాన్ని పెంపొందించడం.

పై ధ్యేయాల సాధనకు అందరు విద్యార్థులు సహపాఠ్య కార్యక్రమాల్లో పాల్గొనేట్లు చూడాల్సి ఉంది. సహపాఠ్య కార్యక్రమాల్లో విద్యార్థుల భాషా పాటవాన్ని పెంపొందించేందుకు ప్రత్యేక శ్రద్ధతీసుకోవాలి. తద్వారా విద్యార్థుల భావగ్రహణ, భావవ్యక్తీకరణ సామర్థ్యాలను మెరుగుపరచవచ్చు.

## భాషాబోధకులు నిర్వహించదగిన సహపాఠ్య కార్యక్రమాలు :

a) ప్రాథమికదశ :

i) అక్షరక్రీడలు.
ii) పదక్రీడలు, పదనిర్మాణ క్రీడలు, పదాలమెట్లు, పదపోరాటం, బింగోఆట, గళ్ళనుడికట్టు, డామినోఆట, చిత్రపదక్రీడ, అంత్యాక్షరి, జిగ్‌జాగ్ పుస్తకం, మాటల తమాషా, ఎటుచదివినా ఒకేమాట మొదలగునవి.
iii) పొడుపుకథల క్రీడలు.
iv) వాక్యనిర్మాణక్రీడలు.

ప్రాథమిక తరగతుల్లో ప్రధానంగా, మాధ్యమిక తరగతుల్లో కొంతమేరకు పై క్రీడలు నిర్వహించుటద్వారా భాషాభ్యసనం వేగవంతమౌతుంది. ఈ క్రీడల

విద్యార్థులందరిని భాగస్వాములను చేయడం వల్ల వారిలో సహకారభావన పెరుగుతుంది. వీనితోబాటు సంభాషణా చతురత, సక్రియాత్మకత, చురుకుదనం పెంపొందుతాయి. ఈ క్రీడల వల్ల నియంత్రిత వాతావరణంలో గాక స్వేచ్ఛాయుత వాతావరణంలో భాషాభ్యాసం కొనసాగుతుంది. వీనితో బాటు బాలగేయాలు, అభినయగేయాలు చదివించడం, సంభాషణలు చెప్పించడం, పద్యాలు చదివించడం, పద్యపఠన పోటీలు నిర్వహించడం, మొదలైన వివిధ కార్యక్రమాల ద్వారా విద్యార్థులు ఇతోధిక జ్ఞానాన్ని సముపార్జిస్తారు.

b) మాధ్యమిక - ఉన్నత దశలు :

ప్రాథమిక తరగతుల్లో నిర్వహించిన సహపాఠ్య కార్యకలాపాలను పై తరగుతుల్లో కూడా కొనసాగించి, అదనంగా కింది కార్యక్రమాల్ని కూడా నిర్వహించాలి. వానిలో

i) పదాల, వాక్యాల వరసక్రమ క్రీడలు.
ii) చిత్రకథాక్రీడలు.
iii) పదబంధ ప్రహేళికలు.
iv) కథాంశపూరణలు.
v) పద్యపఠన పోటీలు.
vi) వాక్యనిర్మాణ క్రీడలు, వాక్యాంతరీకరణ క్రీడలు, వాక్యపరివర్తన క్రీడలు.
vii) అనుభవాల రచన, వ్యాసరచన, లేఖారచన, వివిధ ఇతర రచనలు.
viii) వక్తృత్వం, వాదవివాదాలు, ఉపన్యాసం.
ix) చిత్రవ్యాఖ్య.
x) నాటకీకరణం, అభినయం, సంగీతం, నృత్యం.

ఈ కార్యక్రమాలను నిర్వహించుట ద్వారా విద్యార్థుల భాషాపటిమను పెంపొందించవచ్చు. వాక్యపరివర్తన క్రీడలద్వారా విద్యార్థుల్లో సృజనాత్మక రచనను ప్రేరేపించవచ్చు. ఉదాహరణంగా ఒక చిన్న సామాన్య వాక్యమిచ్చి వాక్యంలోని పదాల స్థానాలను పరివర్తనచేయుట ద్వారా ఛందోలక్షణమైన ఒక తూగు, లయను సాధింపవచ్చని చూపి విద్యార్థులు అలా వాక్యాంను పరివర్తనం చేయడానికి ప్రోత్సహిస్తే మొదట అనుకరించినమా, తర్వాత స్వతంత్రంగా రాయగల్గుతారు.

ఉదా:- రాముడు రావణుని చంపెను.

రాముడు చంపెను రావణుని.
చంపెను రాముడు రావణుని.

ఇట్టి క్రీడల ద్వారా వాక్యనిర్మాణ రీతుల్ని, మెలకువల్ని విద్యార్థులు తెల్సికొంటారు. కథాంశంలోని వాక్యాలను చెల్లాచెదరుచేసి వరసలోకూర్చడం, వాక్యాలు అట్టలపైరాసి వరసక్రమంలో విద్యార్థులను నిలబెట్టడం మొదలైనవికూడా చేయించవచ్చు. పద్య పఠనపోటీలు విద్యార్థుల్లో ధారణాశక్తిని, పద్యపఠన నైపుణ్యాన్ని పెంపొందిస్తాయి. చిత్రాలు, దృశ్యాలు చూపి వ్యాఖ్య చేయించడం మొదలైనవి విద్యార్థుల భాషాభివృద్ధికి తోడ్పడుతాయి.

ఇక వక్తృత్వం ఉపన్యాసం మొదలైన కార్యక్రమాల్లో పాల్గొనడానికి విద్యార్థులు జంకుతారు. కారణం సభాకంపం తప్ప వేరుకాదు. సభాకంపాన్ని పోగొట్టడానికి దిగువ వ్యూహం అనుసరించవచ్చు.

i) మొదట విద్యార్థులను వారు కూర్చొనే చోటునే నిలబడి మాట్లాడమనడం
ii) క్రమంగా విద్యార్థిని ముందు వరసల్లోకి వచ్చి మాట్లాడమనడం (ఇంతవరకు ఉపాధ్యాయునికి అభిముఖంగానే ఉండి మాట్లాడుతాడు.)
iii) తరగతిలో విద్యార్థుల కభిముఖంగా నిలిపి మాట్లాడమనడం.
iv) చిన్నతరగతుల విద్యార్థుల ముందు మాట్లాడించడం. (తద్వారా వారిలో ఆత్మవిశ్వాసం కల్గి భయం తగ్గుతుంది.)
v) పై తరగతుల విద్యార్థులముందు ఆ తర్వాత పాఠశాలలోని అందరు విద్యార్థులముందు మాట్లాడించడం.

వక్తృత్వంలో విద్యార్థులు మొదట రాసికొని వచ్చిన విషయాన్ని చూచిచదవమని తర్వాత తర్వాత సద్యోవక్తృత్వం చెప్పమని కోరవచ్చు.

వ్యాసరచన, గేయరచన, కవిసమ్మేళనాలు నిర్వహించడం, కవి జయంతుల నిర్వహించడం, సాహిత్య ఉత్సవాలు నిర్వహించడం మొదలైన కార్యక్రమాల విద్యార్థులలో భాషాభిరుచిని పెంపొందించటంతోబాటు వారి వ్యక్తీకరణ నైపుణ్యాల్ని మెరుగుపరచే అవకాశం కల్పిస్తాయి. ఈ కార్యక్రమాలన ప్రతివారం విధిగా ప్రణాళికా బద్ధంగా నిర్వహించాల్సిన అవసరం ఎంతోఉంది ఉపాధ్యాయులు కేవలం పాఠ్య పుస్తకబోధనతో సరిపుచ్చక వీటిని కూడ నిర్వహించి విద్యా గమ్యాలను సాధించాలి.

# పదమూడో అధ్యాయం

# పరీక్షలు - మూల్యాంకనం

## 13.01. ఉపోద్ఘాతం :

విద్యావ్యవస్థ ఆశిస్తున్న ఫలితాలను, ప్రభావాలను అంచనావేయగల్గింది పరీక్ష. ఈమధ్యకాలంలో ఈ ప్రక్రియను మూల్యాంకనం అని వ్యవహరిస్తున్నారు. పాశ్చాత్యదేశాల్లో ఈప్రక్రియనే పరిగణనం (Asessment) అని పేర్కొంటున్నారు. పరీక్ష (Examination) మూల్యాంకనం (Evaluation), పరిగణనం (Assesment) అనే మూడూ ఒకే భావనకు సంబంధించినవి. ఇవి ఒకదానికన్న ఒకటి విస్తృతమైనవిగా, సూక్ష్మమైనవిగా గుర్తింపబడుతున్నాయి. మనరాష్ట్రంలో లక్ష్యాధార బోధన ప్రారంభమైన నాటినుండి మూల్యాంకనం అనే పదం పరీక్ష అనే పదంతో బాటు ప్రచారంలోకి వచ్చింది. ప్రాథమిక దశలో కృత్యాధారబోధన (ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం వారి షట్సూత్రాలు) ప్రారంభించిన తర్వాత పరిగణనం అనే పదానికి ప్రాధాన్యత ఏర్పడింది. ఈమూడింటిలో ప్రతిదీ తనదైన పరిధిలో విద్యార్థుల్లో ఆశించిన ప్రవర్తనామార్పుల్ని అంచనావేయగల్గే, గణనచేయగల్గే, గుర్తించగల్గే, పరిశీలించగల్గే సాధనమే. ఉపాధ్యాయులు వీనినుపయోగించి తాము బోధించిన విషయాల ద్వారా విద్యార్థుల్లో ఆశించిన ప్రవర్తనా మార్పుల్ని లెక్క కట్టాల్సి ఉంటుంది. వీని ఉచితానుచితాలు ఉపాధ్యాయులు వీనిని వినియోగించేతీరు, సన్నివేశాలు మొదలైన అంశాలపై ఆధారపడి ఉంటాయి. మూల్యాంకనం కేవలం పాఠబోధన చివర మాత్రమేగాక, పాఠబోధనలో అంతర్భాగంగా నిర్వహించాలి. అప్పుడే అది నిరంతరమూ, సమగ్రమూ అవుతుంది.

## 13.02. పరీక్ష (Examination) :

ప్రాచీనకాలం నుండి ఏదో ఒక పద్ధతిలో విద్యార్థుల్ని పరీక్షిస్తూనే ఉన్నారు. ప్రతిరోజు అంతకుముందు రోజు చెప్పిన పాఠాన్ని ఛాత్రులు

అప్పగించినపుడే కొత్తపాఠం చెప్పేవారు గురుకులాల్లో. పది, పన్నెండు సంవత్సరాలు గురుకులావాసం చేసి విద్యార్జన చేసిన ఛాత్రులు పండిత పరిషత్తుల్లోనో, రాజాస్థానాల్లోనో తమ ప్రతిభను ప్రదర్శించి గుర్తింపు పొందేవారు. ఈనాటి విశ్వ విద్యాలయాల్లో నిర్వహిస్తున్న స్నాతకోత్సవాల లాంటిదే ఇది. ఆ తర్వాత నిత్యజీవితంలో అడుగిడేవారు. తర్వాతి కాలంలో నిత్యం పరీక్షతోబాటు త్రైమాసిక, అర్ధవార్షిక, వార్షిక పరీక్షలు కూడా అమలులోకి వచ్చాయి. ఈ పరీక్షలు విద్యార్థుల ధారణాశక్తిని మాత్రమే పరీక్షించేవి. మరియు పాఠ్యపుస్తకాల్లోని విషయాలకే ప్రాధాన్యత నొసగేవి. మౌఖికంగా గాని, ఇతరత్రాగాని సద్యస్ఫురణ శక్తిలేని ఛాత్రులు ఈపరీక్షా వారధిని దాటలేకపోయేవారు కూడా. దీనివల్ల పరీక్షలంటేనే నిరాసక్తత, భయం విద్యార్థుల్ని వెన్నాడేవి. కొన్ని పర్యాయాలు ప్రతిభావంతులైనవారు కూడా నిరాశానిస్పృహలకు లోనయ్యేవారు. చాలాకాలం వరకు రాజ్యమేలిన ఈ పరీక్షలు మౌలికమైన మార్పులతో మూల్యాంకనం అనే భావనకు స్థానం కల్పించాయి.

## 13.03. మూల్యాంకనం (Evaluation) :

విద్యార్థుల సంపూర్ణ వికాసాన్ని అంచనావేసే సాధనంగా మూల్యాంకనాన్ని భావించవచ్చు. 'పరీక్ష' అనే భావన కన్న కొంత విస్తృతమైనభావన ఇది. పాఠ్య విషయాల ఆర్జనా తీవ్రతలతో బాటు, విద్యార్థులు కనబరచిన ఆసక్తులు, అభిరుచులు, వైఖరులు, అనుభూతులు మొదలైనవానిలోని మార్పుల్ని కూడా దీని ద్వారా అంచనావేయవచ్చు. మూల్యాంకనం లక్ష్యాధారమై ఉండి వివిధ పద్ధతుల్లో, వివిధ వ్యూహాలతో అనుసరింపబడుతుంది. అందువల్ల పరీక్షకన్న దీనికి ప్రామాణికత హెచ్చు అని విద్యావేత్తలు విశ్వసిస్తున్నారు. 'పరీక్ష' లోని లోపాల్ని ఈ విధానం పూర్తిగా తొలగించలేకపోయినా, కొంతమేరకు వానిని అరికట్టగల్గి మరింత సమర్థమైన అంచనాలకు సాయపడుతుంది. విదేశాల్లో ఎంతోకాలం నుండి అమల్లో ఉన్న ఈ మూల్యాంకన భావన మనరాష్ట్రంలో Non-Detention విధానాన్ని ప్రవేశపెట్టిన నాటినుండి అమల్లోకి వచ్చింది. నేడు లక్ష్యాధార బోధనతో బాటు నిరంతర సమగ్ర మూల్యాంకనమనేది ఈనాటి పాఠశాలల్లో ఆచరణలో ఉంది.

## 13.04. పరిగణనం (Asessment) :

మూల్యాంకనం కన్న విస్తృత పరిధి కలదిగా పరిగణనం విశ్వసింపబడుతోంది.

అభివృద్ధిచెందిన అన్నిదేశాల్లో పరీక్షలు, మూల్యాంకనం అనేవి కొంతమేరకు పాత భావనలు. కారణం ఈ రెండూ తరగతిగదులకే పరిమితమవి. విద్యార్థుల సర్వాంగీణ వికాసాన్ని అంచనావేయడం తరగతిగదులతో బాటు తరగతిగదుల వెలుపల కూడా జరగాలని పరిగణనం భావిస్తుంది. విద్యార్థులు పాఠశాలల్లో కన్న పాఠశాలల వెలుపల ఎక్కువ సమయం గడుపుతారు. నియంత్రిత వాతావరణం వెలుపల స్వేచ్ఛాయుత వాతావరణంలో కూడా విద్యార్థుల ప్రవర్తనలను పూర్తిస్థాయిలో అంచనావేయడానికి పరిగణనాన్ని ఉపయోగించుకోవచ్చు. ప్రధానంగా కృత్యాధార బోధన (Activity based Teaching ) నిర్వహించే సందర్భాలన్నిటిలో పరీక్ష, మూల్యాంకనం అనే భావనలకన్న పరిగణనం ద్వారావే విద్యార్థుల ఆర్జనా తీవ్రతల్ని మరింత సమర్థంగా మదింపు వేయవచ్చునవి విద్యావేత్తల అభిప్రాయం. పరీక్ష, మూల్యాంకనాలలో అనుసరించే వ్యూహాలతో బాటు పరిశీలనలు, స్వీయపరిగణనం, "కృత్య సాక్ష్యం, అభ్యసన సాక్ష్యం" మొదలైన అంశాలను చేర్చుకొని పరిగణనం మరింత విస్తృతపరిధిగల మదింపువేయగల ప్రక్రియగా గుర్తించబడింది.

## 13.05. మూల్యాంకనం - లక్షణాలు :

పరీక్ష, మూల్యాంకనం, పరిగణనం ఒకదాని కన్న ఒకటి విస్తృతపరిధిలో విద్యార్థుల ఆర్జనా తీవ్రతల్ని మదింపువేసే సాధనాలుగా భావించవచ్చు. ఈ ప్రక్రియల్లోని మదింపు సాధనాలు కింది ప్రధాన లక్షణాలను కల్గి ఉండాలి.

### A) లక్ష్యాత్మకత (Objectivity) :

సార్వజనీన లక్షణం కల్గి ఉండటమే లక్ష్యాత్మకత. వ్యక్తిగత ఆపేక్షలకు నిరపేక్షలకు అతీతమై మదింపువేసే ఏ అంశం పై కూడా ఇతర ప్రభావాలేవీ ప్రసరించకుండా జాగ్రత్తపడటమే లక్ష్యాత్మకత. దీని ప్రకారం

i) వీనిని నిర్వహించే వ్యక్తులు ఖచ్చితమైన సార్వజనీనమైన పద్ధతినే అనుసరించాలి.

ii) సమాధానాలన్నీ ఒకే విధంగా విలువ కట్టబడాలి.

iii) విద్యామనోవైజ్ఞానిక శాస్త్రసూత్రాలపై ఆధారపడాలి.

### B) విశ్వసనీయత (Reliability) :

ఈ సాధనాలు ఎప్పుడు నిర్వహించినా ఒకేవిధమైన ఫలితాలీయడమే

వాని విశ్వసనీయతకు నిదర్శనం. అంటే నిర్ణీత కాలవ్యవధుల్లో ఎన్ని పర్యాయాలు నిర్వహించినప్పటికి ఒకే విధమైన ఫలితాలనీయాలి.

**C) ప్రామాణికత (Validity) :**

ఏ అంశాన్నైతే మదింపువేయాలని సాధనం భావిస్తుందో అదే అంశాన్ని మాత్రమే మదింపువేసే లక్షణమే ప్రామాణికత. ఇది ఆమోదింపబడిన ప్రమాణాలకు (Criteria) అనుగుణంగా ఉండాలి. నిపుణులు విలువకట్టి సంతృప్తిచెందిన సాధనం ప్రామాణికత కల్గినదిగా భావిస్తారు. దీనికి విశ్వసనీయత ఎక్కువ.

**D) ఔపయోగికత (Usability) :**

విద్యావ్యవస్థలోని అందరూ ఈ సాధనాలను సులభంగా వినియోగించు కోగల్గినప్పుడే వీనికి ఔపయోగికత అనే లక్షణం వర్తిస్తుంది. అంతేగాక లభించిన ఫలితాలను అందరూ తేలికగా వ్యాఖ్యానించగల్గాలి కూడా. దీన్ని నిర్వహణ సౌలభ్యత అని కూడా అనవచ్చు. దీన్ని కాలం మరియు అర్థికాంశాల దృష్ట్యా నిర్ణయిస్తారు.

## 13.06. మూల్యాంకనం - సాధనాలు :

మదింపు సాధనాలు రెండురూపాల్లో వినియోగంలో ఉన్నాయి. వానిని గూర్చి తెల్సికొందాం.

i) విద్యార్జనా నికషలు (Scholastic Achievement Tests)
ii) విద్యా మనోవైజ్ఞానిక నికషలు (Psychological Tests)

i) విద్యార్జనా (విద్యా ఉపలబ్ది) నికషలు :

బోధించిన పాఠ్యాంశాలను విద్యార్థులు ఏ మేరకు స్వంతం చేసికొన్నారో తెల్సికోవడానికి ఉపయోగపడేవే విద్యార్జనా నికషలు. వీనిని రెండురూపాల్లో నిర్వహిస్తారు. ఒకటి పరీక్ష, రెండోది నికష. పరీక్ష సాధారణంగా విద్యాసంవత్సరంలోని మొదటి మూడు మాసాల చివర, ఆరు మాసాల చివర మరియు సంవత్సరాంతంలో నిర్వహింపబడేది. నికష ఏదేని ఒక బోధనాంశం చివర (భాషలో ప్రధానంగా ఒక పాఠం పూర్తిగా బోధించినతర్వాత) నిర్వహించేది. దీన్ని చిట్టి పరీక్ష లేదా పరీక్షిక అని వ్యవహరించవచ్చు. ఇది నేటి పాఠశాలల్లో పాఠ్య విభాగనికష (Unit Test) అనే పేరుతో నిర్వహింప

బడుతోంది. నికష ఏదేని ఒక బోధనాంశానికే పరిమితం. భాషలో ఒక పాఠానికి పరిమితం. అంటే ప్రతిపాఠానికి ఒకనికష నిర్వహించాలి అన్నమాట. కారణం unit అంటే ఏకకం. ఏకలక్షణ సమన్వితం అని అర్థం అందువల్ల భాషలోని ప్రతిపాఠం ఒక (unit). (ఒక పాఠానికి మరో పాఠానికి మధ్య భావసంబంధంగాని, విషయసంబంధంగాని ఉండదు). పరీక్ష, నికష విద్యాబోధన ద్వారా విద్యార్థుల్లో ఆశించిన లక్ష్యాలను' ఏ మేరకు సాధించగల్గారో తెల్సికోవడానికి ఉపయోగపడే సాధనాలు. నికషను ప్రమాణీకరిస్తే ప్రామాణిక నికష (Standardised Test) అవుతుంది.

(ii) విద్యా మనో వైజ్ఞానిక నికషలు :

ఇవి విద్యా మనోవైజ్ఞానిక శాస్త్ర ఆధారాలు కలవి. విద్యార్థుల ప్రజ్ఞాపాటవాలు, ఆసక్తులు, వైఖరులు, అనుభూతులు, అభిప్రాయాలు, మూర్తిమత్వం, ప్రవర్తనలు, సృజనాత్మకత మొదలైన ప్రత్యేక లక్షణాలను అంచనా వేసే సాధనాలు ఈనికషలు. పాఠశాలల్లో విద్యార్థుల ప్రజ్ఞ ననుసరించి ప్రతిభావంతులు, సామాన్యులు, మందబుద్ధులు, అనే మూడు స్థాయిల్లోని వారిని గుర్తించి తరగతిగదిలో విద్యార్థులు ప్రవేశించిన నాటి ప్రవర్తనలను తరగతిగది వదిలి వెళ్ళేనాటి ప్రవర్తనలను తెల్సికోవడానికి ఇవి ఉపకరిస్తాయి. నిర్గమన ప్రవర్తన (Exit behaviour) మరియు ప్రవేశ ప్రవర్తన (Entry behaviour) ల మధ్యగల భేదం పాఠ్యాంశాల బోధన ద్వారా విద్యార్థులలో కల్గిన ప్రవర్తనా మార్పుగా పరిగణిస్తారు. ఈ లక్షణాలన్నిటినీ మదింపు వేయటానికి ప్రజ్ఞానికషలు, ఆసక్తి నికషలు, అభిరుచి నికషలు, వైఖరి నికషలు, ప్రవర్తనా నికషలు, మొదలైన వానిని విద్యా మనో వైజ్ఞానిక శాస్త్రం ఉపాధ్యాయులకు సమకూర్చింది. ఉపాధ్యాయులు తమ వృత్తి పూర్వ శిక్షణా కాలంలో వీని గురించి విస్తృతంగా అధ్యయనం చేసిన వారే. కావున నిత్య బోధనలో వీనిని ఉపయోగించుకొన్నపుడే విద్యార్థుల ప్రవర్తనల్లో తమ బోధన ద్వారా ఆశించిన పరివర్తనాన్ని చూడగల్గుతారు. మనోవైజ్ఞానిక నికషలు అన్నీ సాధారణంగా ప్రామాణిక నికషలే.

కాని నేటి పాఠశాలల్లో విద్యార్జనా నికషలకే ప్రాధాన్యత నిచ్చి మనోవైజ్ఞానిక నికషలను విస్మరించడం జరుగుతోంది. ఈ విధానం మారినపుడే మనం ఆశిస్తున్న విద్యాలక్ష్యాలకు పరిపూర్ణత లభిస్తుంది. పరీక్షయైనా, మూల్యాంకనమైనా సమర్థంగా నిర్వహింపబడి ఆశించిన ఫలితాన్ని సాధించడం అనేది ఉపాధ్యాయుల దృష్టిలో ఉండవల్సిన విషయం. వీనికి ఆధారం ప్రశ్న రూపాలు. అందువల్ల

ప్రశ్నలు తయారుచేయడం, అభివృద్ధి పరచడం, కొత్త దృక్కోణాల్లో ప్రశ్న తయారీ గూర్చి ఆలోచించడం ఈ నాటి అవసరమైఉంది.

వీనిని పాఠశాల పరిధిలోనే నిర్వహిస్తే అంతర మూల్యాంకనమని పాఠశాల వెలుపలి సంస్థలు నిర్వహిస్తే బాహిర మూల్యాంకనమని (Internal Evaluation, External Evaluation) అంటారు. ఈ రెండూ ఆయా పరిమితుల్లో సత్ఫలితాలిస్తాయి. ఈ రెండు పద్ధతులనూ ఉపాధ్యాయులు వినియోగించుకోవాలి.

## 13.07 ప్రశ్నలు - రకాలు :

పరీక్షలు, నికషల రూపురేఖలు వాని ప్రాథమిక ధర్మాలను గూర్చి కొంత తెల్సికొందాం. వీనిలో ప్రశ్నలు మూడు రూపాల్లో ఉంటాయి. అవి

A) వ్యాస రూప ప్రశ్నలు (Essay type questions).

B) లఘుసమాధాన ప్రశ్నలు (Short answertype questions).

C) లక్ష్యాత్మక ప్రశ్నలు (objective type questions).

### A. వ్యాస రూప ప్రశ్నలు:

విద్యాక్షేత్రంలో అనాది కాలం నుండి రాజ్య మేలుతోన్న ప్రశ్న వ్యాస రూప ప్రశ్న. విద్యార్థుల లిఖిత వ్యక్తీకరణానికి ఇది ప్రాధాన్యత ఇస్తుంది. ప్రశ్నకు సమాధానం ఒక వ్యాసం రూపంలో ఉంటుంది. ఈ ప్రశ్న రూపానికి పరిమితులున్నాయి. ప్రయోజనాలున్నాయి. పరిమితుల్లో ప్రధానంగా

i) సమాధానాలు [illegible]డానికి విద్యార్థులు అన్ని పాఠాలు చదవాల్సిన అవసరముండదు.

ii) ప్రశ్నకు సమాధానాల పరిధి విద్యార్థులను బట్టి మారుతుంది.

iii) సమాధానాల విలువ కూడా ఉపాధ్యాయులను బట్టి మారుతుంది.

iv) వీనిలో ధారణ శక్తికే ప్రాధాన్యత.

v) ఈ ప్రశ్నలకిచ్చే సమాధానాల్లో అసందర్భాంశాలకు అవకాశముంటుంది.

ఐతే ఈ ప్రశ్నలను తయారుచేయుట చాలా సులభం. అతి తక్కువ సమయంలో ఎన్నైనా ప్రశ్నలు తయారుచేయవచ్చు. పై పరిమితులను

అధిగమించగల్గినచో ఇవి కింది ప్రయోజనాలు కల్గిస్తాయి.

i) విద్యార్థుల లిఖిత అభివ్యక్తిని సమర్థంగా అంచనా వేస్తాయి.

ii) విషయ వివరణ, విశ్లేషణా శక్తుల్ని మదింపువేయగల్గుతాయి.

iii) సృజనాత్మకతను, ఆలోచనల్ని మదింపు వేయ గల్గుతాయి.

iv) విద్యార్థుల దస్తూరీ వాణ్యతను పరీక్షించ గల్గుతాయి

v) విద్యార్థుల ధారణాశక్తిని పరీక్షించగల్గుతాయి.

పై ప్రయోజనాలు, పరిమితులను ఉపాధ్యాయులు దృష్టిలో పెట్టుకొని విద్యార్థుల్లో ఆశించిన జ్ఞాన పరిధుల్ని అంచనా వేయటానికి వ్యాస రూప ప్రశ్నల్ని ఉపయోగించాలి. సమాధానాల నిడివికి పరిమితులు విధించి, వానిని విలువ కట్టుటలో అపేక్షలకు నిరపేక్షలకు తావీయక పోతే ఇవి ఆశించిన ప్రయోజనాలను నెరవేరుస్తాయి.

B)లఘు (సంక్షిప్త) సమాధాన ప్రశ్నలు:

ఇవి వ్యాస రూప ప్రశ్నలకు చిన్న రూపాలు. ఒక వ్యాస రూప ప్రశ్నను ఎన్నో లఘు సమాధాన ప్రశ్నలుగా విడగొట్టవచ్చు. వీని సమాధాన పరిధి రెండు వాక్యాల నుండి ఐదు వాక్యాల లోపల ఉంటుంది. పరిమితులూ, ప్రయోజనాలూ వ్యాస రూప ప్రశ్నలవే వర్తిస్తాయి. ఐనా ఇవి

i) వ్యాస రూప ప్రశ్నలకన్నా సమర్థమైనవి.

ii) విద్యార్థులు అన్ని పాఠాలు చదవాల్సి ఉంటుంది.

iii) సంక్షిప్తంగా సమాధానాలిచ్చే నేర్పు విద్యార్థులకు అలవడుతుంది.

iv) అసంబద్ధ అంశాల ప్రస్తావనకు అవకాశం తక్కువ.

v) రచనాశక్తిని కొంత మేరకు మాత్రమే మదింపు వేయవచ్చు.

పై వానికి లోబడి ఇవి సాధించగల్గిన లక్ష్యాలను దృష్టిలో పెట్టుకొని వీనిని పరిమితంగా ఉపయోగించుకోవాలి.

C లక్ష్యాత్మక ప్రశ్నలు:

లక్ష్యాధార బోధనను అత్యంత సమర్థంగా మదింపు వేయడానికి ఉపయోగపడే ప్రశ్న రూపాల్లో ఇవి ప్రముఖమైనవి. ఇవి వైవిధ్యంగా ఉండి లక్ష్యాంతర్భాగాలైన స్పష్టీకరణాల ద్వారా విద్యార్థుల్లో ఆశిస్తున్న ప్రవర్తనా మార్పుల్ని అంచనా వేయడానికి ఉపకరిస్తాయి. ఇవి చిరు(చిట్టి) ప్రశ్నలు. వీనికి కూడా పరిమితులూ, ప్రయోజనాలూ ఉన్నాయి. పరిమితుల్లో

i) విద్యార్థుల లిఖిత అభివ్యక్తిని అంచనా వేయలేవు..

ii) భాషా నైపుణ్యాలను ·పరిశీలించడం వీనికి సాధ్యం కాదు.

iii) ఆలోచనల్ని, వైఖరుల్ని సామాన్య పద్ధతిలో లెక్క కట్టలేవు.

iv) విద్యార్థుల ధారణ శక్తిని అంచనా వేయలేవు.

v) కొన్ని పర్యాయాలు మూక ఉమ్మడిగా సమాధానాలు చూపి రాయడానికి (Copy) చేయడానికి అవకాశముంటుంది. (జాగ్రత్తలు తీసికోకపోతే)

ప్రయోజనాల్లో ప్రధానమైనవి. :

i) అన్ని పాఠాలకు ప్రాధాన్యత లభిస్తుంది. వ్యాపకత ఎక్కువకావున విద్యార్థులు పాఠాలన్నీ చదవాల్సి ఉంటుంది.

ii) సమాధానాలు ఒక అక్షరంలోనో ఒక పదంలోనో ఉంటాయి కనుక సులభంగా సమాధానాల్ని సూచించవచ్చు.

iii) సమాధానాల్లో సాక్షికత ఉండదు.

iv) సమాధానం ఒకటే అగుటవల్ల విలువ కట్టుటలో కూడా ఆపేక్షలు నిరపేక్షలు పని చేయవు.

v) అన్ని సందర్భాల్లోనూ ఒకే ఫలితమిస్తాయి.

vi) సమాధాన పత్రాలను ఎవరైనా సరిచూపి విలువ కట్టవచ్చు.

vii) విద్యార్థుల స్థాయి కనుగుణంగా, లక్ష్యాలకనుగుణంగా ప్రశ్నలను తయారుచేయవచ్చు.

viii) ప్రశ్నలను ప్రామాణికం చేయవచ్చు.

ix) పోటీ పరీక్షల్లో ఈ ప్రశ్న రూపాలకే ప్రాధాన్యత.

x) నికషల లక్షణాలైన విశ్వసనీయత లక్ష్యాత్మకత, ప్రామాణికత ఔపయోగికతలు ఈ ప్రశ్నలకుంటాయి.

ఈ ప్రశ్న రూపాలను తయారుచేయడం వ్యాసరూప, లఘు సమాధాన ప్రశ్నలు తయారుచేసినంత సులభం కాదు. ఉపాధ్యాయులు బోధనకు ఎంత సమయం తీసుకుంటారో అంతకన్న ఎక్కువ సమయం ఈ ప్రశ్న రూపాలను తయారుచేయడానికి వెచ్చించాలి. ఉపాధ్యాయుల సునిశిత పరిశీలనా శక్తి వీనిని మరింత సమర్థం చేయడానికి ఉపకరిస్తుంది. పైమూడు విధాలైన ప్రశ్నలతో కూడిన నికష, పరీక్షలను ఉపాధ్యాయులు ఉపయోగించాలి. వీనిని నిర్వహించే విధాలను తెల్సికొందాం.

## 13.08 మూల్యాంకనం - పద్ధతులు

### i) మౌఖిక (పరీక్ష - నికష) పద్ధతి :

ఈ పద్ధతిలో ఉపాధ్యాయులు అడిగే ప్రశ్నలకు మౌఖికంగా (వాగ్రూపంగా) విద్యార్థులు సమాధానాలిస్తారు. ఈ పద్ధతిలో ప్రశ్నల యొక్క కాఠిన్యతను బట్టి కొందరు విద్యార్థులను సులభమైనవి, కొందరిని సామాన్యమైనవి, మరి కొందరిని కఠినమైన ప్రశ్నలు అడిగే అవకాశముంది. సాధారణంగా అందరు విద్యార్థులు ప్రతిప్రశ్నకు సమాధానం చెప్పాల్సిన అవసరముండదు. అందువల్ల విద్యార్థుల సమగ్ర జ్ఞానాన్ని మదింపు వేయలేం. ఉపాధ్యాయుల ఆపేక్షలు, నిరపేక్షల వల్ల కొందరు విద్యార్థులు కేవలం సులభమైన లేక కఠినమైన ప్రశ్నలకే సమాధానం చెప్పవల్సి రావచ్చు. సద్యోవ్యక్తీకరణ సామర్థ్యమున్న వారు మాత్రమే సరియైన సమాధానాలు చెప్పి పరీక్షకుల సంతృప్తి పరచగల్గుతారు. ఈ పద్ధతి ప్రాథమిక దశలో లిఖిత అభివ్యక్తి అంతగా ఎదగని విద్యార్థులకు ఉపయుక్తమైంది. పోటీ పరీక్షల్లో దీనికి ప్రాధాన్యముంది. సమాధానాలు అప్పటికప్పుడే విలువ కట్టబడతాయి. అద్యతన సమాచారాన్ని కూడా స్వంతం చేసికొని ప్రశ్నకు సమాధానాన్ని పరిమిత సమయంలో చెప్పి మెప్పుసంపాదించగల్గిన విద్యార్థులకు ఈ పద్ధతతి అత్యంత ఉపయుక్తము. ఈ రూపాన్ని వినియోగిస్తున్నపుడు ఉపాధ్యాయులు మొదటే అడగదల్చిన ప్రశ్నలను పట్టిగా రాసికొని వాని కాఠిన్యతా స్థాయికనుగుణంగా వర్గీకరించి ప్రతి విద్యార్థినుండి అన్ని విధాలైన ప్రశ్న రూపాలకు సమాధానాలాశిస్తే దీని ఉపయోగం మెరుగవుతుంది.

ii) లిఖిత (పరీక్ష-నికష) పద్ధతి :

ఈపద్ధతిలో ప్రశ్నలకు సమాధానాలు లిఖిత రూపంలో ఉంటాయి. సాధారణంగా పాఠశాలల్లో నేడు నిర్వహించే పరీక్షలు, నికషలు అన్నీ లిఖితరూపాలే. లిఖిత వ్యక్తీకరణ సామర్థ్యమున్న విద్యార్థులకు ఇవి కొట్టిన పిండి. విద్యార్థులు ఆలోచించి సమాధానాలు ఈపద్ధతిలో రాయడానికి అవకాశముంటుంది. తమ ప్రాధాన్యతాక్రమంలో ప్రశ్నలకు సమాధానాలీయవచ్చుకూడా. సమాధానాలు విలువ కట్టుటకు కొంత సమయం తీసుకొంటుంది. విలువ కట్టడంలో కూడా భేదాలుండవచ్చు. అయినప్పటికి విద్యార్థుల రచనా శక్తిని, ఆలోచనాశక్తిని, సృజనాత్మక శక్తిని అంచనా వేయటానికి ఈ పద్ధతే సమర్థమైంది. చాలా సందర్భాల్లో పరిమితులకు లోబడి ఈ పద్ధతిని ఉపయోగించుకోవచ్చు.

iii) ప్రయోగశాలా పద్ధతి :

విద్యార్థులు ప్రయోగ శాలల్లో నిర్వహించే ప్రయోగాలను, కృత్యాలను మదింపు వేయడానికి ఈ పద్ధతి ఉపకరిస్తుంది. భాషేతర విషయాల మదింపులో దీనికి ప్రాధాన్యత ఉన్నప్పటికి విద్యా సాంకేతిక శాస్త్ర ఫలాలైన భాషా ప్రయోగశాలల్లో (launguage laboratory) విద్యార్థుల భాషాభ్యాస తీవ్రతను ఈ పద్ధతిలో మదింపు వేయవచ్చు.

ఇట్లు వివిధ రూపాల్లో, పద్ధతుల్లో నిర్మించే నికషలు

i) సూత్రాధారిత నికషలు (Norm referenced tests).

ii) ప్రమాణాధారిత నికషలు (Criterian referenced tests)

అని రెండు విధాలని చెప్తారు. Norm referenced నికషలో సామూహిక ప్రమాణాలపై ఆధారపడి విద్యార్థుల ప్రగతిని ఇతర విద్యార్థుల ప్రగతితో పోల్చి చూస్తారు. Criterian referenced నికషలో ప్రతివిద్యార్థికోసం ప్రత్యేకంగా నిర్వచించిన ప్రమాణంతోనే అతడి ప్రగతిని పోల్చడం జరుగుతుంది. నేడు సామూహిక ప్రమాణాల నిర్ధారణ కన్న, వైయక్తిక ప్రమాణాల నిర్ధారణే అవసరమైనదిగా విద్యావేత్తలు భావిస్తున్నారు. ఈ అంశాలన్నీ దృష్టిలో పెట్టుకొని పరీక్షలను, నికషలను తయారుచేయాలి. నికషల్లో పొందుపరచే ప్రశ్నల లక్షణాలు దిగువ విధంగా ఉండాలి.

i) ప్రతిప్రశ్న ఒక లక్ష్యానికి, ఒకే స్పష్టీకరణానికి సంబంధించినదై ఉండాలి.

ii) స్మృతిజ్ఞానాన్ని పరీక్షించడంతో బాటు వివిధ మూర్తిమత్వ లక్షణాలను పరీక్షించగల్గాలి.
iii) ప్రశ్నలలో వాడే పదాలు సంక్షిప్తంగా, స్పష్టంగా ఉండాలి.
iv) ప్రశ్న వివిధ రూపాల్లో ఉండాలి.
v) లక్ష్యాత్మకత, విశ్వసనీయత, ప్రామాణికత ఔపయోగికతలను కల్గి ఉండాలి.

పై లక్షణాలు కల్గిన ప్రశ్నలతో కూడిన నికషలను తయారుచేస్తున్నప్పుడు ఉపాధ్యాయులు కింది అంశాలను దృష్టియందుంచుకోవాలి.

i) నికషలో పూర్వనిర్ణయమైన లక్ష్యాలు, ఆశిస్తున్న ప్రవర్తనా మార్పుల్ని మదింపువేయగల్గడం.
ii) నికషలో పాఠాలన్నింటికి సమాన ప్రాతినిధ్యం కల్పించడం.
iii) నికషకోసం వివిధ ప్రశ్నరూపాల నెన్నుకోవడం.
iv) ప్రతిప్రశ్న రూపంలో ఎన్ని అంశాలు చేర్చాలో నిర్ణయించడం.
v) ప్రశ్నల కాఠిన్యతా స్థాయిని పరిగణనంలోకి తీసికోవడం.

పై అంశాల నేపథ్యంలో నికషలు నిర్మించినపుడే అవి ఆశించిన ఫలితాలనీయగల్గుతాయి. వ్యాసరూప, లఘుసమాధాన ప్రశ్న రూపాలు తయారుచేయడంలో అంతగా నైపుణ్యం అవసరం లేకపోయినప్పటికి, లక్ష్యాత్మక ప్రశ్నరూపాల తయారీలో తగు జాగరూకత అవసరం. అందువల్ల వివిధ లక్ష్యాత్మక ప్రశ్నరూపాలను వానిని తయారుచేయుటలో తీసికోవల్సిన జాగ్రత్తలను వివరంగా తెల్సికొందాం.

## 13.09 లక్ష్యాత్మక ప్రశ్న రూపాలు తయారు చేయుటలో తీసికొనవల్సిన జాగ్రత్తలు :

లక్ష్యాత్మక ప్రశ్నల్లో వివిధ రూపాలున్నాయి. వీనిని లక్ష్యాల్లోని ప్రతి స్పష్టీకరణాన్ని సాధించడంకోసం తయారుచేయవచ్చు. వీనిని తయారుచేయుటలో చాలా జాగ్రత్తలు తీసికోవాలి. వీని గురించి తెల్సికొందాం.

### A) ఖాళీలు పూర్తిచేయుడం (Fill in the blanks). :

దీన్ని రిక్తపూరణమంటారు. ఒక వాక్యంలోని ఖాళీని అర్థవంతమగు రీతిలో ఒక పదంతోగాని పదబంధంతో గాని పూర్తిచేయాల్సి ఉంటుంది. ఈ ప్రశ్నరూపం జ్ఞానలక్ష్యంలో జ్ఞప్తికి తెచ్చుకోవడం అనే స్పష్టీకరణాన్ని

సాధిస్తుంది. ఈప్రశ్నరూపాన్ని

i) వాక్యాల చివర పదాలను సూచించి,

ii) ఖాళీ ప్రక్కనే బ్రాకెట్టులో పదం ప్రాతిపదిక రూపాన్నీ ఇచ్చి తయారుచేయవచ్చు. ఇలా రూపాల్ని మారిస్తే ఈ ప్రశ్న సాధించే స్పష్టీకరణాలు కూడా మారతాయి. వాక్యం చివర పదాలను సూచిస్తే జ్ఞాన లక్ష్యంలో గుర్తించుట అనే స్పష్టీకరణం సాధింపబడుతుంది. రెండవ రూపంలో అవగాహనా లక్ష్యం నెరవేరుతుంది. ఈమూడు రూపాలు ఒకదానికన్న ఒకటి కఠినాలు. ఈప్రశ్నరూపాలను తయారుచేయుటలో కింది జాగ్రత్తలు తీసికోవాలి.

i) వాక్యంలో ఒకటి కన్న ఎక్కువ ఖాళీలుండరాదు.

ii) వాక్యం మొదట ఖాళీ ఉండరాదు.

iii) పాఠ్యపుస్తకాన్ననుసరించి ఖాళీని పూర్తిచేయమని సూచన ఇవ్వాలి. (లేకపోతే కొన్ని పర్యాయాలు ఏ పదం రాసినా వాక్యం అర్థవంతమౌతుంది. ఆ సందర్భాల్లో కేవలం ఖాళీని పూర్తిచేయండి అని అంటే విద్యార్థులు పూర్తిచేసినతీరే సరి ఔతుంది.)

iv) వాక్యంలో కేవలం నామవాచకపదాలను ఖాళీగా ఉంచక ప్రధాన పదబంధాన్నో, క్రియనో, విశేషణాన్నో ఖాళీగా ఇవ్వాలి.

B) బహుళ సమాధాన(Multiple choice) ప్రశ్న :

దీన్ని బహుళావరణ, సంభావ్య సమాధానాల ప్రశ్న అనికూడా అంటారు. ఒక నిర్దేశవాక్యానికి మూడు నుండి ఐదు సంభావ్య సమాధానాలీయబడ తాయి. వీనిలో ఉత్తమమైన సమాధానాన్ని విద్యార్థులు ఎంపికచేసికొని సూచించాలి. ఈ సమాధానాల సంఖ్య ఐదుకు తగ్గకుండా ఉన్నపుడు వీని విశ్వసనీయత పెరుగుతుంది. విద్యార్థులు సమాధానాల్ని ఊహించుట తగ్గుతుంది. సమాధానాలన్నీ ఒకే కాలానికి, ఒకే అంశానికి, ఒకే లక్షణానికి చెందినవై ఉంటేనే ప్రశ్న ఆశిస్తున్న లక్ష్యాన్ని సాధిస్తుంది. ప్రతి సమాధానం తానే నిజమైన సమాధానంగా పోటీ పడాలి. ఈ పరిమితులతో ప్రశ్న తయారుచేస్తే ఆ ప్రశ్న జ్ఞానలక్ష్యంలో గుర్తింపు అనే స్పష్టీకరణాన్ని ఒక దశలో, అవగాహనలక్ష్యంలో వివిధాంశాల మధ్య విచక్షణ చేస్తారు అనే స్పష్టీకరణాన్ని మరోదశలో సాధిస్తుంది. ఈప్రశ్నల్ని తయారుచేయడానికి

ఉపాధ్యాయులకు ఎక్కువ శ్రమ, ఆలోచన అవసరం. నేటిపోటీ పరీక్షల్లో ఈ ప్రశ్నరూపాలే ప్రముఖస్థానాన్ని పొందుతున్నాయి.

C) జతపరచడం (Matching) :

దీన్ని 'యుగళీకరణం' అని కూడా వ్యవహరిస్తారు. ఈ ప్రశ్నలో రెండు వరసల్లో పదాలిచ్చి ఒకవరసలోని పదాలతో మరో వరసలోని పదాలను జతపరచమంటారు. రెండు వరసల్లో సమానంగా పదాలీయకుండా క్రమంగా 4-7, 5-9, 6-11, సంఖ్యల్లో పదాలిస్తే ప్రశ్న కాఠిన్యత పెరుగుతుంది. ఈ ప్రశ్నలో ఇచ్చే అంశాలు ఒకే వర్గానికి, కాలానికి, అంశానికి పరిమితం కావాలి. ఈ ప్రశ్న జ్ఞానలక్ష్యంలో గుర్తించడం, అవగాహనాలక్ష్యంలో సంబంధాన్ని కనుక్కోవడం అనే స్పష్టీకరణాలను సాధిస్తుంది. ఈప్రశ్న రూపాన్ని వరసలు పెంచి మూడు, నాలుగు, ఐదు వరసల్లో విస్తరించవచ్చు. విస్తరించిన కొలది ప్రశ్న కాఠిన్యత పెరుగుతుంది. ఆంగ్లంలో Substitution Tables వలె వాక్యనిర్మాణ క్రీడకూడా ఈ ప్రశ్నరూపం ఇచ్చి వేయించవచ్చు. దీనివల్ల విద్యార్థుల్లో వాక్యనిర్మాణ దక్షత పెరుగుతుంది.

D) తప్పొప్పుల (True - false Type) ప్రశ్న :

ఈ ప్రశ్నను సత్యాసత్య వివేచనమని వ్యవహరించవచ్చు. ఈ ప్రశ్నలో ఈయబడిన వాక్యం తప్పో, ఒప్పో విద్యార్థులు ప్రశ్న చివరి బ్రాకెట్లో రాయాలి. ఈ ప్రశ్న జ్ఞానలక్ష్యంలో జ్ఞప్తికి తెచ్చుకొనుట అనే స్పష్టీకరణాన్ని, మరో దశలో అవగాహనా లక్ష్యంలో దోషాలను కనుగొనడం, సరిచేయగల్గడం, నిరూపించగల్గడం, వివేచించగల్గడం అనే స్పష్టీకరణాలను సాధిస్తుంది. ఈ ప్రశ్నరూపం ఒకే వాక్యంలో గాక రెండు, మూడు, నాలుగు వాక్యాల్లో ఇవ్వవచ్చు. వాక్యాల సంఖ్య పెరిగినకొలది కాఠిన్యతా స్థాయి పెరుగుతుంది. ఈ వాక్య సమూహాల్లో ఏ వాక్యం దోషరహితమో విద్యార్థులు కనుగొంటారు. ఒక సంశ్లిష్ట వాక్యమిచ్చి, ఆ వాక్యంలోని ఏభాగంలో దోషముందో కనుగొనమని కూడా ఈ ప్రశ్నను రూపొందించవచ్చు. ఈ ప్రశ్నలు తయారుచేస్తున్నప్పుడు నిర్ధారితమైన అంశాలను అసత్యాలుగా మార్చడంగాని, చారిత్రకాంశాలు, నామవాచకాలు మొదలైనవానిని మార్చడంగాని చేయరాదు. వాక్యంలో దోషాన్ని చేరుస్తున్నప్పుడు కాలం, వచనం, విభక్తి, పురుష మొదలైనవానిలో దోషంచేస్తే సబబని విద్యావేత్తల అభిప్రాయం. పరిమితులకు లోబడి వినియోగించుకోగల్గితే ఆశించిన లక్ష్యాన్ని సాధిస్తుంది ప్రశ్న.

E) వ్యవస్థీకృత (క్రమీకరణ)(Arrengement) ప్రశ్న :

ఏదేని ఒక సంఘటనలోని, కథాంశంలోని వాక్యాల క్రమాన్ని మార్చి, వ్యవస్థితం చేయమని కోరడం ఈప్రశ్నలోని ప్రత్యేకత. ఇది అవగాహనా లక్ష్యంలో అంశాలను వ్యవస్థీకరించగల్గడం అనే స్పష్టీకరణాన్ని సాధిస్తుంది. దీనివల్ల సంఘటనలో ఏదిముందో, ఏది తర్వాతదో విద్యార్థులు గ్రహించగల్గుతారు.

F) వర్గీకరణ (Clasification) ప్రశ్న :

కొన్ని పదాల సమూహమిచ్చి స్వభావం, లక్షణాల ఆధారంగా వానివి సమూహాలుగా విడదీయడం ఈ ప్రశ్న ప్రధాన ఉద్దేశ్యం. అవగాహన లక్ష్యంలో వర్గీకరించగల్గడం అనే స్పష్టీకరణాన్ని ఈ ప్రశ్నరూపం సాధిస్తుంది.

G) దోషసవరణ (Error Correction) ప్రశ్న :

నిర్దేశవాక్యాలు తప్పులో ఒప్పులో తెలుపుతుంది సత్యాసత్యవివేచన ప్రశ్న. ఈప్రశ్న తప్పును గుర్తించి ఆవాక్యాన్ని సరిచేసే అవకాశం కల్పిస్తుంది. దీనివల్ల అవగాహనాలక్ష్యంలో దోషసవరణ అనే స్పష్టీకరణాన్ని సాధిస్తుంది.

H) సహసంబంధ ప్రశ్న :

ఒకవైపు జంట పదాలిచ్చి, మరోవైపు జంటలోని ఒకే పదమిచ్చి, మొదటి జంటలోని పదాల మధ్యగల సంబంధం ఆధారంగా రెండో జంటలోని మొదటిపదానికి సరిపోయే రెండో పదాన్ని సూచించమనడం ఈ ప్రశ్న ప్రత్యేకత. అవగాహనా లక్ష్యంలో సహసంబంధ స్థాపన అనే స్పష్టీకరణాన్ని ఈ ప్రశ్నరూపం సాధిస్తుంది.

పై ప్రశ్న రూపాలతో బాటు అవగాహనా లక్ష్యంలోని మరికొన్ని స్పష్టీకరణల సాధనకు కింది ప్రశ్న రూపాలు ఉపకరిస్తాయి.

| | |
|---|---|
| i) పదప్రయోగప్రశ్న : | పదబంధాల్ని, జాతీయాల్ని వాక్యాల్లో ఉపయోగించడం. |
| ii) సందర్భం(చెప్పడం) : | వాక్యాన్ని లేదా పద్యపాదాన్ని ఎవరు, ఎప్పుడు ఎచట అన్నారో చెప్పడం. |
| iii) సారాంశం / తాత్పర్యం ప్రశ్న : | పద్య, గద్యభాగాల ప్రధానభావాన్ని సంక్షిప్తంగా చెప్పడం. |

iv) శీర్షికానిర్ణయం ప్రశ్న : ఇచ్చిన పరిచ్ఛేదంలోని ప్రధానభావం ఆధారంగా శీర్షికను చెప్పడం.

v) సాధారణీకరణ ప్రశ్న : వివిధ అంశాల్లోని సామ్యాల ఆధారంగా సాధారణీకరణం చేయడం.

vi) పోలికలు, భేదాల ప్రశ్న : రెండు అంతకన్న ఎక్కువ అంశాల మధ్యగల పోలికలు, భేదాలు చెప్పడం.

vii) విరామచిహ్నాల ప్రశ్న: వాక్య సమూహంలో విరామచిహ్నాలు గుర్తించడం.

viii) వివరించే ప్రశ్న : ఒక సామెతనుగాని, జాతీయాన్ని గాని వివరించి చెప్పడం.

ix) సంక్షిప్తీకరణ ప్రశ్న : ఇచ్చిన పరిచ్ఛేదాలను పరిమితిమేరకు కుదించి రాయడం.

x) విశ్లేషణ ప్రశ్న : ఒక అంశాన్ని వివిధకోణాలనుండి పరిశీలించి వివరించడం.

పైన వివరించిన ప్రశ్నరూపాలు జ్ఞాన, అవగాహన లక్ష్యాలనే మదింపు వేయగల్గుతాయి. భావావేశరంగంలోని లక్ష్యాలైన అభిరుచి, అనుభూతి, వైఖరులు, సంస్కృతి సంప్రదాయాలు, సృజనాత్మక శక్తులు మొదలగువావిని, శ్రవణ, భాషణ, పఠన, లేఖన నైపుణ్యాలను అంచనా వేయడానికి పై ప్రశ్న రూపాలు అంతగా సరిపోకపోవచ్చు. విద్యామనో వైజ్ఞానిక నికషల్లో భావావేశరంగానికి సంబంధించిన నికషలు విరివిగా లభిస్తున్నాయి. వీనిని వినియోగించుకొని, పాఠ్యాంశాలలో ఈ లక్ష్యాల సాధనకు ప్రశ్నలు నిర్మించాల్సిన ఆవశ్యకత ఎంతేని ఉంది. అందువల్ల ప్రస్తుతం ఉపయోగిస్తున్న వ్యాసరూప, లఘుసమాధానాల ప్రశ్నరూపాలనే భావావేశ రంగాన్ని మదింపువేయగల్గిన ప్రశ్నలుగా రూపొందించగల్గితే కొంతమేరకు ఆశించిన లక్ష్యాలు నెరవేరుతాయని విద్యావేత్తల అభిప్రాయం.

## 13.10 ప్రశ్నపత్రం తయారీ :

సాధారణంగా ప్రశ్నపత్రాలు నికషలు, పరీక్షలనే పేరుతో తయారుచేయబడతాయి. నికష ఒక గంట కాలానికి ఉద్దేశింపబడింది. పరీక్ష రెండున్నర లేదా మూడు గంటల కాలానికి ఉద్దేశింపబడింది. ఇంతకుముందే ప్రస్తావించినట్లుగా నికష ఒక పాఠానికే పరిమితం. పరీక్ష అలా కాక మూడునెలల కాలంలో, ఆరు నెలల కాలంలో, సంవత్సరకాలంలో పూర్తిచేయబడిన పాఠ్యప్రణాళికాంశాలన్నిటిని తనలో చేర్చుకొంటుంది. ప్రశ్నపత్రాలను ఉపాధ్యాయులే స్వయంగా

తయారుచేయాలి, కారణం వారు ఏ లక్ష్యాలనాశించి బోధిస్తారో ఆ లక్ష్యాలనే మదింపువేయాలి కనుక ఇట్టి ప్రశ్నపత్రం మాత్రమే ఆశించిన ప్రవర్తనా మార్పులకు దర్పణ మౌతుంది. దీనిద్వారా ఉపాధ్యాయులు తమ విద్యార్థుల శక్తియుక్తుల్ని, బలహీనతల్ని సమగ్రంగా అంచనావేయగల్గుతారు. విద్యాసంవత్సరం మొదటే ఉపాధ్యాయులు ప్రశ్నల నిధులు (Question Banks) తప్పనిసరిగా సిద్ధంచేసికొంటే వీనినుండి నికషలకు, పరీక్షలకు అవసరమైన ప్రశ్న రూపాలను ఎంపికచేసికోవచ్చు. దీనివల్ల ప్రశ్న పత్ర నిర్మాణం సులభమవుతుంది. నికషలు తయారు చేసేటపుడు ఉపాధ్యాయులు ఈ కింది అంశాలను విధిగా దృష్టియందుంచుకోవాలి.

i) పాఠ్యవిభాగ నికష (unit test) ఒక బోధనాంశం చివర నిర్వహించేది.
ii) దీని సమయావధి అరవై నిమిషాలు.
iii) ఇది ఇరవై ఐదు గుణముల (Marks) కు ఉద్దేశింపబడింది.
iv) నికషలో ప్రశ్నలీవిధంగా ఉండవచ్చు.
  - ఒక వ్యాసరూపప్రశ్న - 5 గుణాలు.
  - నాల్గు లఘుసమాధాన ప్రశ్నలు $4 \times 2 = 8$ గుణాలు
  - ఇరవై నుండి ఇరవైనాల్గు లక్ష్యాత్మక ప్రశ్నలు. వీనిలో ఒక్కొక్క
    ప్రశ్నకు అరమార్కు వంతున 12 గుణాలు.
v) పాఠంలోని వివిధ శీర్షికలకు సమాన భారత్వమీయాలి.
vi) ప్రశ్నల్లో కొన్ని కఠినంగాను, కొన్ని సులభంగానూ ఉండి కొన్ని సామాన్యమైనవి కూడా ఉండాలి.
vii) అన్ని లక్ష్యాలను దృష్టిలో పెట్టుకొని ప్రశ్నలను తయారుచేయాలి.
viii) వేరు వేరు నికషల్లో వేరువేరు లక్ష్యాత్మక ప్రశ్న రూపాలంనెన్నుకోవాలి. దీనివల్ల వివిధ ప్రశ్నరూపాలు విద్యార్థులకు పరిచయమౌతాయి.
ix) నికష తయారీకి ముందే సంబంధించిన వివిధ పట్టికలు తయారుచేయాలి. (ఆ తర్వాతనే నికషను తయారుచేయాలి.)
x) ప్రశ్నపత్రానికి మాదిరి సమాధాన పత్రం తయారుచేయాలి.
xi) భాషారూపానికే నికషల్లో విశేష ప్రాధాన్యతనీయాలి.
xii) గద్యపాఠాల నికషలలో పదప్రయోగ ప్రశ్న, పద్యపాఠాల నికషలలో పద్యపూరణప్రశ్న విధిగా చేర్చాలి.
xiii) లఘు సమాధాన ప్రశ్నల్లో
  - ఒక ప్రశ్న రచయిత వివరాలను.

- రెండోది సందర్భసహిత వ్యాఖ్యను,

- మూడు నాల్గు ప్రశ్నలు భావావేశరంగాన్ని పరీక్షించాలి.

xiv) వ్యాసరూప ప్రశ్న కూడా భావావేశ రంగాన్ని దృష్టిలో పెట్టుకొనే ఇవ్వాలి.

xv) లిఖితరూప అభివ్యక్తిని వ్యాసరూప, లఘుసమాధాన ప్రశ్నల్లో, అన్ని లక్ష్యాల్లో అంతర్భాగంగా మదింపు వేయవచ్చు.

xiv) పాఠం చివర అభ్యాస వేదికల్లో ఇచ్చిన ప్రశ్నలుగాక ఇతర ప్రశ్నలు తయారుచేసి ఇవ్వాలి.

## 13.11 ప్రశ్నపత్రం (నికష) తోబాటు సిద్ధం చేయాల్సిన పట్టికలు:

కింది పట్టికలు నికషతో బాటు తయారుచేయాల్సి ఉంటుంది. అప్పుడే నికష సమగ్రమౌతుంది.

i) పాఠ్యభాగ భారత్వ పట్టిక (Weightage to Contents) :

| క్ర.సం. | శీర్షిక/పాఠ్యభాగం | గుణాలు | శాతం |
|---|---|---|---|
| 1 | | | |
| 2 | | | |
| 3 | | | |
| 4 | | | |
| | మొత్తం | 25 | 100% |

ii) లక్ష్యభారత్వ పట్టిక (Weightage to objectives) :

| క్ర.సం. | లక్ష్యం | గుణాలు | శాతం |
|---|---|---|---|
| 1 | జ్ఞానం | | |
| 2 | అవగాహనం | | |
| 3 | వైఖరి | | |
| 4 | సంస్కృతి సంప్రదాయాలు | | |
| 5 | రసానుభూతి/సృజనాత్మకశక్తి/ భాషాభిరుచి | | |
| | మొత్తం | 25 | 100 |

iii) ప్రశ్నరూప భారత్వ పట్టిక (Weightage to Question forms) :

| క్ర.సం. | ప్రశ్న రూపం | ప్రశ్నల సంఖ్య | గుణాలు | శాతం |
|---|---|---|---|---|
| 1 | వ్యాసరూపప్రశ్న | 1 | `5 | 25% |
| 2 | లఘుసమాధాన ప్రశ్నలు | 4 | 8 | 32% |
| 3 | లక్ష్యాత్మక ప్రశ్నలు<br>i) ఖాళీలు పూర్తిచేయుట<br>ii) సంభావ్యసమాధానాలు<br>iii) వాక్యప్రయోగం/పద్యపూరణం<br>iv)<br>v)<br>vi) | 20/24 | 12 | 48% |
| | మొత్తం | | 25 | 100% |

iv) ప్రశ్నల కాఠిన్యతా భారత్వ పట్టిక
(Weightage to difficulty level of Questions) :

| క్ర.సం. | కాఠిన్యతాస్థాయి | గుణాలు | శాతం |
|---|---|---|---|
| 1 | కఠినం (Difficult) | | |
| 2 | సామాన్యం (Average) | | |
| 3 | సులభం (Easy) | | |
| | మొత్తం | 25 | 100 |

కాఠిన్యతా స్థాయి నిర్ణయంలో సాధారణంగా భావావేశరంగంలోని లక్ష్యాలకు చెందిన ప్రశ్నలు కఠినమైనవిగా, అవగాహనా లక్ష్యానికి చెందిన ప్రశ్నలు సామాన్యమైనవిగా, జ్ఞాన లక్ష్యానికి చెందిన ప్రశ్నలు సులభమైనవిగా భావించవచ్చు. (ప్రశ్నను నిర్మించే విధాన్ని బట్టి లక్ష్యం మారవచ్చు)

v) పాఠ్యవిభాగ నికష రూపురేఖా విశ్లేషణ పట్టిక (Blue print) :

ఈ పట్టిక మొదటి మూడుపట్టికల సమగ్ర రూపం

| క్రమం | లక్ష్యం | జ్ఞానం | | | అవగాహనం | | | | | | | | | | | | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పాఠ్యాంశం | E | S | O | E | S | O | E | S | O | E | S | O | E | S | O | E | S | O |
| 1 | | | | | | | | | | | | | | | | | | | |
| 2 | | | | | | | | | | | | | | | | | | | |
| 3 | | | | | | | | | | | | | | | | | | | |
| 4 | | | | | | | | | | | | | | | | | | | |
| 5 | | | | | | | | | | | | | | | | | | | |
| | మొత్తం | | | | | | | | | | | | | | | | | | |

పై పట్టికలో : E : వ్యాసరూపప్రశ్న. S : లఘుసమాధాన ప్రశ్న. O : లక్ష్యాత్మక ప్రశ్న.

ఈ పట్టికను పూర్తిచేసే విధం :

ఉదాహరణకు ఒక పాఠాన్ని ఐదు శీర్షికలు చేసి ఐదు రోజులు బోధించారని అనుకొందాం. రచయితకు సంబంధించిన లఘుసమాధాన ప్రశ్న ఒకటో శీర్షికలో (పాఠ్యాంశం) వస్తుంది. అప్పుడు జ్ఞానలక్ష్యంలో లఘుసమాధాన ప్రశ్న వరసలో క్రమసంఖ్య ఒకటికి ఎదురుగా (1) అని రాసి కింద బ్రాకెట్లో (2) అని రాయాలి అంటే ఈ ప్రశ్న ఒకటో పాఠ్యాంశంలో జ్ఞాన లక్ష్యానికి చెందిన లఘు సమాధాన ప్రశ్న అని, దీనికి రెండు మార్కులని తెల్సికోవచ్చు. ఇట్లే అన్ని ప్రశ్నలను శీర్షిక, లక్ష్యం ప్రశ్న రూపాల ననుసరించి పూర్తిచేయగా నిలువు, అడ్డం గళ్ళలో సమాన మొత్తం వచ్చేట్లు చూడాలి.

vi) ప్రశ్నానురూప విశ్లేషణ పట్టిక (Question analysis) :

| ప్రశ్నసంఖ్య | ప్రశ్నరూపం | లక్ష్యం | స్పష్టీకరణం | గుణాలు | కాఠిన్యత | సుమారు రాసే సమయం |
|---|---|---|---|---|---|---|
| 1 | | | | | | |
| 2 | | | | | | |
| 3 | | | | | | |

ఈ పట్టికలో పాఠ్య విభాగ నికషలోని అన్ని ప్రశ్నలు వరసగా విశ్లేషించి రాయాలి. ఈ పట్టిక నికష  ఫలితాల విశ్లేషణకు ఉపకరిస్తుంది.

vii) మాదిరి సమాధాన పత్రం : (Principles of Valuation and Key answer sheet) :

మాదిరి సమాధాన పత్రంలో వ్యాసరూప, లఘుసమాధాన ప్రశ్నలకు విద్యార్థులనుండి ఆశిస్తున్న  సమాధానాల్లోని మౌలికాంశాలను పేర్కొని వానిలో విద్యార్థులు ఎన్ని అంశాలు రాస్తే ఎన్ని  గుణాలియ్యాలో వివరంగా నమోదుచేయాలి. ఉదాహరణకు ఒక లఘుసమాధాన ప్రశ్నకు  సమాధానంగా పేర్కొనదగిన మౌలికాంశాలు నాలుగున్నాయనుకొందాం. ఈ నాల్గింటిని రాస్తే  ప్రతిదానికి $\frac{1}{2}$ గుణం వంతున రెండు గుణాలియ్యాలని, లేక ఏవేని రెండు  మౌలికాంశాలు రాస్తే వానికి ఒక్కొక్క గుణం వంతున రెండు గుణాలీయవచ్చని, లేదా రెంటికి  $\frac{1}{2}$ గుణంవంతున ఒకగుణాన్ని, దోషరహిత వాక్యనిర్మాణానికి మరో గుణాన్ని ఇవ్వాలని  సూచించవచ్చు. లఘుసమాధాన ప్రశ్న ఆశిస్తున్న సమాధానంలోని మౌలికాంశాలు నాలుగుకు  మించకుండా చూడాలి. అట్లే వ్యాసరూప ప్రశ్న ఆశిస్తున్న సమాధానంలోని  మౌలికాంశాలు పదింటికి మించరాదు. వ్యాసరూపప్రశ్నలో విద్యార్థుల రచనారీతికి ఒకటి రెండు  గుణాలు కేటాయించవచ్చు. వ్యాసరూప, లఘుసమాధానాల ప్రశ్నలు పరీక్షల్లో ఎక్కువ కనుక  రచనారీతిని మదింపు వేయడానికి వానిలో ప్రాధాన్యతనీయాలి.  విద్యార్థులుచేసే దోషాలకు గుణాలు ఏ దామాషాలో తగ్గించాలో కూడా స్పష్టంగా పేర్కొనాలి. లక్ష్యాత్మక ప్రశ్నలకు సమాధానంగా ఆశిస్తున్న పదమో, పదబంధమో, అక్షరసంకేతమో ప్రశ్న సంఖ్య కెదురుగా సూచిస్తే సరిపోతుంది. ఈ మాదిరి  సమాధానపత్రం సాయంతో తరగతికి బోధించని ఇతర ఉపాధ్యాయులు (శాస్త్రోపాధ్యాయులే) సమాధానాలకు విలువకట్టవచ్చు. పైన పేర్కొన్న మొదటి ఐదు పట్టికలు సిద్ధం చేసినతర్వాతనే ఉపాధ్యాయులు ప్రశ్నపత్రం తయారుచేయాలి.  ఆ తర్వాత ఆరోపట్టిక, ఏడో పట్టిక సిద్ధంచేయాలి.  ఇట్లు పెక్కు జాగ్రత్తలతో తయారుచేసిన ప్రశ్నపత్రాన్ని అచ్చొత్తించి విద్యార్థులకిచ్చి సమాధానాలు  రాయించాలి. ప్రశ్నలకు సమాధానాలు రాయడంలో ఎట్టి అవాంఛనీయ పరిణామాలను అనుమతించరాదు. విద్యార్థులు రాసిన సమాధానాలను మాదిరి సమాధానాల ఆధారంగా  విలువగట్టి రూప విశ్లేషణ పట్టిక కనుగుణంగా సమాధానాలను విశ్లేషించాలి.

### 13.12 లక్ష్యాత్మక ప్రశ్నలకు విలువకట్టే విధం :

సాధారణంగా ఈ ప్రశ్నల సమాధానాలకు 1/2 గుణం నుండి ఒక గుణాన్ని (Mark) కేటాయిస్తారు. ఈ ప్రశ్నలన్నీ కేవలం ఒక అక్షరసంకేతాన్నో, పదబంధాన్నో, పదాన్నో సమాధానంగా ఆశిస్తాయి. వీనిని దిగువ పద్ధతుల్లో విలువ కట్టవచ్చు.

i) మొత్తం గుణాల్లో ఇవ్వబడిన గుణాలను శాతంలో సూచించడం.
ii) ఎ,బి,సి,డి,ఇ అనే అక్షర సంకేతాల్లో గ్రేడు/స్థాయిని సూచించడం.
iii) పదాలలో విలువ కట్టడం. అసలే బాగులేదు, బాగులేదు, కొంతమేరకు బాగుంది, బాగుంది, చాలా బాగుంది. చాలామంది.
iv) సున్నా (0) నుండి (4) నాల్గు వరకు పాయింట్ల రూపంలో విలువ కట్టడం.

పై వానిని కింది పట్టికలో సులభంగా పోల్చి తెల్పుతుంది.

| పాయింట్లు | 0 | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|---|
| పదాల్లో వివరణ | అసలే బాగులేదు | బాగులేదు | కొంతమేరకు బాగుంది | బాగుంది | చాలా బాగుంది |
| శాతం | 0-20 | 21-40 | 41-70 | 71-90 | 91-100 |
| అక్షర సంకేతం | E | D | C | B | A |

పైవిధంగా విలువ కట్టబడిన సమాధానపత్రాల ఫలితాలు నివేదించడంలో

i) లక్ష్యాలు ఏ మేరకు సాధింపబడ్డాయో చెప్పడం.
ii) విద్యార్థుల ప్రగతి, శక్తియుక్తులు, బలహీనతలను చెప్పడం.
iii) ఉపాధ్యాయుల బోధన పద్ధతులు - బోధన నైపుణ్యం, పాఠ్యపథకంలో రూపొందించుకున్న విధానంలోని లోటుపాట్లను తెల్పడం.
iv) పాఠ్యప్రణాళిక భారత్వాన్ని తెల్పడం, మొదలగునవి ప్రధానంగా ఉపాధ్యాయులు దృష్టియందుంచుకోవాలి. ఫలితాలను చెప్పడంలో వివిధ ప్రశ్నరూపాల మధ్యగల కాఠిన్యతా భేదాన్ని, విద్యార్థులు సమాధానాలిచ్చిన సరళిని కూడా పోల్చిచూడాలి. ప్రశ్నలకు విద్యార్థులు రాసిన

సమాధానాలను విశ్లేషించుట ద్వారా తర్వాత నిర్వహించే నికషల్లో చేర్చుకోదగ్గ ప్రశ్నరూపాలను నిర్ణయించుకోవచ్చు. ఒక విద్యార్థిని మరోవిద్యార్థితో పోల్చడం, ఒక నికషలో విద్యార్థి సాధించిన ఫలితాన్ని మరో నికషలో కనబరచిన ప్రగతితో పోల్చడం ద్వారా విద్యార్థుల ప్రగతిని అంచనా వేయవచ్చు. ప్రశ్నల కాఠిన్యతాస్థాయిని నిర్ణయించుటకు సాంఖ్యకశాస్త్ర పద్ధతుల్ని కూడా ఉపాధ్యాయులు వినియోగించుకోవచ్చు.

ఇట్లు ఒక నికష నిర్వహణకు, ఫలితాల విశ్లేషణకు స్థూలంగా కింది కార్యక్రమాన్ని నిర్వహించాలి.

i) పాఠ్యాంశనిర్ణయం.
ii) లక్ష్యనిర్ణయం, స్పష్టీకరణాల ఎంపిక.
iii) పాఠపథక రచన, బోధన.
iv) నికషలో చేర్చవలసిన ప్రశ్నరూపాల ఎంపిక.
v) ప్రశ్నల తయారీ, వివిధ పట్టికల తయారీ.
vi) నికష నిర్వహణ.
vii) సమాధానాలను విలువకట్టుట.
viii) ఫలితాల విశ్లేషణ, లోపాలను గుర్తించుట.

నికష ఆశించినరీతిలో ఫలితాలనీయకపోతే పై కార్యక్రమంలో ఎక్కడో ఒకచోట లోపం జరగడానికి అవకాశముంటుంది. అందువల్ల ఆలోపాన్ని కనుగొని నివారణకు ప్రయత్నించాలి. ఇట్లు నిర్వహించిన నికషకు సంబంధించిన నివేదికను (విద్యార్జన అభిలేఖ) (విద్యా ఉపలబ్ధి అభిలేఖ) సిద్ధంచేయాలి.

## 13.13 విద్యా ఉపలబ్ధి నికష అభిలేఖ (Scholastic Achievement Test Record) :

విద్యార్థులు ఒక నికషలో సాధించిన ఫలితాల్ని, నికష నిర్మాణ దశనుంచి ఫలితాల విశ్లేషణ వరకు తీసికొన్న కార్యక్రమాన్ని, జాగ్రత్తలను వివరించేదే విద్యా ఉపలబ్ధి నికష అభిలేఖ. ఈ నివేదికలో కింది అంశాలు పొందుపరచాలి.

i) ఉపోద్ఘాతం.
ii) మూల్యాంకనం, ఆవశ్యకత.
iii) వివిధ ప్రశ్నరూపాలు, వాని పరిమితులు.

iv) ప్రస్తుత నికషలో ఉపయోగించుకొన్న ప్రశ్నరూపాలు, వీనిని తయారుచేసిన విధం. వివిధ పట్టికలతో సహా.
v) నికష నిర్వహించిన విధం.
vi) సమాధానాలకు విలువకట్టిన తీరు.
vii) ఫలితాలను సంఖ్యాశాస్త్రంలోకి అనువదించడం.
viii) ఫలితాలను విశ్లేషించడం.
ix) నికష ఫలితాలను క్రోడీకరించడం.
x) విద్యార్థుల్లోని శక్తియుక్తుల్ని, బలహీనతల్ని గుర్తించడం.
xi) నికష అభివృద్ధికి, మెరుగుదలకు సూచనలీయడం.

ఇట్లు తయారుచేసిన నికష నివేదిక ఒక చిట్టి పరిశోధనవలె విద్యార్థుల ప్రగతి సమాచారాన్ని సంబంధితులందరికీ నివేదించగల్గుతుంది. పై పద్ధతిలో నిర్వహించిన మూల్యాంకనం సమగ్రమై విద్యార్థుల పూర్తి అభివృద్ధిని మదింపువేస్తుంది. ఈ ఫలితాల ఆధారంగా ప్రగతిపత్రాలు (Progresscards) క్రమాభివృద్ధి పత్రావళులు (Cummulative Record cards) అభ్యసనాభిలేఖలు (Learning Records) రూపొందించాలి. వీనితో బాటు వివిధ సహపాఠ్య కార్యక్రమాల్ని కూడా మదింపువేయుట ద్వారా భాషాబోధన ఉద్దేశ్యాల్ని సంపూర్ణంగా సాధించవచ్చు. ఉపాధ్యాయులు ఈ విషయంలో నిరంతరం నిబద్ధతతో కృషిచేయాలి.

# పదునాల్గో అధ్యాయం

# నిర్దేశ్యాలు (Assignments)

## 14.01 ఉపోద్ఘాతం :

బోధన వ్యవస్థలో నిర్దేశ్యాలు ఒక ముఖ్యమైన భాగం. నిర్దేశ్యాలు అభ్యసనానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా దోహదపడి విద్యార్థుల ప్రగతికి వంతెనలు కడతాయి. విద్యావేత్తలు నిర్దేశ్యాలను ఈ విధంగా నిర్వచించారు. 'బోధనాభ్యసన సోపానాల్లో భాగమై విద్యార్థులచే ప్రస్తుత పాఠ్యాంశాల పునశ్చరణకు, తదుపరి పాఠ్యాంశాల గుర్తింపుకు తోడ్పడి ఫలవంతమైన, సమర్థమైన అభ్యసనానికి దోహదపడే ప్రశ్నలు లేక వ్యాసక్తుల రూపంలో ఉండేవే నిర్దేశ్యాలు. ఈ నిర్వచనం విస్తృతమై నిర్దేశ్యాల స్వరూప స్వభావాల్ని స్పష్టంచేస్తోంది. భాషాబోధనలో వీనికి ఇనుమడించిన ప్రాధాన్యత ఉంది. ఇవి అభ్యసనాన్ని పునర్బలనం చేసి విద్యార్థుల సర్వాంగీణ వికాసానికి ఉపకరిస్తాయి. నిర్దేశ్యాలు

i) విద్యార్థులను అభ్యసనానికి సంసిద్ధులను చేసేవిగా.

ii) విస్తార పఠనాన్ని ప్రోత్సహించేవిగా.

iii) పాఠ్యాంశాల పునశ్చరణకు తోడ్పడేవిగా.

iv) అభ్యసన లోపాల నివారణకు ఉపకరించేవిగా ఉంటాయి.

ఇవి స్వభావాన్ని బట్టి సైద్ధాంతకాలని, కృత్యాత్మకాలని రెండు విధాలు. ఈనాడు కృత్యాధార బోధనలో కృత్యాత్మక నిర్దేశ్యాలకే ప్రాధాన్యత. కృత్యసాక్ష్యం (Portfolio), కృత్య విశ్లేషణ (Task analysis) కృత్యాత్మక నిర్దేశ్యాల్లో భాగాలే. ఇవి విధానాన్ని బట్టి మౌఖికాలని, లిఖితాలని రెండు విధాలు. నిర్దేశ్యాలు నిర్వహించే స్థలాన్ని బట్టి తరగతి గది నిర్దేశ్యాలు, గృహ నిర్దేశ్యాలు, ప్రయోగశాలా నిర్దేశ్యాలని మళ్ళీ మూడు రకాలు. విద్యార్థుల వైయక్తిక భేదాల ఆధారంగా కూడా వీనిని వర్గీకరించవచ్చు. ఇవి ప్రతిభావంతులైనవారికి, సామాన్యులకు, వెనుకబడినవారికి వేరు వేరుగా సిద్ధంచేయవచ్చు.

## 14.02 నిర్దేశ్యాలు - ప్రయోజనాలు :

నిర్దేశ్యాలకు ఈ దిగువ ప్రయోజనాలు ఉన్నాయి :

i) పూర్వపాఠ్యాంశాలను ప్రస్తుతాంశంతో సమన్వయించడానికి.
ii) విద్యార్థుల అర్జనా తీవ్రతల్లోని లోపాలను తెలిసికోవడానికి.
iii) విద్యార్థుల. విరామసమయాన్ని సద్వినియోగం చేయడానికి.
iv) విద్యార్థుల్లో ఉత్సుకతను పెంచడానికి.
v) విద్యార్థుల్లోని సృజనాత్మకతను వెలికి తీయడానికి.
vi) బోధనాంశాల పునశ్చరణకు.
vii) విద్యార్థుల స్వయంకృషికి ప్రాతిపదిక నిర్మించడానికి.
viii) విద్యార్థుల వైయక్తిక శక్తియుక్తుల్ని గుర్తించడానికి
వీనిని ఉపయోగించుకోవచ్చు.

## 14.03 నిర్దేశ్యాలు - లక్షణాలు :

మంచి నిర్దేశ్యాలకు దిగువ లక్షణాలుంటాయి :

i) నిర్దుష్టత.
ii) సుస్పష్టత.
iii) ఆసక్తికరము.
iv) కృత్యాధారత.
v) వైయక్తిక భేదాలకు తగినవి (గా).
vi) మౌలికాంశాల/భావనల అవగాహనకు తోడ్పడేవి (గా).
vii) లక్ష్యాధారత.
viii) ప్రామాణికత.
ix) విశ్వసనీయత.
x) జౌపయోగికత.

నిర్దేశ్యాలకు ఉపాధ్యాయులు విలువ కడుతున్నపుడు ఈ కింది అంశాలను దృష్టియందుంచుకోవాలి.

i) ఉపాధ్యాయులే స్వయంగా నిర్దేశ్యాలు దిద్దాలి.
ii) దిద్దడానికి అవసరమైతే ప్రతిభావంతులైన విద్యార్థుల సహకారం తీసికోవచ్చు.
iii) నల్లబల్లపై సమాధానాలు రాసి విద్యార్థులనే సరిచూడమనవచ్చు.
iv) నమూనా సమాధానాల ఆధారంగా విద్యార్థులు తమంతతామే ఉపాధ్యాయుల సమక్షంలో దిద్దుకోవచ్చు.

నిర్దేశ్యాలను పాఠ్యబోధనకు ముందు, బోధన మధ్య, బోధనచివర ఇవ్వవచ్చు. నిర్దేశ్యాలు పూర్తిచేయుటకు వీలయినంత తక్కువ సమ

యమియాలి. అరగంట, గంటకాలం నిర్దేశ్యాల సాధనకు సరిపోతుంది. నిర్దేశ్యాలు కాఠిన్యతాస్థాయి కనుగుణంగా తయారుచేస్తే వానిని క్రమీకృత నిర్దేశ్యాలని (Graded Assignments) అంటారు. భాషాబోధనలో క్రమీకృత నిర్దేశ్యాలకే ప్రాధాన్యత ఎక్కువ. ఈ నిర్దేశ్యాలు చూచిరాతలుగా, ప్రశ్నలకు సమాధానాలుగా, అభ్యాసవేదికలను సాధించేవిగా, సహపాఠ్య కార్యక్రమాలను సూచించి నిర్వహించేవి గా ఉపాధ్యాయులు తయారుచేయవచ్చు.

ఇట్లు భాషోపాధ్యాయులు తమ విద్యార్థుల అభ్యసనాన్ని సమర్థం చేయడానికి నిర్దేశ్యాలను ఉపయోగించుకొని బోధన నిర్వహిస్తే భాషాబోధన ద్వారా ఆశించిన ఉద్దేశ్యాలను సాధించవచ్చు.

అనుబంధం - 1

# పాఠబోధన - ఉపాధ్యాయులకు సూచనలు

I) దృశ్యవ్యక్తీకరణం - నల్లబల్ల ఉపయోగం :

i) మొదటనే నల్లబల్లను ఎట్లుపయోగించుకోవచ్చో, దానిపై ఏమేమి రాయాలో నిర్ణయించుకోవాలి.

ii) స్పష్టంగా రాయాలి. అక్షరాలు, పదాలు, వాక్యాల మధ్య నిర్ణీత వ్యవధానం స్పష్టంగా పాటించాలి.

iii) వేగంగా రాయాలి. తప్పులు రాయరాదు.

iv) పెద్దగా రాయాలి. వెనక కూర్చున్న విద్యార్థులకు కూడా కనబడేట్లు రాయాలి.

v) నల్లబల్ల స్థలాన్ని వేరువేరు విషయాలు రాయుటకై విభజించుకోవాలి.

vi) ప్రామాణికమైన సంక్షిప్తరూపాలనే (Abbreviations) ఉపయోగించాలి. భాషలో వీలయినంతవరకు పదాలను సంక్షేపించి రాయరాదు.

vii) పద్యోచిత్రాలు గీసేపుడు జాగ్రత్త తీసికోవాలి.

viii) మౌలికాంశాలు, సారాంశం ఒకపక్క విడివిడిగా రాయాలి.

II. మౌఖికవ్యక్తీకరణం :

i) సాంకేతిక, పారిభాషిక పదజాలాన్ని స్పష్టంగా ఉచ్ఛరించాలి. పరియైన ఊనికతో ఉచ్ఛరించాలి.

ii) ఉచ్చారణ విద్యార్థులు గ్రహించలేదనుకున్నపుడు నల్లబల్లపై రాపి చూపించాలి.

iii) మాట్లాడటంలో సమవేగం పాటించాలి.

iv) స్వాభావిక భాషణం చేయాలి, కృతకభాషణం కూడదు.

v) సంక్లిష్టమైన వాక్యాలను పరిహరించాలి, చిన్న వాక్యాల్లో మాట్లాడాలి.

vi) నిరంతరం మాట్లాడటం కన్న మధ్యమధ్య ఉపకరణాలను ప్రదర్శించాలి. విద్యార్థుల్ని మాట్లాడించాలి.

vii) నల్లబల్ల మీది రాత, భాషణం మధ్య సమన్వయముండాలి.

viii) భాషణంలో ఊతపదాలు తగ్గించాలి.

ix) కంఠధ్వనిలో సమతూకం ఉండాలి.

x) విద్యార్థుల దృష్టిని, అవధానాన్ని హెచ్చరికలతో పాఠంవైపుమళ్ళించాలి.

xi) పాఠం చివర ముఖ్యాంశాలను క్రోడీకరించి చెప్పాలి.

III. శ్రోతల (సభికుల) స్పృహ, (Awareness of audience) :

i) విద్యార్థులతో నయనసంబంధం స్థాపించాలి.

ii) ఒకేచోట నిలబడక తరగతిలో అన్నివైపులా కదలాలి.

iii) బోధనాంశాన్ని పూర్వాంశాలతో, పూర్వానుభవాలతోపోల్చాలి. వాని మధ్య సహసంబంధాన్ని స్థాపించాలి.

iv) శ్రోతల అవధానాన్ని ఆకర్షించాలి.

v) విద్యార్థుల్లో ప్రతిభావంతులూ, మందబుద్ధులూ ఉంటారని గుర్తించాలి.

vi) విద్యార్థుల మనస్సుల్ని బోధనద్వారా చూరగొనాలి.

vii) విద్యార్థులను ప్రేమగా చూడాలి.

viii) వ్యక్తీకరణకనువైన హావభావ ప్రదర్శన చేయాలి.

ix) తరగతిలోని ప్రతి విద్యార్థికి సమాధానమిచ్చే అవకాశం క్రమపద్ధతిలో కల్పించాలి.

x) సమాధానాలు చెప్పలేని విద్యార్థులతో, ఇతర విద్యార్థులు చెప్పిన సమాధానాలను చెప్పించాలి.

xi) విద్యార్థుల్లో ఆశిస్తున్న ప్రవర్తనా మార్పులేవో స్పష్టంగా బోధనకు ముందే నిర్ణయించుకోవాలి. వాని కనుగుణంగా బోధన వ్యూహాలను ఎంపిక చేసికోవాలి.

## అనుబంధం - 2

ఉపాధ్యాయుల బోధననైపుణ్యం ఈ కింది విషయాల ఆధారంగా మదింపువేయబడుతుంది. అందువల్ల ఉపాధ్యాయులు కింది అంశాలను దృష్టియందుంచుకోవాలి.

1. పాఠ్యవిషయ జ్ఞానం ఉపాధ్యాయులకుంది.
2. పాఠ్యవిషయాన్ని స్పష్టంగా వివరించగలరు.
3. విద్యార్థుల అవసరాలను గుర్తించగలరు.
4. విద్యార్థులకు సాయపడే మనస్తత్వముంది.
5. విద్యార్థుల భావాలను, అభిప్రాయాలను మన్నిస్తారు.
6. తరగతిని ఆసక్తికరంగా రూపొందిస్తారు.
7. విద్యార్థుల్లో ఆలోచనాశక్తుల్ని ప్రేరేపించగలరు.
8. పాఠ్యాంశాలను అనుభవాలతో పోల్చి చెప్పగలరు.
9. తమ పరిధులను తాము గుర్తించగలరు.
10. తరగతిగదిని సమర్థంగా నిర్వహించగలరు.
11. అవసరమైతే బోధన వ్యూహాలను మార్చుకుంటారు.
12. విద్యార్థుల్ని స్వయం అభ్యసనానికి ప్రోత్సహిస్తారు.
13. ఇంటిపని మితంగా తగినంత ఇస్తారు.
14. తరగతిని క్రమశిక్షణలో ఉంచుతారు.
15. విద్యార్థుల శక్తియుక్తుల్ని, బలహీనతల్ని గుర్తిస్తారు.
16. తరగతిలో బోధన సమయాన్ని సద్వినియోగం చేస్తారు.
17. తరగతి వెలుపల కూడా విద్యార్థుల సందేహాల్ని నివృత్తిచేస్తారు.
18. తరగతికి సిద్ధపడి తగిన బోధన వ్యూహాలతో వస్తారు.
19. విద్యార్థులడిగిన ప్రశ్నలకు సమయస్ఫూర్తితో సమాధానాలిస్తారు.
20. తాము క్రమశిక్షణ పాటిస్తారు.
21. విద్యార్థుల తలిదండ్రులతో సంబంధం కల్గి ఉంటారు.
22. విద్యార్థులను పేరుపేరునా గుర్తిస్తారు.
23. అందరు విద్యార్థుల ఎడ సమానాదరాన్ని చూపుతారు.
24. విద్యార్థుల శక్తియుక్తుల్ని ప్రోత్సహిస్తారు.

# అనుబంధం - 3

ప్రశ్నాపత్రం - 1

## కాకతీయ విశ్వవిద్యాలయం

అక్టోబర్, 1994

Faculty of Education
B.Ed. Examination
(New Regulations)

Methods of Teaching : TELUGU

Paper V

Time : Three Hours] [Maximum Marks : 100

భాగము 'అ'

ఈ క్రిందివాటిలో ఏవేని తొమ్మిదింటికి 15 పంక్తులు మించని సమాధానములు వ్రాయండి.

(మార్కులు) 9×5=45

1. ప్రథమ భాష, ద్వితీయభాష, తృతీయభాషలు అననేమి?
2. 'త్రిభాషా సూత్రము' - అనగానేమి?
3. "అభినయ గీతములు" ఏ దశ విద్యార్థులకు ఉపకరించును? వానిని నీవెట్లు నిర్వహించెదవు?
4. "ఆదర్శ పఠనం, పునః పఠనం, ప్రకాశ పఠనం"లు అననేమి?
5. ఉక్తలేఖనము ప్రయోజనములెట్టివి?
6. వ్యాకరణ బోధనా ప్రయోజనములెట్టివి?
7. "సూక్ష్మాంశ బోధన" (Micro-Teaching) అనగానేమి?
8. "పూర్వజ్ఞాన పరిశీలనము", "ఉన్ముఖీకరణము"లు అననేమి?
9. విద్యార్థులకు ఇంటిపనిని ఇచ్చునపుడు ఎట్టి దృష్టి అవసరము?
10. భాషా బోధనలో బోధనోపకరణముల ఆవశ్యకత ఎట్టిది?
11. బోధనలో టేప్‌రికార్డరు ఉపయోగపడు సందర్భమును వివరింపుము.

12. పఠన నైపుణ్యా ప్రాముఖ్యత ఎట్టిది?

13. "ప్రదర్శనము" అను సోపానమును ఎట్లు నిర్వహించెదవు?

భాగము 'ఆ'

ఈ క్రింది ప్రశ్నలలో ఏవేని ఐదింటికి 25 పంక్తులు మించని సమాధానములు వ్రాయుము.

(మార్కులు) 5×8=40

1. భాషా బోధనలో భాషాశాస్త్ర అధ్యయన ఆవశ్యకత ఎట్టిది?

2. ఉత్తమ శ్రవణ లక్షణములు తెలిపి, శ్రవణ లోపమునకు గల ప్రధాన కారణములను పేర్కొనుము.

3. వర్ణోచ్చారణ స్థానములనగా నేమి? ఏవేని ఐదు ఫలితములను, ప్రయత్నములను వివరింపుము.

4. మాధ్యమిక దశ విద్యార్థులలో వక్తృత్వము, వ్యాసరచనలను, ఎట్లు పెంపొందించెదవు?

5. పద్య బోధనలో "స్థూలార్థ సంగ్రహణం" - కవితా సౌందర్యముల ప్రాముఖ్యత ఎట్టిది?

6. "చర్చ" మరియు "పునర్విమర్శ"లలోని ప్రశ్నలను ఎట్లు నిర్వహించెదవు? ఎందుకు?

7. "ప్రధాన వాచకము, ఉప వాచకములు ఒకదానికొకటి పూరకములు" దీనిని వివరింపుము.

8. మూల్యాంకన సాధనములను వివరింపుము.

భాగము 'ఇ'

ఈ క్రింది ప్రశ్నలలో ఏవేని ఒక ప్రశ్నకు 50 పంక్తులు మించని సమాధానములు వ్రాయుము.

(మార్కులు 1×15=15)

1. భాషా బోధనలో వాచక చర్యయొక్క ప్రయోజనములను తెలిపి, ఒక భాషోపాధ్యాయుడిగా నీవు వివిధ దశల విద్యార్థులల్లో దీనిని పెంపొందించుటకు ఎట్లు ప్రయత్నించెదవో విపులముగా విశదీకరింపుము.

2. అధికార భాషగా తెలుగును అమలుపరచు విధానమును సమగ్రముగా చర్చింపుము.

3. నీకు తెలిసిన ఒక నీతి పద్యమును వ్రాసి, దానికి సమగ్ర పాఠ్య పథకమును సిద్ధము చేయుము.

ప్రశ్నపత్రం - 2

## నాగార్జున విశ్వవిద్యాలయం

## B.Ed. DEGREE EXAMINATION, OCTOBER 1993
## Course VI - TELUGU EDUCATION

Time : Three hours　　　　Maximum : 100 marks

పార్టు ఎ నుండి ఏవేని పది ప్రశ్నలకు సమాధానములు వ్రాయుము.

పార్టు బి నుండి ఏవేని రెండు ప్రశ్నలకు సమాధానములు వ్రాయుము.

పార్టు ఎ లోని ప్రతి ప్రశ్నకు సమాధానము $1\frac{1}{2}$ పేజీకి మించరాదు.

పార్టు బి లోని ప్రతి ప్రశ్నకు సమాధానము 5 పేజీలకు మించరాదు.

పార్టు ఎ --- (10×6=60 మార్కులు)

1. 'నాటక ప్రదర్శన' (నాటకీకరణ) యనే అంశము భాషణాభివృద్ధికి ఎట్లు తోడ్పడుతుంది?
2. 'క్రీడా పద్ధతి' అనగానేమో తెలిపి, వివిధ భాషా క్రీడలను తెలుపండి.
3. మంచి దస్తూరికి ఉండవలసిన లక్షణములేవి?
4. 'వ్యాసరచన'లో విద్యార్థులకు నీవు ఎట్లు తోడ్పడుదువు?
5. మాతృభాషను నిర్వచించుము. మాతృభాషా ప్రయోజనములను నాల్గింటిని పేర్కొనుము.
6. వివిధ ప్రణాళికలను మాతృభాషా బోధన లక్ష్యసిద్ధికి అనుగుణముగా వివరించండి.
7. ఆధునిక తెలుగు సాహిత్య బోధన వలన సిద్ధించు ప్రత్యేక ప్రయోజనములేవి?
8. 'సూక్ష్మాంశ బోధన పద్ధతి'ని మాతృభాషా బోధనకు అన్వయించి వివరించండి.
9. తెలుగును పరిపాలన భాషగా అమలు చేయుటకు నిర్వహించవలసిన కృత్యములేవి?

10. మాతృభాషా బోధనలో వినియోగించదగు ఆకాశవాణి కార్యక్రమములేవి?

11. 'ఉద్యమ పద్ధతి' అనగానేమో వివరించి, రెండు మాతృభాషా ప్రాజెక్టులను వివరించండి.

12. వ్యాకరణ బోధనలో అనుసరించదగిన నవీన బోధన పద్ధతిని వివరించండి.

13. 'సాహిత్యోపవ్యాసములు' భాషాబోధనలో ఎట్లు ఉపయోగపడును?

14. మౌనపఠన ప్రయోజనములను ఐదింటిని తెలిపి, మౌనపఠన వేగమును పెంపొందింపజేయుటకు నీవు చేపట్టు కార్యములను వివరించుము.

15. 'పఠన బోధన పద్ధతులు' (పఠనమును నేర్పు పద్ధతులు) వివరించండి.

పార్టు బి --- (2×20=40 మార్కులు)

16. మాతృభాషా బోధకుడు చతుర్విధ భాషా నైపుణ్యములను అభివృద్ధిచేయుటకు చేపట్టవలసిన కార్యక్రమములను సమీక్షించుము.

17. 'ఆధునిక మూల్యాంకన విధానము' నందలి అంశములను వివరింపుము.

18. 'మాతృభాషా బోధన' ద్వారా సిద్ధింపజేయు విలువలను చర్చించుము.

19. 'భాష'ను నిర్వచించి, భాషయొక్క సర్వసాధారణ ప్రయోజనములను వివరించండి.

ప్రశ్నపత్రం - 3

# శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం

## B.Ed. DEGREE EXAMINATION-NOVEMBER, 1993

## PART A-THEORY

## PAPER V OR VI-(CONTENT AND METHODOLOGY OF SCHOOL SUBJECTS I & II)

## (f) TELUGU

Time : 3 Hours] [Marks : 90

### సెక్షన్ I

ఈ క్రింది ప్రశ్నలలో ఏ పదింటికైనను అతి సంగ్రహముగా సమాధానములు వ్రాయుము.

ప్రతి సమాధానము దాదాపు అర్థపుట ఉండవలెను. 10×3=30

1. మాతృభాషను నిర్వచింపుము.
2. భాష-భావం ఈ రెండింటికి గల సంబంధము వివరించుము.
3. మాండలిక భాష-వ్యవహారిక భాషలను గురించి తెల్పుము.
4. పాఠశాలలో మాతృభాషా స్థానం వివరించండి.
5. అవగాహనకు ఆనందానుభూతికిమున్న సంబంధాన్ని వివరించండి.
6. భాషల ప్రాధాన్యతను గురించి వివరించండి.
7. నాటకీకరణకు, నాటక ప్రదర్శనకు భేదాలేమి?
8. అధ్యాపకునకు ధ్వన్యుత్పత్తి విజ్ఞానం అవసరం ఏమిటి?
9. ఉన్మఖీకరణము - సింహావలోకనము - గ్రైహికము ఈ మూడింటి ప్రశ్నలలో వైవిధ్యము తెల్పుము.
10. సారస్వత సంఘములు అనగానేమి? వీటివలన ప్రయోజనమేమి?
11. వాచక ప్రయోజనా లేమిటి?
12. మాతృభాషలో దశానుగుణంగా వినియోగించే బోధనోపకరణాలేమిటి?
13. నిఘంటువులలోని రకాలేమిటి? ఉదహరించండి.
14. మాంటిసోరి - కిండర్‌గార్డెను పద్ధతుల మధ్య తేడాలేమిటి?
15. పర్యవేక్షణాధ్యయనం ప్రయోజనాలేమిటి?

## సెక్షన్ II

ఈ క్రింది ప్రశ్నలలో ఏ ఆరింటికైనను సమాధానములు వ్రాయుము. ప్రతి సమాధానము దాదాపు $1\frac{1}{2}$ పుటలలో నుండవలెను 6×5=30

16. మాతృభాషా ప్రయోజనములను తెల్పుము.
17. తెలుగు భాషపై సంస్కృతి భాషా ప్రభావమును సోదాహరణముగా తెల్పుము.
18. త్రిభాషా సూత్రమును సమర్థించుము.
19. లిపి సంస్కరణ ఆవశ్యకతను గురించి వ్రాయుము.

20. మాతృభాషాధ్యాపకుడు ఏయే ప్రత్యేక లక్షణములను కల్గియుండవలెను.

21. ఉద్దేశ్యం, లక్ష్యము, స్పష్టీకరణము ఈ మూడింటికిగల భేదమును సమర్థించుము.

22. ప్రాచీన బోధనా పద్ధతులకన్న ఆధునిక బోధనా పద్ధతులు మిన్న సమర్థించుము.

23. బాలగేయములు అని వేటినందురు? వాటివలన ప్రయోజనమేమి?

24. మౌన పఠనము అనగానేమి? మౌన పఠనమువలన ప్రయోజనమేమి?

25. గద్య బోధనోద్దేశ్యము వ్యాకరణమును బోధించుట ఎట్లు?

## సెక్షన్ III

ఈ క్రింది వానికి నాలుగు పుటలలో జవాబులు వ్రాయుము.2×15=30

26. (a) తెలుగు వాచకమున కుండవలసిన బాహ్య అంతర లక్షణములను పేర్కొని, నేటి తొమ్మిదవ తరగతి తెలుగు వాచకము స్థాయి సమీక్షింపుము.

లేదా

(b) లిఖిత చర్యా దోషములు ఎన్ని రకములు? వాటిని పేర్కొనుము. తగిన నివారణోపాయములు సూచింపుము.

27. (a) రచన అనగానేమి? మాధ్యమిక దశ విద్యార్థులలో ఏయే రచనా విధానములు పెంపొందించెదవు?

లేదా

(b) పద్య బోధనా పద్ధతులు తెల్పి, అందు ఏది ఉత్తమమైన పద్ధతియో ఉదాహరణ పూర్వకముగ సమర్థించుము.

# శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

## B.Ed. DEGREE EXAMINATION-SEPTEMBER, 1994

## PART A-THEORY

## PAPER VI-CONTENT AND METHODOLOGY OF TEACHING SCHOOL SUBJECT : II (F) TELUGU

(1991 REGULATIONS)

Time : 3 Hours] [Max. Marks : 90

### విభాగము I

1. క్రింది ప్రశ్నలలో ఏ పదింటికైనను సంక్షిప్తంగా ప్రతి దానికి పది పంక్తులు మించకుండా సమాధానాలు వ్రాయుము:- 10×3=30

(a) 'సాహిత్యజ్ఞానం' లక్ష్యానికి స్పష్టీకరణలు రాయుము. ఇవి తెలియుట వలన ఉపాధ్యాయునికి చేకూరు ప్రయోజనమేమి?

(b) 'సంస్కృతి' అననేమి? భాషాబోధన ద్వార మన సంస్కృతి పట్ల విద్యార్థులకు ఎట్లు మక్కువ కలుగజేయ వచ్చును?

(c) 'అవగాహనం' అననేమి? అవగాహనానికి సంబంధించిన స్పష్టీకరణాలు రాయుము.

(d) మా౦ ౹ిజీక (Monthly test) పత్రాన్ని తయారుచేయునపుడు ఏ అంశాలను దృష్టియు౦ంచు కొనవలెను?

(e) విస్తార పఠనం అననేమి? విద్యార్థుల విస్తార పఠన సామర్థ్యాన్ని అభివృద్ధి చేయుటకు మీరేమి చేయుదురు?

(f) లక్ష్యరూప లేక విషయనిష్ఠ ప్రశ్నల (objective type) లక్ష్యమేమి? వీనిని తయారు చేయునపుడు ఏ యే అంశాలను దృష్టియందిడు కొనవలెను?

(g) శ్రవణ నైపుణ్యాన్ని అభివృద్ధి చేయుటకు భాషోపాధ్యాయుడు చేపట్టవలసిన కృత్యాలు ఏవి?

(h) ప్రాథమిక తరగతుల విద్యార్థుల భాషాభ్యసనానికి టి.వి., వీడియో క్యాసెటు రికార్డర్లు ఎట్లు తోడ్పడును?

(i) 'ఉక్తలేఖనం' అననేమి? ఉక్తలేఖనం ద్వార ఏ భాషానైపుణ్యాన్ని అభివృద్ధి చేయవచ్చును?

(j) 'ఉప వాచకం' లేక సహాయవాచకం అననేమి? ఇది ఎట్లుండవలెను?

(k) 'ద్రుతాంతాలయిన పదాలు ద్రుత ప్రకృతికాలు' సోదాహరణంగా వివరించండి?

(l) 'రుగాగమాన్ని' సోదాహరణంగా వివరించండి?

(m) 'ఉత్పలమాల' లక్షణాన్ని వివరింపుము.

(n) రూపకాలంకారాన్ని సోదాహరణంగా వివరించండి.

(o) బహువ్రీహి సమాసాన్ని ఉదాహరణాల సహాయంతో వివరించండి.

విభాగము II

2. క్రింది ప్రశ్నలనుండి ఏ ఆరింటికైనను ప్రతిదానికి $1\frac{1}{2}$ పుటలకు మించని సమాధానాలు రాయండి:- 6×5=30

(a) గిడుగు వేంకటరామ మూర్తిగారు వ్యావహారిక భాషోద్ధరణకోసమే పుట్టారనుటను సమర్థించుము.

(b) స్వాతంత్ర్యోద్యమానికి భాషాసాహిత్యాలు ఎట్లు తోడ్పడినవి?

(c) గద్యబోధన ఉద్దేశాలేవి? వానిని సాధించుటకు తెలుగు భాషోపాధ్యాయుడేమి చేయవలెను?

(d) వ్యక్తి పద్ధతి లేక డాల్టన్ పద్ధతి అనగా నేమి? వ్యక్తి పద్ధతిని అనుసరించి ఉన్నత తరగతులకు తెలుగు గద్యాన్ని ఎట్లు బోధించవచ్చును?

(e) క్షుణ్ణ పఠనాభివృద్ధికి తోడ్పడు పాఠ్య పుస్తకాన్ని ఏమందురు? అది ఎట్లుండవలెను?

(f) వ్యాకరణ బోధనకు నిగమోపపత్తి, అనుమానోపపత్తి పద్ధతులలో ఏది ఉత్తమమైంది? సోదాహరణంగా వివరింపుము?

(g) ఉక్తరచన అనగా నేమి? విద్యార్థులలో ఉక్తరచన సామర్థ్యాన్ని అభివృద్ధి చేయుటకు మీరే కార్యక్రమాలను చేపట్టెదరు?

(h) పఠన బోధన పద్ధతు లేవి? వానిలో అన్నింటికన్న ఉత్కృష్టమైన పద్ధతి ఏది? సహేతుకంగా సమర్థింపుము

(i) పర్యవేక్షితాధ్యయనం అన నేమి? దాని ప్రయోజనా లేవి? దాని నెట్లు నిర్వహింపవలెను?

(j) 'ఉపాధ్యాయులలో తెలుగు భాషోపాధ్యాయుని పాత్ర ప్రత్యేకమైంది' చర్చింపుము.

విభాగము III

3. ఈ క్రింది ప్రశ్నలకు నాలుగు పుటలకు మించని సమాధానాలు రాయండి:- 2×15=30

(a) త్రిభాషా సూత్రం అనగా నేమి? అది మనరాష్ట్ర ప్రజలకు ఎంతవరకు ప్రయోజనకారి?

లేదా

'మాతృ భాషామాధ్యమంతో బోధన విద్యార్థుల సర్వతో ముఖాభివృద్ధికి మూలం' చర్చింపుము

(b) మన సాంప్రదాయ పరీక్షలలో నున్న లోపాలేవి? వానిని మూల్యాంకన విధానం ద్వార ఎట్లు నివారింపవచ్చును? సహేతుకంగా చర్చించుడు.

లేదా

పాఠ్య పుస్తకం అననేమి? భాషకు సంబంధించిన పాఠ్య పుస్తకాలు వాచకాలు భాషేతర పాఠ్య పుస్తకాలలో నున్న భేదమేమి? వాచకాలు ఎట్లుండవలెను?

# శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం

B.Ed. Degree Examination : October 1993

Paper VI Telugu

Time - 3 hrs] [Marks - 100

## Section-I

ఈ క్రింది వానిలో ఏ పదింటికైనను ఒక్కొక్కదానికి $1\frac{1}{2}$ పుటకు మించకుండా సమాధానము వ్రాయుము. 10×3=30

1. భాషా దోషమనగానేమో వివరింపుము?
2. అనువాదముయొక్క ఆవశ్యకతను తెలుపుము?
3. బోధనోపకరణములననేమి?
4. పాఠ్యగ్రంథమవసరమును తెలుపుము?
5. భాషాధ్యయనములోగల త్రివిధ జ్ఞానములను వ్రాయుము?
6. పద్యబోధనలోగల విశిష్టతను తెలుపుము?
7. ఉపవాచకము ఏ పఠనమును పెంపొందించును?
8. ఉచ్ఛారణ దోషములననేమి?
9. సింహావలోకనమనగానేమి?
10. తెలుగుపై సంస్కృత భాషాధిక్యత కలదు. చర్చింపుము?
11. బాహ్యపఠనముయొక్క ఆవశ్యకత?
12. నైపుణ్యం స్థాయిని నిర్దేశించును చర్చింపుము?
13. విద్యార్థులలో మౌనపఠనావశ్యకతను తెలుపుము?
14. భాషాబోధనలో మూడంచెల విధానమవసరమా?
15. పాఠ్యప్రణాళిక అననేమి?

## Section-II

ఏవేని ఆరింటికి సమాధానాలు వ్రాయుము. సమాధానాలు ఒక్కొక్కటి $1\frac{1}{2}$ పుటకు మించకూడదు. 6×5=30

16. భాష ప్రయోజనములను గూర్చి వ్రాయునది.
17. భాష, భాషేతర విషయ అనుసంధానము చర్చింపుము?
18. నేటి త్రిభాషా సూత్రముయొక్క పూర్వాపరాలను చర్చింపుము?
19. క్రీడాపద్ధతి అనగానేమి? అది భాషాబోధనకెట్లుపకరించును?
20. వ్యాసరచనావశ్యకతను గురించి తెలుపుము?
21. బాహ్యపఠనము ఏ స్థాయిలో చేయుదువు? అది విద్యాబోధనకెట్లు ఉపకరించును?
22. వ్యాకరణ బోధనావశ్యకతను తెలిపి, అది ఏ స్థాయిలో చోటుచేసుకున్నదో వివరింపుము?
23. భాషా బోధకుడికుండవలసిన లక్షణములను తెలుపుము?
24. విద్యార్థుల భాషాదోషములను, నివారణోపాయములను సోదాహరణముగా తెలుపుము?
25. ఉత్తమ పాఠ్యగ్రంథమునకుండవలసిన అంతర్లక్షణములను చర్చింపుము?

## Section-III

ఏవేని రెండింటికి సమాధానాలు వ్రాయుము 2×10=20

26. మాతృభాషా బోధనలోని లక్ష్యములను, స్పష్టీకరణములను సోదాహరణముగా తెలుపుము?

లేదా

నేటి విద్యావిధానంలో పాఠ్యగ్రంథంయొక్క ఆవశ్యకతను తెలిపి, అవి మాతృభాషాధ్యయనమునకెట్లుపకరించునో తెలుపుము?

27. పద్యబోధన పద్ధతులను తెలిపి, వివిధస్థాయిలలో నీవు ఆచరించు విధానమును సోదాహరణముగా తెలుపుము?

లేదా

ఉద్యమ పద్ధతి (Project Method)ని గూర్చి వ్రాయుము.

## ఆంధ్రవిశ్వవిద్యాలయం

ప్రశ్నాపత్రం-6

## B.Ed. DEGREE EXAMINATION, 1990

(NEW REGULATIONS)

PART I-THEORY

METHODS OF TEACHING SCHOOL SUBJECTS

TELUGU

(Time : 3 Hours)

Maximum : 80 marks

విభాగము A

ఇందు పన్నెండు ప్రశ్నలకు సమాధానము వ్రాయుడు
(సమాధానము 15 పంక్తులకు మించకూడదు) 12×5=60

1. 'భాష మానవునకు వరప్రసాదము' ఎట్లు?
2. ఆధునిక, సంప్రదాయ బోధనాపద్ధతులకుగల భేదమేమి?
3. కథాకథనములో కథాచిత్రముల పాత్రయెట్టిది?
4. లేఖన సంసిద్ధత అనగానేమి?
5. విద్యార్థులలో నిక్షిప్తమైయున్న సృజనాత్మకశక్తిని వెలికితీయు మార్గములను వివరించండి.
6. పద్యబోధనలో సంగీతమునకుగల స్థానమెట్టిది?
7. గద్యబోధనా లక్ష్యములను పేర్కొనండి.
8. ప్రాయోగిక వ్యాకరణ మననేమో వివరించండి.
9. మాతృభాషా బోధనలో బోధనోపకరణముల పాత్రయెట్టిది?
10. 'భాష సంస్కృతిని ప్రతిబింబించును' ఎట్లు?
11. మౌనపఠన దోషములననేమి? వానినెట్లు నిర్వహించెదవు?
12. బృందగానములననేమో వివరించండి.

13. ఉన్ముఖీకరణము, సింహావలోకనము, గైహిక సోపానములలో వేయు ప్రశ్నలకు గల భేదమును తెలపండి.

14. చతుర్విధ భాషానైపుణ్యములను వివరించండి.

15. వార్షిక ప్రణాళిక ఆవశ్యకత యేమి?

16. పాత పరీక్షా విధానములోని లోటుపాట్లను వివరించండి.

17. ఏడవతరగతికి అనువగు పద్యమును వ్రాసి దానికి ఉన్ముఖీకరణ సోపానాన్ని సిద్ధంచేయండి.

18. పాఠశాల పత్రిక విద్యార్థులకేవిధముగ ఉపయోగపడును?

విభాగము B

ఈ క్రింది ప్రశ్నలలో ఏ రెండింటికైనను సమాధానము వ్రాయునది (సమాధానములు 30 పంక్తులు మించరాదు) 2×10=20

1. పద్యబోధనలో రసాస్వాదమును విద్యార్థులచే యెట్లు చేయింతువు?

2. క్రీడామార్గమును నిర్వచించి మాతృభాషా బోధనకు అదియెట్లు తగియున్నదో వివరింపుడు.

3. ఉత్తమ పఠన లక్షణములను పేర్కొని విద్యార్థుల పఠన సామర్థ్యమును ఎట్లు అభివృద్ధిచేయుదువో క్లుప్తముగ వివరించండి.

ప్రశ్నపత్రం - 7

Telugu Pandits Training Certificate Examination February, 1994

Methods of Teaching Telugu

Telugu Medium

Time : 3 Hours] [Marks : 100

సూచనలు: 1. మొదటి ఎనిమిది ప్రశ్నలలో ఏ ఐదింటికైనా సమాధానాలు వ్రాయాలి. ప్రతి ప్రశ్నకు 16 మార్కులు.
2. తొమ్మిదవ ప్రశ్నకు విధిగా సమాధానం వ్రాయాలి. మార్కులు 20. తొమ్మిదవ ప్రశ్నతో సహా సమాధానాలు వ్రాయవలసిన ప్రశ్నలు ఆరు.

1. "పరభాషద్వారా నేర్చే విద్య సోపానాలు లేని సౌధంవంటిది" చర్చించుము.

2. వాచిక చర్య ఆవశ్యకతను తెలిపి దాని అభివృద్ధికి మార్గాలను సూచించుము.

3. పఠనలేఖనాల పౌర్వాపర్యమును వివరించుము.

4. ఉద్యమ పద్ధతిలో భాషాబోధనకు గల స్థానమును తెలిపి, ప్రయోజనాలను పరిమితులను పేర్కొనుము.

5. విద్యార్థులు చేసే కొన్ని ధ్వని దోషాలను పేర్కొని వాటికిగల కారణాలను పరిష్కారమార్గాలను తెలుపుము.

6. వైయాకరణుని వ్యాకరణాధ్యయనమునకును విద్యార్థి వ్యాకరణ పఠనమునకునుగల భేదమును వివరించుము.

7. పద్యాన్ని సాంప్రదాయికంగా బోధించే కొన్ని పద్ధతులను తెలిపి అందు ఉత్తమమైన పద్ధతిని పేర్కొనుము.

8. ఈ క్రిందివానిలో రెండింటికి సంగ్రహముగా సమాధానములు వ్రాయుము.

   అ. ఉత్తమ పరీక్షాపత్ర లక్షణాలు.
   ఆ. ద్వితీయ భాషగా తెలుగుబోధన.
   ఇ. వాచక బోధనకు ఉపవాచక బోధనకుగల భేదాలు.
   ఈ. భాషావస్తు ప్రదర్శనశాలలు.

9. ఈ క్రిందివానిలో ఏదేని ఒకదానికి తరగతి నిర్ణయించేసి లక్ష్యములు స్పష్టీకరణములు వ్రాసి పాఠ్యపథకంను తయారుచేయుము.

   ద్విరుక్తటకారసంధి

లేదా

అవని విదీర్ణమైనను హిమాద్రి చలించుటగల్గినన్ మహా
ర్ణవ మదియింకినన్ దివసనాథుడు జంద్రుడు తేజమేదినన్
కువలయనాథ నీకు నొక కుత్సిత భావముగల్గ నేర్చునే
భూ[illegible]దుపయోగ్యమైన నృప భారము నాకు వహింప శక్యమే.

ఉస్మానియా విశ్వవిద్యాలయం

**FACULTY OF EDUCATION**

**B.Ed., EXAMINATION, SEPTEMBER 1994**

**Subject : METHODS OF TEACHING TELUGU Paper V(b)**

Time : 3 Hours] [Max. Marks : 100

ఎ భాగం

6 × 10 = 60 మార్కులు

ఈ క్రింది ప్రశ్నలలో ఏవేని పదింటికి సమాధానాలు రాయండి
ప్రతి ప్రశ్నకు మార్కులు 6

1. మాతృభాషను నిర్వచించి వివరించండి.

2. ప్రాథమిక, ఉన్నత తరగతుల్లో మాతృభాషా బోధన ఉద్దేశ్యాల్లోని భేదమేమి?

3. 'అధికార భాషగా' తెలుగు వినియోగ పడ్తున్న తీరును సమీక్షించండి.

4. 'విద్యాప్రణాళిక - విషయప్రణాళిక - పాఠ్యప్రణాళిక' భావనలు వివరించండి.

5. భాషణ సామర్థ్యాన్ని విద్యార్థుల్లో పెంపొందించడానికి మీరు చేపట్టే చర్యలేవి?

6. విద్యార్థుల్లో సృజనాత్మక శక్తుల్ని పెంపొందించడానికి భాషా బోధనలలో మీరు సూచించే చర్యలేవి?

7. 'శ్రవణ సామర్థ్యం' అంటే ఏమిటి? దీన్ని ఎలా పెంపొందించాలి?

8. విద్యార్థులలో భాషాభిరుచిని పెంపొందించడానికి మీరు చేపట్టదలచిన సహపాఠ్య కార్యక్రమాలను తెలపండి.

9. వర్ణోచ్చారణ క్రియను తెలిపి అందులోని మౌలికాంశాలను సోదాహరణంగా వివరించండి.

10. శీర్షికా ప్రకటనం ఆవశ్యకత ఏమిటి? దీనిని నిర్వచించడమెట్లు?

11. పునర్విమర్శ ప్రశ్నలకు - ఇంటి పని ప్రశ్నలకు గల సామ్య భేదా లేవి? వివరించండి.

12. సాధారణ బోధన పద్ధతులేవి? దానిని ఏయే సందర్భాల్లో ఉపయోగించాలి?

13. ఉపవాచక బోధనలో నీవనుసరించే పద్ధతులేవి? క్రమమేమి?

14. 'పాఠ్యాంశాలను నిత్యజీవిత అనుభవాలతో సమన్వయించడం' అనే అంశాన్ని తెలుగు బోధనలో సోదాహరణంగా వివరించండి?

15. బోధనోపకరణాల ప్రయోజన ఏమి? దృశ్యశ్రవ్య ఉపకరణాలు మీకు ఎలా సహకరిస్తాయి.?

బి విభాగం

20 × 2 = 40 మార్కులు

ఈ క్రింది ప్రశ్నలలో రెండింటికి సమాధానాలు రాయండి.
ప్రతి ప్రశ్నకు మార్కులు 20

16. 'విషయ విశ్లేషణం' 'బోధన లక్ష్యాలు' అంటే ఏమిటి? మీరు బోధించిన ఒక పాఠానికి విషయ విశ్లేషణం రాసి బోధించేపుడు దృష్టిలో పెట్టుకొన్న లక్ష్యాలను, స్పష్టీకరణాలను సందర్భాలతో వివరించండి.

17. వ్యాకరణం ఎందుకు బోధించాలి? దాని ప్రయోజనా లేవి? మీరు బోధించిన ఏదేని ఒక వ్యాకరణాంశం పై సమగ్ర పాఠ్య పథకం రాసి అనుసరించిన పద్ధతని సమర్థించండి.

18. భాషా నైపుణ్యాలు ఏవి? వారి మధ్యగల అంతర సంబంధమేమి? అవి ఒక దానిని మరొకటి ఎలా ప్రభావితం చేస్తాయి? వీని అభివృద్ధికి చేపట్టాల్సిన చర్య లేవి? జాగ్రత్త లేవి? సోదాహరణంగా వివరించండి.

19. భాషోపాధ్యాయునికి ఉండవలసిన లక్షణాలను/అతడు బోధనను సమర్థం చేయ డానికి అవలంభించాల్సిన పద్ధతులను వివరించి వానిని నిత్య బోధనలో అనుసరిస్తున్న తీరును సమీక్షించండి.

